# సమగ్ర సంఖ్యా శాస్త్రం

# అదృష్ట విజ్ఞానం

లేదా

మీరు కూడా అదృష్టవంతులు కాగలరు




పండిట్ సేతురామన్

అదృష్టం ఎన్నడూ ఎండమావి కానే కాదు,
ఇది మీ ముంజేతి స్వర్ణ కంకణం వంటిది.




సమగ్ర సంఖ్యా శాస్త్రం

# అదృష్ట విజ్ఞానం

## మీరూ అదృష్టవంతులు కాగలరు


రచయిత

**PANDIT SETHURAMAN**

పునఃపరిశీలన & అనువాదం

**V.S.GURUSWAMY M.A.**

“శ్రీ గాయత్రి”,

పాత నెం. 19, క్రొత్త నెం. 14, శ్రీనివాసన్ స్ట్రీట్, మందవల్లి, చెన్నై - 600 028, దక్షిణ భారతదేశం.

ఫోన్: 91-44-24959424

వెబ్ సైట్: www.scienceoffortune.com

ఈ-మెయిల్ :adhrushtavingyanamu@gmail.com



# సమర్పణ

జీవితంలో అనేక ఘన విజయాలు సాధించి, సర్వదా సుఖసంతోషాలతో ప్రశాంతంగా జీవించాలని శ్రమించే విజ్ఞ పాఠకులందరికి ఈ పుస్తకం సాదరంగా అంకితం.

# శ్రీ గురుభ్యో నమః

1. గాయత్రి యా సద్గురో శ్చాపి
   దృష్టి పాతాతో సకర్త్రుకా|
   జీయాత్ చిరం కృతిః కీర్త్యా
   శ్రియా సర్వ జనేడితా ||

2. ధీమాన్ శ్రీమాన్ సువిజ్ఞానా
   భక్తో దేవ్యా గురోరపి|
   కర్తాస్యాః కృతేః సోయం
   జీయాదాచంద్ర తారకం||

3. అదృష్ట విజ్ఞాన కృతేః ప్రకాశనే
   కృతంచ సాహ్యం కీల యెర్జనైరిహ|
   పుష్ట్యాయుతాః కీర్తియుతాశ్చ సర్వే
   భూయాసురా రాత్ సుఖినః ససంపదః||

4. అదృష్ట విజ్ఞాన గతాన్
   విశేషాన్ జానంతి భాగ్యాత్ జయసౌఖ్యతో:|
   విశ్వాసినస్తే కృత పుణ్య పుంజాః
   సంత్వత్ర సర్వే చిరజీవి నోముదా ||

5. జయతు జయతు కర్తాదృష్ట విజ్ఞానకస్య
   జయతు జయతు భూమాదృష్ట విజ్ఞానమేతత్|
   జయతు జయతు చాస్యాం శ్రద్ధ ధానోజనశ్చ
   జయతు జయతు నిత్యం సాచదేవీ గురుశ్చ ||

|| శుభమస్తు ||

# భూమిక

## శ్రీ గురుభ్యో నమః

ప్రపంచంలో సర్వ జనులు సౌఖ్యమే తప్ప, కష్టాన్ని కొంచెం కూడా కోరరు. అయితే వారి ఇష్టానుసారంగా ఏదీ జరుగదు. దీనికి అత్యంత సూక్ష్మ కారణం ఏమిటై వుంటుందని మనం చాలా నిశితంగా విమర్శించి, పరీక్షించి తెలుసుకోవలసి ఉంటుంది. మనం పూర్వజన్మ కర్మ ఫలములు సుఖదుఃఖాల రూపంలో ఈ జన్మలో అనుభవిస్తూ వుంటాం. ప్రతి ఒక్కరు సర్వసుఖాలు అనుభవించుటకు, తమ తమ కష్టాలు నివారించుకొనుటకు పలు సాధనముల ద్వారా ప్రయత్నించవచ్చు. మనం ఈ జన్మలో కొన్ని అపూర్వ సాధనాల ద్వారా సుఖాలను పెంచుకొని, దుఃఖాలను మన దరికి చేర నీయకుండా జీవించుటకు కొన్ని ఉపాయాలు ఉన్నవని ఈ పుస్తకం విస్వసనీయంగా చెప్పుతున్నది. ఈ గ్రంథంలో పేర్కొన్న విషయాలను అర్థం చేసికొని, ఆ ప్రకారము నడచుకొంటే దీనిలో చెప్పిన ఫలితాలను మనం తప్పక పొందగలం. జ్యోతిష శాస్త్రం మంచి చెడ్డలను వివరిస్తుంది. ఈ పుస్తకంలో చెప్పిన విశేషాలు మాత్రం అనుష్టాన ప్రాధాన్యత కలిగినవి. పూర్వ కర్మ ఫలితంగా విధి ఏవిధంగా ఉన్నప్పటికీ, దీనిలో చెప్పిన విధంగా చేస్తే మీరు కోరిన సత్ఫలితములు తప్పక పొందగలరు. అయితే తమ తమ ప్రాప్తానుసారం ఎవరికి ఏ సమయంలో ఏది అనుభవించవలసి వుందో, అది భగవదనుగ్రహం వల్ల ఆ యా సమయాలలో మనం అనుభవించక తప్పదు. ఈ ప్రపంచంలో అనేక శాస్త్ర-ములు పుట్టాయి, అవి ఎందరికో ఆదర్శంగా ఉన్నాయి. ఆ సర్వేశ్వరుడు సర్వజ్ఞుడు. ఆయన ఆజ్ఞ లేనిదే చిన్న అణువైనా కదలదన్నది సర్వవిదితం. ఇప్పుడీ పుస్తకం మీ చేతిలోకి రావటం కూడా ఆయన ఆజ్ఞ మేరకే అని మనం నమ్మాలి. ఈ పుస్తకం అనేక మందికి తప్పక ఉపయోగపడుతుందని, వారికి సర్వ సుఖ సౌఖ్యాలు కలిగిస్తుందని నా పూర్తి నమ్మకం. భక్తితో వాల్మీకి రామాయణం రచించినట్లే, ఈ రచయిత అనంత భక్తితో, గాయత్రీ మాత దివ్య అనుగ్రహంతో దీనిని రచించారని నా దృఢ విశ్వాసం. కాబట్టి ఈ పుస్తకంలో చెప్పబడిన విశేషాలు సర్వ జనులకి కళ్యాణదాయకమై అభయహస్తంగా ఉంటాయని, వీటిని అనుసరించి

సర్వజనులు తమ తమ కష్టాల నుండి సత్వరమే బయటపడి, సుఖశాంతులు పొందుతారని నేను గాఢంగా విశ్వసిస్తున్నాను. ఈ పుస్తక రచయితను, అలాగే ఈ పుస్తకం ఇలా సర్వాంగ సుందరంగా రూపొంది మన ముందుకు రావటానికి కారకులైన అందరిని, దీని ప్రచురణలో సర్వ బాధ్యతలు వహించి, అనేక వ్యయ ప్రయాసలు ఓర్చి శ్రమించిన అందరికి, అలాగే దీనిని నమ్మి దీనిలో వివరించిన విషయములను దృఢ విశ్వాసంతో ఆచరిస్తూ ముందుకు సాగే విజ్ఞులైన పాఠకులందరికి మహామాత కృప వలన సిరి సంపదలు, సర్వశుభాలు కలగాలని, వారికి సర్వదా ఆ దివ్యమాత కరుణాకటాక్షం రక్షాకవచంగా నిలవాలని ఆ జగద్రక్షకిని ప్రార్థిస్తున్నాను.

భవదీయ శ్రేయోభిలాషి

ముళ్ళండిరం

**M.V.** వెంకట సుబ్రహ్మణ్య శర్మ

**ముఖ్య గమనిక**

ఈ గ్రంథానికి భూమిక వ్రాసిన శ్రీ శర్మగారు ఒక అసాధారణమైన వ్యక్తి. వీరు తమ జీవితకాలంలో మూడు కోట్ల పర్యాయములు “గాయత్రి జపం” జపించి, తద్వారా ఆ జ్ఞాన స్వరూపిణిని ప్రత్యక్షం గావించుకొన్న మహనీయులు. కాబట్టి శ్రీ శర్మగారు ఈ గ్రంథానికి వ్రాసిన భూమిక దీని ప్రామాణికతకి ప్రమాణంగా నిలుస్తుంది.



“సంఖ్య మరియు అక్షరం మనుష్యునికి

రెండు కళ్ళు వంటివి.”

# విషయ సూచిక

# త్రిమూర్తులు

| అక్షరం | సంఖ్య | గ్రహం |
|---|---|---|
| A,I,J,Q,Y | 1 | **సూర్యుడు** |
| B,K,R | 2 | **చంద్రుడు** |
| C,G,L,S | 3 | **గురువు** |
| D,M,T | 4 | **రాహువు** |
| E,H,N,X | 5 | **బుధుడు** |
| U,V,W | 6 | **శుక్రుడు** |
| O,Z | 7 | **కేతువు** |
| F,P | 8 | **శని** |

(పై పట్టిక చాల్డియన్ ప్రణాళికపై ఆధారపడినది. ఇది పురాతనమైనది అయినప్పటికి చాలా ఖచ్చితమైనది. ఈ ప్రణాళిక మానవ జీవితంపై పని చేసే అదృశ్య శక్తుల రహస్యాత్మక స్వభావంతో ముడిపడి ఉండటం చేత, ఈ పుస్తకంలో వీలైనంత వరకు

సరళ పద్ధతిలో వివరించటానికి ప్రయత్నించుట జరిగింది).

# ముందు మాట

**అసాధ్యాలని సాధించగలిగినవారే**

**గొప్పవారు అవుతారు;**

**సామాన్యులకి అది సాధ్యం కాదు.**

(అని రాశారు సుప్రసిద్ధ తమిళ మహాకవి తిరువళ్ళువర్.)

సంఖ్యాశాస్త్రంలో అసాధ్యం అనేదానిని సాధించిన గొప్పవారు ఎవరైనా ఉన్నారా అంటే అది భారతదేశంలో చెన్నైలోని స్వర్గీయ పండిట్ సేతురామన్ గారు అని ఎవరైనా చెబుతారు. వారు తమిళ భాషలో రాసిన "అధిష్ట విజ్ఞానం' ( అదృష్ట విజ్ఞానం) ఈనాటికి కూడా ఒక గొప్ప సంఖ్యా శాస్త్ర గ్రంథం. మీరు ఏ సంవత్సరంలోనైనా జనవరి 1వ తేదీ నుండి డిసెంబర్ 31వ తేదీ వరకు ఏ రోజున ఎప్పుడు జన్మించిన వారైనా సరే, మీ జీవితాలలోకి లోతుగా చూసి, ఇది మీ గురించి అనేక నిజాలు చెప్ప గలిగిన ఒక గొప్ప శక్తివంతమైన ప్రామాణిక గ్రంథం. ప్రపంచంలో మరే ఇతర సంఖ్యాశాస్త్ర వేత్త కూడా 52 కంటే మించిన నామ సంఖ్యలకు భవిష్యత్తు చెప్పగలిగే అవకాశం గురించి కలగని ఉండరు. కాని స్వర్గీయ పండిట్ సేతురామన్ గారు హిందు, చాల్డియన్ మరియు పైథాగరియన్ పద్దతులలో సంఖ్యాశాస్త్రం గురించి కూలంకుషంగా అనేక సంవత్సరాలు పరిశోధించి, 108 వరకు నామ సంఖ్యల రహస్యాలను కనుగొని బయట ప్రపంచానికి తెలియజేసారు. తాము కనుగొన్న ఈ విషయాలని 1954లో తమ తమిళ సంఖ్యాశాస్త్ర గ్రంథంలో వారు ప్రచురించినప్పుడు, ఇది అమోఘ ఘన విజయాన్ని సాధించింది. వారి కుమారుణ్ణి, శిష్యుణ్ణి మరియు వృత్తి రీత్యా సంఖ్యాశాస్త్ర వేత్తనైన నాకు, వారు ఈ గ్రంథం ద్వారా సాధించిన అశేష కీర్తి ప్రతిష్టలు చూసినప్పుడు, ఎంతో గర్వంగా అనిపిస్తుంది.

ఏ విద్యా రంగంలో నైనా, సాధారణ విద్యార్జన మరియు తగిన శిక్షణ చాలా ముఖ్యం. అయితే ఇతరుల భవిష్యత్తుని చెప్పే అసలైన భవిష్య విశేషజ్ఞుడిగా వృత్తి బాధ్యతలు నిర్వహించేవారికి మాత్రం కేవలం శాస్త్ర పరిజ్ఞానం ఒక్కటే చాలదు, విచారణ , భవిష్య దృష్టి మరియు ఆధ్యాత్మిక శక్తి కూడా అవసరం. స్వర్గీయ పండిట్ సేతు రామన్ గారిలో ఈ సుగుణాలన్నీ ఉన్నాయి, పైగా వారు గొప్ప సహృదయులు. వారి యథార్థ

భవిష్యవాణి మరియు నిజాయితీ గలిగిన మార్గదర్శనం ద్వారా లాభపడి, దృగ్విషయ విజయాన్ని సాధించిన అనేకమంది తమ విజయగాథలని వివరించేందుకు, తమకి 'అదృష్ట మార్గాన్ని చూపించిన గురువు' గొప్పతనాన్ని స్తుతించేందుకు ప్రపంచం నలుమూలలా అనేక స్థానాలలో ఇప్పటికీ అనేక మంది జీవించి ఉన్నారు. పండిట్ సేతురామన్ గారు ఈ 'అదిరిష్టవిజ్ఞానం' అనే గ్రంథాన్ని మొదటి సారిగా 1954లో ప్రచురించారు. ఈ తమిళ గ్రంథం 2013 లో 25వ ముద్రణ వెలుగు చూసింది. మొదటి ఆంగ్ల ముద్రణ 2003లో వచ్చింది. ఇంకా ఇది చైనీస్తో సహా, మరో నాలుగు భాషల్లో ముద్రించ బడింది.

పండిట్ సేతురామన్ 1997వ సంవత్సరంలో స్వర్గస్తులు అవుతూ, జీవితంలో అనుకున్నది నిరంతరం సాధించాలనుకునే మానవత్వ సంబంధిత వీలునామాను విడిచి వెళ్లారు. తన సేవలు కోరి వచ్చే అభిమానులు, వారు ఏ కులం, మతం, నమ్మకం కలిగిన వారైనా, వారి ఆర్థిక స్థితిగతులు ఎలాంటివైనా సరే, అవి పట్టించుకోకుండా వారికి తమ సాయశక్తులా ఆయన సహాయ సహకారాలు అందించేవారు. అందమైన మాటల్లో చెప్పాలంటే, వారు ఆయన్ని ఒక దేవుడిలా ఆరాధించేవారు. రెండవ ప్రపంచ యుద్ధం సమయంలో బ్రిటిష్ ఇండియన్ ఆర్మీలో ఒక అధికారిగా పని చేసే ఒక యువకుడు, ఆ తరువాత సంఖ్యాశాస్త్రంలో మహోన్నతంగా పెరిగి, ఒక సజీవ దైవంగా పూజించబడే ప్రపంచ ప్రఖ్యాత సంఖ్యాశాస్త్ర ప్రవీణుడౌతారని ఎవరూ అనుకోలేదు. ఇదీ ఆయన గురించి జనం చెప్పుకొనే లోక ఉవాచ.

గొప్పతనం అనేది ఆయనకి బలవంతంగా ఆపాదించినదీ కాదు, 'కొన్నదీ' (ఈమధ్య కొందరిలా) కాదు. ఆయన గొప్పవారిగానే పుట్టారు! మిలిటరీలో పనిచేసే సమయంలో తమ పై అధికారికి ఆయన, ఫలానా రోజున ఫలానా సమయంలో శత్రువుల స్థానాలపై పోరాటానికి వెళితే విజయం లభిస్తుందని లెక్కకట్టి చెప్పేవారు, అలా చేసిన ప్రతి సారీ అలాగే గెలుపు లభించేది. యువకుడైన సేతుకి సైన్యం నుంచి సేవానివృత్తి పొందిన తరువాత, అనేక చోట్ల అనేక ఆకర్షణీయమైన ఉద్యోగావకాశాలు లభించాయి. అయినా, ఆయన మాత్రం సంఖ్యాశాస్త్ర వేత్తగానే తమ వృత్తి బాధ్యతలు స్వీకరించారు. అవును మరి, అనేక సంవత్సరాల ఆయన అధ్యయనం, పరిశోధన మరియు జన్మజాత

దైవజ్ఞానం ఫలితాలు అందరికీ, సామాన్యులు మరియు ధనికులకి సరిసమానంగా అందాలన్నది ఒక భగవదేశ్చ అయి ఉంటుంది.

అనతి కాలంలోనే ఆయన ఖ్యాతి గొప్ప సంఖ్యాశాస్త్ర ప్రవీణులుగా దసదిశలా విస్తరించింది. ఆయన సేవలు, సలహాలు కోరుతూ వచ్చే అభిమానుల సంఖ్య రోజు రోజుకీ పెరిగిపోతూ, వారికి విశ్రాంతి తీసుకొనే సమయం కూడా దొరికేది కాదు. అందుకే ఆయన ఈ రోజుకి 48 గంటలు ఉంటే బాగుండేది, కాస్త విశ్రాంతికీ సమయం దొరికేది", అనేవారు నవ్వుతూ. సంఖ్యాశాస్త్ర నిపుణులుగా వృత్తి నిర్వహణలో విదేశాలలోని తమ అభిమానులకి సేవలు అందించేందుకు ఆయన అనేక దేశాలకి వెళ్లేవారు. ఆయన అందరికి విజయ మార్గాన్ని తెలియచేసేవారు. కాబట్టి ఆయన విదేశాలకు వెళ్లిన ప్రతిసారీ, రాజకీయ ప్రముఖులు, గొప్ప గొప్ప ధనికులు, వ్యాపార ప్రముఖులు మరియు అనేక మంది సామాన్యులు కూడా అక్కడ ఆయనని కలిసేందుకు బారులు తీరేవారు. ఒక సంఖ్యాశాస్త్ర ప్రముఖుడిగా ఆయన సాధించిన విజయం, భౌగోళిక సరిహద్దులని మాత్రమే కాక, కులం, మతం, జాతి భేదాలని కూడా దాటి, సువిశాలంగా విస్తరించంది. పండిట్ సేతురామన్ గారు సంఖ్యాశాస్త్రం గురించి తమ గ్రంథం 'అధిష్ట విజ్ఞానం" (అదృష్ట విజ్ఞానం) ప్రచురించినప్పుడు, అది అత్యధికంగా అమ్ముడుపోయే సంఖ్యాశాస్త్ర గ్రంథంగా అశేష పాఠకుల విశేష మన్ననలను అందుకుంది.

తమ జీవితాలలో ఆయన సేవలని అందుకుని, ఆయన దైవజ్ఞ సూచనలు మరియు సంఖ్యాశాస్త్ర ప్రావీణ్యంతో అనేక ప్రయోజనాలు పొందిన ప్రముఖులు ఎందరో ఉన్నారు. అలాంటి అందరి వివరాలు-విశేషాలు అందించాలంటే మరో గ్రంథం తయారవుతుంది. కాబట్టి స్థలాభావాన్ని దృష్టిలో ఉంచుకొని, అలాంటి వారిలో కొందరి గురించే కొద్దిగా ఇక్కడ ప్రస్తావించడం జరిగింది.

సహజముగనే జిజ్ఞాసియైన బాల సేతురామన్ అయిదవ తరగతిలో న్దునప్పుడు, చరిత్ర పాఠము బోధించు మాస్టరుగారిని ఒక ప్రశ్న అడిగి తికమక పెట్టినాడు. ఆకాలపు అర్ధణా కాసు ఒకదానిని చూపి అందు ముద్రింపబడిన బ్రిటిష్ చక్రవర్తి తలపై కిరీటము లేదేమి? అని అడిగి, అట్లు "అధిక ప్రసంగము" చేసినందులకు శిక్షగా క్లాసు బయట నిలబెట్టబడినాడు.

విషయమేమనగా ఆ పంతులుగారివద్ద ఆ ప్రశ్నకు సమాధానము లేదు. అటువైపు వచ్చిన హెడ్ మాస్టర్ గారు విషయమును విచారించి, తనకు కూడ ఇంత చిన్నదయినా, ముఖ్యమైన విషయము తట్టనందుకు సిగ్గుపడి, పిల్లవానికి మిఠాయి ఇచ్చి, క్లాసులో అందరి ఎదుట, పాఠములో లేని విషయములు అడిగి ఇబ్బంది పెట్టవద్దని హెచ్చరించి వెడలినాడు. ఆ ప్రశ్నకు సమాధానము తెలుసుకొనుట నాలుగు సంవత్సరములు పట్టినవి. అయినను అది తెలియునంతవరకు నిద్రపట్టునా! అట్టి పట్టుదల గల బాలుడు పెరిగి పెద్దవాడయి పండిట్' సేతురామన్ అయినాడనిన ఆశ్చర్యమేమున్నది? అతని జ్ఞాన పిపాస, విషయములను క్షుణ్ణముగా పరిశోధించుట మొదలగు గుణముల ఫలితమే ఆ మార్పు.

మా తండ్రిగారికి సంగీతమునందు, ఇతర లలితకళలయందు ఆసక్తి అధికము. వారికి సంగీతములో మంచి ప్రవేశము కూడా కలదు. కర్ణాటక సంగీత విద్వాంసులెందరో మా తండ్రిగారిని సంప్రదించి, సంఖ్యాశాస్త్ర మును అనుసరించి, వారి సలహాలను పాటించి, కీర్తి ప్రతిష్టలు అందుకొన్నవారే. వారి గొప్పదనము మా తండ్రిగారికే చెందును. రత్నముల గూర్చి వారికి గల జ్ఞానము చెప్పుకోదగ్గదే. ఎందరో ప్రసిద్ధ రత్న వ్యాపారులు వారిని తరచుగా కలసి, తమవద్దగల ఆభరణముల వేలలు, నాణ్యత మున్నగు విషయములను వారిని సంప్రదించి తెలుసుకొనేవారు.

“అదృష్ట విజ్ఞానము” అనునది మన జీవితమున అంకెలకు గల ఆశ్చర్యకరమైన, రహస్యమయమయిన స్థానమును గురించి పండిట్ జీ చేసిన క్షుణ్ణమైన పరిశోధనల యొక్క సారమే.

గ్వాలియరు మహారాజు కీర్తిశేషులు శివాజీరావు సింధియాగారు మా తండ్రిగారికి మంచి మిత్రులు. 1946లో మా తండ్రిగారు వారితో కొన్ని నెలలు వుండినారు. వారు తరచుగ ‘మీరు తప్పక విశ్వేశ్వరయ్యను కలుసుకొనవలెను” అని చెప్పేవారు. సర్ M. విశ్వేశ్వరయ్య, మైసూరు సంస్థానములో దివానుగా ఉండి ప్రసిద్ధికెక్కిన ఇంజనీరు, గణిత మేధావి. ప్రపంచములోనే గొప్ప తెలివిగలవారిగా గణింపబడువారు. 85 ఏండ్లకు పైబడినవారు. మా తండ్రిగారో... 22 ఏండ్ల యువకులు.

వయసులో అంత పెద్దవారయిన M.V.గారు తన తెలివిని కుర్రతనముగా లెక్కగట్టెదరని మా తండ్రిగారు అభిప్రాయపడినారు. కాని మహారాజుగారు, వారట్టివారు కారనియు, ఎవరు చెప్పినను శ్రద్ధగా విని, తగిన సలహాలు ఆదరముగ ఇచ్చెదరనియు చెప్పిరి. ఆ సమయమున వారు మహారాజుగారికి సంబంధించిన పరిశ్రమలకు సలహాదారుగా ఉండిరి. కొద్దిరోజుల పిమ్మట, నాటి సాయంత్రము జరుగబోవు విందులో కలుసుకొనవలసినదిగా మా నాన్నగారికి ఆహ్వానము వచ్చినది.

అటువంటి విందులలో విస్కీ' యేరుగా పారునని మా తండ్రిగారు వాటిలో పాల్గొనెడివారు కారు. అయినను మహారాజుగారు తప్పక రావలెనన్నందున వెళ్ళినారు. ఆ విందుకు శ్రీ విశ్వేశ్వరయ్యగారు ముఖ్య అతిథిగా విచ్చేసియుండిరి. వచ్చిన ప్రముఖులతో కొంతసేపు ముచ్చటించి వారు వేరొక గదిలో విశ్రాంతిగా కూర్చొన్నారు. మహారాజుగారు మా తండ్రిగారిని వారివద్దకు పిలచుకొనిపోయి, " వీరు సంఖ్యాశాస్త్ర వేత్త. వీరితో సంఖ్యను గురించి మాట్లాడండి. నేను పిదప వచ్చెదను" అని చెప్పి గదిలో నుండి వెడలినారు. విశ్వేశ్వరయ్య గారు మా తండ్రితో " నేడు మహారాజుగారు నాకు గొప్ప ఆశ్చర్యమును కలిగించెదనన్నారు. అది యేమి" అని అడిగినారు.

జవాబుగా మా తండ్రిగారు సంఖ్యాశాస్త్రము గురించిన ముఖ్య విషయములు చెప్పి, జననతేది, పేరు సంఖ్య, తగినవిగా ఉన్న ఏమగును, ఒకదానికొకటి తగనివిగా ఉన్న ఏమగును అన్నది వివరించినారు. తరువాత విశ్వేశ్వరయ్యగారి జననతేది, పేరులోని అక్షరములు అడిగి తెలుసుకొని వారి జీవితమున జరిగిన సంఘటనలను చెప్పిరి. అది విని దిగ్భ్రాంతి చెందిన వారు, " నా జీవితము, పదవి, ఉన్నతి అన్నవి అందరికీ తెలిసినవే. కాని నాకు మాత్రమే తెలిసినవానిని మీరు చెప్పుటయే నాకు మహా ఆశ్చర్యముగా ఉన్నది. పేరు మనిషిని ఇంతగా బట్టబయలు చేయునా?", అని అబ్బురపడినారు. వారు చెప్పిన సంఘటనలు సరిగ్గా ఆయా తేదీలలోనే జరుగుట తలచి చూసి చెప్పనలవిగాని విధంగా ఆశ్చర్య పడ్డారు.

తన వయసు, కీర్తి ప్రతిష్టలు మొదలగువానిని ఉద్దేశించి పేరు మార్చవలెనా అని అడిగినారు. దానికి అవసరములేదనియు, చెడ్డ దినములందు విశ్రాంతిగా ఉండవచ్చుననియు మా తండ్రిగారు సమాధానమిచ్చినారు. పిమ్మట వారు "నాకు ఈ

శాస్త్ర-మున అమితమయిన నమ్మిక ఏర్పడినది. నేను ఏమి చేయవలెనో మీరు వ్రాసి ఇవ్వండి. దాని ప్రకారమే చేసెదను" అన్నారు. మాటలు ముగిసిన తరువాత మా తండ్రిగారిని విందు జరుగు మంటపమునకు తోడ్కొని వచ్చి, అక్కడి ప్రముఖులను ఉద్దేశించి "నేనింతవరకు సంఖ్యలకు కూడికలు, తీసివేత, గుణకారము, భాగహారములను నాలుగు ముఖములే కలవన్న అభిప్రాయములో ఉంటిని. కాని వీరు, 'దాగిన ముఖమును చూపుట" అను ఆశ్చర్యకరమైన అయిదవ ముఖమును దీనికి కలిగించినారు. నిజముగానే వీరొక గొప్ప మేధావి" అని పొగడినారు. దానికి మాహారాజుగారు, "మీరే ఒప్పుకొనినారన్న ఈ లోకమే ఒప్పుకొనినట్లు" అని సంతోషపడినారు.

మీ చెంతనున్న 'అదృష్ట విజ్ఞానము" అను ఈ పుస్తకము, దక్షిణ భారతదేశమున గల మద్రాసు పట్టణ వాస్తవ్యులయిన కీ.శే. పండిట్ సేతురామన్ గారి అవిరామకృషి, అఖండ పరిశోధనల ఫలితము.

ఈ గ్రంథము 1954వ సంవత్సరములో తమిళమున ప్రథమముగా ముద్రించబడి, ఏవిధమయిన ప్రకటనలు, ప్రయత్నములు లేకనే 2002లోగా 14 ముద్రణలకు నోచుకొన్నది. అది యీ గ్రంథముయొక్క ప్రాశస్త్యమును తెలుపుచున్నది. అదియును, గ్రంథకర్తను ప్రత్యక్షముగా కలిసికొని అడిగినవారికే, ఆ తమిళ ప్రతి ఇవ్వబడుచుండినది. వీరు ప్రపంచ పర్యటన (3మారులు వీరు పర్యటించినారు) గావించినపుడు తమిళము తెలియని ఎందరో తమ సమస్యలను చెప్పుకొనిపరిహారము కోరినారు.

మీ సౌకర్యార్థం ఇపుడు ఈ గ్రంథము ఆంగ్లములోను, తెలుగులోను ముద్రింపబడినది. ఈ పుస్తకమునకై ఎక్కువ వెల చెల్లింపనవసరములేక, ముఖ్యమైన, సందర్భానుసారముగా, గ్రంథకర్త యొక్క పరిశోధనలను, పాఠకుల గమనికకై పొందుపరచినాము. వాటి సహాయముతో పాఠకులు తమ జీవితములలో మంచి మార్పులను పొందెదరు గాక. ఈ శాస్త్రమును అన్ని కోణముల నుండియు విరివిగా వ్రాయవలయుననిన, రెండువేల పుటలకు పైగా వ్యాపించి, సామాన్యులకు అందుబాటులో ఉండదు. ఈ విషయములను దృష్టిలో ఉంచుకొనియే గ్రంథ పరిమితియు, ధరయు నిర్ణయింపబడినవి.

గణిత శాస్త్రము ప్రపంచమంతటను ఒకటియే. కూడికలు, తీసివేతలు, గుణకారము, భాగహారములలో ఏవిధమైన మార్పును లేదు.

సంఖ్యా శాస్త్రము అంకెలపైన ఆధారపడినదే కావున దాని ఫలితములలో ఏ భేదమును ఉండదు. కనుక ఈ పుస్తకమును శ్రద్ధగా చదివి, దీనిలో సూచించిన వానిని పాటించి, మీ జీవితములను విజయవంతము కావించుకొనండి. దీనిలో చెప్పబడిన విధులు దైవదత్తములని భావించండి. అవి అచిరమైనవి, జీవితమునకు ముఖ్యమైనవి, సమయానుసారము మారునవి కావు. ఈ గ్రంథమును చదివి, అనుసరించు అందరూ తమ కష్టములు తీరి, అఖండ ఐశ్వర్యములతో ఉండవలెనని సర్వత్ర నిండియున్న ఆ దేవదేవిని ప్రార్థించుచున్నాను.

చెన్నై-600028

**V.S. GURUSWAMY**
**S/O Pandit Sethuraman**

# తమిళంలో తొమ్మిదవ ముద్రణ పీఠిక

ఈ గ్రంథమునందు 1969వ సంవత్సరం నుండి నేను క్రొత్తగా ఏ విషయమును చేర్చలేదు. నాకు అవసరమైనవి అని అనిపించిన కొన్ని అభిప్రాయములను పాఠకుల ముందు ఉంచుతున్నాను.

ఈ గ్రంథమున చెప్పినట్లు నడచుకొని జీవితములో మహోన్నతస్థితిని పొందిన అనేక మంది విదేశములందు నివసించువారు. వారును, అట్టి ఆశాభావమే కలిగిన పారిశ్రామికవేత్తలును కోరిన మీదట మూడుసార్లు ప్రపంచ పర్యటన చేయవలసి వచ్చినది. తూర్పు దేశములయిన ఇండోనేషియా నుండి జపాను వరకు, ఐరోపా, అమెరికా దేశములందును ఈ గ్రంథముయొక్క కీర్తి నిండి ఉండుటచే, మేము ఎక్కడకు వెళ్ళిననూ ఘనస్వాగతము ఉండినది. ఈ శాస్త్ర మహిమను గురించి ఆయా దేశపు రేడియో, టీవి సంస్థలు, వార్తాపత్రికలు మా రాకను, ప్రత్యేక గోష్టులను వివరిస్తూ ప్రత్యేక సంచికలు ప్రచురించి, ప్రత్యేక కార్యక్రమములు ఏర్పాటుచేసి అమితమైన ప్రాధాన్యత, గౌరవము చూపినందులకు వారికి నా మనసారా కృతజ్ఞతలు తెలుపుకొనుట ముఖ్యము.

తమిళ భాష తెలియనివారు కూడా ఇంత ఆసక్తి చూపించుట వారి జ్ఞాన పిపాసను సూచించుచున్నది. హాంకాంగ్ నగర వార్తాపత్రికలు, “నిర్ణయించిన వెలకన్న అధిక విలువతో యావత్ప్రపంచంలో ను, పలు ముద్రణలు అమ్ముడుపోయిన గ్రంథము యొక్క రచయితగారి విజయము” (ఈ పుస్తకము కామ కళకు సంబంధించినది కాదు.

సంఖ్యలకు సంబంధించినదని మనవి) అన్న మకుటముతో స్వాగతము పలికినవి.

సంఖ్యలను గురించిన పరిజ్ఞానము లోకమంతట ఎక్కువయినది. ఈ సందర్భమును ఉపయోగించి రాబడి చేసికొనదలచిన పలువురు, ఏవిధమైన పరిశీలన పరిశోధన లేకయే కొన్ని పుస్తకములను ప్రచురించి పాఠకులను తికమక పెట్టినారు.

డాక్టరు, వకీలు వంటి వృత్తులందును విద్వాంసులును, శాస్త్ర మునభ్యసించి చేయు ఏ వృత్తినయినను తమకు తామే చాటుకొనరాదన్నది పద్ధతి. అందువలననే ఇంతవరకు

అదృష్టవిజ్ఞానము? గ్రంథమునకు నేను ఏ విధమయిన ప్రకటనలు, వ్యాపారరీతిగాను, వృత్తిరీతిగా ను ఇవ్వలేదన్నది అందరికి విదితమే. జనులను మోసగించుటకై దొంగ డాక్టర్లు ప్రకటనలిచ్చుట మనము చూస్తున్నాము. అట్లే అనేకులు సంఖ్యాశాస్త్రజ్ఞులమని ప్రకటించుకొని సంఘమును కలుషితము చేయుచున్నారు.

నా మూలముగా వృద్ధిలోకి వచ్చిన పలువురు, సన్యాసులు సహితము, తమకు ఈ శాస్త్రము బాగా తెలియునని నమ్మబలిక అనేక ప్రముఖులకు పేర్లు మార్చి విపరీత ఫలితములకు కారణమయినారు. నేను ఆ యా దేశములకు వెళ్ళకుండుటయే వీటికి ముఖ్య కారణమని విదేశములలోని మనవారు పలువురు అభిప్రాయపడుట చేతనే నేను కొలంబో, లండను, న్యూయార్కు నగరములందు ఎక్కువ కాలము ఉండవలసి వచ్చెను. అనేక నగరములలో పలువురు నా శిష్యులమని చెప్పుకొనుచు వారికి తెలిసిన రీతిలో పేర్లు మార్చి డబ్బు చేసుకొని, సుఖముగా ఉన్నారు. నిజమునకు నాకట్టి దీర్ఘకాల శిష్యులెవ్వరును లేరని నన్ను తెలిసిన వారికందరకును స్పష్టముగా తెలియును. ఇటువంటి వారి బారిన పడకుండ మిమ్ము మీరు కాపాడుకొనండి. **దీనికంతటకుసుముఖ్య కారణము క్రిందచెప్పచున్నాను**.

'అదృష్ట విజ్ఞానము' అను పుస్తకమున చెప్పినదే ఈ శాస్త్ర ము. దీనిని ఒక మారు చదువగనే శాస్త్ర పరిజ్ఞానమంతయు పొందినట్లు పలువురు తలచుటయే దీనికి మూలకారణము. నిజముగా ఈ శాస్త్రమును విరివిగా వ్రాసినచో రెండువేల పుటలకు పైగా నే పోవును. అంత పెద్ద గ్రంథ మయినచో సామాన్య ప్రజలకందుబాటున వుండదని, వారికి దానివలన ప్రయోజనముండదని జంకి, తమిళమున ఒకింత ప్రవేశమున్న అందరకును అర్ధమగునట్లు కఠిన పద ప్రయోగము లేక సులభముగా బోధపడునట్లు వెలువరించుట జరిగినది.

ధనవంతులును, వ్యాపారవేత్తలును అయిన అభిమానులెందరో తమకు దైనందిన జీవితమున ఉపయోగపడునట్లు వ్రాయవలెననియు కోరిరి. (ఇట్లు తెలుపుటకు కారణమేమనిన, నేను ఈ వృత్తిలోకి దిగిన 41 సంవత్సరములుగా 1500 మంది కోటీశ్వరులను చూసితిని. అందు అయిదుగురు మాత్రమే హైస్కూలు వరకైనను చదివినవారు. కాని వీరందరు స్థిరమైన లక్ష్మీపుత్రులు, లాభనష్టముల వలన కలత

చెందనివారు.)

అన్ని ముద్రణలలోను గ్రంథ చరిత్ర ఉన్న శీర్షికతో ఈ పుస్తకము వెలువడుటకు ముఖ్య కారణముగా ఉండినవారు ఒక మహాత్ములు (వారు తమ పేరు ప్రకటించుకొనుట కిష్టపడలేదు) అని వ్రాసియుంటిని. నాదగ్గరి స్నేహితులకందరకును వారెవరో తెలిసినప్పటికినీ, 8మార్లు ముద్రింపబడి బ్రహ్మాండముగా అమ్ముడుపోయి, ఒక్క తమిళనాడునందే 50,000 పైగా ఐశ్వర్యవంతులు దీని మూలముగ సృష్టిచెందిన తరువాత ఇప్పుడయినా వారికి చెందవలసిన గౌరవ మర్యాదలను, పాఠకుల కృతజ్ఞతలను వారికి చేర్చుట నా కర్తవ్యము. నావలెనే వారును వయోధికులయినారు.

అప్పుడు నాకు 29 ఏండ్లు. వారికి 23 ఏండ్లు. సంకోచపడుట సహజమే. వారికి పేరు మార్పు జేసి ప్రతిదినము నేను చెప్పినట్లు సంతకము పెట్టుచు వచ్చిన పది దినములలో వారి సమస్య తీరిపోవునని చెప్పినట్లే ఈదేశపు ప్రముఖవైద్యులు నయము చేయలేమని ఆశలు వదలుకొన్న జబ్బు పరిపూర్ణముగా నయమగుటచే, ఈ శాస్త్రమును వారు పూర్తిగా నమ్మి అనుసరించి అభిమానిగ మారినారు. ఆనాటి నుండి నా సంతోషమును, సుఖమును తనవిగా భావించేవారు.

తనవలెనే అందరూ ఈ శాస్త్ర ము ద్వారా లాభమొందవలెనని యెంచి నాచేత ఈ పుస్తకమును ప్రచురింప జేసిరి. వారు అంత నిర్బంధింపక పోయినచో ఈనాటికిని నేను నా పుస్తకమును వెలువరించి ఉండను. అందులకు మరియొక కారణమును కలదు. ఈ జ్ఞానము చెడ్డవారి చేత చిక్కినచో అనర్థములు జరుగునన్న భయమే ఆ కారణము. ఇప్పటికే అన్ని దేశములును దుష్టుల చేతిలో ను, దుష్టశక్తుల పిడికిటిలో ను చిక్కి మంచివారు, విద్యావంతులు చేతగానివారుగా పరిగణింప బడుచున్నారు.

వ్యాపారులు అన్ని విధములయిన అధికారుల చేతను చిక్కి పీడింప బడుచున్నారు. ధర్మము, న్యాయములను లెక్క చేయనివారు బలవంతులై పురాణకాలపు రాక్షసులవలె సుఖముగ ఉన్నారు. ఈస్థితి మారి మంచివారును ఈ గ్రంథమును అనుసరించి గొప్పగాను, భయము లేకుండను, జయప్రదముగా ను జీవింపవలెననుటయే నా కోరిక.

పైన చెప్పబడిన కారణముల వలన గ్రంథము వెలువరించబడనిచో మంచివారు నష్టపోదురని వాదించి, నా చేత ఈ పుస్తకమును వెలువరింప జేసినవారు T.V.S. పరిశ్రమల ప్రస్తుత చైర్మను శ్రీమాన్ R. Ramachandran గారే. తమిళ పాఠకుల కృతజ్ఞతలు వీరిని చేరుగాక! దీనిని అనుసరించుట వలన వారెంత ప్రకాశించుచున్నారో అందరకును తెలిసినదే.

'అదృష్టవిజ్ఞానము"న మార్పులు చేర్పులు లేకుండుటకు కారణము వాటి ఆవశ్యకత లేకపోవుటయే. 1954నుండి నేటివరకు ఇందు ఇవ్వబడిన అంకెల ఫలితములు ప్రపంచ వ్యాప్తముగను అట్లే ఉన్నవి. ఈ గ్రంథము గీటురాయి వలె ఉండవలెనని వ్రాయబడినది. రాజకీయ వ్యవహారములలో నేనేవిధముగను తలదూర్చలేదన్నది అందరకును తెలిసినదే. కాని రాజకీయ మార్పుల వలన వ్యక్తిగతముగా ఇబ్బందులకు గురియైన వారికి ఎన్నడు దేనిని నిరాకరింపలేదు. ఉదాహరణకు కొలంబో నగరము అగ్నికి ఆహుతి అగును; పెద్ద పెద్ద ఫ్యాక్టరీలు, ఆస్తులు అమ్మివేయుడు, పిల్లలను విదేశములకు చదువులకై పంపుడని శ్రీలంక అభిమానులందరకును 1978లోనే పలుమారులు చెప్పితిని. (1983 ఏప్రిల్ లోగా ఆస్తులు అమ్మవలెనని హెచ్చరించితిని.) కాని కొందరు మాత్రమే కుర్చీ బల్లలతో సహా అమ్మినారు. కొందరు మనస్ఫూర్తిగా అమ్మలేదు. కొందరు ఆటగా తీసికొనినారు. ఇటువంటి విషయములు సూచనగనే చెప్పగలము. బహిరంగముగా చెప్పినచో దానివలన మేలు కన్న కీడే ఎక్కువ జరుగును.

26వ తేదీని గురించి అందరును భయపడునట్లే వ్రాయుట జరిగినది. నిజమును దాచకూడదన్న ఉద్దేశ్యముతో అట్లు చేసితిని. ఒక ఉదాహరణను పరిశీలింపుడు.

ప్రస్తుత బ్రిటిష్ మహారాణి అయిన ఎలిజబెత్ మహారాణిగారి పితామహి రాణి మేరి 26వ తేదీన జన్మించినారు. ఆమె ఐదవ జార్జి పట్టమహిషిగా సింహాసనమును అధిష్టించినపుడు అది 'రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యము'గా ఉండినది. (ప్రపంచ వ్యాప్తముగా). 1936లో జార్జి మరణించి రాణి మేరి సింహాసనము దిగునప్పుడు ప్రపంచ సామ్రాజ్యమున పలు దేశములను ఇంగ్లండు కోల్పోయినది. అటు తరువాత ఆమె కుమారుడు ఆరవ జార్జి 1952లో మరణించినపుడు ప్రపంచ సామ్రాజ్యమును పూర్తిగా

పోగొట్టుకొని ఇంగ్లండు, స్కాట్లండు, ఐర్లండు మాత్రమే మిగిలినవి. (ఇట్లుండ, కొందరు యువకులు 26వ తేదీన జన్మించిన యువతిని ప్రేమించుచున్నాను, వివాహము చేసికొనవచ్చునా అని ప్రశ్నించునప్పుడు సామ్రాజ్యమునకే ఆ గతి పట్టినది. ఆలోచించి నిర్ణయించుకొనుమని నేను చెప్పవలసి ఉన్నది.) అంత మాత్రమున అధైర్యపడరాదనునదియే ఈ గ్రంథ లక్ష్యము.

ఈ విధమయిన తేదీలలో జన్మించిన ఎందరినో నేను తగిన విధముగా వివాహములు చేయమని చెప్పి, కీడు జరుగని దినములలో వివాహము ఏర్పాటు గావించినందున ఈ నాటికినీ వారు సుఖ సంపదలతో తులతూగుచున్నారు. మేలు-కీడుల ప్రభావము నుండి తప్పించుకొను మార్గమును అర్థమయ్యేలా చేయునదే ఈ గ్రంథము.

పెక్కురు జ్యోతిష్కులు నన్ను " ఈ శాస్త్రము చక్కని ఫలితముల నిచ్చుచున్నది. కాని శాస్త్రములందు నవగ్రహములు మిక్కిలి బలము గలవి. వాని ప్రభావము దైవములను కూడా విడచిపెట్టవందురే", అని అడిగియున్నారు. (విధి విష్ణువునైనా విడిచిపెట్టదు అనుట కద్దు.) అందుకు నా సమాధానమిదియే. గ్రహములన్నియు వాని ధర్మమును అనుసరించియే నడచుచున్నవి. ఈ సౌర కుటుంబమునకు అధిపతి అయిన సూర్యుడు మనకు ప్రత్యక్షముగా కనపడుచు, తన కిరణముల ద్వారా వేడిమిని, జీవశక్తిని ప్రసాదించుచున్నాడు. గ్రీష్మ ఋతువులో అమితమైన వేడిమిని ఇచ్చి మనలను కష్టపెట్టునదియు ఇతడే. ఆ కాలములో ఇంటి నుండి 2 వెలుపలకు అడుగిడువలెనన్న ప్రజలు జంకుదురు. ఏలనిన, అట్టి ఏండలో నడచిన తల తిరుగును, కాళ్ళు బొబ్బలెక్కిపోవును. (ఈ అనుభవము మనకన్నా ఎడారి భూముల రాష్ట్రములైన సింధు, రాజస్థాన్ ప్రజలకు ఎక్కువగా ఉండును). అయినను కాలికి చెప్పులు, తలపైన పాగానో, టోపీనో, లేక గొడుగునో ఉపయోగించినచో ఎక్కువ కష్టపడకుండ కావలసిన స్థలమునకు పోయెదము. అదియే కారులో నో బస్సులో నో ప్రయాణించిన తల, పాదములు బాధపడవు. మరి ఎయిర్-కండిషన్డ్ కారులో పోయిన, బయట ఎండ మాడ్చుచున్న విషయమే మనకు తట్టదు.

మనము వేడిమి నుండి తప్పించుకొన్నందులకు సూర్యుడు కోపము చెందడు.

ఆకాశమంత ఆచ్ఛాదనము వేయుట మనకు అసాధ్యము. మనను కాపాడుకొన్న చాలునన్నట్లు ప్రయత్నింపవలెను. ఇందుమూలముగ మనము సూర్యుని శక్తిని, వేడిమిని తగ్గింపలేము. ఈ పద్ధతిలోనిదే గ్రహముల దుష్టశక్తుల నుండి మనుష్యులయినను, వ్యాపార స్థలములు అయినను, తమకు సాధకమయిన అంకెలను పేరునందు చేర్చుకొని ఆపదలనుండి తప్పించుకొనుటయు, బాగుపడుటయును (విధిలో వ్రాసిపెట్టి వుంటే కాలు కాలియే తీరుననుటయే ప్రయత్నమందు నమ్మకములేనివారి వాదము.) ఎండ, వేడి అదియే విధి. దీని బారిన పడుటయు, తప్పించుకొనుటయు మన ప్రయత్నమునకును, మన తెలివికిని లోబడినదే.

ప్రప్రథమముగా నేను 1959లో సింగపూర్, మలేషియా దేశములు పర్యటించినపుడు తిరిగి వచ్చుటకు ఆరు నెలలు పట్టినది. దానికి కారణము, ఆ దేశముల నుండి నన్ను చూడవచ్చెడు వ్యాపారులును, సిబ్బందియును, కుటుంబముల నుండి దూరముగ జీవించువారే. పలువురు రెండ్లేండ్ల కొకమారు ఇండియాకు వచ్చి భార్యబిడ్డలతో నెలరోజులు గడిపి తిరిగి పోవువారే.

పలువురు ముస్లిం సహోదరులు ఏడెనిమిది యేండ్లుగా వారి కుటుంబములను వదలి ఉన్నవారే. ఒక్కమారు ప్రయాణించిన అగు ఖర్చు రెండేండ్ల వరకు వారిని బాధించును. వీరందరు జన్మతేదియో, లేక తేది, మాసము, సంవత్సరము కలిపిన వచ్చు సంఖ్య యో 7గా కలవారే. "ఈ కష్టములను మేము మిమ్మలను సంప్రదించి తీర్చుకొన్నాము. కాని వచ్చుటకు ఈమాత్రము వసతి కూడా లేనివారు ఎందరో మిమ్ములను కలవలేక కష్టపడుచున్నారు. వారికొరకు కొన్ని నెలల మీ సమయమును వెచ్చించి, ఒక్కమారు మా దేశములకు రారాదా!" అని ప్రాధేయపడుచునే యుంటిరి. దాని పర్యవసానమే నా ఈ పర్యటన.

నేను అచ్చటికి చేరిన దినమే నాకు ఘనస్వాగతమిచ్చిన * తమిళ్ మురసు' (తమిళడంకా) పత్రిక అధిపతి, సంపాదకులు అయిన శ్రీమాన్ సారంగపాణి సాయంత్రము ఒక సభ నేర్పాటుచేసి, సభకు వచ్చెడివారు తమ తమ జన్మతేదీలను వెంట తెచ్చుకొనవలసినదని పత్రికలో పెద్దగా ప్రకటించినారు. వారు పరిచయములో

నన్ను గురించి శ్లాఘించి, "వీరు తక్కినవారివలె ధనము నార్జించుటకై ఇచ్చటకు రాలేదు. భార్యాబిడ్డలకు దూరముగనే జీవించుచున్నవారి జీవితములకు వెలుగుబాట చూపుటకై వచ్చి నారు" అని చెప్పినారు. సభకు విచ్చేసిన అందరును జన్మతేది తెచ్చినట్లు చెప్పినారు. ఇటువంటి కష్టములకు 7 సంఖ్యయే కారణమని చెప్పి, ఇక్కడ కూడిన వారిలో 7 సంఖ్యలేనివారు ఎందరని ప్రశ్నించితిని. ఒక్కరు కూడా చేయెత్తలేదు.

శ్రీ సారంగపాణిగారు కూడ తాను బాల్యములో తిరువారూరులో ఉండినట్లు తరువాత తానింతవరకును భారతదేశమునకు వెళ్ళనే లేదనియు చెప్పినారు. అనేకులు తాము భార్యా బిడ్డలను వదలి వచ్చి 10 ఏండ్లు, 20 ఏండ్లు అయినవనినారు. 'పెండ్లియైన నాలుగో నాడే వచ్చి ఏడేండ్లయినను ఇంటి ముఖము చూడలేదు " అన్నటువంటి కథలింకెన్నో. అప్పుడు నేను పేర్లు మార్చిన అందరు నూ ఇప్పుడు భార్యాపిల్లలతో కలిసి సుఖసంపదలతో జీవించుచున్నారు. (మలేషియా దేశమున ఈ కళను అందరును అర్థము చేసికొనునట్లు మంచి ప్రచారము నిచ్చిన ఈ తమిళ్ దేశన్" పత్రిక వారికిని, 'తమిళ్ మురు"', 'ఏక్కో పత్రికల వారికిని నా కృతజ్ఞతలు.)

నాడు పనివాండ్రుగా ఉండిన ఎందరో నేడు యజమానులుగ ఉన్నారు. ఆ కాలములో జపాను నుండి నైలెక్స్ చీరలు దిగుమతి చేసి అమ్మిన ఒక గుజరాతీ వ్యాపారి, నా పర్యటనకు గుర్తుగా తనకేదైన ప్రత్యేకముగ చేయవలెనని కోరినాడు. అందుల కంగీకరించి అతను రప్పించు చీరలకు, నెలెక్స్ క్రేప్-644 అని చెప్పమనినాను. ఈ 644 చీరలగురించి మహిళాలోకానికి బాగుగనే తెలియును. నేను అంకెలను బట్టల వ్యాపారములో ఉపయోగించుట ఇదియే మొదటిసారి. దాని మూలమున అతనికి పలుకోట్ల డాలర్లు లాభించినది. శ్రీలంక దక్షిణ భాగమునుండి జపా నువరకు, వస్త్ర ముల వ్యాపారములో పేరెన్నికగన్న వ్యాపారములన్నియు నేను పేరు మార్చి ఇచ్చినవే అని వ్యాపారరంగమున అందరికీ తెలియును.

ఓటమి అనునదియే లేక 41 సంవత్సరములుగా ఈ కళ జనులకు మంచినే చేయుచున్న దని అందరూ గుర్తించి, ధైర్యముగా ఏమాత్రమును జంకులేక దీనిని అనుసరింపవచ్చునని తెలుపుటకే ఇంత చెప్పుట. వేలాదిమంది పనిచేయు పరిశ్రమలలోను, దీనిననుసరించుటచే, సమ్మెలు, విపత్తులు మొదలగు

అవాంతరములు ఏర్పడలేదన్నది ఎల్లరకును విదితమే. నావద్దకు వచ్చిన అందరిని మంచి, చెడు అను విచక్షణ లేకుండా వేగముగా ధనవంతులుగా మార్చుచున్నానని నామీద పలువురు పెద్దలు ఆరోపించుచున్నారు.

నేను నా ఇరువదవ సంవత్సరము నందే సైన్యమున చేసే ఉన్నత ఉద్యోగమును వదలి ప్రజల మంచికై ఈ శాస్త్రమును ఉపయోగింప వలయుననియే దీనిని వృత్తిగ చేపట్టితిని. ఈ శాస్త్రమును అందరును ఒప్పుకొని, వేగముగ ప్రచారము కావలెన/ నిన, నేను పేర్లు మార్చిన వారందరును శీఘ్రముగ మేలు పొందినగాని సాధ్యముకాదని, అందరకును ఉన్నత పదవులు వచ్చునట్లు పేర్లు మార్చి పెట్టితిని. వెంటనే ఫలితములు కనిపించినవి. ఆర్థికముగా పైకి వచ్చినవారినే కుటుంబమున కూడా గౌరవించుచున్నారు. పేరు విధములయిన వృద్ధిని, ప్రగతిని యెవ్వరును లెక్క చేయుట లేదు. విద్యావంతులు కూడా పేరు మార్చినంతనే అదృష్టము కలుగును" అన్న వ్యాఖ్యను నమ్మలేదు. (మా తండ్రిగారు కూడా నమ్మలేదు. వారి జబ్బుకు ఆపరేషన్ మాత్రమే నివారణ అన్నప్పుడు, నేను వారి పేరు మార్చి కొద్దిరోజులు వారిచేత సంతకము చేయించి, వారి వ్యాధి పూర్తిగా నయమయినది అని తెలిసినపుడు, వారు నన్ను, నా శాస్త్రమును పూర్తిగా నమ్మినారు.)

పుదుక్కోటిలో జబ్బుపడిన ఒక వకీలుగారి పేరును 42 నుండి 46 సంఖ్యకు మార్చి, నెలరోజులలో వారు జడ్జి అగుదురని అనినపుడు తక్కిన వకీళ్ళు పరిహాసమనుకొన్నారు. కాని నేను చెప్పినట్లే, ఎవరును ఎదురుచూడని విధముగా వారు స్పెషల్ జడ్జిగ నియమింపబడినారు. ఇక, దానివెనుక ఎవరును ఈ శాస్త్రమును నవ్వులాటగా అనుకొనుట లేదు.

చెట్టినాడులో అందరు ప్రముఖులును ఆనాడే పూర్తిగా నమ్మినారు. 1951 లో, నావలన పదవులలో పైకి వచ్చిన కొందరు జడ్జీలు, శ్రీలంకకు రావలసినదిగా కోరిరి. వారి ఆహ్వా నముపై 'కొలంబో'కు వెళ్ళి హోం మినిష్టరుగారి సెక్రటరిగా ఉండిన శ్రీ వైరముత్తుగారింట బస చేసితిని. వారు నన్ను జూసి, "ఇప్పుడు 3వ స్థానమున గల జస్టిస్ నాగలింగం ప్రధాన న్యాయాధిపతి కాగలరా! అనునది తెలిసికొనుటకే జడ్జీలు మిమ్ములను ఇచ్చటకు రప్పించినది" అన్నారు.

“నాగలింగంగారు ఆ పదవికి రాలేదు. ఎందుకంటే వారికన్న పైనున్న వారు 5 ఏండ్లు, 7 ఏండ్ల అనుభవము గలవారు. వీరిది 41/2 ఏండ్లు మాత్రమే. ఇది మామూలు విషయముగాదు. వారడిగినదే, వరమిచ్చునట్లు ఏదైనా చెప్పి ఇబ్బందిలో పడవలదు”” అని వైరముత్తుగారు మరల మరల హెచ్చరించినారు. ”నన్ను అడిగినచో నా చేతనయినది చేసెదను” అని నేనంటిని. అనుకొన్నట్లే నాగలింగంగారు “నాకు ఇది చేసిన యెడల, ఒక తమిళుడు ఈ పదవిని వహించిన కీర్తి శ్రీలంక తమిళ జాతికంతకును చేరును” అన్నారు.

వారిని కొద్ది దినములు లీవు తీసికొని తిరిగి నేను ఇచ్చుతేదీన ఉద్యోగములో చేరినచో త్వరలోనే శ్రీలంక అంతటకును పెద్దపదవిలో ఉండెదరని వ్రాసి యిచ్చినాను. నెల తిరుగులోపల ప్రధాన న్యాయాధికారి కామన్ వెల్త్ న్యాయాధిపతుల కాన్ఫరెన్సు నకై ఆస్ట్రేలియా వెళ్ళగా, వారి తరువాతి స్థానమున గల జడ్జిగారు కడుపులో ఆపరేషన్ జరిగి ఆసుపత్రిలో ఉండుట వలన మూడవ స్థానమున ఉండిన నాగలింగంగారు ప్రధాన న్యాయాధీశులుగా బాధ్యత చేపట్టినారు.

అలాగే, అనుకోకుండా, గవర్నరు జనరలుకు ఇంగ్లండునుండి అర్జంటుగా పిలుపు వచ్చుటచే వీరే రెండుమార్లు గవర్నరు జనరలుగా కూడా ఉండినారు.

పార్లమెంటు ఎగువ సభ (లంక) మెంబర్ల సంఘమున నేను ప్రసంగించినపుడు, కాబోవు ప్రధానమంత్రులు కూడ ‘నాయక” అన్న పేరుగలవారుగనే ఉందురని చెప్పినాను. రెండవ వరుసలో కూర్చుండి యుండిన ‘దహనాయక” అను మెంబరు నిలబడి పండిట్ గారు, నాపేరు కూడ దహనాయకానే. నన్ను కూడా అనుగ్రహింపుడు” అనినంతనే అందరును చప్పట్లు చరచి నవ్విరి. (ఏలననగా! వారు ఒక స్వతంత్ర అభ్యర్థి, తన ఓటు మాత్రమే కలవారు).

“మీరును కొద్దికాలము లంకకు ప్రధానిగ ఉందురు ), అని నేనంటిని. నేను నవ్వులాటకు చెప్పినట్లు అందరును అనుకొనిరి. సభ ముగియగానే ఇప్పుడు మంత్రిగారయిన తొండైమాన్ నావద్దకు వచ్చి * పసివారివలె మీరిట్లు చెప్పుట తగునా! ప్రజాస్వామ్యములో స్వచ్ఛంద అభ్యర్థి ఎట్లయ్యా ప్రధాని కాగలడు?”” అని

నొచ్చుకొనినారు. అందుకు నేను, "తొండైమాన్ గారు, నేను చెప్పినట్లే వారు ప్రధాని నిశ్చయముగా కాగలరు. నేటినుండియు వారిని స్నేహితునిగా చేసికొనుడు" అని చెప్పినాను.

శ్రీమాన్ బండారునాయకా కాల్చి చంపబడినపుడు, ఏ పార్టీకి చెందనివారినే, విచారణ ముగియువరకు, ప్రధానిగా నియమింపవలెనని బ్రిటిషువారు నిర్ణయించినందువలన శ్రీమాన్ దహనాయకను ప్రధానమంత్రిగా నియమించిరి. టైమ్స్ పత్రిక మొదటి పేజిలోనే, 'ఇండియా నుండి వచ్చిన పండిట్ సేతురామన్ తప్ప శ్రీలంకలో ఎవరును కలలో కూడా శ్రీ దహనాయక ప్రధాని కాగలరని తలచలేదు" అని ప్రచురించినారు. నేను కొద్దికాలమని అన్నట్లే వారును 6 నెలలు ఆ పదవిలో వుండినారు.

1979లో మరల లంకకు పోవుట తటస్థించినది. అప్పుడు తొండైమానుగారు నాకిచ్చిన విందులో తమ కుమారునితో, "నీ చిన్నప్పుడు 1951 లో దహనాయక ప్రధాని అవుతారని చెప్పి నది వీరే), అని పరిచయము చేసినారు. ఆ సంఘటన వారి మనసులో అంతగా హత్తుకున్నది కాబోలును. ఏలననగా శ్రీ దహనాయక నాతో సంఖ్యల గురించి చర్చించినపుడు ఇవన్నీ నీకు జరగవయ్యా" అన్నది వారే గద..

క్రీస్తు శకము ప్రారంభము నుండి 1954వరకు ప్రపంచమున జరిగిన యుద్ధములు, ప్రభుత్వములు మారుట, ఇతర సంఘటనలు అన్నియు, సరియగు కారణముతో నే జరిగినవా అని పరిశోధించి తృప్తి చెందిన మీదట వెలువరించినదే ఈ " అదృష్టవిజ్ఞానము".

చెమటోడ్చి పెంచిన పైరులా, రక్తము చిందించి సంపాదించిన స్వాతంత్ర్యములా, 1942 నుండి నేటివరకు రోజుకు 3 గంటలు మాత్రమే నిద్రించి, ఈ పరిశోధననే నా జీవిత లక్ష్యముగా చేసికొని పెంచిన పైరు ఈ కళ. దీనిని కళంకపరచుటయో, జనులను దారి మళ్ళించుటయో చేయుట వలన తరువాతి తరమువారు అయోమయములో పడెదరు. దీనిని పాఠకులు గ్రహించిన మంచిది.

కొన్ని సంఖ్యలు

ఈ గ్రంథమున పేర్కొన్న ఫలితములు అన్ని దేశ, కాలములకును వర్తించును. ప్రపంచములోనే గొప్ప అంతస్తును ఈయగలిగిన సంఖ్యగా 46ను పేర్కొంటిని. ఇండోనేషియా రాజధానియైన జకార్తాలో ఒక గొప్ప అమెరికను స్కూలునందు (అక్కడి విద్యార్థుల ఏడాది స్కూలు ఫీజు రు. 30వేలు, ఉపాధ్యాయుల నెల జీతము రు. 50,000 పైనే). ఈ శాస్త్ర మును గురించి ప్రసంగింప ఆహ్వానింపబడినాను. అప్పుడు, లోకములో మిక్కిలి ప్రసిద్ధికెక్కినవారి సంఖ్య 46 అని చెప్పి, వారికి తెలియునట్లు Joseph Stalin, Albert Einstein, Charlie Chaplin అని అందరికును పరిచయమైన పేర్లను ఉదహరించి నల్లబల్లపై వ్రాసి, వీరందరికన్న గొప్పగాను, ఇంకా వేయి సంవత్సరములు అన్ని దేశముల స్కూలు పుస్తకములలోను రాదగిన పేరు ఎవరిది? అతను ప్రస్తుతము మనకాలములో నే జీవించుచున్నారు అని చెప్పిన కొద్ది నిముషములయినను జవాబు రాలేదు. తరువాత నేనే, Neil A. Armstrong, 46 సంఖ్య గల అమెరికను. చంద్రునిపై మొట్టమొదట దిగినవారెవరు? అన్న ప్రశ్న స్కూలు పుస్తకములలో ఎన్నటికినీ ఉండును అని గట్టి కరతాళముల మధ్య ముగించితిని. అయినను 46 సంఖ్య పెట్టుకొనిన వారికందరకును ఇటువంటి ఫలితములు ఉండవు. అది వారికి తగినదిగా ఉండవలెను. 9 అంకెవారికి 46 హృద్రోగము (గుండె జబ్బు) కలుగజేయును.

37 - మిక్కిలి గొప్పవైన భోగభాగ్యములు ఇవ్వగలిగినది. ఈ సంఖ్యలో ఎందరో మదనకామరాజులను చూడవచ్చును. అయినను ఇది 9, 18, 27 తేదీలలో పుట్టినవారికి కండ్లలో అధిక ఉష్ణము చేసి అంధత్వము నిచ్చును.9, 27 వారికి45 మంచియే చేయును. కాని 18వ తేది వారికి 44, 45 కుష్టురోగము కలుగజేయును (క్రూరత్వము, అహంకారముల వలన రక్తము చెడిపోయి ఈ వ్యాధి ఎక్కువగును). అధికమయిన మద్యపానము వలన ప్రేవులు చెడి మరణించినవారు కొందరే ఉందురు. 30 ఏండ్ల క్రిందటనే "వీరు తప్ప తాగి పొట్ట పగిలి చస్తాడు" అని చెప్పబడినవారుకూడ బాగుగనే ఉన్నారు.

కాని అసూయ, ఈర్ష్యల వలన ఎందరో పిత్తాశయము పేలి మరణించిన వారున్నారు. ఓర్వలేనితనముతో పొట్ట పగులుతుంది అంటారు. నిజమే. ఎందరో పారిశ్రామికవేత్తలు,

తమకు అతిమూత్రవ్యాధియో, గుండెజబ్బో వచ్చినది సమ్మె జరిగినపుడో లేక టాక్సు ఒత్తిడులలో నో అని చెప్పెదరు. ఎన్నో వ్యాధులకు పనుల వత్తిడి, మానసిక వత్తిడియే మూల కారణమగుచున్నది. 6 అంకెవారికి సాధారణముగ6 వచ్చు దినములు మిక్కిలి అదృష్టమైనవి. కాని ఆరోజున కంటివైద్యము చేసిన కనీసము ఒక్కకన్నయినను పోవును. కారణము, 6కి అధిపతి అయిన శుక్రుడు "ఒంటికన్నువాడు" అనుటయే. ఇటువంటి చికిత్సలకు సామాన్య విధులు చాలవు. తత్వదర్శనము, లోతయిన జ్యోతిష పాండిత్యమును లేనిచో విపరీత ఫలితములు ఈయగలవు.

2 అంకె చంద్రుని సూచించుచునది. నీరు గల కూరగాయలను అందు పైరు చేసిన, ఎక్కువ నీటిని వాడుకొని, వంకాయలు కూడా టెంకాయలవలె అగును. కాని 2 తేదీన ఆపరేషన్ చేసుకొన్నచో చీము, నీరు పట్టి నయమగుటకు చాలా దినములు పట్టును. కంటి వైద్యము 9 సంఖ్యవారు తప్ప మిగతా అందరును 1 వచ్చు రోజులలో చేసికొన వచ్చును. 9 వారు 9, 5 దినములలో చేయుట మంచిది. 9 సంఖ్య వారు 2 సంఖ్య దినమందు కన్ను ఆపరేషను చేసుకొన్న నీరు కార్చుచునే ఉండి కన్ను కుళ్ళిపోవును. "2-10-1985 నందు కాటరాక్ట్ (కంటి శుక్లాలు) ఆపరేషను చేయించవద్దు. డాక్టరు సమర్ధుడయినను నీరుకార్చియే కన్ను పోవును" అని చెప్పియు ధైర్యముగా అదే రోజున చేయించుకొని కన్ను పోగొట్టుకొనినాడు నా మిత్రుని భాగస్వామి ఒకరు.

కన్ను పూర్తిగా తీసివేసి అందమైన గాజుకన్ను ను అమర్చి నారు. ఈవిధముగా 3 వారికి 6 వచ్చు దినములు, 6 వారికి 3 వచ్చు దినములు, 7 కు 8, ఇంకా 8, 1, 2, 4, 7, 8 వారందరకును 8 వచ్చు దినములు దురదృష్టమునే తెచ్చును. శరీరములోని అంగములు ఏ ఏ సంఖ్యలకు చెందినవో తెలిసికొని, దానికి తగినట్లు నిర్ణయింపవలెను.

పలురకములయిన మూర్ఛ వ్యాధులు, జన్మతేది 6, 15, 24 గా లేనిచో 41 వచ్చునట్లు మార్చి, ప్రతిదినము వ్రాయుచు వచ్చిన పూర్తిగా నయమగును. జన్మతేది6, 15, 24 గాని, పుట్టినతేది, నెల, సంవత్సరము కూడిన వచ్చు సంఖ్య 6 గా వున్నచో, 42 వచ్చునట్లు పేరు మార్చిన మేలు జరుగును. ఈ వ్యాధి అజీర్ణము వలన ఎక్కువగును కనుక 33వంటి జీర్ణశక్తిని తగ్గించు అంకెలకు మార్చరాదు.

పార్కిన్సన్ వ్యాధి అనబడు వైద్యశాస్త్ర ము నివారించలేని జబ్బు ఎడతెగని మలబద్ధకము వలన ప్రేవులు పనిచేయుట చెడిపోయి, నరములలో సరియైన రక్తప్రసరణము లేక (చేతులు, కాళ్ళు వణకుట) వచ్చును. దీనిని 5 ఎంతమాత్రము నివారింపలేదు. 1 గాని, 9 గాని జన్మతేదికి సఖ్యముగా ఉన్న దానిని చూసి అమర్చిన చక్కగా నయమగును.

ఈ కాలములో అన్ని విధములయిన ఊపిరి ఇబ్బందులను ఉబ్బసము (ఆస్త్మా)గా పేర్కొనుచు న్నారు. అందు 4 శాతము కూడా నిజమైన ఆస్త్మా కాదు. చేతి వేళ్ళ మొదటి వేళ్ళ మొనల (గోరు వుండు కణుపు)లో గళ్ళు గీసినట్లు రేఖలున్ననే అవి ఆస్త్మా అగును. ఇతరమైనవి పరిసరములు శుభ్రత లేకపోవుట, నేత పరిశ్రమల ప్రక్కన నివసించుట, ప్రత్తి, సిమెంటు మొదలగువాని వలన పీల్చు గాలి మలిన పడియుండుట వలన వచ్చునవి. ఈ విధంగా వ్రాస్తూ పోతే నేను చెప్పిన 2000 పుటల గ్రంథమగును.

నేను ఇంత వివరముగా చెప్పుటకు కారణం లేకపోలేదు. 1దీనిని చదివినంతనే పూర్తి శాస్త్రము తెలిసినట్లు అనుకొనుట తప్పుయని తెలుపుటకే. నన్ను ప్రత్యక్షముగ వచ్చి కలుసుకొనలేనివారు, తమదిగాని తమ కుటుంబంలో ఎవరి పేరయినగాని 16, 17, 26, 29, 31, 35, 38, 44, 47 వంటి దుష్ఫలితములనిచ్చు నవిగా ఉన్న ఎడల, పుట్టినతేదికి తగిన, పుస్తకమున మంచిదే అని చెప్పబడిన ఏ సంఖ్యకైనను మార్చుకొనవచ్చును. మీరు ఎంత తప్పుగా మార్చినను ఇంతకన్న కీడు చేయలేదు. ఎంతో కొంత మంచియే జరుగును. ఇందు 38 హఠాన్మరణమును సూచించునది, 16 పుత్రశోకమును, 47 అంధత్వము (గ్రుడ్డితనము) నివ్వగలిగినవి. వానినుండి తప్పించుకొనుడు.

పుత్రభాగ్యము:

ఈ కళ ద్వారా సంతాన భాగ్యములేని వేలాది దంపతులు చక్కని, అదృష్టకరమైన సంతానము పొందినారు. 'గర్బసంచి పెరుగుదల లేదు, చికిత్స ఫలించదు' అని గొప్ప డాక్టరులు వదలివేసిన వారు కూడా పేరు మార్పిడివలన సంతానవంతులు అయినారు.

పంచాంగము:

నేను మొదటి ముద్రణలో చెప్పిన దానికన్న ఇప్పుడు పంచాంగ విషయములు మరీ అధ్వాన్నమయినవి. పంచాంగములు పురోహితులు ఎక్కువగా కొనవలెనని ఒక్కొక్క పంచాంగము సంవత్సరమున 80-కిపైగా ముహూర్తములను ఇచ్చుచున్నవి. ఆషాఢము, భాద్రపదము, మార్గశిరము ఏదియును వారికి అడ్డుకాదు. ఆ మధ్య ఒక ప్రసిద్ధ పంచాంగ ప్రచురణకర్త బంధువు నన్ను చూడవచ్చి నారు. "ఏమయ్యా! మీ పంచాంగములో అన్ని ముహూర్తములు ఇచ్చియున్నారే? ఇది న్యాయమా!?" అని అడిగినందులకు అతను, "మేము ఏజెంట్లకు తక్కువ వెలకు పంచాంగములను ఇవ్వవలసియున్నది. వ్యాపారసరళిలో ఎక్కువ ముహూర్తములు పెట్టుచున్నాము. రూపాయకు 22 ముహూర్తములు అన్నట్లున్న వాటిని పెండ్లిచేయువారు ఏల తీసికొనవలెను? పెండ్లి ఖర్చులకు వేలకువేలు పోసేవారు ఒక మంచి జ్యోతిష్కునివద్ద లగ్నము పెట్టించరాదా!" అని ఎత్తిపొడిచినారు. ఏదో జనులందరును ఖర్చుకు వెరచి పంచాంగ ముహూర్తములు చూచుచున్నారన్నట్లుండినని వారి వాదము. సంఖ్యాశాస్త్రము తెలియనివారికి పెండ్లి జరుగుతేది వారి వైవాహిక జీవితముపై ఎంతటి ప్రభావమును చూపునో తెలియదు. నాకును డిఫెన్సు ప్రధాన కార్యాలయమున, మరణించిన వారి జన్మతేది, వివాహమయిన తేది, గాయపడ్డ తారీఖు, మరణించిన తేది అని వేలకొలది సంఖ్యలను, తేదీలను పరిశోధించిన పిమ్మటనే దాని బలము తెలియవచ్చినది. అదృష్టకరమయిన దినములందు వివాహమయిన వారు యుద్ధభూమిలో ఉండికూడ అకాలమరణము పొందలేదు. అట్లే తెలిసినవారు, చుట్టపట్లగలవారి కుటుంబములలో జరిగిన సంభవములను గమనించి తరువాతనే వివాహతేది ప్రాముఖ్యతను 'అదృష్ట విజ్ఞానము"లో పొందుపరచితిని. జాతకరీత్యా అల్పాయుష్కులేనని జ్యోతిష ప్రకారము చెప్పబడినవారిని, మాంగల్యబలములేని కన్యలను సరియైన తారీకులలో వివాహము చేయించి ఎందరినో ఈనాటికిని చక్కగా జీవించునట్లు చేసియున్నాను.

నా అభిమానులు పలువూర్లలో పెండ్లికి కావలసిన చీరలు, నగలు, పచారి వస్తువుల వ్యాపారములు చేయువారు. వివాహ సంబంధమయిన వ్యాపారములగుటచే వారికి ఎన్నో పెండ్లి ఆహ్వాన పత్రికలు వచ్చును. వాటిని సేకరించి, ఆ వివాహముల

ఫలితములను చూసి, మద్రాసు వచ్చు నపుడల్లా ఎవరు మంచి దినమున వివాహమాడినారు, ఎవరు దురదృష్టదినములలో పెండ్లి చేసుకొనినారు, ఫలితములేమి అని పట్టికవేసి చెప్పెడివాడను. వారును సాధ్యమయినంతవరకు చెడ్డదినములలో పెండ్లి వద్దని అందరకును చెప్పెడివాడను. కాని పలువురు 'బుద్ధి కర్మానుసారిణి" అనునట్లు అట్టి సలహాలను అలక్ష్యముచేసి పశ్చాత్తాపము చెందినారు. కనుక ఈగ్రంథమును చదువు తల్లిదండ్రులును, వివాహము కావలసిన యువతీ యువకులును దయచేసి ఈపుస్తకమున చెప్పబడిన వానిని అలక్ష్యము చేయక శ్రద్ధగా అనుసరించి చక్కగా జీవింపవచ్చునని అర్థము చేసికొని, నడుచుకొని, అందరూ సుఖముగా ఉండవలెనన్నదే నా కోరిక.

ముఖాముఖి కలుసుకొను కొద్దిమంది తప్ప వేలాది అభిమానులు, పాఠకులకు నామనసున తోచిన కొన్ని విషయములను స్పష్టీకరించుటకే ఈ ఉపోద్ఘాతం.

మానవ జీవితమున, ఈ గ్రంథములోని విషయములవలె సహాయపడునవి, భగవంతుని తత్వమువలె మార్పులేక నిరంతరం అయినదియును, జీవితమునకు తోడైయుండు శక్తి మరియొకటి లేదు. దానిని అర్థము చేసికొని, పూర్తిగా అనుసరించి విశిష్టతను, స్పష్టమైన ఉన్నతిని, ఎడతెరిపిలేని సుఖమును పొంది చిరకాలము జీవించాలని నా కోరిక. మీ జయమే నా లక్ష్యము. నా తల్లి పరాశక్తి అందరికి సర్వ సౌఖ్యములు మరియు సంతోషము ఇచ్చుగాక!

తేది:1-2-1987 గ్రంథకర్త

చెన్నై-600028 **పండిట్ సేతురామన్**

# సామాన్య పరిచయం
# (పీఠిక 1954)

"కృతనిశ్చయంతో ప్రారంభించబడిన ప్రతి ఒక్క పనీ నిర్విఘ్నంగా నెరవేరుతుంది."

- తిరువళ్ళువర్

పైన చెప్పిన విషయాన్ని అందరు చక్కగా అర్థం చేసుకోవాలి.

మన విజయం లేదా పరాజయానికి మనమే తప్ప, మరెవరూ కారణం కాదని మనమంతా అర్థం చేసుకోవాలి. ఇది ఎదురు చూడని సంఘటన అని కొందరు అంటారు. కాని ఎదురు చూడని సంఘటనలు అంటూ ఏవీ ఉండవు. ఒక చిన్న గింజ నాటితే, దానిలోంచి ఒక మొక్క వచ్చి అది పెద్ద వృక్షంగా మారుతుంది. మనం అనుకోకుండా పారవేసిన ఒక గింజ నేలలో నాటుకొని, దానిలోంచి ఒక చిన్న మొక్క పుట్టడం, అది పెరగడం సహజమే. అయితే దానిని మనం గమనించం. అయితే అది పెద్ద చెట్టుగా మారినప్పుడు, ఇది ఎక్కడి నుంచి వచ్చినదని ఆలోచించటం సరికాదు. మనం ఎలాంటి విత్తనం నాటితే, అలాంటి మొక్కే మొలుస్తుంది. అలాగే మన ప్రయత్నాలు ఎలా ఉంటే, ఫలితాలు కూడా అలాగే ఉంటాయి. ప్రకృతి ఎన్నడూ మారదు. మనం నాటిన ఒక గింజ మొక్కై, మానై అలాంటి ఎన్నో గింజలను మనకు అందిస్తుంది. దీనినే పెద్దలు, చేసుకున్న వారికి చేసుకున్నంత అని అంటుంటారు.

మనం నాటిన మొక్కలకు అందే ఫలాలను మనం అనుభవిస్తాం. కాబట్టి మన ప్రయత్నాలే మనం అనుభవించే ఫలితాలకు ఆధారం అన్నది మనం మరువరాదు. విత్తనం లేకుండా మొక్క మొలవదు. ప్రయత్నం లేకుండా ఫలితం లభించదు. ఇది ఎన్నటికిని మారని నిజం.

ప్రయత్నించాను... రకరకాలుగా ప్రయత్నించాను... కాని ఫలితం శూన్యం అంటూ కొందరు వాపోతూ ఉంటారు. అయితే తాము చేసిన ప్రయత్నాల గురించి తరచి చూడరు. తమ తప్పులేమిటని పరిశీలించే ప్రయత్నం చేయరు. మనం చేసే పని

సక్రమంగా చేస్తే దానికి ఫలితం ఎన్నడూ విచారించేదిగా ఉండదు. అలా జరగనప్పుడే, విపరీత పరిణామాలతో అవి మనల్ని నిరాశ పరుస్తాయి.

రకరకాలుగా ప్రయత్నించి నిరాశ పడేవారు తమ తప్పులు సరిదిద్దుకోవాలి. వారు తాము చేయవలసినది చేయక, పక్కనున్న వారు ఏం చేస్తున్నారో అదే చేయటం జరుగుతుంది. ఈ తేడాని వారు అర్థం చేసుకోవాలి. ప్రకృతి నుండి అందరికి సమానమైన అదరణే లభిస్తుంది. ప్రకృతి ఎవరికీ తక్కువ ఎక్కువలు ఇవ్వటం జరుగదు. ప్రతి వ్యక్తి వేరు వేరు విధులతో పుట్టడం జరుగుతుంది. ఎక్కువ సౌకర్యవంతమైన జీవితం గడిపేవారిని చూసి, వారినే అనుకరిస్తూ పనులు చేయడం ప్రారంభిస్తే ఇది జీవితాన్ని భ్రమింపచేయటమే అవుతుంది. ఈ ప్రపంచంలో కాలచక్రం ప్రారంభం నుండి గతి తప్పక, పొరపాటులేక సవ్యంగానే పోతూవుంది. సూర్యోదయం, సూర్యాస్తమయం, పౌర్ణమి, అమావాశ్య వీటిలో ఏవీ మార్పులు లేవు. రుతువులు కనిపించకుండా పోవటం లేదు. అంతా సవ్యంగానే జరుగుతున్నది. ఇది మనం మరువకూడదు.

రాత్రి, పగలు అన్నింటికి ఒక నిశ్చితమైన హద్దు, పద్దతి ఉన్నపుడు అవి మనకు ఉండవద్దా ? మనం వీటిని గ్రహించి నడుచుకోవద్దా ?

**అలోచనలు/ అంతర్మథనములు**: ఈ కాలంలో మనుష్యుల ఆలోచనలలో తగిన అభివృద్ధి కనిపించుటలేదు. (ఆలోచనల ఉద్గమ స్థానమునే మనం హృదయం లేదా మనసు అని అంటాం.) ప్రకృతి నుండి మనకు ఆలోచనలు **లభించాయి**. ప్రస్తుత విద్యావిధానం కేవలం తెలివితేటలనే ఎక్కువగా పెంచుతూ వుంది. కర్ణుడు , శిబిచక్రవర్తి వంటి మహా దాన సంపన్నులు పుట్టిన గడ్డలోనే మనమూ పుట్టాము. మనం విద్య, సంసృతి నుండి పాఠాలు నేర్చుకుంటూ ఉన్నాం. మన మనసులోని భావాలను కప్పిపుచ్చుకోవడం లేదా వాటిని మరో విధంగా ప్రకటించటం చేస్తున్నాం. దీనినే మనం విజయం అనుకుంటే మనల్ని మనం మోసం చేసుకున్నట్లే అవుతుంది. భావనలను చక్కగా అర్థం చేసుకుని, వాటి ప్రకారం మనం చేసే పనులను తీర్చిదిద్దుకుంటే, తద్వారా మన ఆంతరిక బాహ్య వాతావరణాలు రెండూ గుబాళిస్తాయి. మన జీవితం బాగుపడుతుంది. మనకు శాంతి సమకూరుతుంది.

వివేకాన్ని ఉపయోగించుకొనే **విధానంలోనే** మనిషికి, పశువుకి మధ్య తేడా తెలుస్తుంది. మనిషిలో ఆలోచించే శక్తి ఎక్కువ. వెలుగువైపు అల్లుకునే లత, అందంగా గూడు కట్టుకొనే పక్షి, గొప్ప కళానైపుణ్యంతో తేనెపట్టును నిర్మించే తేనె టీగ- ఇవన్నీ తమ ఆలోచనా శక్తితోనే తమ పనులు చక్కగా చేస్తున్నవి. (1954లో చెన్నైలో తన ఇంట్లో అలవాటైన ఒక పావురాన్ని నా స్నేహితుడొకడు తిరుచ్చిలో వదిలేసి ఆ రాత్రి ట్రైన్లోనే ఇంటికి తిరిగి వచ్చాడు. మరునాడు సాయంత్రానికి ఆ పావురం కూడా ఇంటికి తిరిగి వచ్చింది). ఏనుగు వంటి దీర్ఘాయుష్షు కలిగిన జంతువు కూడా ఒక నిశ్చిత సమయం వరకే సంతానాన్ని ఇవ్వగలుగుతుంది. ఒకేసారి సమాగమంతో గర్భధారణ చేస్తుంది. వివేకవంతులైన ఒక వర్గం కుటుంబ నియంత్రణతో మరియు ఇంకొక వర్గం కాశీ , రామేశ్వరం అంటూ తీర్థ యాత్రలకు వెళ్ళి కష్టపడుతూ ఉన్నారు. 100 సంవత్సరాలు బ్రతకడం కూడా నమ్మశక్యం కాకుండా ఉంది. దీనికి కారణం, మనం భావాలను **పరిపక్వతచెందేవరకు** నిరీక్షించకుండా, సమయం రాకుండానే వాటిని పరిపక్వం చేసే ప్రయత్నం చేయటమే .

భావాలతో ఇంద్రియాలు మేల్కొనడం సహజం, అయితే ఇంద్రియాల ద్వారా భావాలను మేల్కొల్పటం అసహజం. భావాలు సమయం **హద్దుని అనుసరించే** ఉద్భవిస్తాయి. ఇలాంటి సమయంలో వాతావరణం అనుకూలంగానే ఉంటుంది. కాబట్టి ఈ సమయాలలో చేసే పనులు తప్పక **ఫలవంతం** అవుతాయి. అలాగే భావనలు సరిగ్గా అమరని సమయాలు ఉంటాయి. ఈ సమయాలలో వాతావరణం అనుకూలంగా ఉండదు. కాబట్టి ఇలాంటి సమయాలలో మనం చేసే ఏ పనులు అయినా సహజంగానే **విఫలం కావటం తథ్యం**.

అనుకూల వాతావరణంలో చేసే పనులు విజయవంతం కావటానికి తగిన శక్తి **రోజురోజుకీ** పెరుగుతూ ఉంటుంది.

(అంతర్మథన శక్తి తక్కువ కావటంతో మనో శక్తి శ్రేష్ఠత స్థాయి దిగజారుతూ ఉంటుంది. మన పూర్వీకులలో ఉండే సూక్ష్మదృష్టి ఇప్పటి వారిలో కనిపించుట లేదు. విశ్వాసం, మస్తిష్క విలక్షణత/ తీక్షణత తగ్గి అవిశ్వాసం మరియు నిరాశానిస్పృహలు సర్వ సామాన్యంగా మారి పోయాయి. ఈ భావాల తిరోగమనానికి రెండు ఉదాహరణలు

చూద్దాం. కుక్క , ఆవు వంటి జంతువులు ఆహారాన్ని వాసన చూసి, ఆ సూక్ష్మ జ్ఞానంతోనే దాన్ని తినవచ్చో లేదో తెలుసుకోగలుగుతున్నవి. ఎర్రని లేదా నల్లని గొడుగును చూసి ఎద్దు బెదురుతున్నవి. యుద్ధం మరియు దుఃఖాన్ని సూచించే ఈ రంగులను మనం విజ్ఞతతో ఆలోచించి, ఉపయోగించకుండా ఉండడం మంచిది. ఆహారపదార్థాలు మరియు రంగుల గురించి ఈ పుస్తకంలో రాబోయే పేజీలలో వివరించటం జరిగింది).

మనం వివేకవంతంగా జీవించటానికి (నిర్వికారంగా ఇంద్రియ ప్రకోపాలతో జీవించుట చేత) ప్రకృతి నియమాన్ని మనం గ్రహించే ప్రయత్నం చేయుట లేదు. అందుకే మీరు దీన్ని చక్కగా అర్థం చేసుకోవాలని కోరుతున్నాను.

ఏ సమయంలో పనులు ఎలా చేస్తే విజయం లభిస్తుందో, ఎలాంటి సమయాల్లో అవి విఫలం అవుతాయో ప్రతి వ్యక్తి తెలుసుకోవాలి.

**విజయం మరియు పరాజయం అందించే శక్తులు తమ తమ దిశలలో పనిచేస్తూ ఉంటాయి.కోరిక, ద్వేషం,మంచి, చెడువంటి విచక్షణ ఆధారంగా పనిచేస్తూ ఉంటాయి. అందుకే మనం చెడ్డవారిని కూడా భోగ భాగ్యాలతో విరజిల్లుతూ ఉండడం చూస్తుంటాం.** ఇది చూసి కొందరు భగవంతుడికి న్యాయంలేదు అని అంటూ ఉంటారు. మనం ఇక్కడ భగవంతుడికి న్యాయం ఉందా లేదా అని ఆలోచించటం ముఖ్యం కాదు. మనల్ని , మన పరిస్థితులని చక్కగా అర్థం చేసుకొని, వాటి ప్రకారం మన సర్వ శక్తుల్ని వినియోగించుకోవటమే అతి ముఖ్యం.

(జీవించాలని కోరుకొనే వారి కోసం రాయబడిన ఈ పుస్తకంలో జీవించే వారికి నిజమైన చూపునిచ్చే కళ్ళు ఏమిటి అన్నది ఇప్పుడు చూద్దాం.)

"సంఖ్య మరియు అక్షరం మనుష్యునికి రెండు కళ్ళు."

ఈ విధంగా తమిళ భాషలోని మహ కవి తిరివుళ్ళువర్ అన్నారు. దీన్నే మనం నిత్య జీవితంలో " అంకెల జ్ఞానం లేనివాడు అంధుడు" అని అనటం జరుగుతున్నది. దీని అర్థం ఏమిటంటే, అంకెలు సమయానికి కొలబద్దలు వంటివి అని. అందుకే సమయాన్ని గ్రహించకుండా పోయే వాళ్ళని అంధులతో సమానమని అంటారు. వీళ్ళు

దారి మధ్య గట్టి దెబ్బలు తింటూ, పడి లేస్తూ పోతుంటారు. పరాజయాలేఈ దెబ్బలు. పేరు సరిగ్గా కుదరకపోతే ఎవ్వరు ప్రముఖులు కాలేరు.

కాలాన్ని ఎలా గుర్తించాలి, సరియైన పేరు ఎలా పెట్టాలి అనే అన్ని ముఖ్యమైన అంశాల గురించి ఈ పుస్తకంలో తేలిక భాషలో వివరించటం జరిగింది.

## మనుష్యులలో భేదాలు

మన పూర్వీకులు గణితంలో వస్తువులను లెక్కించేటప్పుడు చివరి అంకె 9 అని అన్నారు. (ఈ అంకె యొక్క విశిష్ట లక్షణాలను 322-343 వరకూ చూద్దాం). అందుకే వారు అన్ని వస్తువులను 9 వర్గాలుగా విభజించటం ప్రారంభించారు. నవ గ్రహాలు, నవ ధాన్యాలు, నవ రత్నాలు, నవ పాషాణాలు - ఇలా అన్ని వస్తువులను 9 రకాలుగా వివరించటం జరిగింది. 9 అంకె చివరి దశని చూపిస్తుంది. కాబట్టి 9ని అంతంగా ఉపయోగించటం పరిపాటి అయ్యింది. ఏదైనా మంత్రం జపించాలా? 108 (1+0+8= 9) సార్లు జపించండి అన్నారు. ఎక్కువగా చెయ్యాలంటే 1008 సార్లు జపించ మన్నారు. ఇలా మొత్తం కూడా వచ్చే సంఖ్య 9 గా నిర్ణయించటం జరిగింది. మందు తినాలన్నా 45 (4+5= 90) రోజులు తినాలన్నారు. ఈ విధముగా ఈ పుస్తకంలో కూడా 9 రకాల వ్యక్తుల గురించి చెప్పబడింది. పుట్టిన తేది ప్రకారం వ్యక్తుల జీవితం గురించి వివరణ ఇవ్వబడింది. 9 రకాల మనుష్యుల గురించి సంక్షిప్తంగా ముఖ్య వివరాలు మీరు ఈ పుస్తకంలో చూడవచ్చు.

## ఈ పుస్తకం గురించి

ఇంత వరకూ దురదృష్టవంతులుగా ఉన్న వారిని ఈ పుస్తకం అదృష్ట వంతులుగా మార్చేస్తుంది. నిరంతరం జీవితంలో విజయం సాధించే సాధనంగా ఈ పుస్తకం నిస్సందేహంగా నూటికి నూరు పాళ్ళు ఉపయోగ పడుతుంది. అదృష్టవంతులు కూడా కాలచక్రంలో దురదృష్టం ఎదుర్కొన వలసిన సమయం రాకపోదు. అయితే ఈ పుస్తకం సహాయంతో వారు ఆ పరిస్థితి నుండి బయట పడవచ్చు.

మన కండరాలు బలపడాలంటే మనం ఏం చేయాలి? వ్యాయామం చేయాలి. అంతే గాని దాన ధర్మాలో, మరేవో చేసి మన ఆరోగ్యాన్ని మార్చుకోవాలను కోవడం వీలు

పడేది కాదు. "ఈ ప్రపంచంలో ఎవ్వరూ సరియైన ఉపాయాన్ని ఉపయోగించకుండా ఏమీ పొందలేరు." ఇది ఉపనిషత్తులోని సార కైవల్యుని ఉవాచ.

మనం మన అదృష్టాన్ని పెంచే ఉపాయాల్ని గురించి ఆలోచించ వద్దా? వాటిని అనుసరించ వద్దా? మనం ప్రతి వ్యక్తికి వారి పుట్టిన తేదిని అనుసరించి సరియైన పద్ధతిలో పేరు పెట్టాలి. మనం చేసే ప్రయత్నాలలో కార్యసిద్ధి ఎప్పుడు లభిస్తుంది అన్నది తెలుసుకొని ఆ రోజుల్లోనే మనం ప్రయత్నాలు చేయాలి. ఈ విషయాన్ని ఈ పుస్తకంలో విపులంగా వివరించాం.

ఆరోగ్యవంతమైన శరీరానికి పౌష్టిక ఆహారం మరియు వ్యాయామం ఎలా మేలు చేసి ఆరోగ్యాన్ని పెంచుతాయో, ఆలాగే అనారోగ్యకరమైన శరీరంమీద ఈ పౌష్టిక ఆహారం మరియు వ్యాయామం దుష్ప్రభావాన్ని చూపించటం కూడా జరుగుతుంది. సరిగ్గా ఇలాగే చెడ్డ రోజులలో మనం చేసే ప్రయత్నాల ఫలితాలు కూడా చెడుగా పరిణమించటం జరుగుతుంది. మన దురదృష్టాన్ని ఎలా దూరం చేసుకోవాలి? మన అదృష్టాన్ని ఎలా పెంచుకోవాలి ? అనే వివరాలను అందించే సమయం విశిష్టత గురించి ఈ పుస్తకంలో చక్కగా వివరించటం జరిగింది.

ఈ పుస్తకం ఆందించే సారం
మీ సుఖ జీవనానికి ఆధారం

- రచయిత

చెన్నై-600028

తేది:19-8-1954

# పుస్తకం పేరు, దాని అర్థం

'అదృష్టము" అను మాటకు కంటికి కనపడనిది అని అర్థము. ఒకనికి భవిష్యత్తు తెలియకపోయినను, జరుగబోవు సంఘటనలు, ఎదురు చూడకపోయినను, అవి అతనికి అనుకూలముగ ఉండి అతని ఉన్నతికి తోడ్పడినచో అట్టివానిని అదృష్టశాల అనెదము. అట్లుకానిచో దురదృష్టశాలి అనిపించుకొనును.

ఈవిధముగా, అనుకూల పరిస్థితులను తెలుపుమాటగ అదృష్టము వాడుకలో ఉన్నది. కనుక, బహిరంగముగ అగుపడని ప్రకృతిశక్తులు పనిచేయు విధానమును, వాటిని అర్థము చేసుకొని అనుసరించి, మన జీవన విధానమును ఎట్లు జయప్రదముగా చేసికొనవచ్చునో విపులీకరించు ఈ గ్రంథమునకు అదృష్ట విజ్ఞానము" అను సముచితమయిన పేరు ఇవ్వబడినది.

ప్రకృతి శక్తుల సూక్ష్మతను, సున్నితత్వమును ఎరిగి, వానిని శబ్ద తరంగములతో జాగృతము చేయునది మంత్రశాస్త్ర ము. ఆ శక్తుల రూపములను తెలిసికొని, వాని మూలముగ సర్వ కార్యములు సాధించుకొనుటయే తంత్రశాస్త్ర ముల లక్ష్యము. ఒకదానికొకటి తోడుగ ఉండు ఈ రెండు శాస్త్ర ములే ప్రకృతిని అర్థము చేసికొని మానవుడు తన జీవితాన్ని అందుకు అనుగుణముగా మలచుకొనుటకు సహాయపడునవి.

అర్హత లేనివారికవి అందరాదన్న ఉద్దేశ్యముతో, ఈ రెండు శాస్త్రములు వివరణ కూడ లేక గోప్యముగానే ఉంచబడినవి. గురు, శిష్య పరంపరలోనే ఇవి ఇంకను జీవించి ఉన్నవి. వీనికి సంబంధించిన గ్రంథములందు కూడా యంత్రములు, మంత్రములు అవి ఇచ్చు ఫలితములే చెప్పబడి ఉండును. కాని, అవి ఎట్లు, ఏల అట్టి ఫలితములు ఇచ్చుచున్నవో విడివిడిగా, వివరముగా చెప్పబడలేదు.

ఈ పుస్తకమున, ఈ తత్వములు, సులభముగా అందరకును బోధపడునట్లు వివరింపబడినవి. సంగ్రహముగ చెప్పిన, ప్రతివారును తాము జన్మించిన తేదీని బట్టి ఏదో ఒక సంఖ్యకు చెందుచున్నారు. పిమ్మట అక్షరములతో (పేరుతో)

వివరింపబడుచున్నారు. పై శాస్త్ర ముల ప్రకారము మానవుడు యంత్రము, అతని పేరు మంత్రము. ఆ రెండింటికీని అనుకూలత ఉన్నచో పూర్ణఫలము లభించును. అట్లు కానిచో విపరీత ఫలితములు ఏర్పడును. అంకెలను, వానికి తగిన అక్షరములను ఫలితములతో పాటు ఈ పుస్తకము వివరించుచున్నది.

# చరిత్ర

అంకెలు, అక్షరములు మానవ జీవితమును ఏవిధముగా ప్రభావితం చేయగలవో వివరించెడు ఈ కళ మన కళలలో మిక్కిలి పురాతనమైనది. దీని ఆధారముగానే త్రిమూర్తులను, వారి లీలలు వివరించు పురాణములు వ్రాయబడినవి. హిందూ దేశమునుండియే గణితము, వైద్యము, జ్యోతిషము, మంత్రము మొదలయిన శాస్త్ర ములు ఈజిప్టు, పారశీకము వంటి దేశములకు ప్రాకినవి. ఈ కళకు సంబంధించిన వివరములను వినాశనము నుండి కాపాడదలచిన ఈజిప్టు జ్ఞానులు వానిని చిత్రముల రూపములోను, శిల్పములుగను పిరమిడ్లలో భద్రపరిచిరి. ప్రస్తుతము ఈ గ్రంథములో చెప్పబడిన 108 సంఖ్యలలో 78వరకు పిరమిడ్లలో చిత్రముల రూపమున కలవు. మిగిలిన 30 సంఖ్యల వివరములు భారతదేశమును దాటిపోలేదు. **సాలమన్** చక్రవర్తి తరువాత మరుగుపడిన ఈ కళను **పైథాగరస్** అను గణిత శాస్త్రజ్ఞుడు గుర్తించి తన శిష్యులకు బోధించినాడు. (జయముపై దృష్టి నిలిపిన మీకు ఇంత చదువుట కూడా శ్రమగ తోచవచ్చును. మీలో కొందరు వెంటనే దీనిపై మీ అభిప్రాయము చెప్పుటకు కూడా సిద్ధమే. కనుకనే, ఈ శాస్త్ర మును అభ్యసించుటకై ఎటువంటి శిష్యులను **పైథాగరస్** ఏరి, ఎంచుకొనినాడు అన్న విషయము చెప్పుట అవసరమయినది. కళలలో ఒకింత ప్రవేశము, ప్రావీణ్యము, కుశాగ్రబుద్ధి గలవారిని మాత్రమే వారు శిష్యరికమునకు అర్హులుగా ఎంచుకొనేవారట. శిష్యరికమునకు సిద్ధపడినవారు కూడా మూడు సంవత్సరములు మౌనముగా వారితో ఉండవలయును. పొరపాటున ఒక్కమారు నోరు తెరచినను వెంటనే అచటి నుండి పంపివేయుదురట. వారి బుద్ధికి తగని, విరుద్ధమయిన అభిప్రాయములు విన్నంతనే అనేకులు మౌనమును మరచి మాటలాడినందున శిష్యత్వమును కోల్పోయిరట. పుస్తక పఠనముతోనే జ్ఞానులమవగలమనుకొనువారికి ఇది వింతగా తోచవచ్చును. మౌనము పాటించిన శిష్యులు గొప్ప చింతనాశీలురుగా పరిగణించబడిరి. వివరించుతూపోతే అంతే లేదు.)

అక్షరముల సాయమున శబ్దములను కొలుచుటకు ప్రయత్నించిన 'హిబ్రూలు ప్రస్తుతము ఆంగ్లమున ఉన్న అక్షరములనే వాడిరి. అక్షరములు తక్కువగా ఉన్నవన్న

సౌకర్యముతో నే ఈ గ్రంథమునందును ఆంగ్ల అక్షరములనే ఉపయోగించితిని.

హైడన్ అను మేధావి పిరమిడ్లలో కనిపించే చిత్రములకు వ్యాఖ్యానము వ్రాసినారు. పిదప **ఫ్రాన్సు** దేశస్థుడయిన **జెర్మెయిను** అను సిద్ధపురుషుడు దానిని ప్రచారము గావించినాడు. (**మెస్మరు** అనువానికి అతను బోధించినదే పిదప మెస్మరిజం అయినది. అతను పుస్తకముగా ఏదియు రాయలేదు. అతని పేరుతో ఈ మధ్య కొన్ని రేఖాశాస్త్ర ము, జ్యోతిష్యమునకు సంబంధించిన పుస్తకములు వచ్చుచున్నవి.) కొంతకాలము క్రిందట కీరో (Cheiro) అన్న పేరుతో ప్రసిద్ధికెక్కిన ఒకరు ఈ శాస్త్ర ముపై ఒక పుస్తకమును రాసినారు. ఇతను 108 అంకెలలో 52 వరకు రాసి, అందు 35 సంఖ్యలకు మాత్రమే ఫలితముల నిచ్చి మొత్తము 52 సంఖ్యలే కలవు అని జనసామాన్యము నమ్మునట్లు రాసినారు. హైడన్ అభిప్రాయములనే ఇతడును రాసినాడు. నార్వే, జర్మనీ దేశస్థులు కూడా కొందరు రాయుచున్నారు గాని అందరును తాము చదివినదానిని కొద్దిగా మార్చి రాయుచున్నారే తప్ప దీనిన ఎట్లు ఉపయోగింపవలెనో చెప్పుటలేదు. (వీరెవరును దీనిని వృత్తిగా గైకొనలేదని గమనింప ప్రార్థన.) కీరో పుస్తకమునే నేను మొదట చదివి నది. దానితోనే నాకు ఈ కళయందు ఆసక్తి ఏర్పడినది. కాని ఈ కళ యొక్క ఆయువుపట్టు మనదేశమున మంత్రశాస్త్ర ములో ఉండుట పరిశోధనల వలననే తెలిసినది. వద్దనుకొనినను చెప్పవలసిన అవసరమేర్పడినందున నాకు ఈ కళకు గల అనుబంధమును క్లుప్తముగా వివరించెదను.

నా బాల్యమునందే మాయింటికి వచ్చెడి జ్యోతిష్కులు, రేఖా సాముద్రిక నిపుణులు, నేను గొప్ప **ఇంజనీరు** అయ్యెదననియు, అనేక నూతన విషయములను కనుగొని లోకమునకు ఉపయోగపడెదననియు చెప్పెడివారు. దానినే మనసులో ఉంచుకొని ఇంజనీరింగు కాలేజీలో చేరితిని. కాని జడ పదార్థములను గురించిన ఆ చదువు నాకు ఆసక్తి కలిగింపలేదు. ఆరు నెలలలోనే, ఎవరి అనుమతి కోరకుండా చదువును ముగించుకొంటిని (పరిస్థితులు కూడ అంత ప్రోత్సాహకరముగా ఉండలేదు.) శాస్త్రము తప్పదు. నేను తొందర పడితినా అన్న సందేహము నన్ను రేఖాశాస్త్ర మును పరిశోధింప చేసినది. అప్పుడు యోగా, మెస్మరిజం, హిప్నాటిజం నేర్పువారు కూడా ఎక్కువగానే

వెలసినారు. మంచివారి సాంగత్యము వలన నేను దేవి ఆరాధకుడను అయినాను. అక్కడి నుండి జీవితమున అపురూప సంఘటనలు మొదలయినవి. మనో వశ్య శాస్త్రములు అభ్యసింపరాదు అని ఆమె ఆజ్ఞ ఇచ్చినందువలన వానిని నిలిపివేసితిని. ఉచితముగానే ఎందరికో హస్తసాముద్రికము చెప్పితిని. అనుభవముమీద పరిశోధనాసక్తి, దూరదృష్టియు అలవడినది. జరుగబోవు సంఘటనలను అట్లే చెప్పెడివాడను (చిన్న వాడను కనుక ఏవి చెప్పరాదో నాకు తెలియలేదు). భయానక సంభవములను వినువారు, వాటిని ఎట్లు పరిహరించుటయని సలహా అడుగుతారు. దానికి సమాధానము తెలియని నేను ఎంతో పరితపించెడివాడను. నేను చెప్పిన దుర్ఘటనలు సంభవించినపుడు నేనే దానికి కారణమయినట్లు బాధపడి ఉన్నాను. జరుగబోవు దుర్ఘటనలను పరిహారము చేయు శక్తిలేనిచో ఫలితములు చెప్పరాదు అని నేను నిర్ణయించిన ఒక్కొక్క మారును, "అట్టి శక్తినిచ్చు కళను నీవు నేర్చెదవు. చేతులు (రేఖలు) చూచుట మానవలదు"" అని ఆ తల్లి చెప్పెడిది. అంకెలు, అక్షరముల గూర్చిన ఈ శాస్త్రమున అట్టి శక్తి కలదని నేను భావింపలేదు. దీని సహాయమున నా పేరులో చిన్న మార్పు చేయగానే నా జీవితములో గొప్ప మార్పు అభివృద్ధి వచ్చినది. (ఒక్క సంవత్సరములో నే పలుమార్లు జీతము పెరిగి, స్టెనోగా ఉండినవాడిని మిక్కిలి ఉన్నత పదవిని పొందితిని. జీతము పదమూడు రెట్లు పెరిగినది.) సైనిక ప్రధాన కార్యాలయమున ఉండుటచే వేలకొలది వీరుల జీవితములు, ముగింపులు తెలిసికొనగలిగితిని. (మా పై అధికారి నా ఈ పరిశోధనయందు మిక్కిలి శ్రద్ధ వహించినారు. నేను చెప్పినట్లే, కొంత సైన్యము నష్టమయిన వెనుకనే వారికి ఇందులో నమ్మకము కుదిరినది. తరువాత ఈ పుస్తకములో ఇచ్చినట్లే అదృష్టదినములు ఎంచుకొని సైన్యములను పంపి విజయములను సాధించినారు.)

హిట్లరు, జ్యోతిష్యమున గల నమ్మకముతో పౌర్ణమి రాత్రులు విమాన దాడులు, అమావాస్య దినములందు 9వ తారీకులందునే నేల మీద ఆక్రమణలు మొదలుపెట్టిన విషయము పాఠకులకు పరిచితమే. నా పరిశోధన పూర్తియయినదని నమ్మకము కలుగగానే, స్వతంత్ర జీవనం అపేక్షించి ఉద్యోగమునుండి బయటపడితిని. "చిన్న వయసులోనే ఇంత పెద్దజీతమును వదలి, జ్యోతిష్కుడిగా ఎవరయినా జీవింప

నిర్ణయించు కొంటారా?" అని మావారందరూ దిగులుపడినారు. కాని నా మనసు మారకుండునట్లు ఆ 'అమ్మ' అద్భుతములు జరిపి చూపినది. ఈ కళలో ముఖ్య రహస్యములను కూడా నాకు అర్ధమగునట్లు చేసినది.

**ఈ శాస్త్రము కాలము యొక్క మార్పులేని నియమములపై ఆధారపడి ఉన్నది. కావున సరియైన పద్ధతిలో ప్రయత్నించువారు ఎవరైనను, ఎటువంటి భేదములేక, తప్పక కార్యసిద్ధి పొందగలరు.**

ఇతరులకు కీడుచేయు తలంపు కలవారికి నేను ఈ శాస్త్ర పు సహాయముతో తోడుపడ ఇచ్చ గింపను. దానికి తగినట్లే, మంచిని కోరు సజ్జనులే నన్ను ఇంతవరకు సంప్రదించినారు. (నేను వారిని పరీక్షించిన విధము వారందరికీ తెలియును.)

ఈ కళను ఉపయోగించి సులభముగా ధనమార్జింప దలచి బొంబాయి స్టాకు మార్కెట్టునందును, గుఱ్ఱపు పందెములలోను డబ్బు పెట్టి జయమును, ఆనాడు పాలకులుగా ఉండిన ఎందరో సంస్థానాధీశుల స్నేహమును పొందితిని.

అయితే దైవశక్తి సన్నగిల్లినది. ఈ విషయమును నాదృష్టికి తెచ్చి నన్నుద్ధరించినవారు నా పరమ మిత్రులు కీ. శే. శ్రీ సాధు శక్తిదాస్ గారే. (శ్రీ సాధు శక్తిదాస్ తమిళమున రేఖాశాస్త్రము గురించి పుస్తకములు రాసారు). ఈ కళ మూలముగా నేను జనసామాన్యముతో సంబంధం పెట్టుకొను అవసరాన్ని వారు తరచుగా చెప్పేడివారు. దీనిని వ్యాపకముగా పెట్టుకొనాలి" అన్నప్పుడల్లా • దీనిని ఒక పుస్తకముగా రచించి జనుల కందజేసిననే నీ బాధ్యత తీరును" అని చెప్పేడివారు.

ఆయన తన పేరు ఉపయోగించి ఎందరో ధనము వసూలు చేసిన రసవత్తర ఘటనలు పేర్కొని, నేను రచించు పుస్తకమున నా ఫోటో తప్పక ముద్రింప వలయునని నొక్కి చెప్పేడివారు. ఈ కళవలన లాభముపొందిన వారందరు కూడా దీనిని పుస్తకముగా ప్రచురింపవలెనని కోరినారు. 1951-52లో శ్రీలంకలో ప్రసంగించు సందర్భములలో అక్కడి అభిమానులును ఇదే అభిప్రాయమును మరల మరల వెలిబుచ్చినారు. ఆంగ్లమున ప్రచురించుటకు కొందరు ముందుకు వచ్చి నారు. కాని నాకు 'దేవి యాజ్ఞ' దొరకనందున అందరకును ఆశాభంగము కావింపవలసి వచ్చెను.

1953 ప్రారంభమున యోగాచార్య శ్రీ సుందరంగారి ఆహ్వానం కారణంగా బెంగుళూరు వెళ్ళితిని. వారు నడుపు 'సుందరోదయం" అను పత్రికలో ఈ కళను గురించి నన్ను వ్యాసములు వ్రాయుమని అడిగినారు. నాకు తమిళమున వ్రాయుట అలవాటునులేదు. ఇష్టము లేదు అన్నది విని 'ఎవరో విదేశీయులేనా ఈ కళ వలన లాభము పొందవలెను? మనదేశమున దీనిని గురించి తెలియును. మొదట తమిళమున వ్రాయుట నీ కర్తవ్యము" అన్నారు.

నేను సమ్మతించి వ్యాసములు రచించినాను. పాఠకులలో ఉదారులుండుట గమనించినాను. నా సూచనలు పాటించి వృద్ధిపొందిన ఒక వ్యాపారి, అదే వ్యాపారము, అదే వీధిలో చేయుచున్న ఇతర వ్యాపారులకు నన్ను పరిచయము చేసినాడు. ఇంక ఈ కళ తప్పక ప్రచారము కాగలదని తోచినది. ఇంతవరకూ నన్ను సంప్రదించి తమను అదృష్టశాలురుగా చేసికొన్న యే ప్రముఖుడును, తనకు పోటీదారులుగా ఉన్న వారికి నన్ను పరిచయము చేయలేదు. పైపెచ్చు వారు నన్ను కలవకుండునట్లు జాగ్రత్తపడినారు. మరికొందరు, ఆ ఊరిలోనే తనకొక్కనికే అట్టి అవసరమేర్పడినదనియు, వేరెవ్వరికిని సహాయం అవసరము లేదని చెప్పి, రెట్టింపు ధనమిచ్చి వేరెవరినీ చూడనీయక రైలెక్కించేవారు. తను మాత్రమే బాగుపడవలెననుకొనే ఇట్టివారి వలన, ఈ కళకు ఏ ప్రయోజనము ఏర్పడలేదు. (నాకు మట్టుకు లాభమే).

పాఠకుల కోరికపై 1953లో పుస్తకము విడుదలయగునని ప్రకటించితిని. అచ్చగుటకు ముందు, ' ఇప్పుడు ధనము వెచ్చించి పుస్తకము ప్రచురింప అవసరము లేదనియు, దీనివలన మేలు పొందినవారు, ఆ పనికి సాయపడుటకు ముందుకు వచ్చెదరనియు, విదేశములలో ఉండువారికి అవసరమయినప్పుడును తామే ఏర్పాటు చేయుదురనియు" ఉత్తర్వు అగుటచే పుస్తకము నిలిపివేయబడినది.

1954లో మదురైకు వెళ్ళితిని. అచ్చట ఈ కళను ప్రచారము చేయుటలో సహాయపడిన స్నేహితులు, ఇది పుస్తకముగా వచ్చితీరవలెను అని సాధ్యమయినంత ప్రచారము గావించినారు.

ఈకళ ప్రాచుర్యము యొక్క ఆవశ్యకతను గుర్తించిన ఒక మహాత్ముడు (తన పేరు

గుప్తముగా ఉండ అభిలషించువారు) ఈ పుస్తకము తమిళమునందును, ఆంగ్లములో ను ముద్రించుటకు కావలసిన ద్రవ్య సహాయము చేసినారు.

ఈ గ్రంథము వలన మేలుపొందిన వారి దీవెనలు వారికి తప్పక లభించ గలవు.

**PANDIT SETHURAMAN**

# ఉపయోగించు విధానము

# అంకెలు - అక్షరములు

అంకె

మీ గురించి ఈ శాస్త్రము చెప్పు విషయములను అర్ధము చేసికొనుటకు ముందు మీ అంకెలను మీరు తెలిసికొనుట ముఖ్యము. ఇది సులభమే. మీరు ఎప్పుడు జన్మించితిరి? జనన తేది అయిన అంకె లేక సంఖ్య, తేది, నెల, సంవత్సరము మూడింటిని కూడిన వచ్చు సంఖ్యయును మీ సంఖ్యలు. మచ్చుకి మీ జనన తేది 17-10-1931 అనుకుందాం. మీ జనన తేదిలో 17 అనునది 1+7=8 అగుచున్నది. మొత్తము కూడిన 1+7+1+0+1+9+3+1=23. అనగా 2+3=5 అగుచున్నది. 8, 5లు మీ అంకెలు. (రాత్రి 12 గంటల తరువాత పుట్టినచో మర్నాటి తేదిని తీసుకొనవలెను).

జననతేది అనునది మీరు ఏ గ్రహమునకు చెందినవారని తెలుపును. దానిననుసరించి మీ శరీర నిర్మాణమును, గుణములు మొదలయినవి ఉండును. జీవితములో ఏర్పడు సంభవములు, మిగతావారితో మీ బాంధవ్యములు, భవిష్యత్తు, జీవితపు ముగింపు మొదలయినవి మీరు పుట్టినతేది, నెల, సంవత్సరము మూడింటిని కూడగా వచ్చు సంఖ్య తెలుపును. అట్లు కూడగా వచ్చు సంఖ్య జనన తేది కన్నను బలము గలదయినచో గుణములు, శరీర నిర్మాణము కూడ దానినే అనుసరించును. జన్మ తేది ఒకరి ఆశలను, సామర్ధ్యమును సూచించును. కూడగా వచ్చు సంఖ్య, అది ఎంతవరకు నెరవేరును అనునదియు, ఎంతవరకు సాధింపగలరు అనునదియు తెలుపును. విధిని సూచించేది ఈ సంఖ్య యే. విధి అనగా చెడు లేక కీడు అని పొరపడవద్దు. విధి అంటే ముగింపు లేక గడువు లేక హద్దు అని అర్ధము చేసికొనవలెను.

చిన్న ఉదాహరణ చూద్దాం. ఒక పచ్చిక బయలులో ఒకమూల ఆవు నొకదానిని కట్టినామనుకొనుడు. దాని మేతకు కావలసిన దూరము తిరుగగలినంత త్రాడును ఉపయోగించితిమి. ఆ తాడు ఉన్నంత మేరకు ఆ పరిధిలో అది ఎంతైనా

మేయవచ్చును. దానికి అంత చాలును. తాడుకన్న దూరము పోవ ప్రయత్నించినసే, తను కట్టబడిన విషయము దానికి తెలియును. తెలిసినను దానిని మీరలేదు, కాని ఆ హద్దు లోపల ఏ ఆటంకమేర్పడినను అది దాటగలదు. మన జీవితమును అట్టిదే.

ఎవరు ఏ రంగములో చేరవలయునో అందు ప్రయత్నించిన జయము కలుగును. వేరే ప్రయత్నములు కలసి రావు. ఎందరో తాము సరియైన రంగములో సంపాదించినదానిని సంబంధములేని రంగములో పెట్టి నష్టపోయినారు. దీనికి కారణము అదృష్టము మారినది" అని చెప్పుట తప్పు. ప్రతివారును తమకు తగిన పనులనే ఎంచుకొనుట వారి విజయమునకు మొదటి మెట్టు అవుతుంది.

విధి మనను ఎంతవరకు శాసించును?

చిన్న ఉదాహరణ చూద్దాం. ఒక పుల్లని మామిడి టెంక నుండి మొలచిన చెట్టు పుల్లని పండ్లనే ఇచ్చును. కాని మనకు తియ్యని పండ్లు కావలయుననిన దానిని ఒక తియ్యమామిడి మొక్కతో అంటుకట్టెదము. ఫలితము తియ్యని మామిడిపండ్లు. (చెట్లకు, మొక్కలకే చేయగలిగిన ఈ విద్య, మన జీవితములో చేసుకొనుట ఒక కష్టమా!)

ఈ మామిడిమొక్కను, ఈ విధముగ ఎంత పెద్దదైన, రుచికరమైన పండ్లనిచ్చునదిగాను చేయవచ్చును. కాని ఎంత ప్రయత్నించినను దీని నుండి పనసపండ్లనో, అరటిపండ్లనో పొందలేము. విధిని మార్చలేము అనుట దీనినే. ఎప్పుడయితే ఈ మొక్క మామడి టెంక నుండి మొలచినదో అప్పుడే అది ఆ జాతికి చెందినది. ఆ లక్షణములకు కట్టుబడినది. ఆ జాతిలో అది ఏ మార్పునయిన చెందగలదు. కాని ఏవిధముగను అది వేరు జాతి మొక్కగా మారజాలదు. ఈ సూత్రమే మానవజాతికిని వర్తించుచున్నది.

హిందూ శాస్త్ర ముల ప్రకారము ప్రతివారును గత జన్మలో తీరని కోరికలను తీర్చుకొనుటకే ఈ జన్మ ఎత్తుచున్నారు. దానికి తగిన విధితో ను, అందుకు తోడ్పడు శరీర, మనః ప్రవృత్తులతోను జన్మించుచున్నారు. ఈ సంగతిని మనం మరువకూడదు.

జన్మతేది సంఖ్య సూచించు ఏ వృత్తినయినను మనము జయప్రదముగ చేయగలము. ఫలితములు మూడు (తేది, నెల, సంవత్సరము) కూడిన వచ్చు

సంఖ్యకు కట్టుబడి ఉండును. ఆ సంఖ్య అదృష్టకరమయినదిగా ఉన్నచో గొప్ప విజయము కలుగును.

సంఖ్య, అక్షరము అన్న రెండు భాగములలో మీరు ఇప్పుడు మీ సంఖ్యలను తెలుసుకున్నారు. ఇది ముఖ్యమైనది. దీని ఆధారముతోనే అక్షరములు మనకు తగినట్లు పేర్చుకొనవలయును.

## అక్షరములు

ఈ శాస్త్ర పరిశోధన ప్రారంభములో, ఆంగ్ల అక్షరములతో చేయుచున్నామేయని మనసులో ఒక కొరత ఉండినది. కాని ఆంగ్ల అక్షరములు సూచించు ఫలితములు, విచిత్రమయిన పేర్లుగల పలుదేశముల వారికిని వర్తించుట గమనించితిని. నాకు అనుభవము ద్వారా ఆంగ్ల అక్షరములు అత్యంత శక్తివంతమైనవని తెలిసినది. అటు తరువాత మంత్రశాస్త్ర ములను పరిశోధించునపుడు, భవిష్యద్వర్తమానములను చెప్పెడి పురాణములందును, దీనికి సంబంధించిన గ్రంథములందును క్రింద ఇవ్వబడిన అర్థము వచ్చు విషయములను చూసితిని.

“కలియుగము జరుగునపుడు, వర్ణాశ్రమ ధర్మములన్నియు మారిపోవును. ఎల్లరును వారికి నచ్చిన వృత్తిని అవలంబించెదరు. మానవులు మాత్రముగాక, పంచభూతములును తమ ధర్మములలో మార్పులు చెందును. ప్రాచీనతను సంతరించుకొన్న భాషలు మరుగున పడినపుడు, దేవి మాతృకా మంత్రం రెండవ భాగము (ఐం, క్లీం, సౌః) పేరుగా గల భాషయే వృద్ధి చెంది, అందరి మెప్పును పొంది, అన్ని కళలు ఆ భాషయందే వికాసమందును. ఆ కాలమున దీపములు తలక్రిందులుగా వెలుగును”. ఇది ఎంత వరకు నిజమయినది అని నీటినుండి విద్యుత్తును, అందుండి ఫ్యాను రూపమున గాలిని, స్టౌల రూపములో అగ్నిని రూపొందించుటలోనే తెలియుచున్నది. పైన చెప్పబడిన భాషయే ఇంగ్లీషు'. తలక్రిందులుగా వెలుగు విద్యుద్దీపములు దీపముల చరిత్రలో విప్లవము కాదా!

దీనిని చూచిన పిదపనే ఆంగ్ల అక్షరముల శబ్ద తరంగములను, రంగులను, వాటి శక్తులను పరిశోధించుటలో ఆసక్తి ఏర్పడినది. (ఈ గ్రంథము మొదట ఆంగ్లమున

ఉండినందున దీనిని ఒప్పుకొనుటకు నిరాకరించిన కాశీ పండితులు 'ఇంగ్లీషు' గురించి వివరించిన పిదప అభిప్రాయమును మార్చుకొనిరి). ఒక్కొక్క అంకెకు సంబంధించిన అధ్యాయములో ఆ అంకెకు సంబంధించిన అక్షరముల గూర్చి వివరింపబడినది. పాఠకులు వానిని ఉపయోగించుకొన గోరుతున్నాను.

12 రాశులందును 9 గ్రహములు ఒక్కొక్క సమయమున మాత్రమే శక్తి పొంది ఉండును. వాటి ఫలములే 108 సంఖ్యలకు ఇవ్వబడినవి. మీ పేరు ఏ సంఖ్యకు చెందినదని తెలిసికొనుటకు, దాని ఆంగ్ల అక్షరముల అంకెలను కూడవలెను. ఆవిధంగా, మీ సంఖ్యను తెలుసుకొనవచ్చును. ఈ అంకెలకు సమానమైన ఇంగ్లీషు అక్షరముల పట్టిక క్రింద ఇవ్వబడినది :

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
|---|---|---|---|---|---|---|---|
| A | B | C | D | E | U | O | F |
| I | K | L | M | H | V | Z | P |
| J | R | S | T | N | W | | |
| Q | | G | | X | | | |
| Y | | | | | | | |

ఆంగ్ల అక్షరములకు సంఖ్యా విలువలు "చాల్డియన్ " పద్ధతి ప్రకారం ఇవ్వబడినవి. ఈ పద్ధతి విస్తారముగా ఉపయోగించబడి, ఖచ్చితమైనదిగా కనుగొనబడినది.

పేరులో వచ్చు నప్పుడు వీని విలువ ఇంతే. కాని పొడి అక్షరములుగా ఉన్నపుడు I, J, Y- 10 గాను, K - 20 గాను, L, S- 30 గాను, M - 40 గాను, N - 50, O - 70, P.

80, Q - 100, R - 200, T- 400 అని తీసుకొనవలెను. సంఖ్యలు ఆ అక్షరములు ఏర్పరచు శబ్ద తరంగముల వేగము, లేక తాకిడి శక్తిని సూచించు చున్నవి.

కొన్ని ఉదాహరణలను ఇచ్చెదను. (ఏవిధముగా పేరు రాయుదురో అట్లే లెక్కింపవలెను. పదవిని సూచించు పదములు, గౌరవ సూచక పదములు (Mr,వంటివి) చేర్చవద్దు. అలాగే పేరుకు పిదప వచ్చు అక్షరములకు విలువ లేదు.)

వీటిని గమనించండి

| | |
|---|---|
| DR. RAJENDRA PRASAD | |
| 42 21155421 821314 | 46 |
| DR. S. RADHA KRISHNAN | |
| 42 3 21451 22135515 | 46 |
| RAFI AHMED KIDWAI | |
| 2181 15454 214611 | 46 |
| GULZARILAL NANDA | |
| 3637121313 51541 | 46 |
| DR. KAILASNATH KATJU | |
| 42 2113135145 21416 | 46 |
| JOSEPH STALIN | |
| 173585 341315 | 46 |

పైన పేర్కొన్న పేర్లను, అంకెలను గమనించినారా? మన దేశపు రాష్ట్రపతులు అయిన Dr. రాజేంద్రప్రసాద్, Dr. S. రాధాకృష్ణన్ గార్లు, రఫీ అహ్మదు కిద్వాయి, గుల్జారీలాల్ నందా, డా. కైలాస్ నాథ్ కట్జూ, చిరకాలము రష్యాకు అధిపతిగా ఉండిన జోసఫ్ స్టాలిన్ వీరందరిలోను ఒక లింకు కలదు. దివానులుగాను, ప్రభుత్వ నాయకులుగాను 46 సంఖ్య కలవారే ఉండుట ఈ గ్రంథ ఫలితములను నమ్మదగినవిగా

చేయుచున్నవి.) పేరు 46గా ఉండిన 1 అంకె తెలుపు ఫలములు పూర్తిగా వర్తించును. 46 సంఖ్యకు చెందిన ఫలములు జీవితములో జరుగును. పేరును లోతుగా పరిశోధింప దలచినవారు క్రింద చెప్పిన ప్రకారము పరిశీలింపుడు.

| W. | V. | P | A | N | N | A | T | H | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 6 | 6 | 8 | 1 | 5 | 5 | 1 | 4 | 5 | 41 |

పేరు 41 సంఖ్యగా ఉన్నది. కార్యదక్షత గల మనిషిగా ఉండును కాని W.V-12గా ఉన్నది. పేరుమాత్రము 29 సంఖ్య కలది. శ్రమతో పైకి వచ్చుట 12 సూచించుచున్నది. అనేకుల చేత వంచింపబడి తాను అనేకులను వంచించుచూ జీవితమును గడుపుటను 29 సూచించు చున్నది. (ఇది ఎవరి పేరును కాదు. కల్పితమే). ఇలాగుననే బిజినెస్సు, బోర్డులలో ఓ అండ్ (and) 10 మరియు 'కో' (Co) 10గా లెక్కింపవలెను. లిమిటెడ్ పూర్తిగా వ్రాసిన 22. Ltd. మాత్రము వ్రాసిన 11 వచ్చును. కారు మొదలుగు వాహనములకు పేరులకన్న అంకెలు ముఖ్యము. DML 4965 అని వున్న DMLకు అంకెలు కలిపి 35 అని చెప్పవలెను. ఇప్పటికి ఈ వివరములు చాలు.

సరియైన నామ సంఖ్యలని తెలుసుకోవటం ఎలా?

కొన్ని పేర్లు చిన్నవి; కొన్ని పెద్దవి. కొన్ని పేర్లు పెద్దవిగా ఉండటం మాత్రమే కాక, వాటిలో అనేక విభాగాలు కూడా ఉంటాయి. కాబట్టి నామ సంఖ్యని గుణించటం కోసం తమ పేరులో ఏ భాగాన్ని తీసుకోవాలి, తమ అదృష్ట సంఖ్యని ఎలా తెలుసుకోవాలి అనే సందేహం పాఠకులకి కలగటం సహజం. ముందుగా మీకు ఏ నామ సంఖ్యలు మీకు అనుకూలమైనవో, మీ అదృష్టానికి ఏ సంఖ్యలు సహాయపడతాయో మీరు తెలుసుకోవాలి.

ఉదాహరణకి, ముందుగా ఘన విజయాన్ని సాధించిన వెండితెర నటుడు చార్లీ చాప్లిన్ (CHARLIE CHAPLIN) గురించి చూద్దాం.

అతని పుట్టిన తేది:16.4.1889

జన్మ సంఖ్య: 7; భాగ్య సంఖ్య:1

అసలు పేరు (పూర్తి పేరు) :

**CHARLES SPENCER CHAPLIN**

**3 5 1 2 3 5 3 3 8 5 5 3 5 2 3 5 1 8 3 1 5 = 79**

(అతని నామ సంఖ్య 79 పూర్తి వివరాల గురించి "అదృష్ట విజ్ఞానం" పుస్తకంలో చదవండి.)

లండన్ లో ఒక మురికివాడలో కటిక దరిద్రంలో పుట్టిన ఈ ప్రఖ్యాత నటుడు ఒక సాధారణ రంగస్థల గాయక దంపతుల కుమారుడు. రంగస్థలం మీద మొదటిసారిగా అతడు పాట పాడింది 5 సంవత్సరాల వయసులోనే! నటన, అదీ ఒక హాస్యరస చక్రవర్తిగా వెండి తెరపై నటించటం ఆయనలోని మరొక ప్రతిభ. ఆయన తన స్వల్ప ఆదాయంతో జీవిత భారాన్ని నెట్టుకు రావటం, ఎలాంటి ఇతర ఆదాయ వనరులు లేకపోవటం చేత, మెరుగైన అవకాశాల కోసం అతడు అమెరికా (హాలీవుడ్) వెళ్లాడు. అయితే, ఎలాంటి సంఖ్యా శాస్త్రం పరిజ్ఞానం లేకుండానే, ఒక అదృష్ట నామ సంఖ్యతో పాటు, చక్కని భాగ్య సంఖ్య (అదృష్ట సంఖ్య) కూడా అతనికి లభించింది.

**CHARLI E CHA PLIN**

**3 51 2315 35 1 8315 = 46**

"అదృష్ట విజ్ఞానం" పుస్తకంలో నామ సంఖ్య 46 గురించి వివరించిన ప్రకారం, ఈయన తన హాస్యరస పాత్రలలోని నటనకి అంతర్జాతీయ ఖ్యాతిని ఆర్జించారు. ఈయనకి సిరి సంపదలు మరియు పేరు ప్రఖ్యాతులతో పాటు అనేక అవార్డులు మరియు బిరుదులు లభించాయి. ఇలా ఆయన సినీ రంగస్థలంలో ఒక చిరస్మరణీయ చరిత్రగా నిలిచిపోయారు. ఆయన పొందినంత అపార ఖ్యాతి మరియు ప్రాచుర్యం మరే ఇతర నటుడూ పొంది ఉండరేమో!

కాబట్టి పాఠకులు, అత్యధిక అదృష్టాన్ని పొందుట కొరకు, వారు తమ పేరుని మార్చుట మరియు కుదించుటలో తగిన జాగ్రత్తలు తీసుకోవలసిందిగా కోరుతున్నాం.

అనేక తేదీలలో పుట్టి, తమ దైనిక జీవితంలో గాని లేదా వృత్తి వ్యాపారాలలో తమ పూర్తి పేరుని ఏమాత్రమూ ఉపయోగించని చాలా మంది సుప్రసిద్ధులు, మహా

శక్తివంతులు మరియు ధనిక వ్యక్తులు ఎందరో ఉన్నారు. ఉదాహరణకి, జాన్ ఎఫ్. కెనడీ మరియు హేరీ ఎస్. ట్రూమన్ వంటివారు. వారి జీవితాలలో ఈ పేర్లు (సంతకాలు) మాత్రమే కనిపిస్తాయి. విజయాన్ని సాధించ దలచినవారు తమకి ఏ నామ సంఖ్యలు అదృష్టాన్ని తీసుకువస్తాయో తెలుసుకోవాలి. డాక్యుమెంట్లు మరియు అగ్రిమెంట్లపై సంతకం చేయటం వంటి వాటితో సహా తమ నిత్య జీవితంలోని అన్ని సందర్భాలలో అలాంటి పేర్లనే ఉపయోగించాలి. మీ జన్మ మరియు భాగ్య సంఖ్యలు, అదృష్టవంతమైనవి అయినా లేదా దురదృష్టవంతమైనవి అయినా, అంటే మంచివి లేదా చెడ్డవి అయినా, మీరు సరియైన నామ సంఖ్యని తప్పకుండా ఎంచుకోవాలి.

# 5 - అంకె

పేరుకు గల సంఖ్యల గురించి చెప్పునప్పుడు 5 గురించి ప్రస్తావింపవలసియే ఉండును. ఈ అంకెకు గల శక్తియే మిగతా అన్ని అంకెలతో జన్మించినవారిని ఒక్క తాటిపైన నడిపించును. 5 అంకెల వరుసలో 32 అన్న సంఖ్య నన్ను మిక్కిలి ఆకర్షించినది. ఈ గ్రంథమును తెలిసికొన కారణం అయినదియు ఈ సంఖ్యనే. విక్రమార్కుని కథ అందరకును తెలిసియే ఉండును. విక్రమాదిత్యుడు పూర్ణజ్ఞాని అనియు, శక్తిశాలి అనియు, అన్ని జంతువుల భాషలు తెలిసినవాడనియు విక్రమార్క చరిత్ర తెలుపుచున్నది. అతను 32 లక్షణములను, గుణములు కలవాడట. 32 ఆయుధములు ధరించినాడట. అన్నివేళలా 32 మేళతాళములు మ్రోగింప చేసినాడట. 32 దాన ధర్మములను గావించినాడట. అతనికి దేవేంద్రునిచే ఇవ్వబడిన దివ్య సింహాసనము 32 మెట్లు కలిగి ఉండెనట. ప్రతి మెట్టునకు ఒక ప్రతిమ చొప్పున 32 ప్రతిమలు ఉండినవట. మోహిని ఉచ్చాటన చేసెడి వాడనియు ప్రతీతి. ఇతడు ఎందుకు అన్నీ 32గా చేసారో అన్నది చాలాకాలమువరకు సందేహముగానే ఉండినది. తర్వాతనే ఈ గ్రంథ సహాయముతో దాని అంతరార్థము తెలిసినది. 32 అనునది దేవి తంత్రములను సూచించు సంఖ్య. 'మోహిని సిద్ది" అన్న పేరు దానికి కలదు. పరిపూర్ణజ్ఞానమును ఇచ్చు ఈ సంఖ్య మహాద్భుతమైనది. మెరుపు మెరయునట్లు క్రొత్త ఆలోచనలు వచ్చును. కాని వెలుగు చీకట్లు మార్చి మారి వచ్చుటచే (మెరుపు క్షణికము) విక్రమార్కుని వలె 'ఆరు నెలలు రాజ్యము, ఆరు నెలలు త్యాజ్యము' అని జీవితము ఒకే రీతిగ ఉండదు. పేరునకు ఈ సంఖ్య వచ్చి నచో ఈ ఫలితములే ఇచ్చుచున్నవి. భ్రమింపజేయునంతటి ఐశ్వర్యము ఉండును. కాని సంపదల స్థితి చంచలముగా ఉండి తరచుగా మారిపోవుచుండును.

41 - మంచి అదృష్టకరమయిన సంఖ్య. జనాదరణయు, రాజోచిత జీవితమును కలిగించును. సంపద లెక్కకు మించి చేరును. అణకువతో ఉండినచో జీవితము వర్ధించిన విస్తరి అగును. అధిక లాభములు గడించు వ్యాపార సంస్థలు ఈ సంఖ్య కలవిగా ఉండుట గమనించండి.

68 - ఇది కూడా మంచి అదృష్టమైనదే. కడు బీద స్థితిలో ఉండినవారును గొప్ప ధనవంతులుగా మారినారు. అయినా ఈ సంఖ్య తృప్తి ఇవ్వదు. తన శక్తికి మించిన పనులు చేయ ప్రయత్నించి భంగపడుటను ఈ సంఖ్య సూచించును. వీరిలో చాలామందికి రసవాదంపై (బంగారం తయారుచేయుట.) పెట్టి ఉండును.

23 సంఖ్య, ప్రణాళిక ప్రకారము చేయు పనులలో గొప్ప విజయమును ఇచ్చును. లక్ష్యము లేనిచోట సుఖ జీవనమే మిగులును.

ఇతర సంఖ్యలు

కొన్ని సంఖ్యలు అదృష్టకరమైనవి గాను, మరి కొన్ని దురదృష్ట కరమైనవి గాను పేర్కొంటిని. పాఠకులు తికమక పడరాదన్న ఉద్దేశ్యంతో 38, 47 మొదలుగు సంఖ్యలను కూడ అదృష్టకరమయినవే అని రాసి, వాని లోపములను కూడా రాసినాను. 2 అంకె సూచించు పేరులన్నియును జీవితములో చిక్కులను ఏర్పరిచేవే. 7 అంకెయు తరచు ఇబ్బందులను ఏర్పరుచునదే. 4అనుకోని వ్యతిరేకతలను సృష్టించును. 8 పేరు సంఖ్యగా నుండి, అదృష్టకరముగా ఉన్నచో అది అన్యాయ మార్గములో సంపాదననే సూచించును. నల్లబజారు వ్యాపారులకు తలమానికముగ వీరే ఉందురు. న్యాయమార్గమున ఉండ ప్రయత్నించిన ఈ సంఖ్య నష్టమునే ఇచ్చును.

ముఖ్యమైన అంకెలన్నిటిని నేనే స్వయముగ పరీక్షించి చూచితిని. మంచి బుద్ధిని, సుఖమును, జయమును ఇవ్వగలిగిన సంఖ్యలనే అదృష్ట కరమయినవని రాసితిని. ఉదాహరణలు: ఒక్కొక్క అంకె అధ్యాయం చివర ఆ సంఖ్యలో జన్మించిన ప్రసిద్ధుల పేర్లు, పుట్టినతేదీ, విధి సంఖ్య మొదలగునవి ఇవ్వబడినవి. అందు పేర్కొన్న వారిని ఆ సంఖ్యాబలము ఎంత ఎత్తుకు ఎదుగునట్లు చేసినదో గమనింపుడు. వారి జీవితము, వారి పేరు, సంఖ్యలమీద ఆధారపడి ఉండును. 1 అంకె క్రింద పుట్టినవారు అధికార పదవులు వహింతురని అర్థము చేసికొనవలెను. దీనిని బట్టి వారి స్వభావములు ఉన్నతమైనవనియు, అద్భుతమైనవనియు తలచరాదు. నేను చెప్పినవని తలచరాదు. మచ్చుకు ఇచ్చినవారి మీద పాఠకులు పరిశీలనలు ప్రారంభింతురనియే ఇంత కన్నా ఎక్కువ సంఖ్యాబలము గల ప్రముఖుల పేర్లను జాబితాలో చేర్చలేదు. పైగా, నన్ను సంప్రదించినవారి విషయములను నేను ప్రకటింపరాదు. చెడు ఫలితములు గల

పలువురు ప్రముఖులు నన్ను సలహాలడుగుటచే వారి పేర్లు నేను చెప్పలేదు. తెలిసో తెలియకనో నేను ఎవరి మనసు నొప్పింపను. ఆ కారణముగా నేను పాఠకులకు ఇక్కడ వారి పేర్లను ఇవ్వనందులకు విచారించుచున్నాను. (మన మధ్య ను మసలుచున్న వారిని చూడగానే వారి సంఖ్యను పోల్చుకోగలము).

ఈ పుస్తకమును శ్రద్ధగా చదువువారికి, ఒకరి జనన సంఖ్యను ఊహించుట చాలా సులభము. ముఖ్యమైన పరిశోధనల నిమిత్తమే కొన్ని ఉదాహరణలను ఇచ్చి నాను. దీని ప్రకారము గొప్ప రాజకీయవేత్త (రాజతంత్రి) అనిన 9 & 9 జన్మదిన సంఖ్యగా ఉండును. గొప్ప తగాదాకోరుగా ఉండినచో 2 & 2 సంఖ్యవారు అని మీరూహింపలేరా! ఒకరికి గల జబ్బును బట్టి కూడా వారి జనన తేదిని గ్రహింపగలము.

ఇందు చెప్పబడిన ప్రముఖులు, ఈ శాస్త్ర ము ఆవిర్భావమునకు చాలా కాలము క్రిందటనే పుట్టినారు. మనుషులను చూసి ఈ శాస్త్ర మును వ్రాసితినని పొరబడవద్దు. పాఠకులకు నమ్మకము కలుగుటకై మనుష్యులను ఉదాహరణగా చూపితిని, అంతే.

# సమయం

ఈ పుస్తకాన్ని సరిగ్గా అర్థం చేసుకొనుటకు సమయం గురించి జ్ఞానం అవసరం. దానిని తెలిసికొనుటకు ముందుగా అది ఎలాంటిదని పరిశీలిద్దాం. ఎందుకంటే సమయం రెండు రకాలు. ఒకటి స్పందన కలిగినది. ఇంకొకటి స్పందన లేనిది. మరొక విధంగా చెప్పాలంటే, ఒకటి లోపల నుండి వచ్చు మానసిక స్పందన అనగా అతర్ జ్ఞానం, ఇంకొకటి జడ పదార్థములను తెలిసికొనే జ్ఞానం అనగా బహిర్ జ్ఞానం అని అర్థం చెప్పుకొనవచ్చు. ఇప్పుడు దీనిని పరిశీలిద్దాం. కాలమును భూతకాలము, వర్తమానకాలము, భవిష్యత్కాలము అని మూడు భాగములుగా విభజించారు. భూతకాలమనగా జరిగిన కాలమనీ, వర్తమాన కాలమనగా జరుగుచున్న కాలమనీ, భవిష్యత్కాలమనగా జరుగబోవు కాలమని మనం చిన్న తరగతులలో చదివాం. ఈ మూడు కాలములు కల్పనలో ఉన్నవి తప్ప, నిజంగా ఉన్నది వర్తమాన కాలమొక్కటే. ఆ రోజుల్లో మనం పాఠశాలలో నేర్చుకొన్న ప్రకారం చూస్తే- గడచిన కాలం భూతకాలం, ప్రస్తుతం జరుగుతున్న కాలం వర్తమానకాలం, ఆ తరువాత జరగబోయే కాలం భవిష్యత్కాలం అవుతున్నాయి.

నేను మరొక వాక్యం రాయబోవుచున్నాను - ఇది భవిష్యత్కాలం అవుతుంది. నేను మరొక వాక్యం రాయుచున్నాను - ఇది వర్తమానకాలం అవుతుంది. నేను మరొక వాక్యం రాసాను- ఇది భూతకాలం అవుతుంది. ఈవిధంగా చూస్తే భవిష్యత్తు, వర్తమాన, భూతకాలాలు తలక్రిందులుగా కనిపిస్తున్నాయి. ఎన్ని ఉదాహరణలు చూపినా సరే, ఈ మూడు కాలములను ఒకే వరుసలో స్థిరముగ మారకుండా ఉండునట్లు చూపలేము. ఎందుకంటే, నిజముగా అవి లేవు గనుక. సృష్టిలో ఏదీ నశించుట గాని, లేదా లేకుండా పోవుట గాని జరుగదు. కేవలం మార్పులే జరుగుతాయి. భవిష్యత్తు గురించి మనం ఊహల్లో గాలి మేడలు కడతాం. అయితే వాటికి ఉండే పునాదులు, స్తంభాలు అన్నీ మనం గానీ, లేదా ఇతరులెవరైనా గాని అనుభవించిన లేదా అనుభవిస్తున్న సుఖాలు మరియు పరిస్థితులే కదా! ఆ పరిస్థితిని అందుకొనుటకు మనం ప్రయత్నం చేస్తున్నప్పుడు మనం భవిష్యత్తువైపు పయనిస్తున్నామా, లేక భూతకాలం వైపు

పోవుచున్నామా? కాస్త ఆలోచించి చూడండి. నిజానికి ఈ భూత, భవిష్యత్ కాలములు వేరు వేరు దిశలలో పయనిస్తున్నా, అవి ఎప్పుడూ కలుసుకొంటూనే ఉండుట చేత, ఇదంతా 'కాల చక్రం' అయింది. అందుకే చరిత్ర పునరావృతం అవుతుంది అని మనం అంటూ ఉంటాం. నిజమే కదా? కాలచక్రం తిరుగుతున్నప్పుడు, ఈ భూతకాలం మళ్ళీ భవిష్యత్ కాలంగా మారుట సంభవిస్తున్నది.

ఇక కాలం అనుభవం గురించి ఇప్పుడు చూద్దాం. మనం మన మనసునకు నచ్చిన పనిలో ఉన్నప్పుడు మనకు కాలం గడచిన సంగతే తెలియదు. ఎందుచేత? ఎప్పుడైనా మీరు దీని గురించి ఆలోచించారా? దీనికి కారణం, మన మనసు సంతోషంగా ఉన్నపుడు కాలం స్పృహ మనకు ఉండదు. మనం సంతోషంతో పనిలో నిమగ్నమైనప్పుడు ఇదంతా చాలా సహజం. కష్టాలున్న సమయంలో కాలం కదలనే కదలదని అనిపిస్తుంది. క్షణమొక యుగంగా ఉంటుంది. ఎవరికోసమైనా లేదా దేనికోసమైనా మనం వేచి ఉండుట లేదా ఎదురు చూచుట, అలా కష్టం అనుభవించుట వంటి సమయాల్లో మనకి ఈ విధంగా అనిపిస్తుంది. మన మనోస్థితిని బట్టి కాలంలో మార్పు, అనగా కాలం వేగంగా నడవటమో, నిదానంగా నడవటమో జరుగుతుంది. నేను ఇంతవరకు చెప్పినది అంతర్ జ్ఞానం లేదా మానసిక స్పందన కలిగిన కాలం గురించి.

ఇక బహిర్ జ్ఞానం గురించి చూద్దాం. ఎన్నడో జరిగిన ఒక రైలు ప్రమాదం గురించి మనం మాట్లాడుకొనే సందర్భంలో, అది ఎప్పుడు, ఏ సంవత్సరంలో, ఏ నెలలో, ఏ తేదీన ఎలా జరిగిందన్నది ఒక భూతకాల సంభవంగా మనం లెక్కించటం జరుగుతుంది. అయితే ఆ సంఘటనతో మనకు సంబంధం ఉంటే ఆ సంఘటన 'నిన్ననే' జరిగినట్లుగా మనకు అనిపించటం జరుగుతుంది. అయితే ఆ సంఘటనతో మనకు ఎలాంటి సంబంధం లేనప్పుడు, ఒక కాల నిర్ణయం అవసరం అవుతుంది. మనం అలా కాల నిర్ణయం చేయటం అనగా కొలమానం కోసం ఏర్పడినవే క్షణాలు. ఈ క్షణాలు అనగా ఆ గడియారపు సెకండ్లు కేలండర్లు, శకాలుగా పెరిగినవి. ప్రపంచ సంఘటనలు, ప్రకృతి వైపరీత్యాలు ఒకరికి మించి అధిక సంఖ్యలోని ప్రజలు అనుభవించుట చేత , అట్టి సామూహిక అనుభవాలను కొలచుట కోసమే ఈ గడియారం మరియు కేలండరు

కాలమానం ఉన్నాయి.

పైన చెప్పిన ఈ మనసుతో అనుభవించే కాల వ్యవధి లేదా ఈ అంతర్ జ్ఞానం, ఈ గడియార కాలం లేదా ఈ బహిర్ జ్ఞానం అనే రెండూ ఒక చోట ఒకటిగా కలిసే సమయాన్నే కొన్ని సంఘటనలు సంభవిస్తూ ఉంటున్నవని తెలియుచున్నది. మన దృష్టికి అందని, మన కంటికి కనపడని, మనం అదృష్టం అని చెప్పుకొనే ఈ సంఘటనలు అన్నీ ఈ కాల వ్యవధిలోనే జరగటం సంభవిస్తుంది. ఈ కారణం చేతనే మనమెంత ఆరాటపడినా, మరెంతగా ఆశ పడినా మన కార్యాలు, మన ప్రయత్నాలు వాటికి తగిన సమయం రానిదే సిద్ధించుట జరుగదు.

ప్రపంచంలో సంఘటనలు ఏ విధంగా ఏర్పడుతూ ఉన్నాయో, ఏ సమయం కొలబద్దతో అవి సంభవించుట జరుగుతున్నదో, ఇంకా అవి ఏ కాలవ్యవధిలో సంభవిస్తున్నాయో మనం కాస్త సూక్ష్మ దృష్టితో చూసి, వాటిని నియంత్రిస్తున్న ఆ అద్భుత శక్తిని గ్రహించటం జరిగితే, మనం సర్వ కార్యాలలో అపూర్వ విజయం సాధించటానికి, అలాగే మనం సదా ఆశించే సిరిసంపదలు, అపార ధనం, కీర్తి, సుఖం మొదలైన సకల సిద్ధిని పొందటానికి అదే మూలమంత్రం అవుతుంది.

ఆధ్యాత్మిక సత్యములను తెలిసికొనుట కొరకు అంతర్ మనస్సు స్పందన సమయాన్ని తెలుసుకోవటమనేది ముఖ్యం. మనకు వందేళ్ళ సమయం దేవతలకు ఒక్క దినం అని అంటుంటారు. ఇవీ అలాంటి విషయాలే మనం ప్రస్తుతం చదువబోతున్న ఈ పుస్తకానికి అవి అవసరం లేనందున వాటిని ఇక్కడ అప్రస్తుతంగా భావించి వివరించుట లేదు.

సమయాన్ని లెక్కించుటకు రెండు పద్ధతులు ఉన్నవి. ఒకటి దిన గణన (ఒక వారంలో 7 దినములు). మరోటి తిథి గణన (9 అంకెలపై ఆధార పడిన సంఖ్యలు).

ఒక వారంలో దినాలు 7 వున్నాయి. కాబట్టి ఈ పద్ధతి మనకి ఈ ఇహ జీవనంలో సిరి సంపదలు మరియు కీర్తి ప్రతిష్ఠలు పొందటానికి ఏవిధంగానూ సహాయపడదు. పరసాధనకే తప్ప ప్రాపంచిక జీవన సౌఖ్యం, ధన వస్తు సంచయం, ఐచ్ఛిక గౌరవ మర్యాదలు మొదలయినవి సంపాదించుటకు ఇది పనికిరాదు. (ఒక వారంలోని ఒకే

రోజున మనకు అన్నీ ఒకే విధమైన భావములు, స్పందనలు కలుగుతాయి).7 సంఖ్యని నియంత్రించి, దానిపై అధికారము చలాయించుట మానవులకి సాధ్యం కాదు. 7 సంఖ్య మన మనసుకు అందని ఆత్మ తత్వమును సూచించునది అగుటచే, దీని సహాయంతో మనం నిశ్చయంగా ఇహలోక జీవితంలో జయం పొందలేం. 9 **అంకె సమూహంలోని తేదీలని మనం ఆశ్రయిస్తే మనం ప్రపంచములో సర్వస్వాన్ని జయించగలం.** సర్వసంపదలను పొందగలం. అయితే అన్ని సంపదలు మానవ శక్తికి లోబడి ఉండరాదనే లక్ష్యంతోనే బహుశా 7 దినములుగల వారములు, 52 వారములు కలిగిన (52 కలిపితే మొత్తం 7 వస్తుంది కదా?) సంవత్సరాలు (ఒక రోజు ఎక్కువ అయినప్పటికీ) ఏర్పాటు చేయబడటం జరిగింది. ఇకపోతే మతం, ధార్మిక కార్యాలపై నమ్మకంతో కొనసాగే వ్యక్తులకి సహాయంచేసే ఈ అంకె, ఏవిధంగాను స్వతంత్ర అభీష్టాలు నెరవేర్చుకోవటానికి సహకరించదు. ఒక్కరికి మాత్రమే ఉపయోగపడు కార్యములకు పనికిరాదు. ఈ పుస్తకంలో అంకెలతో చూపించబడే తిథులు అనగా తేదీలను ఉపయోగించుట జరిగింది. అట్టి తేదీలకు సంబంధించిన రహస్యములను ఎవరైనా చక్కగా అర్థం చేసుకోవటం జరిగితే, ఆ తరువాత అలాంటి వ్యక్తులకు నిరాటంకంగా సర్వ కార్యాలలో విజయం కలుగుతుంది.

ఈ పుస్తకంలో అంకెలకు సంబంధించిన కొన్ని ముఖ్య సూచనలు సంక్షిప్తంగా ఇవ్వబడ్డాయి. ఇక్కడ మీరు మరొక ముఖ్యమైన విషయాన్ని మర్చిపోకూడదు.

అదేమిటంటే, ఎవరి జీవితంలోనైనా నిస్సందేహంగా పేరుతోనే అనేక మార్పులు ఏర్పడటం జరుగుతుందన్నది. కనుక ఒక్కొ క్క సంఖ్యలో పుట్టిన వారికి, వారి జీవితంలో ఏ ఏ వయసులో (సంవత్సరంలో) ముఖ్య సంఘటనలు జరుగుతాయన్నది నేను ఈ పుస్తకంలో సూచించ లేదు. మనిషికి పెట్టిన పేరు తగినదై వుంటే, దానికి తగిన విధంగా వారి జీవితంలో వారి వయసు సంఖ్య వారి అదృష్ట సంఖ్య అయితే తప్పకుండా వారి జీవితంలో మంచి మార్పులు జరుగుతాయి.

ఇక, విడి విడిగా అంకెలను, అవి సూచించు అక్షరములను, వాటి వలన కలుగు ఫలితములను తరువాత అధ్యాయాలలో పరిశీలిద్దాం.

# అదృష్ట విజ్ఞానం - కొన్ని అనుభవములు

'అదృష్టవిజ్ఞానం' అను ఈ గ్రంథము వేలాది అభిమానుల కోరికపై 1954లో ప్రచురింపబడినది. అయినను ఏవిధమయిన వ్యాపార ప్రకటనలు, ప్రచారము గావింపక, 'ఆ దేవి' ఆజ్ఞ ప్రకారము, అదృష్ట శాలురగుటకు ప్రాప్తమున్న వారికే ఈ పుస్తకము లభ్యము కావలెనని, ప్రత్యేకముగా ఇది కావలయునని అడిగినవారికే మా తండ్రిగారు ఈ పుస్తకము ఇచ్చెడివారు. దీనిని తెలుసుకున్న వారిని, జయప్రదముగా జీవింపచేయు కళయగుటచే శ్రద్ధగా చదివి, స్పష్టముగా ఆలోచించి, ఈ గ్రంథము చూపిన మార్గముని అనుసరించి వృద్ధిచెందగలవారు మాత్రమే దీనిని కోరెదరు, పొందెదరు. ఈ గ్రంథమును పలువురు పూజించి, ఒక దైవికమైనదిగా భావించి, అమిత భక్తి శ్రద్ధలతో దీని ప్రకారమే జీవించుచున్నారు.

ఈ గ్రంథమును వెలువరించుటచే లక్షలాది క్రొత్త స్నేహితులు ఏర్పడినారు. ఈ కళకు సంబంధించి, మేము ఏదేశమేగినను, ప్రపంచమున అన్ని మూలలలోను, మాకు ఘన స్వాగతమే ఉండినది. అచ్చట నివసించు జనులు మా వలన ఉన్నత స్థితి పొంది ఉండుట వలన ప్రస్తుతము ఈ కళ దేశ విదేశములందు ఉచ్ఛ స్థితిలో ఉన్నది. ఈ కళను ఉపయోగించి పేరునందు చిన్న మార్పులు చేయుటచే, జీవితములో మహోన్నతి పొందవచ్చునన్నది మాచేత పలుమారులు నిరూపింపబడిన సత్యము. పామరుల నుండి ప్రముఖులవరకు అన్ని వర్గముల వారికి గొప్ప మార్పులు, వృద్ధినీ ఇవ్వగలిగినది ఈ శాస్త్రము. ఎంత ధనము వెచ్చించి పరిశ్రమ నెలకొల్పినను, ప్రారంభము తప్పయిన తేదీలో జరిగినచో వరుసగా చిక్కులే ఏర్పడును. ఆశించిన ఉత్పత్తి, లాభములు ఉండవు. కనుక ఏదయినా ముఖ్యమైన పని ప్రారంభించునపుడు, మంచి తేదీన ప్రారంభింపవలెను. అది అతిముఖ్యము. నన్ను, మా తండ్రిగారిని సంప్రదించిన పలువురు తమ అనుభవములను ప్రకటింప కోరిరి. పేరులో చేసిన చిన్న మార్పు, జీవితములో ఎంత ఎత్తునకు ఎదుగునట్లు చేయునో తెలుపుటకు వారి అనుభవములు మంచి ఉదాహరణలుగా ఉండునని తలచి, అటువంటి కొన్ని ఉత్తరములను మీ ముందుంచుచున్నాను.అదృష్ట విజ్ఞానం - కొన్ని అనుభవములు

**P.R. RAMASUBRAHMANEYA RAJHA**

**"RAMAMANDIRAM"**

**RAJAPALAYAM - 626117.**

**27th Dec. 2001**

నా మేనల్లుడు శ్రీ N.K. రామస్వామిరాజా మూలముగా పండిట్ సేతురామన్ గారిని కలుసుకొను మహద్భాగ్యము నాకు కలిగినది. మా తండ్రిగారయిన శ్రీ P.A.C. రామసామిరాజా వారికి జ్యోతిష శాస్త్ర ముపై అపార నమ్మకము ఉండేది. వారికి సమయము దొరికినపుడెల్ల మా కుటుంబములోని అందరి జాతకములను ప్రసిద్ధ జ్యోతిష్కులకు చూపి భవిష్యత్తు గురించి తెలిసికొనుచుండెడివారు. కాని నేను అందుకు పూర్తిగా విరుద్ధము. నాకు జ్యోతిష్యం మీద, రేఖా-శాస్త్రము, సంఖ్యాశాస్త్రము మొదలగువాని మీద కొంచెము కూడా నమ్మకం లేదు.

1962లో మా తండ్రిగారు దివంగతులయిన పిమ్మట, ప్రత్తి వస్త్ర పరిశ్రమలతో పాటు కొత్తగా స్థాపించిన, 66,000 టన్నుల సిమెంటు ఉత్పత్తి చేయు ఫ్యాక్టరీని కూడ నిర్వహింపవలసిన ముఖ్యమైన బాధ్యత నాపై పడినది. అన్ని పరిశ్రమలు సవ్యముగా నడచుటకు నేను కఠిన పరిశ్రమ చేయవలసి వచ్చింది. 1977లో ఉత్పత్తి అనేక రెట్లు పెంచు ఉద్దేశ్యముతో ధైర్యముగా రు. 15 కోట్లకు పైననే అందు ఖర్చుపెట్టితిని. తమిళనాడులోనే మొట్టమొదటగా Dry Process పద్ధతిలో ను, ఇండియాలోనే ప్రథమంగా గణింపదగిన ఒక దినమునకు 1200 టన్నుల ఉత్పత్తి చేయగలిగిన పెద్ద బట్టీ స్థాపించితిని. నా ఈ సాహసమునకు ఎందరో నన్ను విమర్శించిరి. ఆ సమయమునకు సిమెంటు ధర నిర్ణయము ప్రభుత్వముచేత ఉండినది. నేను పెట్టిన మూలధనము చాలా అధికమని అభిప్రాయపడినారు. ఫ్యాక్టరీని నడపుటకు గవర్నమెంటు నుండి సరియైన వెల నిర్ణయము పొందుటకు నేను పడ్డ కష్టనష్టములకు లెక్కలేదు. ఇంత ఇక్కటయిన పరిస్థితిలో చిక్కి అవసపడుచున్న నాకు నా మేనల్లుడు ఆ కాలపు సంఖ్యాశాస్త్ర మేధావి అయిన పండిట్ జీని కలవమని సలహా ఇచ్చినాడు. నేను కూడ వెంటనే వెళ్ళి వారిని చూసినాను. వారు నా పేరులో కొన్ని అక్షరములను మార్చి నారు. తరువాత కుటుంబములోని అందరి జాతకములను పరిశీలించి వారి

పేర్లకు కూడా కొన్ని మార్పులు గావించినారు. పండిట్ జీ గారి పరిచయము నాలో కొన్ని మార్పులను తెచ్చి నది. దాని ఫలితముగ నేను దేనినయినా సాధింపగలను అన్న నమ్మకము బలపడినది. అన్ని సవాళ్ళను విజయవంతముగ ఎదుర్కొంటిని. మా తండ్రిగారు స్థాపించిన 66,000 టన్నులు ఉత్పత్తిచేయు ఫ్యాక్టరీతోనే 60 లక్షల టన్నుల సిమెంటును ఉత్పత్తి చేయగల నాలుగు పెద్ద ఫ్యాక్టరీలు నిర్మింపగలిగినాను. మా “RAMCO’ సంస్థలో కొత్తగా ఏ నిర్ణయయములు తీసికొన్నను, పరిశ్రమను విస్తరించునపుడును, పండిట్ గారిని ముందే కలిసి వారి ఆలోచన ప్రకారము చేయుట పరిపాటి అయినది. వారిని సంప్రదించినవారును, వారి ఆలోచనను పాటించినవారును, ఓటమిని తప్పించుకొని విజయము చేపట్టినారని, వారికి స్వశక్తిపై నమ్మకము పెరిగినదనియు, నేను ఘంటా పథముగ చెప్పగలను.

ప్రస్తుతము పండిట్ జీ మన మధ్య లేరన్న కొరత ఉన్నను, వారి అడుగుజాడలలో నడచి, మంచి విధముగ సలహాలు చెప్పుచున్న వారి కుమారులు శ్రీ V. S. గురుస్వామి గారిని తలచినపుడు చాలా సంతోషముగా ఉన్నది. పండిట్జీ రచించి, ప్రచురించిన ‘అదృష్ట విజ్ఞానము’ అను ఈ పుస్తకము సంఖ్యాశాస్త్ర అభిమానులకు ఒక ‘ఎన్-సైక్లోపీడియా’ (ENCYCLOPAEDIA) వలె ఉన్నది. వీరి కుమారుడు ప్రస్తుతము ఆంగ్లములోను, తెలుగులోను ప్రచురించిన ఈ గ్రంథము ప్రపంచమున ఎల్లరకును ఒక వరప్రసాదమని నిశ్చయముగా చెప్పగలను. పండిట్జీ పరిచయ భాగ్యము, నాకు కలిగించినందులకు ఆ భగవంతునకు మనఃపూర్వక కృతజ్ఞతలను అర్పించుకొనుచున్నాను.

అభిమానముతో,

**P.R. RAMASUBRAHMANEYA RAJHA**

Chairman, Ramco Group

**DR. K.A. ZIYAAUDHIN, M.D.,(USA)**
19, Rosen Brook Drive
Lincoln Park
New Jersey 07035
U.S.A
24-12-2001

పండిట్ సేతురామన్-గారితో నా స్నేహము గురించి వ్రాయుటకు నేనెంతో గర్విస్తున్నాను. పండిట్ గారిని కలుసుకున్న తరువాత నా జీవితం ఎంతగానో మారినది.

నేను 4 అక్టోబరు 1944లో జన్మించాను. కష్టపడి చదివి నేను మద్రాసులోని స్టాన్లీ మెడికల్ కాలేజిలో విద్యార్థినయినాను. 10యేండ్ల బాలునిగా ఉన్నప్పటి నుండి నేను కన్న కలలు ఫలించి M.B.B.S. డిగ్రీ తీసుకొని, ఇండియా, చైనా సరిహద్దులలో డ్యూటి చేయుచుండిన తమిళనాడు పోలీసు శాఖలో ఉద్యోగము కూడ దొరికినది. కాని పోస్టింగు చాలా దూరమున ఉన్నదని నేను డ్యూటీలో చేరలేదు. ఫలితముగా, తమిళనాడులో నున్న ఆల్ ఇండియా మెడికల్ సర్వీసులో నాకు ఉద్యోగము లేకుండా పోయేను. మద్రాసు కార్పొరేషను నడుపు చిన్న ఆరోగ్య కేంద్రములలో నేను చేరవలసి వచ్చెను. పెద్ద ఆసుపత్రిలో ఉద్యోగము కాకపోవుటచే నాకు అది తృప్తి నివ్వలేదు. నిస్సహాయత, కోపము ఎక్కువయ్యాయి. ఆ తరుణములో నా సోదరుడు పండిట్ గారి 'అదృష్ట విజ్ఞానము'" (తమిళం) నిచ్చి చదువమనెను.

ఒక్కమారు వారిని కలిసినందున ఏర్పడు నష్టమేమియు లేదనుకొనుచూ పోయి, వారిని ప్రత్యక్షముగా చూసి నా కలలను, ఆశలను వారిముందు ఉంచినాను. చిన్న తనమునుండియు గొప్ప డాక్టరు కావలెనని, అమెరికా వంటి పెద్ద దేశములలో ఉద్యోగము చేయవలెనని కలలు కనుచుండినందువలన, నా 18వ ఏటనే అమెరికన్ దౌత్య కార్యాలయమునకు రాసి, అమెరికాలో ఉద్యోగము చేయుటకు ఏమి చేయవలయును, ఏ అర్హతలు కావలయునని అడిగి తెలుసుకొంటిని.

పండిట్గారు నేను జన్మించిన తేది, నా పేరు, జాతకము అన్నీ పరిశీలించి నాపేరులో చిన్న మార్పులు చేసినారు. ప్రభుత్వ పేరు పట్టిక (గెజిట్) నందు కూడా మార్చుకోమనినారు. మలేషియాలో జరిగిన అమెరికన్ ఎంట్రెన్సు పరీక్షలో నేను

నెగ్గినాను. అమెరికా పోవుటకు సిద్ధపడినాను. కాని పండిట్ జీ అనుజ్ఞ దొరకలేదు. 'పెండ్లి చేసుకొని, తల్లిదండ్రులతో ను, భార్యాబిడ్డలతోను రెండు సంవత్సరాలైనా ఇండియాలో ఉండు. అమెరికాకు నిన్ను నేను పంపుతానుగా " అని హామీ ఇచ్చారు. పిదప, వారి ఆలోచన ప్రకారమే నేను అమెరికాలోని కొన్ని ఆస్పత్రులకు ఉద్యోగ దరఖాస్తులు పెట్టినాను. ఫలితముగా ఇప్పుడు మా కుటుంబములో అందరకూ అమెరికన్ పౌరసత్వము ఇవ్వబడి అమెరికాలో సంతోషముగా ఉన్నాము.

అమెరికాలో అనేక పరీక్షలు పాసయినాను. ప్రభుత్వము, ప్రైవేటు శాఖలలో ను పనిచేసిన తరువాత స్వంతముగా ఒక ఆస్పత్రి కట్టి, దానికి నన్ను పూర్తిగా అర్పించుకొనుచున్నాను. పండిట్ గారి ఆశీస్సులు నాకు పూర్తిగా లభ్యమయినందువలన అన్నియు సవ్యముగా జరుగుచున్నవి. అవసరము లేనందున నేను స్వంత విమానము కొనలేదు గాని వారి శుభాశీస్సుల వలన 25 సంవత్సరాలుగా ఆరోగ్యము, ఐశ్వర్యములను అనుభవించుచున్నాము.

సంఖ్యాశాస్త్ర-ము అనునది ఆటవలె పేరు మార్చుట కాదు. ఎవరి జన్మతేదికి తగినట్లు, వారికి లెక్కలు చూసి, మంచి జీవితమునకు పునాదిగ ఉండునట్లు అమర్చుటయని చెప్పవచ్చును.

దక్షిణ భారతదేశములో, "కూత్తా నల్లూరు" అను చిన్న గ్రామమునకు చెందిన ఒక బాలునికి నేడు ఎంతో అభివృద్ధి సాధించిన దేశములో, వేలకొలది వ్యాధులతో పీడింపబడు వారికి చికిత్స చేయు భాగ్యము కలిగినదనిన, అది అంతయు సిద్ధపురుషుడివంటి సేతు రామన్ గారి భిక్షయే అనవలెను. భగవత్కృప కలిగిన పండిట్గారివంటి కొందరి వలననే ఇట్లు తలచినది సాధింప సాధ్యమగునని దృఢముగా నమ్ముచున్నాను. వారు భౌతికముగా లేనప్పటికినీ, వారి తత్వ వివరణలు, ఈ నాటికీ మనకు మార్గదర్శకముగా ను, చీకటిలో దారిచూపు కాంతి దీపమువలె అన్ని విషయములలోను సహాయపడుచున్నది.

తండ్రిగారు నిర్యాణము చెందిన తరువాత, వారి దారినే అనుసరించి, మన అందరకు దారిచూపుచూ ముందుకు నడిపించుచున్న వారి కుమారులు శ్రీ V.S.

గురుస్వామిగారు వంశపారంపర్యమును, ప్రేమాభిమానములు కలిసిన సేవానిరతిని తన వృత్తిలో రంగరించుట చూసి మనసులో చెప్పలేనంత ఆనందము కలుగుచున్నది. నేను, నా కుటుంబమును శ్రీ గురుస్వామి వలన ఇప్పటికినీ మేలునే పొందుచున్నాము. వారి ఆలోచన, సలహాల సహాయముతోనే, దాని ప్రకారమే నడచెదమని గట్టిగా చెప్పుచున్నాను.

నమ్మకము ఏర్పడినవారు, ఈ గురువుని చేరి, తమ తమ కష్టాల నుండి విముక్తి పొంది మేలు పొందుతారని నేను ఆశిస్తున్నాను.

'అదృష్ట విజ్ఞానము" అను ఈ గ్రంథము లభించిన వారును, ఆ గురువు యొక్క సలహాలనను అనుసరించి, జీవితమున పెద్ద లాభములు, గొప్ప వృద్ధిని సాధించినవారు కూడ ఆ దేవుని దయకు పాత్రులయిన వారే.

విధేయుడు,

MD

**Dr. K.A. ZIYAAUDHIN, M.D., U.S.A.**

**S. SELVARETNAM**
Retiree : Asian Development Bank
Consultant : World Bank, IMF
B.Sc. Eng. (Lon) M.Sc. Eng(Lon.), C.Eng. FI, Mech.E. (Lon) FIE.E. (Lon), FI Mar.E. (Lon) M.B.I.M. (Lon.) F.I.E. (Srilanka)
42, 2 A Skelton Road, Colombo-5, Srilanka
Ph: 585973
15-10-2001

పండిట్ సేతురామన్ గారిని కలుసుకొను భాగ్యము నాకు 1973లో కలిగినది. వారిని చూసినపుడు నేను కొలంబోలో ఒక ఇంగ్లీషు కంపెనీలో సీనియర్ ఇంజనీరుగా పనిచేయు చుంటిని. నా జన్మతేది 18. విధి సంఖ్య 6. నా పేరుకి గల సంఖ్య 39 గా ఉండినది. పండిట్గారు నా పేరును 42కు మార్చినారు. నా దైనందిక జీవితములో చేయవలసిన కొన్ని విధులను వివరించినారు. 18 నెలలలో ఫస్ట్ ఇంజనీరుగా ప్రమోషను వచ్చినది. అప్పుడే జపాను, ఇంగ్లాండ్ దేశముల నుండి పైచదువుకు ఉపకార వేతనము కూడా వచ్చినది.

1976లో ఐక్యరాజ్యసమితి (UN) ఇండోనేషియాలో పరిశ్రమల శాఖకు సలహాదారునిగా నన్ను నియమించినది. నా జీతము నా జీవితములో ఎదురుచూడని విధముగ 30 రెట్లు పెరిగినది?. దీనిని పురస్కరించుకొని పండిట్గారిని ఇండోనేషియాకు ఆహ్వానించినాను. నా ఆహ్వానమును మన్నించి వారు వచ్చి నాతో రెండు నెలలు గడపినారు. ఆ సందర్భములో పలువురు ప్రముఖులు, రాజకీయ నాయకులు, పారిశ్రామికవేత్తలు వారిని కలసినారు. వారందరకును నావలెనే పదవిలో ను, ఆర్థికముగాను ఉన్నతి లభించినది. నేను పండిట్ గారితో కలిసి బాంకాక్, హాంకాంగ్, జపాను మొదలైన చోట్లకు ప్రయాణించితిని. అతి ప్రసిద్ధములయిన ఎలక్ట్రానిక్ సంస్థలకు చెందినవారు పండిట్ జీని కలిసి వారిని తమ అతిథిగా గౌరవించి, తమ తమ సంస్థల అభివృద్ధిని విస్తరించుటకు సలహాలను పొందిరి.

1979లో మనీలా, ఫిలిప్పైన్స్ దేశములలో ఆసియా అభివృద్ధి బ్యాంకు (Asian Development Bank) లో నేను U.N. లో పొందిన జీతమునకు 1 1/2 రెట్లు ఎక్కువ జీతముతో ఉద్యోగములో చేరితిని. పండిట్ గారిని మనీలాకు ఆహ్వానించినాను. వారు

వచ్చి నాతో 1 నెలరోజులు గడిపినారు.

ఫిలిపైన్స్ దేశమున పెద్ద రంగములలోని ముఖ్యులు వారి సలహాలను పొందిరి. మా బ్యాంకులో పనిచేయుచుండిన పలువురు స్నేహితులు వారిని కలిసి మేలు పొందినారు. నా పిల్లలు కూడా మంచి చదువులు చదివి పలు దేశములలో పెద్ద పదవులలో ఉన్నారు. మంచి ఫలితములను పొందుచున్నారు.

నా జీవితమునకు, నా ప్రగతికి మూలముగ ఉండి, నాకు దారి చూపిన ఘనత పండిట్ గారికే చెందును. మా కుటుంబములో వారిని దైవ సమానులుగా పూజించుచున్నాము. వారి శరణు పొందుటకు దోవ చూపిన ఆ భగవంతునకు సదా మా కృతజ్ఞతలు ఉండుగాక!

ఇట్లు,

S. Selvaretnam

**S. SELVARETNAM**

**S. KRUSHNA KUMAR**
S/o Dr. S. Ramanujam
Srinivasa Surgical Clinic
Madras Road
Kodur - 516 101
Cuddapah (Dt.)

నేను చెన్నైలోని ఒక ప్రసిద్ధ సాఫ్ట్ వేర్ కంపెనీలో ఉద్యోగము చేయుచున్నాను. నా అసలు పేరు అనిల్ కుమార్. జీవితములో ఇంకా వృద్ధిలోనికి రావలెనని నా ఆకాంక్ష. నా మిత్రుని ద్వారా శ్రీ V.S. గురుస్వామిగారి గురించి వినియున్నాను. వారివద్ద న్యూమరాలజీ సలహా తీసుకొన్న ఎంతో లాభకరముగా ఉండునని నా మిత్రుని అభిప్రాయము. ముందుకు రావలెనన్న ఆశ బలీయముగా ఉన్నందున, నేను వెంటనే వెళ్ళి వారిని కలిసినాను. నా జన్మ సంఖ్య 06-01-1977. వారు నా వివరములను అన్నిటినీ పరిశీలించి మొత్తము నా పేరు మార్చవలెనన్నారు. నా పేరుని S. అనిల్ కుమార్ నుండి S.కృష్ణ కుమార్ గా మార్చినారు. వారు కొన్ని నియమముల నేర్పించి, వానిని క్రమము తప్పక పాటించమని చెప్పి, నేను తప్పక వృద్ధిని త్వరలోనే పొందెద నని చెప్పి పంపినారు. నా కొత్త పేరును, వారు చెప్పినట్లే రాయుట మొదలిడినాను. నాలుగవ నెలలోనే నా స్వంత ప్రయత్నముతో కొన్ని మిలియన్ల లాభములు తేగలిగిన ఒక ప్రతిష్ఠాత్మకమైన కాంట్రాక్టు మా కంపెనీకి తెచ్చి నాను. నా విజయమునకు మా కంపెనీ డైరక్టరులందరును మిక్కిలి సంతోషించినారు. నా కొత్తపేరు కృష్ణ కుమార్ యాజమాన్యమువారి నిజమయిన మెప్పుతో నోటీసు బోర్డులో పెట్టబడినది. నా జీతము కూడ 25% పెరిగినది. ఈ క్రొత్త పేరుతో మరికొన్ని గొప్ప కాంట్రాక్టులు పొందుచున్నాను. ఎన్నో గొప్ప ఆర్డరులు పొందగలుగుచున్నాను. నా మనసు కూడా, శ్రీ V. S. గురుస్వామిగారిని కలిసిన తరువాత, ఎంతో ప్రశాంతముగా ఉన్నది. నన్ను, అటువంటి గొప్పవారికి పరిచయము చేసిన నా మిత్రునికి నేనెన్నటికినీ కృతజ్ఞుడను.

ఇట్లు,

**S.**కృష్ణకుమార్

**D. PALANIAPPAN**
37-1, Tingkat 1, Jalan 2/90
Taman Pertama, Batu 31/2, Cheras
56100 Kuala Lumpur,
10-12-2001

నేను కౌలాలంపూరులో మంచి స్థితిలో ఉన్నాను. నేను శ్రమకు వెరచేవాణ్ణి కాను. నాకు 30-5-1976లో వివాహమైంది. 15 సంవత్సరాలు వేచియున్ననూ పిల్లలు కలుగలేదు. ఎందరో వైద్యులను సంప్రదించి, చికిత్స పొందినా ప్రయోజనమేదియు లేకుండుటచే క్రొత్త ప్రయత్నముల ఆపియుంటిమి. అట్లే 15 సంవత్సరములు గడచిపోయినవి. ఏడాదికి ఒకమారు ఇండియా వచ్చుట నాకు అలవాటు. “ఈరోడు” అను వూరిలో ఉన్న మా బంధువు ఒకరు పండిట్ సేతురామన్ గారి సామర్థ్యమును గురించి ఎంతో చెప్పి పొగడి నారు. మా సమస్యకు వారు తప్పక పరిష్కారము చూపగలరని మరీ మరీ చెప్పినారు. నేను వారిని కూడా వెంటబెట్టుకొని, 18-7-1991 తేదీన పండిట్ సేతురామన్ గారి ఇంటికి వెళ్ళి తిని. పండిత్-జీని కలసి, నా సమస్యలను వారికి మనవి చేసితిని. నేను 1-6-1950న జన్మించినాను. వారు నా జననతేది, వివాహము జరిగిన తారీఖు, హస్తరేఖలు, జాతకము అన్నింటినీ పరిశీలించి పేరు బాగుగనే ఉన్నదనియు, దానిని కొంత బలపరచిన చాలునని చెప్పి నేను చేయవలసిన దానిని రాసియిచ్చిరి. నా భార్య 5-9-1956లో పుట్టినది. ఆమె పేరు S. PAPPATHI. పండిట్ గారు ఆమె పేరును దీర్ఘముగా పరిశీలించి, అది సరిగా లేదని, S. PAPPATHIYAMMAగా మార్చి ఆమెకు కూడ కొన్ని విధులను రాసి ఇచ్చినారు. కొత్త పేరును ప్రతి నిత్యము రాయమని చెప్పి, తప్పక సంతానము కలుగునని ఆశీర్వదించినారు. నా వృత్తి గురించి కూడా వారి సలహాను తీసికొంటిని. రెండేండ్ల తరువాత నా భార్య గర్భము దాల్చి 11-12-1994లో మగబిడ్డను కన్నది. మా సంతోషమునకు ఎల్లయే లేదు. వెంటనే పండిట్ సేతురామన్ గారికి మా కృతజ్ఞతలను అందచేసితిమి. వారు మా బిడ్డకు T. P. Saravanan అని పేరు పెట్టిరి. పండిట్ సేతురామన్ గారు మా జీవితంలో చూపిన ఈ అద్భుతమును జన్మలో మరువలేను. నేను ఇండియా వచ్చినపుడల్లా వారి ఇంటికి వెళ్ళి గురుస్వామిగారిని తప్పక కలుసుకొనుచున్నాను. తండ్రిగారివలెనే వీరును మరిన్ని అద్భుతములకు కారణమై

దీర్ఘాయువుగా ఉండవలెనని ఆ మురుగన్ ని ప్రార్థించుచున్నాను.

ఇట్లు,

ప్రేమతో,

D. PALANIAPPAN

**N.K. RAMASUWAMI RAJA**
Managing Director,
Madras Chip Board Ltd.
**'SETHU'**
No. 1, Pacr salai
Alagai Nagar,
Rajapalayam
14-01-2002

నేను 1974 నుండి పండిట్ సేతురామన్ గారి అభిమానిని అని చెప్పుకొనుటకు గర్వముగా ఉన్నది.

మా తండ్రిగారయిన శ్రీ N.R. కృష్ణమరాజావారు 'మద్రాసు చిప్ బోర్డు లిమిటెడ్' అను సంస్థను ఎన్నో ఆశలతో ప్రారంభించినారు. వారి అవిరామ కృషి, అకుంఠిత ప్రయత్నము ఉండినను, ఆ సంస్థ నష్టమునే చూపుచుండేది. ఎందరో దానిని అమ్మివేయమని వారికి సలహానిచ్చి నారు. 1980లో వారి మరణాంతరము పండిట్ జీ నాకు కొత్త ఉత్సాహమునిచ్చి, ఆ సంస్థను వదలక నడుపుమనియు, నా నిర్వహణలో అది లాభకరముగా నడచునని ధైర్యమునిచ్చారు.

పండిట్-జీ నా కంపెనీ పేరుని చిన్న మార్పు చేసినారు. అటు పిమ్మట మా సంస్థ మంచి పద్దతిలో, లాభదాయకముగా పనిచేయుచున్నదని సంతోషముతో చెప్పుకొనుచున్నాను.

ప్రతియేడు క్రొత్తలెక్కలు వ్రాయునపుడు, పండిట్-జీ గారి సలహా తీసుకొనుట పరిపాటి. ప్రతియేడు వారు సంస్థ యొక్క భవిష్యత్తు గురించి చెప్పినదే, ఏవిధమయిన మార్పు లేకుండా జరిగినది. 1985 లో క్రొత్త లెక్కలు ప్రారంభించునపుడు, ఈయేడు ప్రభుత్వ నిధి సంస్థనుండి చెప్పుకోదగ్గ సహాయము లభించును అన్నారు. అట్లే మేము కట్టవలసిన వడ్డీ పెద్ద మొత్తము రద్దయినది. దాని తరువాతనే మా సంస్థ ఆర్థికముగా పుంజుకొన్నది. పనివారలకు బోనసులిచ్చు స్థితిని అందుకొంటిమి. అటుపైన పాతబాకీలు పూర్తిగా తీర్చివేయబడి, భాగస్థులకు డివిడెండు కూడా సక్రమముగ లభిస్తున్నది.

భగవంతుని ఆశీస్సులతో, పండిట్ గారి ఆదరణలో మా సంస్థ బలహీనత నుండి

బయట పడి, లాభకరముగా మారి, చక్కగా వృద్ధి చెందుచున్నది. అంతేగాక పండిట్జీ మా కుటుంబమునకు కూడా శ్రేయోభిలాషిగా ఉండి మాకు మార్గదర్శకులు అయినారు.

ప్రస్తుతము, తన తండ్రిగారి వలెనే సంస్కారిగా ఉన్న గురుస్వామి గారిని అన్ని విషయములలో సంప్రదించుచున్నాము.

సేతురామన్ గారి 'అదృష్ట విజ్ఞానం'ని అనుసరించువారు జీవితమున అన్ని శుభములును పొంది దైవకృపకు పాత్రులగుదురని నిశ్చయముగ చెప్పుచున్నాను.

అభిమానముతో,

**N.K. RAMASUWAMI RAJA**

**S. MUTHOOVEL**
244/3B Block 5
Type II
Neyveli – 607803
4-12-2001

నేను నైవేల లిగ్నైటు కార్పొరేషనులో 1986నుండి Male ward Assistantగా పనిచేయుచున్నాను. నేను 8-6-1962లో పుట్టినాను. మద్యపానము అను రక్కసి బారినపడి ప్రతి సాయంత్రము త్రాగుడు, ధూమపానము చేసెడివాడను. నేను సహజముగా దయాహృదయము కలవాడను. ఇతరుల కష్టములు చూసి కూడ ఓర్వలేను. పిలువకుండానే పోయి చేతనయిన సహాయము చేసేవాడిని. ఎన్నో సార్లు పరులకు అప్పు ఇప్పించి వడ్డీ నేను కట్టేవాడిని. అనవసరపు తగాదాలు, పోలీసులు, కోర్టులు, కేసులు అంటూ తంటాలలో చిక్కుకొనుచుంటిని. అదృష్టవశాత్తు నాకు పండిట్ సేతురామన్ గారి అదృష్ట విజ్ఞానం" అను పుస్తకము చదువు అవకాశము కల్గినది. చదివిన తరువాత వారిని చూడవలెనని తోచి, పూర్తి నమ్మకము లేకున్నను, వెళ్ళి చూసి తీరవలెనని తీర్మానించుకొని బయలుదేరి వారి ఇంటికి చేరితిని. అక్కడ వారి కుమారులు శ్రీ గురుస్వామి గారిని చూసి నా బాధలు వెళ్ళ గ్రక్కితిని.

వారు నా జన్మతేది, తేది, నెల, సంవత్సరము కూడిన వచ్చు సంఖ్య, పేరు సంఖ్య ఒకదానికొకటి తగినట్లుగా లేవని చెప్పి నా పేరును S.Muthuvadivelu నుండి S.Muthoovelగా మార్చి, నేను పాటింపవలసిన కొని విధులను చెప్పినారు. నేను అట్లే శ్రద్ధగా చేయగా రెండవనెలలో నాకు మద్యపానముపై విముఖత ఏర్పడి, త్రాగుడు పూర్తిగా మానివేసినాను. పది యేళ్ళగా ఉన్న ఆ దురలవాటు సునాయాసంగా తొలగి పోయిం2ది. నాకే ఆశ్చర్యముగా ఉన్నది. పొగత్రాగుటను నిలిపివేసితిని. నా పేరు మార్చు నపుడు వారు, నా చెడు అలవాట్లు పోవునని, సదుద్దేశ్యములే కలుగునని, ఉద్యోగములో ఉన్నతిని పొందెదనని, సంఘమున మంచి స్థితిని, గౌరవమును పొందెదనని, చెప్పిన మాటలు నూటికి నూరుపాళ్ళు నిజమయినవి.

పేరు మార్చిన మూడవనెలలో తిరువాడుతురై ఆధీనము వారి మఠములో నాకు దీక్ష దొరికినది. అది నా మహద్భాగ్యముగా ఎంచుచున్నాను. నిత్యము అనుష్టానము

చేయుచున్నాను. నా ఉద్యోగము నందును 11వ నెలలో గొప్ప ఉన్నతి ఏర్పడినది. Chief wireless communication operator Mines-II గా మరియొక గనికి బదిలీ అయినది. జీతము దాదాపు 6 రెట్లు పెరిగినది. నాకు హోమియోపతి యందు అపార శ్రద్ధ కలదు. దాని రిజిస్ట్రేషన్ నెంబరు వచ్చుటకు ఆలస్యము అగుచుండినది. ఈ పేరు మార్పిడి తరువాత నా కొత్తపేరుతో హోమియోపతి రిజిస్ట్రేషన్ నెం. 1441B వచ్చినది.

ఇంట, బయట నా గౌరవము పలు రెట్లు పెరిగినది. మా తాతగారికి నేనిట్లు సంపూర్ణముగా మారుట మిక్కిలి ఆశ్చర్యమును, ఆనందమును కలుగజేసినది. ఇప్పుడు నా జీవితము గొడవలు, కొట్లాటలూ లేకుండా ప్రశాంతంగా ఉన్నది. లాటరీలో రు. 5000/- కూడా ఒకమారు వచ్చి నది. ఈ విధముగా నా జీవితములో ఎన్నో ఆశ్చర్యకరమయిన మార్పులు నేటికినీ జరుగుచునే ఉన్నవి. ఈ అద్భుతము పేరు మార్పిడి నుండియే జరిగినది. శ్రీ గురుస్వామి చిరకాలము చల్లగా ఉండి జనులకు వారి సేవ, సహాయములు ఎల్లప్పుడును అందచేయవలెనని సర్వేశ్వరుడయిన, సర్వశక్తివంతుడయిన నటరాజస్వామిని ప్రార్థించి కోరుకొనుచున్నాను.

తిరుచిత్రాంబళం!

సదా మీ

నమ్మినబంటు

**S. MUTHOOVEL**

**M. RAVEENDHIREN**
9-A, Thanjai Main Road
Tiruverumbur, Trichy District
23-3-2013

నా మధుర స్వీయచరిత్ర

నేను 27-8-1955 తేదీన తిరుచ్చి నగరంలో జన్మించాను. మా కుటుంబములో తగిన వసతి లేనందున 8వ తరగతితోనే నా చదువు ముగిసినది. 16 ఏండ్ల ప్రాయమున నెలకు రు. 300/- జీతముతో బట్టల షాపులో పనికి కుదిరితిని. జీవితములో పైకి రావలెనన్న తహతహ తప్ప నావద్ద వేరేమియు లేదు. 22వ యేట నా పూర్వజన్మ సుకృతము వలన 'అదృష్ట విజ్ఞానం' అను సంఖ్యాశాస్త్ర నిధిని కనుగొంటిని. దానిని పలుమార్లు చదివి M. Ravindran అన్న పేరును నేనే M. Ravindhiranగా 37 సంఖ్యకు మార్చుకొని రాయుట ప్రారంభించినాను. కొన్ని నెలలలో పనిలో మార్పు వచ్చినది. కొందరు భాగస్తులు కలిసి క్రొత్తగా స్థాపించు పరిశ్రమకు మదుపు వారు పెట్టునట్లును, నాకు 10% కమిషను ఇచ్చు నట్లును చెప్పినారు. నేను సమ్మతించి వారితో కలిసితిని. 37వ సంఖ్యకు పుస్తకములో వ్రాసినట్లు కొత్త భాగస్తులు వచ్చి కలసిరి. అట్లే ఒక స్త్రీ తో ప్రేమలో పడితిని. ఇరువురి ఇళ్ళలోను ఏర్పడిన వ్యతిరేకతను ఎదుర్కొని, తొందరపడి తేదీని చూసుకొనక 17-9-1977 (8 & 5) లో పెండ్లి చేసుకొంటిమి. సంవత్సరము తిరుగకముందే ఒక కొడుకు, దాని తరువాత ఒక కూతురు కలిగినారు. నాల్గవ యేడు ఒక విపత్తులో అకస్మాత్తుగ నా భార్య, కూతురు మరణించిరి. అప్పుడే నాకు ఈ శాస్త్రము యొక్క గొప్పతనము, తేదీల యొక్క పూర్తి బలము నాకు అర్థమయినవి. వివాహ తేది సరిగా లేనందున నాకు కలిగిన దుఃఖము అంతులేనిది. ఇకమీదట ఏ విషమ పరీక్షలు వద్దని శ్రీ పండిట్ సేతురామన్ గారిని కలుసుకొని అన్ని వివరములు వెళ్ళ గ్రక్కితిని. వారు నా అరచేయి చూసి బంజరు భూమివలె ఉన్నది. ఇక ఇక్కడ గడ్డి మొలిపింపవలెను. నిన్ను వెంటనే శ్రీమంతుని గావించెదను" అన్నారు. తరువాత నా పేరుని వారు M. RAVEENDHIREN అని దిద్దినారు. పిదప ఒక మంచి రోజున మరలా వివాహము అయినది. పిల్లలు కలిగారు. వృత్తియందు మార్పులు కలిగి పండిట్ గారి ఆలోచనపై నా 36వ యేట మిఠాయి దుకాణము తెరచినాను. వారు దానికి

**“Sree Sweets”** అని నామకరణము చేసిరి. ప్రారంభమున 500, 600 అయిన వ్యాపారము అతి త్వరలోనే ఎన్నో రెట్లు పెరిగినది. నా సమస్యలన్నియు తీరి మంచిస్థితికి చేరుకున్నాను. మొదట్లో కేవలం 35 చదరపు అడుగుల విస్తీర్ణంతో ప్రారంభించ బడిన మా చిన్న షాపు అనేక శాఖలతో పెరిగి, ఇప్పుడు 3000 చదరపు అడుగుల విస్తీర్ణానికి చేరుకుంది. నేను 20,000 చదరపు అడుగుల విస్తీర్ణంతో శ్రీ నిధి సూపర్ మార్కెట్ పేరుతో ఒక పెద్ద డిపార్ట్ మెంటల్ స్టోరీని ప్రారంభించాను. ఇంకా నేను ఒక రియల్ ఎస్టేట్ వ్యాపారాన్ని కూడా విజయవంతంగా నడుపుతున్నాను. ఒక సామాన్య సర్వెంట్ గా జీవితాన్ని ప్రారంభించిన నేను, నా వ్యాపారంలో ఇప్పుడు 400 మందికి ఉద్యోగాలు ఇవ్వగలిగే స్థాయికి ఎదిగి ఇలా ఒక వ్యాపారవేత్తని అయ్యానంటే నాకే నమ్మసక్యంగా లేదు. జీవితంలో నేనిలా ఈ స్థాయికి చేరుకుంటానని నేను ఎన్నడూ అనుకోలేదు. నేను ఇంత గొప్ప స్థితికి వచ్చెదనని కలలో కూడా తలచలేదు. పలు మతములకు చెందిన నా మిత్రులను కూడ వారివద్దకు తీసుకు వెళ్ళాను. నా జయమునకు శ్రీ సేతురామన్గారును, వారి కుమారులు శ్రీ గురుస్వామిగారు మాత్రమే పూర్తి కారకులు. వీరి సంఖ్యా శాస్త్ర సాధనలో నా వంటి పామరులెందరో గొప్ప ప్రముఖులుగా మారుట చూసినాను. నా వలెనే నా బిడ్డలును శ్రీ గురుస్వామిగారి సలహాలను అనుసరించి నడచుకొని జీవితమున ప్రకాశింపాలన్నదే నా ఆశ.

ఎన్నటికినీ మేలు మరువని

M. Raveendhiren

**M. RAVEENDHIREN**

ఈ శాస్త్రము అందరికి సకల లాభములను కూర్చగలిగినది. అందరి జీవితములలోను ప్రగతికి కావలసిన మార్పులను తప్పక ఏర్పరచగలిగినది. బడికి పోవు బాల బాలికల చదువు, అభివృద్ధి మొదలుకొని రిటైరయిన పెద్దల వరకూ అన్ని వయసుల వారికి, అన్ని వర్గముల వారికి విశేషమయిన ఫలితములు ఇచ్చుట నా అనుభవములో చూసియున్నాను.

1987 లో మా తండ్రిగారిని చూచుటకు ఒక సన్యాసి వచ్చినారు. వారి పేరు SWAMI TEJOMAYANANDA. నెరూరు అను వూరిలో ఒక ఆశ్రమమున నిర్వాహకులుగా ఉండిరి. 'గురు అరుళ్' అను పత్రికను కూడ నడుపుచుండెడివారు. వారికి గుండెజబ్బు ఉండేది. వారు మా తండ్రిగారిని చూడ వచ్చిన కారణమే, తన శరీర రుగ్మత తీరి, పత్రిక చందాదారుల సంఖ్య పెరుగవలెననియే. డాక్టర్లు వారికి ఆపరేషను చేయవలెననియు అందుకు 2 లక్షలు ఖర్చు అగుననియు చెప్పియుండిరి. అంత పెద్ద మొత్తమును వారు ఎట్లు సమకూర్చగలరు? పైగా తన ఆరోగ్యమునకై యాచించుటకు కూడ సిద్ధముగా లేరు. మా తండ్రిగారితో, తన సమస్యలు తీరునట్లు పేరు మార్చవలెనని కోరినారు. మా తండ్రిగారు వారి జాతకము, హస్తరేఖలు చూచి పరిశీలించి SAAMI TEJOMAYANANDA అని కూర్చి ఇచ్చినారు. పిదప వారిని చూసి, "మీ ఇష్ట ప్రకారమే మీరు ఎవరినీ యాచింప పనిలేదు. అన్ని సమస్యలు చక్కగా పరిష్కారమవుతాయి. గుండెజబ్బును గూర్చిన దిగులు వలదు " అని చెప్పి పంపినారు. వారు దక్షిణ ఇచ్చుటకు ప్రయత్నింపగా "నేను సన్యాసుల వద్ద పైకము తీసికోను" అని నిరాకరించి తాను మార్చి కొత్త పేరును తప్పక రాయుచుండవలెనని, త్వరలోనే నయమగునని చెప్పి సాగనంపినారు. ఇది జరిగిన 4 నెలలకు కోయంబత్తూరులో జరుగు ఆధ్యాత్మిక మహాసభకు ఆహ్వానము వచ్చి అందు పాల్గొనుటకు వారు అచ్చటకు వెళ్ళుట తటస్థించినది. ఆ సభలను ఏర్పాటు చేసినవారు ప్రముఖ పారిశ్రామికవేత్త. ఎంతో దయాళులు. ఆ సభలలో మన స్వామీజీ స్పృహతప్పి పడిపోయినారు. వెంటనే వారిని ఆస్పత్రిలో చేర్చి-నారు. డాక్టర్లు వెంటనే బైపాస్ సర్జరీ చేయవలెనని‌నారు. స్వామీజీకి స్పృహ వచ్చు నప్పటికి ఆ పారిశ్రామికవేత్త వారి ప్రక్కన కూర్చుని ఉన్నారు. వారు స్వామీజీని ఉద్దేశించి డాక్టర్లు మీకు వెంటనే గుండె సర్జరీ అవసరమనినారు. అందుకు

కాగల ఖర్చు-నంతటినీ భరించుటకు నేను సిద్ధము. మీరు కోయంబత్తూరునందో, చెన్న పట్టణములోనో లేక అమెరికాలోని హ్యూస్టనులో-నో, ఎక్కడ చేయించుకోవాలని అనుకొంటున్నారు ?" అని అడిగారు. అది విన్న స్వామీజీకి ఆశ్చర్యముతో మరియొక అటాక్ వచ్చినంత పనైనది. తరువాత స్వామీజీ ఇష్ట ప్రకారము కోయంబత్తూరునందే ఆపరేషను మంచి విధముగా ముగిసినది. తరువాత 3 నెలలు వారి అతిథి గృహములో విశ్రాంతి పొంది ఆశ్రమమునకు చేరినారు. ఆశ్రమము చేరిన మరునాడే మద్రాసు బయలుదేరి వచ్చి మా తండ్రిగారితో జరిగిన అద్భుతమును చెప్పునపుడు వారి కండ్లు చెమర్చుచునే ఉండినవి. వారి సంతోషమునకు హద్దే లేదు. ఇంతకన్నా ఆశ్చర్యకరమైనది ఏమనగా, పై సంఘటనకు నాలుగు నెలల క్రితమే, తనకు ఆపరేషను చేయించిన పారిశ్రామికవేత్తను, తమ పత్రికలో చందాదారునిగ చేర్చుటకై వారు కలవ ప్రయత్నించినారు. అతి ముఖ్యులతో, ఎవో చర్చలలో ఉండుటచే స్వామీజీ వారిని కలవలేకపోయినారు. "రు. 350/- చందా కూడా వసూలు చేయలేని నాకు వారు 2 లక్షలు ఖర్చయిన ఆపరేషను చేయించినారనిన, అది మీ సంఖ్యాశాస్త్ర మహిమగాక మరేమి?" అని పొగడినారు.

ఈ సంఖ్యాశాస్త్రము మూలముగా లాభము పొందుటకు వయసు అడ్డురాదు. ఎవరి సామర్థ్యమునకు తగినట్లు వారికి మంచి వృద్ధి కలుగును. అమెరికాలో నివసించు అల్లుడుగారి తరఫున శ్రీ సుందరంపిళ్లై అనువారు మా ఇంటికి తరచు వచ్చి కొన్ని విషయములను అడుగుట కద్దు. నేను వూరకుండక వారి పేరును, వయసును అడిగితిని. వారికి 72 ఏళ్ళు. ప్రభుత్వములోAgri Horticultural Directorగా పనిచేసి రిటైరయినవారు. వారి జన్మతేది, పేరు మున్నగువానిని నేను పరిశీలించినాను. వారి పేరు Sundaram_Pillai, "మీ కుటుంబ జీవితములో ఎన్నో చిక్కులు ఏర్పడి ఉండుటను, బిడ్డలవలన మిక్కిలి సమస్యలు ఎదుర్కొనియుందురు " అని నేను చెప్పగనే వారు ఆశ్చర్యముతో తలమునకలైనారు. ఒక దుఃఖ సంఘటన చెప్పి, "మీరెట్లు ఆ విధముగ అడుగ గలిగితిరి?" అని ప్రశ్నింప, "వారి పేరు సరిగా కుదరలేదని, అందుచే చెప్పగలిగితినంటిని. దానిని మార్చినచో ఇకపై ప్రశాతంముగాను, మిక్కిలి సమృద్ధిగను, సంతోషముగను ఉండునట్లు చేయవచ్చును" అని చెప్పితిని. వారును అమిత

ఉత్సాహముతో తన 72యేట పేరు మార్చుకొనినారు. నేను వ్రాసియిచ్చినట్లు నిత్యము వ్రాయుచు ఉండినారు. 3 నెలల తరువాత ఒకనాడు వారి మిత్రుడు ఒక పారిశ్రామికవేత్తతో వారి ఇంటికి వెళ్ళినారు. టేకు వృక్షముల గురించి, వాటిని నాటుట గురించి వారితో చర్చించి, వారి సలహాలు పొంది వెళ్ళినారు. అదైన వారము తరువాత ఆ పారిశ్రామికవేత్త వీరి వద్దకు వచ్చి 'టేకు వృక్షములు పెంచుటకు నాకు కొన్నివేల ఎకరముల స్థలము కావలసి ఉన్నది. మీరు అనుభవజ్ఞులు. శ్రమ అని తలచక మా కొరకు ఈ పనిని చేసిపెట్టవలెను" అని ప్రాధేయపడినారు. వారికి నెలకు రూ.22,000/- జీతముగను, డ్రైవరుతో ఒక అంబాసిడరు కారును ఇచ్చి, వారు ఇంటినుండియే తన పనులను నిర్వహింపవచ్చుననియు, ప్రతిదినము ఆఫీసునకు రానక్కరలేదనియు కూడ చెప్పిరి. వెంటనే సుందరంపిళ్ళైగారు నాకు ఫోను చేసి దీనిని గురించి చెప్పి ఒప్పుకొనవచ్చునా అని అడిగినారు. .

' సంతోషముగా ఒప్పుకొనండి' అని నేనన్నాను. రిటైరయిన 14 ఏండ్లకు రూ. 22,000/- జీతము, డ్రైవరు సహితం కారు దొరకినందులకు వారి సంతోషము వర్ణనాతీతము. నన్ను చూడ వచ్చి నపుడు ఆగలేక నన్ను గట్టిగా కౌగలించుకొనినారు. ఖర్చులు పెద్దగా లేనందున ఆస్తులు కొన్నారు. ఈ సంఘటన వలన సంఖ్యా శాస్త్ర సహాయమున మేలు పొందుటకు వయసు అడ్డురాదన్నది స్పష్టమగుచ్చు నది.

ఈ గ్రంథమును చదివి లాభము పొందు పాఠకులు ఈ రచయిత యొక్క సమర్థతను, పలు విధములైన పరీక్షల వెనుక ఈ శాస్త్ర—మున వీరికి ఏర్పడిన నిశ్చయత్వమును, దృఢత్వమును అర్థము చేసికొనవలెనని చెప్పుచున్నాను.

1945 లో మా తండ్రిగారు, ఈ శాస్త్ర పద్ధతిలో పరులకు పేరు మార్పు చేయుటకు, మొట్టమొదట పాండిచ్చేరిలో వృత్తిగా ప్రారంభించినపుడు పలు అద్భుతములను చేసినారు. 23 దినములలో పాండిచ్చేరి అంతటను వీరి ఖ్యాతి విస్తరించినది. అప్పటి పాండిచ్చేరి గవర్నరయిన లూయివా అను ఫ్రెంచి దేశస్థుడు మా తండ్రిగారిని చూచుటకు ఉబలాటపడినారు. మా తండ్రిగారు వారిని చూచుటకు వెళ్ళినపుడు తన కార్యదర్శితో 'పాలుగారు ముఖముతో నున్న ఈ పసివానినా అందరును అంతెత్తునకు పొగడుచున్నది?' అని అబ్బురపడి అడిగి. అతను "ఔనన్న పిదప తన ప్రత్యేక గదికి

వెంటతీసుకొనిపోయి, తమ భార్యా బిడ్డలను కూడ వెలుపలకు పిలిచి, వీరితో గంటసేపు పూర్తిగా ఆంతరంగిక సమాలోచనలు జరిపినారు. గవర్నరుగారు తమ పదవికాలము తీరినదనియు, ఆ నెలాఖరున క్రొత్త గవర్నరు వచ్చిన వెంటనే బాధ్యతను వారికి అప్పగించి తాను ఫ్రాన్సు దేశమునకు వెలుతున్నట్లును, తమ వస్తువులు సగము అప్పటికే ఓడలో పంపితిమనియు చెప్పినారు. 'మీరింకను 6 నెలలు గవర్నరుగా ఉందురు" అన్న మా తండ్రిగారి మాటలకు, అట్లు జరుగుటకు అవకాశమే లేదు. అయినను మిమ్ము కలిసినందులకు మిక్కిలి సంతోషముగా ఉన్నది. నేను ఇచ్చు పురస్కారమును మీరు అందుకొనవలెను" అని కొన్ని రూపాయి నోటులను ఇచ్చినారు. మా తండ్రిగారు, "నేను 3నెలల పిదప వచ్చి తీసికొందును" అని చెప్పినారు. అందుకు గవర్నరుగారు "మీరు చిన్న వారు. చెప్పినను మీకు అర్థమగుట లేదు. రాబోవు 27న సాయంత్రము పదవీ విరమణ సందర్భములో నా గౌరవార్థము విందు ఏర్పాటు చేసినారు. అందులో మీరు తప్పక పాల్గొ-నవలెను. అప్పుడయినను నేనిచ్చు సన్మానమును స్వీకరింపవలయును" అని చెప్పిరి. మా తండ్రిగారు "నేను తప్పక వచ్చెదను. కాని మీరు ఇంకను 6 నెలలు పదవిలో ఉండుట ఖాయము" అని చెప్పి వీడ్కోలు తీసుకొన్నారు. కొన్ని దినముల పిదప గవర్నరుగారి వీడ్కోలు విందునకు ఆ హ్వానము మనిషి ద్వారా పంపినారు. ఆ సమయము సందర్భవశాత్తు మా తండ్రిగారికి తండ్రిగారు (మా తాతగారు) కూడ అక్కడ ఉండుట తటస్థించినది. ఆ విందునకు తాతగారిని కూడ వెంట తీసుకువెళ్ళిరి. ఊరిలోని ప్రముఖులు, పెద్దలు అందరును అచ్చటకు పెద్ద సంఖ్యలో వచ్చియుండిరి. గవర్నరుగారు మా తండ్రిగారిని ఎదురుగా కూర్చుండబెట్టుకుని తానివ్వదలచిన సన్మాన మొత్తమును చూపి, " ఇప్పుడయినను మీరు నమ్మెదర నుకొనెదను. నా కానుక స్వీకరించండి' అన్నారు. మా తండ్రిగారు నిరాకరించి "మీరింకను 6 నెలలు పదవిలో ఉందురు. నేను తరువాత పుచ్చుకొందును? అని అదే మాట అన్నారు. వీరు ఇంత నిస్సందేహముగ చెప్పుట గవర్నరు కాశ్చర్యముగనే ఉండినది. విందు మొదలయిన 20 నిముషములలో వారికి ఫ్రాన్సు దేశమునుండి తంతి వచ్చినది. అందు వారి పేరు వ్రాసి 'తరువాతి ఉత్తర్వు అందువరకు పదవిలో ఉండవలసినది" అని కబురు వుండినది. అంతే, గంభీరముగా, భారీ

విగ్రహముగ ఉండు గవర్నరుగారు అమాంతము పట్టలేని సంతోషముతో చిన్న బిడ్డను ఎత్తినట్లు మా తండ్రిగారిని రెండు చేతులతో పైకి ఎత్తినారు. తనకు పూలదండలు వేయవచ్చినవారిని, మా తండ్రి మెడలో వానిని వేయమనినారు. వారును అట్లే గావించిరి. తరువాత అక్కడ చేరిన ప్రముఖులతో మా తండ్రిగారిని గూర్చి గొప్పగా పొగడి మాట్లాడినారు. ప్రక్కనే ఆసీనులయి వుండిన తాతగారికి సంతోషము ఉప్పొంగి కండ్ల వెంట కన్నీరు పొరలినది.

" ఎన్ని నోములపంటగా ఇట్టి తనయుని కంటిరో
అన్న పదుగురి మాటలే తండ్రికీయగల కానుక!"

ఈ పెద్దల మాటను మా తండ్రిగారు నిజము చేసినారు. తరువాత గవర్నరు మా తండ్రిగారికి పండ్ల రసము త్రాగుటకిచ్చి తన సంచిలో ఉన్న ధనమంతయు తీసియిచ్చి సాగనంపినారు. నాటి నుండి పాండిచ్చేరిలోని ప్రభువులు, సంస్థానాధిపతులు అందరు మా తండ్రిగారి సలహా పొందుట ప్రారంభించినారు. మా తాతగారికి, తన కుమారుడు మంచి జీతము వచ్చు మిలటరీ ఉద్యోగము వదల సంఖ్యా జ్యోతిష్కునిగ జీవింప మొదలిడినాడే అన్న బెంగ పూర్తిగా తీరిపోయినది. ఇట్లు ఆ మాత గాయత్రీదేవి వారి జీవితమున చూపిన లీలలు లెక్కకు మించినవి. ఇటువంటి ఆశ్చర్య కరమయిన సంఘటనలు ఎన్నోవు–న్నను వివరింప ప్రయత్నించిన 2000 పుటలు చాలవని, ఇంతటితో ముగించుచున్నాను.

**V. S. GURUSWAMY**

# వైద్యరంగమున సాధించిన అద్భుతములు

ఈ సంఖ్యాశాస్త్ర సహాయముతో తీరని వ్యాధులనుకొన్నవాటి నుండి విముక్తి పొందవచ్చునన్న మా తండ్రిగారి ఉద్దేశ్యమును వేలాది మిత్రులు నిజమేనని నిరూపించినారు. ఏండ్ల క్రిందట గొప్ప గొప్ప డాక్టరులు నయం చేయుట అసాధ్యమని వదలుకున్న కేసులు, మరెప్పుడో మావద్దకు వచ్చి, వారి జబ్బులు కుదుర్చుకొని, నేటికిని ఆరోగ్యముగా ఉన్నారు. వైద్యరంగము సాధింపలేని దానిని ఈ సంఖ్యాశాస్త్రము సాధించి చూపినది. వాటిలో కొన్నిటిని పాఠకులతో పంచుకొనుటకు నేను ఆనందించుచున్నాను. వీటిని చదువు పాఠకులకు సంఖ్యాశాస్త్ర పు వైద్య మహిమలు స్పష్టముగా అర్థమగును.

1951 లో శ్రీ మురుగేశు అను వారు ఆర్థిక సెక్రటరీగా లంక ప్రభుత్వములో ఉండిరి. శ్రీలంక కరెన్సీ నోట్లపై చేవ్రాలు చేయునదియును వారే. 1952లో వారికి విపరీతముగ జబ్బుచేసి బ్రతుకుదురన్న ఆశ లేకుండెను. ప్రపంచ ఆరోగ్య సంస్థకు చెందిన డాక్టరులే ఆశవదిలారు. ఆ సమయమున లంకలో ఉన్న మా తండ్రిగారు మిత్రులు కోరిన మీదట వారిని వారింటిలోనే కలిసి, వారి పేరును మురుగేశ్ నుండి ఉరుగేశ్గా మార్చి దానిని ప్రతిదినము రాయమనినారు. అట్లు చేసిన తరువాత వారు స్వస్థులయి మరి 7 సంవత్సరాలు పదవిలో ఉంటిరి అనునది గమనింపదగిన విషయము.

మద్రాసులోని పెద్దబట్టల వ్యాపారి ఒకరు మా తండ్రిగారి వద్ద ముఖ్యమైన సలహాలు పొందుట అలవాటు. ఒకనాడు వారు మా తండ్రిగారితో, 'నా సహోదరికి పెండ్లియయి 11 యేండ్లయినా సంతానము కలుగలేదు. మీరే వారి సమస్య తీర్చవలెనని వేడుకున్నారు. "సరే వారిని పిలుచుక రమ్మ'న్నారు మా తండ్రిగారు. ఆమె అప్పటికే మైలాపూరులోని ఒక ప్రసిద్ధ ఆస్పత్రిలో పూర్తిగా పరీక్ష చేయించుకొన్నది. ఆమెను పరీక్షించిన లేడీ డాక్టరు గర్భసంచి కొంచమయినా పెరగక వేరుశెనగ పరిమాణములో ఉన్నది. నీవు గర్భము ధరించుట అసంభవము. కాలము వృధాచేయక ఒక బిడ్డను దత్తతు తీసుకొమ్మ ని

సలహానిచ్చి "Infertile Uterus, conception not possible, adopt a child' అని చీటిలో రాసి యిచ్చినారు. వచ్చి–నామె దానిని కూడా మా తండ్రిగారికి చూపినది. దానిని చేతిలోకి తీసి చదివి మరల ఆమెకే ఇచ్చి, "దీనిని భద్రముగా ఉంచండి. మరల నాలుగేండ్ల తరువాత అడిగెదను" అనినారు. పిదప ఆ దంపతులను చూసి, "మీకు బిడ్డలు కావలెననిన నేనొక నిబంధన విధించెదను. దానికి మీరిరువురును కట్టుబడేదరా?' అని ప్రశ్నించినారు. ఉలిక్కిపడిన వారు, అదెట్టి నిబంధనయో తెలిసికొన కోరినారు. మా తండ్రిగారు పెట్టిన నిబంధన - "నేను ఆపమనే వరకు ఏడాదికొక బిడ్డవంతున కనుచుండవలయును, అందుకు సిద్ధమా!" అని. తమతో పరిహాసమాడుచున్నారనుకొని వారు, "స్వామీ, మేము పడు అవస్థలో, మీ నిబంధన మాకు వరప్రసాదము కాదా! తప్పక కట్టుపడెదము" అని సంతోషముగా ఒప్పుకొనినారు. పిమ్మట మా తండ్రి గారు వారిరువురి జాతకములను, పేర్లను, అరచేతులను పరిశీలించి ఇరువురి పేర్లలో ను కొన్ని అక్షరములు మార్చి ఇచ్చి దానిని ప్రతిదినము రాయవలెనని రాసి ఇచ్చి నారు. అదిగాక ఒక చిన్న పరిహారము కూడ చేయమనినారు. గర్భసంచి పెరుగుదల గురించి దిగులు వలదనియు, ఈ క్రొత్తపేరు వ్రాయగా వ్రాయగా పెరుగుదల వచ్చుననియు ధైర్యము చెప్పి ఆశీర్వదించి పంపినారు. సరిగ్గా 10 నెలల్లో ఆమె గర్భము దాల్చి పండంటి మగబిడ్డను ప్రసవించినది. వారి కుటుంబములోని వారి సంతోషమును మాటలతో వర్ణించగలమా?

11 సంవత్సరములుగా తపము చేసినా దొరకని భాగ్యము ఇప్పుడు దొరికినదని, వారి సంతోషమునకు మితియే లేకుండెను. ఆబిడ్డకు మాతండ్రిగారే నామకరణము గావించిరి. తరువాత మరియొక మగబిడ్డ, తరువాత ఒక ఆడుబిడ్డయు కలిగిరి. మూడవ బిడ్డకు పేరు పెట్టునపుడు వారు మాతండ్రిగారితో, "స్వామీ, మాకు వెంట వెంటనే ముగ్గురు పిల్లలు కలిగినారు. ఇంకను కలిగినచో పెంచుట కష్టము. మీ మాట జవదాటవలెనని కాదు. కాని కుటుంబ నియంత్రణ అమలుపరచుటకు మాకు అనుజ్ఞనీయవలసినది' అని వేడుకున్నారు. మా తండ్రిగారు అనుమతినిచ్చి, పాత ఆస్పత్రి చీటీలు తీసుకొని, ఇంతకు ముందు పిల్లలు పుట్టుట అసంభవము అన్న డాక్టరు వద్దకే వెళ్ళుమనియు, ఇప్పటి పరిస్థితి చూసి ఆమె ఏమి చెప్పిరో వచ్చి

తెలుపమనియు చెప్పినారు. ఆమె తన పాత డాక్టరమ్మను చూసినది. డాక్టరు ఈమెను గుర్తుపట్టి, నీకు infertile uterus కదా. ఈ బిడ్డ యెవరిది? అని అడిగినారు. ఈమె తను ముగ్గురు బిడ్డలను కన్నదని చెప్పగనే డాక్టరమ్మకు కలిగిన ఆశ్చర్యమింతంతకాదు. ఆమె ఆ తల్లిని పరీక్షించి, గర్భ సంచి పూర్తిగా పెరిగియుండుట తెలిసికొని, తన వైద్యచరిత్రలోనే ఇది మొదటసారి వింతను గనుట అని చెప్పినారు. ఆ తల్లి మాతండ్రిగారిని గురించి చెప్పినది పూర్తిగా విని This is a Medical marvel (ఇది వైద్యరంగమున ఒక అద్భుతము) అని పొగడినారు. వైద్యశాస్త్రము అసాధ్యమన్న దానిని మా సంఖ్యాశాస్త్రము సాధ్యమని ఈ సంఘటనతో నిరూపించినది. కాలచక్రము వేగముగా తిరిగినది. ఆ పిల్లలు పెరిగి పెద్దవారయిరి. ఆ ఆడపిల్లకు వివాహమయి ఆమెకు ఒక బిడ్డ కలిగినది. ఆ బిడ్డకు కూడా మా తండ్రిగారే నామకరణము చేసిరి. మా తండ్రిగారు పోయినపుడు ఆమె వచ్చి పాత సంగతులు చెబుతూ కన్నీరుతో నమస్కరించిన తీరు మమ్ములను మరింత కదిలించివేసినది. సామాన్యముగా గొడ్రాలు అను పేరు ఏ స్త్రీకును రారాదు. ఎందరో స్త్రీలు ఈ పుస్తకమును చదివి, తమంత తామే పేరు మార్చుకొని బిడ్డలను కన్నామని చెప్పియున్నారు. అటు తరువాత వారికి ఈ శాస్త్రము మీద, దాని విధులపైనను శ్రద్ధ మరింత పెరిగినది అన్న విషయము ఇక్కడ గమనింపదగినది.

మా తండ్రిగారు 1987లో ఆస్ట్రేలియాలోని 'మెల్బర్న్ " నగరములో శ్రీ రాజశేఖరన్ అను వారింట ఒక నెలరోజులు బసచేసినారు. అప్పుడు 'సిడ్నీ' నగరము నుండి వారింటికి వచ్చిన బంధువు ఒకరిని చూపి, వీనికి 16 యేండ్లు, చూచుటకు ఏడేండ్లవాని వలెనున్నాడు. ఇక్కడి డాక్టర్లు వానిని మరుగుజ్జు అనినారు. వీడు పొడవు పెరుగుటకు ఏమాత్రము అవకాశము లేదన్నారు. మీరే వీనికొక దారి చూపించవలెనని ప్రాధేయపడినారు. మా తండ్రిగారును ఆ బాలుని జాతకము, చేతులు చూసి, పేరు మార్చి, ప్రతిదినము రాయవలసినదిగా చెప్పినారు. 'శ్రద్ధగా రాసినావంటే మీనాన్న కన్న పొడుగుగా పెరుగుతావు ? అన్న మా తండ్రిగారి మాటను వేదవాక్కుగా తీసికొని, మార్చిన క్రొత్త పేరుని రాసి రెండేండ్లలో ఆరడుగుల వాడయినాడు. ఈనాడు ఆ బాలుడు Papua New Guinea లో ప్రసిద్ధ సర్జనుగా ఉన్నాడు. ఈ సంఘటన గూర్చి సిడ్నీలో నివసించు శ్రీలంక తమిళులు చాలాకాలము చెప్పుకొనుచుండినారు.

ఇది జరిగిన కొంతకాలమునకు, మా తండ్రిగారు సిడ్నీలో శ్రీలంక తమిళుల సభలో ప్రసంగించినపుడు, అచ్చట సభలో కూడియున్న అనేకులు, "Chelva Athithyan పొడుగు పెరిగిన అద్భుతము మా కెల్లరకును బాగుగా తెలియును. మా జీవితములను కూడా అట్లే పెరుగునట్లు చేయుడు" అని మూకుమ్మడిగా అన్నారు.

నేను పై సంఘటనను చెప్పుటకు కారణము, ఇట్లు పేరు మార్పిడి వలన శరీరములోని అంగములందుకూడా కొన్ని మంచి మార్పులు తప్పక వచ్చును అని తెలియజెప్పుటకే. 18 యేండ్లయినా పుష్పవతులుకాని ఆడపిల్లలు, డాక్టరులను సంప్రదించి, హార్మోను చికిత్సలు పొంది విఫలమయిన తర్వాత నావద్దకు రాగానే నేను పేరు మార్చి ఇచ్చి, ఆ పేరును కొద్దినెలలు రాయగానే పుష్పవతులు అయినారు. వారి తల్లిదండ్రులు ఆనందమును, నిశ్చింతను పొందినారు. పేరు తగినదిగా లేకపోయిన, శరీరములోని హార్మోన్లు సరిగా పనిచేయవన్నది పైన చెప్పిన విషయము వలన స్పష్టమగుచున్నది.

పేరు మార్పు వలన మూర్ఛ రోగములవంటి తీరని వ్యాధులు తీరుచున్నవని తెలిసికొన్న కొందరు డాక్టరు మిత్రులు, దీనిని గురించి ఒక పుస్తకము రాయవచ్చును గదా! అని అడిగినారు. ప్రతియొక్క వ్యాధియు, వేర్వేరు సంఖ్య లందు పుట్టినవారికి (ప్రత్యేకమయిన శరీర, మనోతత్వముల కారణమున) వేర్వేరు కారణముల వలన కలుగును. ఒక సంఖ్య ఫలానా వ్యాధిని నయము చేయునని ఖచ్చితంగా చెప్పలేము. అటువంటప్పుడు పుస్తకమును 'ఆషామాషీగా చదివి కొందరు పేర్లు మార్చెదమని బయలుదేరి అనర్థములను, విపరీత ఫలితములను ఎదుర్కొందురన్న భయముతో ఎక్కువగా వివరించుట లేదు. అనుభవపూర్వకముగా తెలుసుకున్న నిజములనే ఇక్కడ వెలువరించుటచే, ఇందు కల్పనలకు, అనుమానములకు తావులేదు.

మాచేత పేరు మార్పిడి గావించుకొని అతి శీఘ్రముగా స్వస్థులయి ఆనందముగ జీవించుచున్న కొందరి లేఖలను మీ ముందుంచుచున్నాను.

**V. LATHA DHEVI**
37-Keela Street,
Needa Mangalam
Tamilnadu
3-2-2002

నేను 12-06-1969లో ఉత్తమపాళయం అను వూర్లో పుట్టి పెరిగినాను. చిన్నప్పుడు నాకు మూర్ఛరోగము (epilepsy) వుండినది. వ్యాధి తగ్గించుకొనుటకు మందులెన్నో వాడినాను. నాకు పెళ్ళి నిశ్చయించినారు. నా అనారోగ్యము సంగతి పెళ్ళివారికి తెలియదు. మా భర్తగారికి గురుస్వామిగారు నిశ్చయించిన 30-01-1995 న మా వివాహము గొప్పగా జరిగినది. పెండ్లి తరువాతను ఈ వ్యాధి నన్ను వదలలేదు. నా భర్త శ్రీ G. G. వీరమణి గారి సహోదరులు మా ఇరువురినీ మద్రాసులోని శ్రీ గురుస్వామిగారి వద్దకు తీసుకొనిపోయినారు. వారితో నా జబ్బు గురించిన అన్ని వివరములు చెప్పినాము.

మూర్ఛ రోగము గురించి దిగులు పడవలదని వారు ధైర్యము చెప్పినారు. పేరును మంచి విధముగా మార్చి పెట్టెదననియు, ఆ పేరుని రాయగా రాయగా కొన్ని నెలలలోనే సంపూర్ణ ఆరోగ్యము కలుగునని చెప్పినారు. ముందు నా జాతకమును, తరువాత నా చేతిని పరీక్షించి V. Latha అన్న పేరును V. Latha Dhevi అని మార్చినారు. ఈ పేరును రోజుకు 32 మారులు రాయమన్నారు. పైగా, మూర్ఛరోగము కొరకు మందులేవియు తినవద్దని, వానియందు steroids ఉండుటచే side effects ఉండుననియు చెప్పిరి. పిల్లల గురించి కూడా భయము లేదనియు, 2 ఏండ్ల తరువాత ఏ విధమయిన కష్టము లేకుండగనే బిడ్డలు కలుగుదురనియు చెప్పి ఆశీర్వదించి పంపిరి.

వారు చెప్పినప్పటినుండియు దినము తప్పక నా కొత్తపేరును వ్రాయుచునేయున్నాను. మొదటి 2 నెలలు కొంత జబ్బుగనే ఉండినది. దాని తర్వాత పూర్తిగా స్వస్థత చిక్కి నది. వారు చెప్పినట్లే 2 యేండ్ల పిదప 20-4-1999 న నాకు మగపిల్లవాడు కలిగినాడు. ప్రసవముకు ముందును, తరువాత కూడ నాకు మూర్ఛ రాలేదు. మా పిల్లవానికి గురుస్వామిగారే G.V. Santosh అని పేరు పెట్టినారు. పేరు

మార్చిన 3వ నెల నుండియే ఏ విధమయిన వ్యాధిచ్ఛాయలు లేక భర్త, బిడ్డలతో సుఖముగాను, సంతోషముగాను ఉన్నాను.

మా పూర్వపుణ్యము వలననే గురుస్వామి గారిని కలిసి నేనును, నాబిడ్డయు ఆరోగ్యముగా ఉన్నాము.

నావంటి పలువురకు శ్రీ గురుస్వామిగారి ఆశీస్సులును, దయయు కలుగవలెనని సర్వశక్తియుతుడైన దేవుని ప్రార్థించుచున్నాను.

కృతజ్ఞతతో,

V. LATHADHEVI

**V. LATHA DHEVI**

**V. RAMACHANDIRAN**
Advocate
“MITHILAPURI”
8, West Mada Street
Srinagar Colony
Saidapet
Chennai – 600015
February 19, 2002

నేను చాలా యేండ్లుగా తలనొప్పితో తరచుగ అవస్థపడెడివాడను. ఎన్నియో వైద్య పరిశోధనలు చేసినను సరైన కారణమును కనిపెట్టలేకపోతిమి. తలనొప్పి వచ్చిన మాత్ర వేసికొందును. అప్పటికి నివారణమగునేగాని అది నిరంతరముగాదు. ఇంతలో 1973లో నామిత్రుని ద్వారా సంఖ్యాశాస్త్ర నిపుణులు శ్రీ సేతురామన్ గారిని కలిసితిని. వారు నేను పుట్టినతేది, జాతకము అన్నీ బాగుగా పరిశీలించి నాపేరులో చిన్న మార్పు చేసినారు. దానిని ప్రతిదినము రాయుమనియు చెప్పినారు. సరిగ్గా 41 రోజులలో ఒక అద్భుతము జరిగినది. అవును! నా తలనొప్పి పూర్తిగా తగ్గిపోయినది. నాటి నుండి నేటివరకు అది మరల రానే లేదు.

పండిట్ గారిని తరచుగ కలుసుకొను సందర్భము దొరికినది. నా బంధువులను, స్నేహితులను ఎందరినో వారివద్దకు పిలచుకొని పోయినాను. వారు నాతో ఎన్నో పసందయిన అనుభవములను పంచుకొన్నారు. నాకు సంఖ్యాశాస్త్ర ముపై ఆసక్తి కలిగినది. పండిట్ గారు ఆ శాస్త్ర పు ఆధారభూతములయిన అనేక విషయములను నాకు వివరించినారు. వారు చాలా సరళ స్వభావులు. వారు సంఖ్యాశాస్త్రమున సాటిలేని మేధావి అనుటకు సందేహమేమియు లేదు.

ఎన్నో రంగములకు సంబంధించిన పారిశ్రామిక వేత్తలు, వ్యాపారులు ముఖ్య ప్రముఖులు, ప్రభుత్వ అధికారులు వారివద్ద సలహాలకు వచ్చుట చూసి నేను ఆశ్చర్యపడియున్నాను.

పండిట్ సేతురామన్ గారి తనయులు శ్రీ గురుస్వామి గారు తమ తండ్రి గారి నుండి వారసత్వముగా ఈ కళను, దానికి కావలసిన జ్ఞానము, ఆసక్తి, శక్తులను పొంది గత 15 సంవత్సరములుగా శ్రేష్ఠమయిన సలహాలనిచ్చుచున్నారు. తమ తండ్రిగారు 1954లో

రచించిన 'అదృష్ట విజ్ఞానం' అను గ్రంథమును నవీనముగ తమిళములోను, ఆంధ్ర, ఆంగ్ల, భాషలలోను వెలువరింపుచున్నారు. దానికి వారికి నా హార్ధిక అభినందనలు తెలుపుచున్నాను.

**V. RAMACHANDIRAN**

**V. SAVARIRAJ**
Mirasdar, Thollampur
Eraiyur P.O.
(Via) Mailam, S.A. Distt.
6-9-1996

నా కుమార్తె Chitra (5 యేండ్లు)కు విషజ్వరము వలన ఎడమ కన్ను ఆగకుండ అదురుచుండెడిది. 6 నెలలకు పైగా పలు డాక్టర్లకు చూపియు (విదేశమున చదివినవారుకూడ) ఫలితము లేకుండెను. ఆ సమయమున బంధువుల ద్వారా సేతురామన్ గారిని గూర్చి విని 6-8-1966లో నేను మా పాపను వారి వద్దకు తీసుకు వెళ్ళాను. పేరు మార్చిన వెంటనే సరియగునని చెప్పి వారు ఆమెకు S. Danalakshmi అని పేరు మార్చినారు. ఆ మార్చిన పేరునే తన పేరుగా ఆ బిడ్డ చెప్పుచుండుటచే మరునాటి సాయంకాలముననే అదురుడు తగ్గిపోయినది. రెండు కన్నులును చక్కగా ఉండినవి. అది చూసి మా బంధువులు, మిత్రులేగాక ఆమెను పరీక్షించిన డాక్టర్లును ఆశ్చర్యములో మునిగిరి. పండిట్ సేతురామన్గారు న్యూమరాలజీలో గాఢంగా పరిశోధనలు జరిపినారనుటకు, వారి పాండిత్యముతో నా కూతురివంటి పేలాదిజనులకు, పేరు మార్పుతో ఆశ్చర్యపడు విధమున, వ్యాధులను నయము చేసినారనుటకును సాక్ష్యము.

పండిట్ సేతురామన్ గారు చిరంజీవులుగా ఉండి మాబోటి వారికి సేవ చేసి సత్కీర్తి పడయవలెనని ఆ భగవంతుని ప్రార్థించున్నాను.

**V. SAVARIRAJ**

(ఈ పాపకు వైద్యము చేసిన డాక్టరు గొప్ప పదవి వహించినవారు. ముందు హేళనగా తలచినా, తరువాత పాపకు నయమగుట చూసి, తరువాత నా సలహాను పాటించి ఉద్యోగమునకు రాజీనామా ఇచ్చి, ఇంగ్లండులోని ఒక ప్రసిద్ధ వైద్య కళాశాలలో ప్రొఫెసరుగ పనిచేయుచున్నారు.)

**APPASSUVAMI**
190, Jawaharlal Nehru Street
Pondicherry
9-9-1968

నా కుడికాలి మీద వ్రణమొకటి, నాయేడవ యేటనే పుట్టి, 24 ఏండ్లుగా ఎంత ఖర్చు పెట్టినను, ఎందరు డాక్టర్లను సంప్రదించినను మానక, ఎక్కువ కష్టపెట్టుచుండెడిది. రెండేండ్ల క్రితము, ఈ పుస్తక రచయిత పండిట్ సేతురామన్ గారిని గురించి విని వారిని చూసినాను. నా పేరు సంఖ్య, జననతేది సంఖ్యకు విరోధముగా ఉండుట వలననే ఇట్టి తీరని వ్యాధి వచ్చినదని చెప్పి Appassamy అని ఉన్న పేరుని Appassuvami గా మార్చి నారు. దీనినే ప్రతినిత్యము 42 మారులు రాయుచుండిన వ్యాధి వున్న చోటు తెలియకుండ పోవునని చెప్పినారు. ఇన్ని యేండ్లుగా ఉండిన వ్యాధి ఇంత సులభముగ వదలునా! అని నేనును, మా బంధువులును అనుకొంటిమి. పేరును అట్లే రాయగా 15 దినములలో వ్రణము మానినది. సంపూర్ణముగ మానినది. గత రెండేండ్లుగా ఎంతో హాయిగా ఉన్నాను. నావలె వ్యాధులవల్ల పీడింపబడు వారందరును పండిట్ గారి ద్వారా లాభము పొందవలెనని ఈ విషయమును ప్రచురింపవలెనని అడిగినాను.

**APPASSUVAMI**

ఇది మిక్కిలి అద్భుతమయిన ఫలితముల నీయగల మంత్రశాస్త్రము. ఈ శాస్త్ర ము ప్రతియొక్కరి జీవితమందును పలు అద్భుతములను చేయగలిగినది. మీరు శ్రద్ధతో చదివి, అనుసరించి, పాటించి, పలు అపురూపమయిన సత్ఫలితములను పొందవలెను అనునదియే నా ఆకాంక్ష. మీ అందరి కృషియు, సఫలమగుటకు మీ పై గాయత్రీ మాత తన కృపను వర్షించుగాక!

పైన ప్రచురించిన లేఖలవంటివి లెక్కకు మించినవి ఉన్నవి. మూర్ఛరోగము వంటి చెప్పుకోలేని వ్యాధులతో నా వద్దకు వచ్చినవారు అప్పటికి చిన్నవయసువారే. ఇప్పుడు వివాహమాడి కుటుంబములతో సుఖముగా ఉన్నారు. వారి భార్యలకు, సంస్థల యజమానులకు కూడ వారి వ్యాధులను గూర్చి తెలియదు. అట్టి విషయములను నేను బహిరంగ పరుచరాదని వారనుకొనుట సహజమే. ఇంత ఏల చెప్పుచున్నాననగా, పాఠకులు పేరు మార్పిడి వలన, ఏ స్థాయికి శరీర స్థితిలో మార్పులు రాగలవు అని అర్థము చేసికొనుటకే.

## పేరు మార్చుకొనుట గురించి ఒక హెచ్చరిక

ఏదో కొంత జ్యోతిష్యము నేర్చినవారును, కొందరు తొందరపాటు గలవారును, తమకు తోచినట్లు ఇతరులకు పేర్లు మార్చిపెట్టి విపరీతములకు అనర్థములకు కారణమయినారు. అట్లు చేయుట మందుల పట్టిక చూసి మందు తినుట వంటిది. పేరు మార్చుటకు ముందు, మునుపటి పేరు ఏ ఏ ఫలితములను ఇచ్చినది, భవిష్యత్తులో ఎట్టి ఫలితముల ఈయగలిగినది, పుట్టినతేది సంఖ్యలపై ఎట్టి ప్రభావము చూపు ను, అనువానిని దీర్ఘముగ విచారించి గమనించి, బాగుగా ఆలోచించియే నిర్ణయింపవలెను. రేఖాశాస్త్రము (హస్త సాముద్రికము) తెలిసినవారయినచో ఆత్మరేఖ, ఆయువు రేఖ, మొదలైన వానిలో ఏవిధమయిన మార్పులు (కుడి, ఎడమ చేతులలో కల వ్యత్యాసము) ఏర్పడియున్నవి. ప్రగతి మార్గములోనే జీవితము సాగుచున్నదా, లేక అధోగతికి పోవుచున్నదా, వ్యాధిగల సూచన లేవయిన కలవా అను విషయములను క్షుణ్ణముగ పరిశీలింపవలయును. పేరు మార్చిన కొన్ని నెలలకయినా చెడు ఫలితములు ఇచ్చు రేఖలు మారినవా, మంచిని సూచించు గీతలు మొదలయినవా అని గమనించుట అతి ముఖ్యము. అప్పుడే పేరు సరిగా మార్చబడినదని తెలియును.

నేను పేరు మార్చు నపుడు, పొరబాటు జరుగకూడదని మనిషి ఎదురుగా ఉన్నచో అతని కాంతి వలయములను (Aura) బట్టియే ఎట్టి సంఖ్యగల పేరు పూర్ణఫలములను ఇచ్చును, అని యోచించియే చెప్పెదనని అందరకును తెలియును. సత్ఫలితముల నిచ్చు తేదీలలో పుట్టిన బిడ్డలకు పేరు పెట్టుటకు ఈ పుస్తకము సహకరించును. 12,26 వంటి తేదీలలో పుట్టిన పిల్లలకు బాగుగా నాలోచించియే పేరు పెట్టవలెను. తీరని వ్యాధులు కలిగిన బిడ్డలు కూడా (తమ పేరిదియని తెలియనివారు) పేరుమార్చి, అందరూ ఆ పేరుతో పిలుచుటచే ఆశ్చర్యకరముగ, శీఘ్రముగ కోలుకొనియున్నారు. (ఇది అనుభవమునకు తెచ్చుకొన్న మంత్రశాస్త్ర మే)! మిక్కిలి శ్రేయస్కరముగ పూర్తి ఫలితములనిచ్చు పద్ధతిలో పేరు మార్చుటకు, మంచి పరిశీలనాశక్తియు, అనుభవమును తప్పక కావలయును.

## పాఠక మహాశయులకు ఒక విజ్ఞప్తి

ఈ సంఖ్యలకు సంబంధించిన కళ, నియమములను కొలిచి చూపెడు ఖచ్చితమయిన లెక్క. దీనిపై పరిపూర్ణ నమ్మకముతో అనుసరించినవారే అపారమయిన సంపదలను, ఉన్నత స్థితిని పొందారు. కొందరు ఈ నిశ్చిత పద్ధతిని అవలంబింపక పంచాంగము మొదలైన వానిని చూచి తికమక పడి అదృష్టదినములను ఉపయోగింపక వదలుకొనుచున్నారు. ఈ సంఖ్యల పద్ధతిలో వేలాది వ్యాపార సంస్థలకు, ఫ్యాక్టరీలు మొదలైన వాటికిని ప్రారంభించుటకును, కొత్త లెక్కలు మొదలు పెట్టుటకును మంచి రోజులు చెప్పియున్నాను. కీడు, నష్టము జరిగినట్లు ఈ నాటి వరకును ఎవరును చెప్పలేదు. మంగళవారము, శనివారము, అష్టమి, నవమి అని ఎన్నిటికో జడియుచున్నారు. పంచాంగములో మరణ యోగమని రాసియున్న ఆధారము లేని భయములు. జంకనవసరము లేని అసత్యములు. అసత్యమన్నమాట ఎందుకు ఉపయోగించుచున్నాననగా, జ్యోతిషశాస్త్ర ప్రకారము ఒక దినము ఎట్లన్నది తెలిసికొనుటకు కావలసిన అయిదు అంగములను వివరించునదే పంచాంగము. తిథి, వార, నక్షత్ర, యోగ, కరణము అనునవియే ఈ పంచ అంగములు. యోగములు 27. కరణములు 11. ముహూర్తములలో కీడు కలుగునది కరణము తప్పుగా ఉండుట వలననే. 'కరణము తప్పితే మరణమే' యని జ్యోతిష్యమున ఒక నానుడి కలదు.

(సర్కసు ఫీట్లకు, ముఖ్యముగా పిల్లిమొగ్గలకు, తమిళములో కరణము" అన్న పేరు గలదు. కనుక ఆ సందర్భములో కూడ దీనిని ఉపయోగించుదురు.) ప్రస్తుతము వచ్చు పంచాంగములలోని ముహూర్తములు ఈ పొరపాటుతోనే వున్నవని చెప్పుటకు చాలా విచారముగానే ఉన్నది. జ్యోతిష్కులు యోగ, కరణములను కలిపి ఎట్లు చూడవలెనో తెలియకనే ముహూర్తములు నిశ్చయించుచున్నారు. అయిదు అంగములను సరిచూసిననే కదా పంచాంగము చూసినట్లగును. ఈ విషయము చెప్పి జనులను బెదరగొట్టరాదని ఇంతకాలము ఊరకుంటిని. కాని ఈమధ్య అట్టి దురదృష్టకరమయిన పలు ముహూర్తములలో లెక్కలేనన్ని పెండ్లిండ్లు జరుగుట చూసి, చెప్పవలసి వచ్చెను. మనము చిన్న జబ్బులకు తీసికొను మందులపై కూడ విషము అని రాసియుండునే. ప్రతిదానికి విషమందులను వాడుటకు అలవాటు పడిన ఈ సమాజము పొరపాటుగా రాయబడిన 'మరణయోగము" అన్న మాటకే బెదరుట వింత కాదా?

జ్యోతిషము యోగము కొరకు (పలు విధములయిన దైవారాధన విధానముల కొరకు) ఋషులచే తెలుపబడిన శాస్త్రము. శుభమైన కార్యములను, పూజలను శుక్లపక్ష అష్టమియందు ప్రారంభించి పౌర్ణమి రోజున ముగించవలెనన్నది పద్ధతి. ప్రస్తుత కాలమున అన్ని అష్టమి, నవములను చెడ్డవిగానే చూచుచున్నారు. ఈ విధమయిన వివిధ వార, నక్షత్ర, యోగ, తిథి తికమకలను వదలననే కాని పనులు చేయుటకు కొన్ని దినములయినా మిగలవు. ఈ గ్రంథము ప్రకారము అదృష్టదినములుగా గణించబడిన రోజులలో ఏ భయమును లేక ముఖ్యమైన పనులను చక్కబెట్టుకొనువారే సంపూర్ణ విజయము పొందగలరు.

ఈ గ్రంథమున వివాహమునకు పనికిరానివి అని చెప్పబడిన తేది, నెల, సంవత్సరము కూడిన 5 లేక 8 వచ్చు రోజులలో వివాహము గావించి, సంవత్సరము తిరుగక ముందే ప్రాణములు పోగొట్టుకొన్న వారిని చూసిన వెనుకనే పలు దేశములందును ఈ పుస్తకముండుట ఎంత అవసరమో తెలియవచ్చినది. దుర్దినములను గూర్చి ఏర్పడిన నమ్మిక మంచి దినములందు కూడా ఏర్పడినట్లయితే అందరును మంచిని సులభముగ అనుభవింతురు.

ఈ గ్రంథములోని విషయములు జనుల మధ్య వ్యాపించి, ఇంకను వారికి

విజయములు చేకూరుటకు దేవి అనుగ్రహించుగాక!

# అంకె 1- సూర్యుడు

అంకె 1 సూర్యుని ఆధిపత్యములో ఉన్నది. ఈ ప్రపంచంలో సర్వ ప్రాణికోటి మనుగడకు సూర్యుడు ఎంత ముఖ్యమైనవాడో, అంతగా 1 అంకెలో పుట్టిన మనుష్యులు ఈ సమాజంలో ప్రముఖులుగా ఉంటారు. ఏ దేశంలోనైనా, ఏ ఊరిలోనైనా వీరే ప్రముఖులుగా, సంఘ పెద్దలుగా చెలామణి అవుతూ ఉంటారు.

జన్మ సంఖ్య 1 అయినా, లేక పేరులోని అక్షరాల కూడిక వల్ల వచ్చే నామ సంఖ్య 1 అయినా, అలాంటివారే ఏ దేశ రాజకీయ రంగాలలో నైనా నాయకులుగా ఉంటున్నారు. రాజ్యాలను ఏలేవారు వీరే.

ఈ సంఖ్యలో పుట్టినవారి గుణములు, వీరి జీవిత విధానమును ఇప్పుడు పరిశీలిద్దాం. ప్రతినెలలో 1, 10, 19, 28 తేదీలలో పుట్టినవారు ఈ సంఖ్య ప్రభావంలోనికి వస్తారు.

ఈ సంఖ్యకు చెందిన వారి మూల గుణములు

ప్రకాశవంతమైన జీవితం గల వీరు నిజాయితీపరులుగా, గంభీరంగా, హుందాగా జీవించుటకే ఇష్టపడతారు. వీరి వేషభాషలు, నడవడిక ఎంతో ప్రత్యేకంగా కనిపిస్తాయి. వీరు జీవితంలో అన్ని సుఖాలను తనివితీరా అనుభవిస్తారు. అందుకోసం ఎంత ఖర్చు పెట్టడానికైనా వెనుకాడరు. సునిశిత బుద్ధిగల వీరు ఏపనిలో చొరబడినా ఏకాగ్రతతో ఆ పనిని పూర్తి చేస్తారు. కనుక వీరి ప్రయత్నములు నిరాటంకంగా విజయం సాధిస్తాయి. వీరు ఏ పనిలో దిగినా బాగా ఆలోచించిన తరువాతే దిగుతారు. అలాగే మొదలుపెట్టిన కార్యం నుండి సగంలో వెనుదిరుగుట అన్నది వీరి విషయంలో జరుగదు. ఎలాంటి ఆటంకాలకు అయినా వీరు భయపడరు. వాటిని ఇంకా ధైర్యంగా ఎదుర్కొని విజయం సాధిస్తారు.

వీరు ఉద్యోగ జీవితంలో నిజాయితీ మరియు క్రమశిక్షణ కలిగి ఉంటారు. కపటం, నయవంచన, రహస్యాలకు వీరు ఎంతో దూరంగా ఉంటారు. మనస్సులో తోచినవి అరమరికలు లేకుండా బయటకు చెప్పి విరోధం కూడా తెచ్చుకుంటారు. వీరి స్నేహాలు,

విరోధాలు ఎల్లప్పుడూ బట్టబయలే. వీరు తమంతట తాముగా స్నేహితులను వెదకుట జరుగదు. వీరిలోని స్నేహ గుణం, ఇతర సద్గుణాలు ఇతరులను వీరి వద్దకు ఆకర్షిస్తాయి. అలా ఎందరో వీరి స్నేహాన్ని, సహాయాన్ని కోరుతూ వీరి వటం జరుగుతుంది.

వీరికి ఆత్మాభిమానం ఎక్కువ. వీరు ఎవరికీ లొంగటానికి సిద్ధం కారు. తమదే పై చేయిగా ఉండాలనుకుంటారు. చేసే ఉద్యోగంలో కూడా పై అధికారి ఏ మాత్రం కించపరిచినా తట్టుకోలేరు. వెంటనే ఉద్యోగానికి రాజీనామా చేయటానికి కూడా సంసిద్ధులవుతారు. వీరికి ముఖస్తుతి అంటే ఏమిటో తెలియదు. ప్రతి విషయంలో వీరు నిర్మొహమాటంగా వ్యవహరించటం సర్వసాధారణం.

వీరు కుశాగ్రబుద్ధి కలిగి విజ్ఞులుగా వ్యవహరించటం మనం గుర్తించ గలం. కాబట్టి వీరు అనేక విషయములను ఎంతో సులభముగా గ్రహించగలరు. జ్యోతిష్యం, వైద్యం, యోగం మొదలయిన శాస్త్రముల గూర్చి, చిత్ర, శిల్ప, సంగీత కళలను గూర్చి వీరు విశేషంగా అధ్యయనం చేసి, వాటిలో ఆరితేరినవారి వలె మాట్లాడతారు. వీరు మాటలనుబట్టి మనుష్యులను అంచనా వేయగలరు. కొద్ది ప్రయత్నంతోనే గొప్ప వక్తలుగా, గొప్ప రచయితలుగా పేరు పొందగలరు. వీరిలో కొందరు అన్నీ తెలిసినా, ఏదీ తెలియనట్లు ఎంతో వినయంగా ఉంటారు. వీరు గొప్ప పేరు గడించాలనో లేక ధనాశతోనో ఏ పనీ చేయరు. వీరు వంశ పారంపర్యంగా వ్యాపారులైనా సరే, ఎంతో న్యాయంగా వ్యాపారం చేస్తారే తప్ప అన్యాయంగా అధిక లాభాలు ఆర్జించాలని అనుకోరు.

కళను వృత్తిగా తీసుకున్న వారికి, మరొకరి సహాయం అందనిదే పైకి రాలేరు. వీరి సంపాదన అంతంతమాత్రంగా ఉంటుంది. వీరికి ధనం దానంతట అదే రావాలి. అంతే గాని వీరు దానిని వెదకి సంపాదించలేరు. వీరు పేరు ప్రతిష్ఠలు వచ్చేవరకు విసుగు, విరామం లేకుండా శ్రమిస్తారు. సామాన్యంగా వీరిలో సోమరులు ఉండరు.

వీరికి ఎంతో మందితో పరిచయం ఉంటుంది. అయినా కొద్దిమంది మాత్రమే వీరికి స్నేహితులుగా ఉంటారు. అలా ఆలోచించి ఎంచుకున్న స్నేహితులకు వీరు ఎంతైనా మేలు చేస్తారు. అదీ మనస్ఫూర్తిగా. వీరు ఎన్నడూ పరుల సొమ్ముకు ఆశపడరు.

వీరిని మహా అదృష్టవంతులుగా మార్చేది రాజకీయ రంగమే. వీరిని రాజ్యాంగచక్ర దత్తపుత్రులు' అని అంటే అతిశయం కాదు. సూర్యుడు వీరికి పరిపాలించే అధికారం ఇస్తున్నాడు. ఉన్నత రాజ్యాంగ పదవులలో వీరు స్థిరంగా ఉంటారు.

వీరు ఇంటిని విలాస వస్తువులతో అలంకరిస్తారు. ఎల్లప్పుడూ వీరు పరిశుభ్రమైన బట్టలనే ధరిస్తారు. వీరు ప్రకృతి ఆరాధకులు కాబట్టి అందమైన కొండ ప్రదేశాలంటే వీరికి ఎక్కువ ఇష్టం. అంతేగాక, వీరికి ప్రపంచం చుట్టివచ్చే వినోద యాత్రలలో ఆసక్తి ఎక్కువగా ఉంటుంది. ఇలాంటి వాటికి వీరు ఎంత ఖర్చు చేయవలసివచ్చినా ఎంత మాత్రం వెనుకాడరు.

ఎవరిలోనైనా పైన పేర్కొన్న గుణములు ఉంటే వారి పై సూర్యుని ఆధిక్యత ఎక్కువగా ఉందని మనం గ్రహించవచ్చు. ఎవరిపైనైనా సూర్యుని ప్రభావం తక్కువగా ఉంటే, వారిలో క్రింద పేర్కొన్న స్వభావం కనిపిస్తుంది:

ఇలాంటివారు ఇతరుల మెప్పు కోసం అనవసరపు ఖర్చులు పెడతారు. అంతేకాక, కొంచెం కూడా అణకువ లేకుండా, ప్రపంచంలో అన్నీ తమకే తెలిసినట్లు ఉంటారు. తాము చేయని పనులను కూడా తామే చేస్తామని చెప్పుకుంటారు. ఇలాంటివారు జీవితంలో అనేక చిక్కులు ఎదుర్కోవటం మాత్రమే కాక, తమ ప్రయత్నాలలో తరచుగా అపజయాలు పొందుతూ ఉంటారు.

వీరిలో ఎంతగా సూర్య బలం తగ్గినా, ఇతరులకు చెడు చేయాలన్న ఆలోచన వీరికి రాదు. వీరు అపఖ్యాతికి జంకుతారు. ఆత్మబలం లోపిస్తే ఆ పరిస్థితులలో వీరు ఇతరుల మాటకు కట్టుబడి జీవిస్తారు. ఇటువంటి వారిని మనం గుమాస్తా ఉద్యోగాలలో చూడవచ్చు.

వీరు తమ అదృష్ట సంఖ్య బలాన్ని వృద్ధి చేసుకుంటే, వీరి జీవితంలో అనూహ్యమైన మార్పులు వస్తాయి. ఇలాంటివారు 50 ఏండ్ల వయసులో కూడా తమ పేరు మార్చుకొని, ఈ గ్రంథంలో చెప్పినట్లు చేసి, గొప్ప ధనలాభం పొందటం మాత్రమే కాక ఎంతో మంది తమ చిన్న చిన్న ఉద్యోగాలు వదలి పెద్ద పెద్ద పరిశ్రమలలో చేరి అభివృద్ధి పొందుట జరిగింది, జరుగుతున్నది.

## శరీరం - వ్యాధి - ఆహారం - ఔషధం

సూర్యుడు హృదయం, వీపు, వెన్నెముకకు అధిపతి. గంభీరంగా కనపడే వీరు చాలామటుకు సామాన్యమైన ఎత్తుగలవారే అయి ఉంటారు. విశాలమైన ఛాతీ, వెడల్పాటి నుదురు, విశాలమైన కండ్లు కలిగిన వీరు చూపు విషయంలో పసివారిలా అమాయకంగా ఉంటారు. వీరి శరీరం రాటుదేలి ఉంటుంది. మెడ బలిష్టంగా ఉంటుంది. మాట్లాడేటప్పుడు వీరు మెడను తమాషాగా తిప్పుతారు. దేనినైనా శ్రద్ధగా గమనించే సమయంలో వీరి హావభావాలు చూసి తీరవలసిందే. అంత అందంగా ఉంటాయవి. వీరిలో స్త్రీలు సాధారణంగా తమ వయసుకు మించి కనపడేలా బాగా ఏపుగా ఎదుగుతారు.

ఈ సంఖ్య కలవారు కళ్ళజోడు ధరించటం సహజం. ముఖ్యంగా 10వ తేదీన పుట్టినవారిలో 100 మందికి 99మంది కళ్ళజోళ్ళతోనే కనిపిస్తారు. వీరు అందానికి ప్రాముఖ్యత ఇచ్చేవారు కనుక తరచుగా కళ్ళ అద్దాల ఫ్రేములు మారుస్తూ ఉంటారు. వీరిలో చాలామందికి చిన్నప్పుడే కంటిచూపుకు సంబంధించిన అనారోగ్యాలు ఉంటాయి. శరీర ఆరోగ్యం కొంచెం దెబ్బతిన్నా వీరు ఎండకు భయపడిపోతారు. ఎండలో పోవాలంటే తలకు టోపియో, తలపాగావో ధరించుట మంచిది. వీరిలో 40 ఏళ్లకు పైబడినవారిలో రక్త ప్రసరణకు సంబంధించిన వ్యాధులు కనిపిస్తాయి. వీరికి తరచుగా వచ్చే వ్యాధులు గుండెజబ్బు, రక్తపోటు మాత్రమే.

వీరు భోజనప్రియులైనా మితంగానే భుజిస్తారు. అంతేకాక, భోజన పదార్థాలను గురించి కూడా పరిశోధిస్తారు. జబ్బు చేయకుండా ఉండాలంటే వీరు ప్రతి ఉదయం ఒక స్పూను తేనెను నీటిలో నో, పాలలో నో కలిపి త్రాగుట మంచిది. ఉదయం తక్కువగా భోజనం తీసుకోవాలి.

వీరిలో పైత్య రసం తక్కువగా ఉండుట చేత ఆకలి లేకుండా భోజనం తీసుకుంటే సరిగా జీర్ణం కాదు. వీరు ఆహారంలో, స్నాన తైలంలో పొన్నగంటికూర చేర్చుకోవటం మంచిది. వీరు సామాన్యంగా ప్రకృతి వైద్యమునే నమ్ముతారు. డాక్టర్ల వద్దకు వెళ్ళుటకు ఇష్టపడరు.

## ప్రత్యేక గుణములు

1వ తేదీన పుట్టినవారికి ఇతరుల అభిప్రాయాలు వినే ఓపిక ఉండదు. పెద్ద గొంతుకతో వాటిని ఖండించి మాట్లాడతారు. మనసులో తోచిన అభిప్రాయాన్ని యథాతథంగా వెలిబుచ్చుతారు. నాజూకుగానో, మృదుమధురంగానో చెప్పే ప్రయత్నంచేయరు. వీరికి ఇతరులను అనుసరించి పోవటం చేతకాదు. అందరు తన ఇష్ట ప్రకారమే నడవాలని వీరు అనుకుంటారు. వీరిలో ఆత్మబలం ఎక్కువగా ఉంటుంది. వీరికి అన్నిటా ప్రగతి సాధించాలనే గట్టి పట్టుదల ఉంటుంది.

10-వ తేదీన జన్మించిన వారిలో నిదానం కనిపిస్తుంది. వీరు సౌమ్యులుగా, మెత్తగా ఉంటారు. తమ మనసులో తోచేవన్నీ మాటల్లో పెట్టరు. వీరు ప్రసిద్ధులు అవుతారు. వీరు తమ జీవితంలో స్నేహానికి, ప్రేమ అభిమానాలకు ఎక్కువగా విలువ ఇస్తారు. వీరు మంచి స్నేహపాత్రులు.

19-వ తారీకున పుట్టినవారు గట్టి మనోబలం కలిగి ఉంటారు. వీరు చూపులకు గంగిగోవు వలె ఉన్నా విషయం వస్తే గట్టివారుగా బయట పడతారు. వీరు తమ అభిప్రాయాలను ఎవరికోరకు మార్చుకోరు. వీరిలో కవితాశక్తి కూడా కనిపిస్తుంది.

28-వ తేదీన పుట్టినవారు అందంగా ఉంటారు. వీరు నవ్వుతూ మాట్లాడతారు. వీరిలో కొంచెం స్త్రీ లక్షణాలు కనిపిస్తాయి. వీరిపై సూర్య ఆధిక్యత తక్కువ. కాబట్టి సాధారణంగా వీరికి కళ్ళజోడు అవసరం రాదు. వీరు అందరినీ సులభంగా నమ్ముతారు. అలాగే మోసపోతారు.

## నామసంఖ్య ఒకటి

మీ పేరులోని అక్షరముల అంకెలను కూడితే వచ్చే అంకె 1 అయితే మీరు ఈ అంకె ఆధిపత్యంలోనికి వస్తారు. పుట్టిన తేది లేక తేది, మాసం, సంవత్సరం కలిపితే వచ్చే అంకె 1, 4 లేక 8 అయితే 1 అంకె వచ్చే పేరు పూర్తి ఫలితం ఇస్తుంది. వేరే అంకెల ఆధిక్యంలో పుట్టినవారు 1 వచ్చేలా పేరు మార్చుకుంటే వారు జీవితంలో అభివృద్ధి పొందినప్పటికీ, అనుకోని చిక్కులను ఎదుర్కొంటారు. మనసుకు నచ్చని జీవితం గడుపవలసి వస్తుంది. కాబట్టి అక్షరాల ద్వారా వచ్చే పేరు సంఖ్యలకు సరి అయిన అర్థం తెలుసుకొని చక్కని ఫలితములు సాధించవలసి ఉంటుంది.

10. ఇది యోగశాస్త్రాలలో పేర్కొనబడిన మూలాధారం నుండి కుండలిని శక్తి పైకి వ్యాపించుటా, సహస్రారము అందుకొని మరల మూలాధారమునకు తిరిగి చేరుటను సూచించేది. (పురాతన గ్రంథంలో కనపడే చక్రంపై పాము పటాన్ని సూచించేది ఇదే). ఈ సంఖ్య వచ్చే పేరు కలవారు నిజాయితీపరులుగా, కీర్తివంతులుగా ఉంటారు. జీవితంలో ముందుచూపు, ఆత్మస్థైర్యం కలిగినవారై ఉంటారు. వీరి జీవితంలో తరచు అదృష్టం మారుతూ ఉంటుంది. 1 అంకె ప్రక్కన 'O' (సున్నా) చేర్చుట వలన ఏర్పడే శకటయోగమే దీనికి కారణం. బండి చక్రం వలె వీరి అదృష్టం కూడా చక్ర భ్రమణంలా మళ్లీ మళ్లీ మారుతూ ఉంటుంది. వీరు సులభంగా పేరు ప్రఖ్యాతులు పొందగలరు. వీరు చేసే ప్రతి పనీ విజయవంతం అవుతుంది. కాబట్టి వీరు మంచి పనులనే చేయటం మంచిది. వీరికి సంతోషమయమైన జీవితం అమరుతుంది. వీరికి ఎన్నడూ డబ్బుకు ఇబ్బంది ఉండదు.

19. "త్రిలోక వశ్యం" అనే సంస్కృత గ్రంథంలో, "దేవలోక రాకుమారుడు" వంటి ప్రాచీన ఈజిప్టు గ్రంథాలలో పేర్కొనబడిన ఈ సంఖ్య ఉదయభానుణ్ణి సూచిస్తుంది. ఉదయభానుడు కనుక అస్తమయం లేదని దీని అర్థం. అంటే వీరి జీవితం వర్ధమాన సూర్యుని వలె ప్రకాశవంతంగా ఉంటుంది. వీరికి గొప్ప పదవి, సంఘంలో గౌరవం, నిత్య సంతోషం, సర్వకార్యాలలో జయం, ధనం అన్నీ సమకూరుతాయి.

ప్రణాళికాబద్ధంగా జీవితం గడిపే వీరు మంచి జీవిత భాగస్వాముల్ని ఎంచుకుంటారు. వీరిలో శక్తి సన్నగిల్లటం అనే మాటే లేదు. వృద్ధులు అయినాకూడా యువకుల వలె చలాకీగా, సంతోషంగా ఉంటారు. చివరి వరకు ఇలాగే యువకులుగానే ఉండటం వీరి ప్రత్యేకత. ఏ కారణం గానూ వీరు తమ నిశ్చితాభిప్రాయాలు మార్చుకోరు. వీరు మహా బుద్ధిమంతులు.

28 : జీవితం ప్రారంభంలో అభివృద్ధిని, సుఖాన్ని ఇచ్చే ఈ సంఖ్య పరస్పర వ్యతిరేక గుణములు కలిగినది. ఏ రంగంలో ప్రవేశించినా వీరికి పోటీలు, చిక్కులు ఉంటాయి. జీవితం మళ్ళీ మళ్ళీ మొదటికే వస్తుంది. ఈ సంఖ్యగల వారు అతి త్వరగా ప్రగతిని సాధిస్తారు. కాని ఆఖరుకు ఏమీ లేకుండా మిగులుతారు. (ఈ సంఖ్యకు గల ఈ ఫలితం నేను చెప్పినపుడు ఆర్మీలో నాతో పనిచేసిన స్నేహితులు Macarthurఉదాహరణంగా

చూపి, "నీ శాస్త్రం సరియైనదేనా?" అని అడిగేవారు. కానీ, MACARTHURని ప్రెసిడెంటు ట్రూమన్ హఠాత్తుగా ఉద్యోగం నుండి తీసివేయగానే వారి సందేహం తీరింది.) ఈ సంఖ్య పేరుగా కలవారికి బంధువుల వలన, స్నేహితుల వలన ఎదురుచూడని కష్టనష్టములు కలుగుతాయి. ఇచ్చిన అప్పులు తిరగివచ్చుట కూడా కష్టమే. చాలా **కష్టపడి సంపాదించుకున్న ఆస్తులు, వస్తువులు అనుకోని విధంగా పోగొట్టుకునే పరిస్థితి వస్తుంది.**

37: ఇది మంచి అదృష్టకరమైన సంఖ్య. ఇది సామాన్యులను కూడ మహోన్నత స్థితికి తీసుకునిపోతుంది. ఇది వశీకరణ శక్తి ఎక్కువగా ఉన్న సంఖ్య. ప్రేమలో విజయం తప్పక లభిస్తుంది. తనకంటే పైఅంతస్తు వారి అభిమానం, ఆదరణ వీరికి లభిస్తాయి. స్త్రీ, పురుష భేదం లేకుండా వీరికి అనేకమంది స్నేహితులుంటారు. ముఖ్యంగా స్త్రీలయితే పురుషులవల్లనూ, పురుషులయితే స్త్రీ లవల్లనూ చెప్పుకోదగ్గ ఉపకారాలు కలగుతాయి. వీరు స్నేహితులవల్ల అభివృద్ధి సాధిస్తారు. వ్యాపారంలో విశేష పెట్టుబడులతో అనుకోకుండా భాగస్వాములు వచ్చి కలుస్తారు. అనేక రకాల ప్రణాళికల ద్వారా ధనం చేరుతుంది. కళలందు ఆసక్తి, ప్రవేశం ఉంటుంది. వీరికి అన్ని విధాలా సౌకర్యవంతమైన సుఖజీవితం అమరుతుంది. అందరినీ ఆకట్టుకొనే రీతిలో వీరికి వేషభాషలు, వాక్చాతుర్యం ఉంటాయి. వీరికి అనుకోని విజయాలను అందించే ఈ సంఖ్య నిజంగా గొప్పదే!

(సూచన : మంచి దశలో ఉన్న వారికి ఈ సంఖ్యగల పేరున్నచో అది వారిని అనవసరపు వ్యవహారాలలో ఇరికించి గొడవలకు దారి తీస్తుంది. సామాన్యులకు మేలు చేసే ఈ సంఖ్యవారు ఉన్నతస్థితికి చేరిన తరువాత దానితో తృప్తి చెందాలి. అంతే తప్ప, దురాశకు పోకూడదు. అలా చేస్తే ఆ దురాశ కారణంగానే ఈ సంఖ్య బలం తగ్గి, పరిణామాలు నష్టానికి దారి తీస్తాయి. దీని ద్వారా లభించవలసిన మంచి ఫలితాలు లభించవు. కాబట్టి వీరు దురాశను వీడితే సత్ఫలితాలు వాటంతట అవే వస్తాయి.)

46. ఈ సంఖ్యగలవారిని 'ధరించిన కిరీటం క్రింది ఫాలభాగం' కలిగినవారని ప్రాచీన శాస్త్రాలలో వర్ణించబడి ఉంది. వీరికి వివేకం, పరిజ్ఞానం, బుద్ధికుశలత తగిన రీతిలో ఉంటాయి. వాటి ద్వారా వీరికి గొప్ప గౌరవం లభిస్తుంది. ఏ వృత్తిలోకి దిగినా వీరు శిఖరాగ్రాన్ని అందుకుంటారు. ఈ సంఖ్య సామాన్య కుటుంబంలో పుట్టినవారిని కూడా

రాజ్యాలు ఏలే అంతస్థుకి చేరుస్తుంది. వయసుతో పాటు వీరికి సంపద, అంతస్తు పెరుగుతాయి. ఈ సంఖ్య కారణంగా వీరు తప్పనిసరిగా నిజాయితీ పరులుగా ఉండుట ముఖ్యం.

55 : ఈ సంఖ్య సృష్టి, సంహారాలకు ఒకే శక్తి కావలెనని స్పష్టం చేస్తుంది. మంత్రశాస్త్రాలలో శతృజయానికి తగినదని దీన్ని పేర్కొన్నారు. గ్రీకువీరులు యుద్ధభూమికి బయలుదేరునపుడు ఒక రేకుపై 55ని రాసి మెడలో ధరించేవారట. ఈ సంఖ్య మనోబలం, సునిశితబుద్ధికి నిలయం. ఈ సంఖ్యగలవారు అందరినీ తమ బుద్ధిచాతుర్యంతో గెలిచి, విజయం సాధిస్తారు. మహాజ్ఞాని అని అందరిచే మెప్పు పొందుతారు. మేధావులైతే వీరి తెలివి మెరుపులా ప్రకాశిస్తుంది. తగు పద్ధతిలో ఉపయోగించకపోతే వీరి తెలివి వీరికే కీడు కలిగించవచ్చు. వీరికి అఖండమైన తెలివి ఉంటుంది. (అలాగే ఈ సంఖ్య జననేంద్రియములకు సంబంధించిన వ్యాధులను గుణపరిచే అద్భుత శక్తిని కలిగి ఉంటుంది.)

64: ఈ సంఖ్య వలన స్నేహితులు మరియు విరోధులు సమంగా ఉంటారు. జీవితంలో వ్యతిరేకత ఎక్కువగా ఉంటుంది. అమిత మనో బలం, సమర్థత, బుద్ధికుశలత ప్రసాదిస్తుంది. గొప్ప గొప్ప పనులు సాధించే శక్తినిచ్చి కీర్తి కలిగిస్తుంది. ప్రభుత్వంలో ఉన్నత పదవి ఇస్తుంది. వీరి మాటకు ఎల్లప్పుడూ గొప్ప విలువ ఉంటుంది.

73: ఈ సంఖ్య మనోశక్తిని పెంచుతుంది. ఈ సంఖ్య ద్వారా వీరికి అంచెలంచెలుగా కీర్తిసంపదలు మరియు అధికారం పెరుగుతాయి. వీరికి సుఖజీవితమే లక్ష్యం. ఇతరులకు తెలియకుండా రహస్యంగా కార్యాలు సాధించే సమర్థత వీరిలో ఉంటుంది. వీరికి ప్రభుత్వ సహాయం లభిస్తుంది. వీరికి సకల భోగభాగ్యములు లభిస్తాయి. అయితే నిజాయితీ లేకపోతే వీరికి కీర్తి స్థానంలో అపకీర్తి కలగవచ్చు. దైవభక్తి, మనో స్వచ్ఛత ఉంటే వీరిలో సదా మంచి ఆలోచనలు కలుగుతాయి. ఆ కారణంగా, వీరు శాంతియుతమైన జీవితం గడుపుతారు.

82 : ఇది ఒక మహాశక్తి కలిగిన సంఖ్య. సామాన్యులను కూడా చక్రవర్తులుగా మార్చగలిగినది. ఈ సంఖ్యవారు నిరంతర కృషి మరియు చక్కని బాధ్యతా నిర్వహణతో

మహావైభవంగా జీవితం గడుపుతారు. సిరిసంపదలతో తులతూగుతూ వీరు మహోన్నత స్థితికి చేరుతారు. శాస్త్రాలలో వీరు మేలు గుఱ్ఱములకు అధిపతి అని రాయబడింది. అంటే నేటి కాలంలో ఖరీదైన కార్లు కొనే భాగ్యం లభించవచ్చు. వీరికి మహోన్నతమైన కీర్తి ప్రతిష్టలు లభిస్తాయి. ఐతే, ప్రేమ వ్యవహారాలలో వీరికి అనవసరపు చిక్కులు ఎదురుకావచ్చు. వీరికి పట్టుదల ఎక్కువ. వీరి కళ్ళలో అమోఘమైన ఆకర్షణాశక్తి ఉంటుంది. ఈ సంఖ్య అర్థం గ్రహిస్తే జలస్తంభనం వంటి సిద్ధులు సిద్ధిస్తాయని శాస్త్రాలలో పేర్కొనబడింది.

91 : ఈ సంఖ్య వైరాగ్యం, సంచారం కలిగిస్తుంది. అనేక యాత్రలు చేస్తారు. గుణాలలో తీవ్రత ఉంటుంది. ఓడలు, పడవల ద్వారా చేసే వ్యాపారాల ద్వారా సంపద కలుగుతుంది. ప్రాణాయామం వంటి వ్యాయామాలు చేసి సుఖజీవితం గడుపుతారు.

100 : సర్వ ప్రయత్నాలలో విజయం కలిగించే ఈ సంఖ్య వలన జీవితంలో సదవకాశాలు ఎక్కువగా లభిస్తాయి. ధన సంపాదన ఎక్కువ. ఎలాంటి ఒడిదుడుకులు లేని సుఖమయ జీవితం చిరకాలం ఉంటుంది.

## అదృష్ట కాలం

పైన పేర్కొన్న విధంగా పేరులోని అక్షరాల కూడిక వల్లనో లేక పుట్టిన తేది 1 అయినవారికి ప్రతినెలలో 1,10,19,28 తేదీలు అదృష్టం కలిగిస్తాయి. ఈ తేదీలలో సంతోషాన్ని కలిగించే సంఘటనలు జరుగుతాయి. వశీకరణశక్తి పెరుగుతుంది. దీనితో వీరు తమ పనులను నిర్విఘ్నంగా సాధించుకోగలరు. పైన చెప్పిన తేదీలలో ముఖ్యమైన పనులు చేయుట అలవాటు చేసుకుంటే, అపూర్వ ఫలితాలు శీఘ్రంగా పొందగలుగుతారు. వీటిలో 28 మాత్రం దీర్ఘకాలం నిలచే ఫలితాలు ఇవ్వలేదు. (28వ తేదీన ఉద్యోగం దొరికితే అది నిలవదు. త్వరలోనే మరొక ఉద్యోగానికి దరఖాస్తు పెట్టవలసినదే.)

ఇవిగాక తేదీ, నెల, సంవత్సరం ఈ మూడింటిని కూడితే 1 వచ్చే దినాలలో చేసే కార్యాలు తప్పక మంచి ఫలితాలనే ఇస్తాయి.

## ముఖ్యమైన తేదీలు

వీరికి 4, 13, 22, 31 తేదీలలో అనేక ముఖ్యమైన పనులు జరుగుతాయి. ఈ తేదీల స్వభావం ఎదురుచూడని మార్పులు అందించటమే. **అప్రయత్నంగానే ఎంతో మేలు జరుగుతుంది**. అయితే వీరు ఈ తేదీలలో ఏ పనినీ తమకు తాముగా మొదలుపెట్టకూడదు.

## దురదృష్టకరమైన తేదీలు

ప్రతినెలలోను 8, 17, 26 తేదీలు వీరికి దురదృష్టకరమైనవి. ఇవి వీరికి వ్యర్థ ప్రయాస, మనస్తాపం, కష్టం, ఓటమి కలిగిస్తాయి. వీరు ఈ తేదీలలో ఏ పని ప్రారంభించినా కష్టముల పాలుకావటం తప్పదు. కాబట్టి వీరు ఈ తేదీలలో జాగ్రత్త పడాలి. అలాగే ఈ తేదీలలో ప్రయాణం చేస్తే ఆరోగ్యభంగం అని గుర్తుంచుకోవాలి. అంతేకాక, కార్యభంగం కూడా కలుగుతుంది.

ఈ మూడు తేదీలలో ఎక్కువ కీడు కలిగించేది 26వ తేది. అటు పిమ్మట 8వ తేదీ; 17వ తేది అయినా ఇవి అంతగా కీడు చేయవు. ఈ తేదీలలో ఏదయినా మంచి పని జరిగి, సంతోషంగా ఉన్నట్లు మీకు అనిపిస్తే త్వరలోనే మీకు దురదృష్టం కలగవచ్చు. వసంతానికి ముందు శిశిరం రావటం ఎంత స్వాభావికమో, 1 సంఖ్యవారు పై తేదీలలో అంటే 8.17,26 తేదీలలో శక్తిహీనులుకావటం జరుగుతుంది. అంతా ప్రకృతి సిద్ధంగా. రాత్రులలో నిద్రించుటవలన మర్నాడు శ్రమించటానికి శక్తి లభించినట్లే ఇది రాబోవు అదృష్టకాలమునకు సూచిక అని భావించవచ్చు. కాబట్టి ఈ తేదీలలో ప్రయత్నం చేయుట మానాలి. ఈ సమయంలో ఏదైనా ముఖ్య కార్యం మొదలు పెడితే, అది అపజయం కలగవచ్చు, లేదా చాలా కాలం వరకు కొనసాగి చివరికి నిష్ప్రయోజనం కావచ్చు. కాబట్టి సుఖ సంతోషాలతో జీవించదలచినవారు ఇది గుర్తుపెట్టుకుని ఆ ప్రయత్నాలు మానుట మంచిది.

అలాగే దినం, మాసం, సంవత్సరం ఈ మూడింటిని కూడితే 8 వచ్చే రోజుల్లో చేసే ప్రయత్నాలు నిశ్చయంగా మంచి ఫలితాలు ఇవ్వవు.

## వృత్తులు

అన్ని ప్రభుత్వ రంగాలలోనివారికి జయకరంగా ఉంటుంది. కరుణ, దయ, చక్కగా

మాట్లాడుటలో సమర్ధులగుటచే మత సంబంధ కార్యాలలో ఆసక్తి ఉంటుంది. అర్థత, శ్రమ, నిజాయితీకి విలువనిస్తే వీరు అన్ని రంగాలలో పైకి వస్తారు. సూక్ష్మ గ్రాహులు కావటంచేత వీరు చూపులతోనే వ్యాధులను పసికట్టగలరు. కాబట్టి వైద్య వృత్తి వీరికి తగినది. పుట్టిన తేది, నెల, సంవత్సరం కలిపితే వచ్చే సంఖ్య 9 అయితే వీరు శస్త్ర చికిత్సా నిపుణులు కాగలరు. I.A.S., I.P.S., I.K.S. రంగాలలో కూడా బాగా రాణిస్తారు. వీరు ప్రకృతి ఆరాధకులు కాబట్టి భావుకులు అయి ఉండటంచేత కవులుగా కూడా కావచ్చు. వీరు నిజాయితీపరులు కనుక అన్నిటికీ తలవంచి పోలేరు. కష్టనష్టాలకు కలవరం చెందుతారు. వ్యాపారంలో సందర్భానుసారం ప్రణాళికలను మార్చవలసి వస్తుంది. అది వీరికి చేతకాదు. కాబట్టి వ్యాపారం వీరికి పనికిరాదు. రచయితలుగా పేరు పొందగలరు. వీరు నచ్చిన శిల్ప, చిత్ర, సంగీత, జ్యోతిష, యోగ కళలో దేనినైనా వృత్తిగా చేపట్టవచ్చు. భాగస్వాములుగా 1, 3, 4, 5 సంఖ్యలవారిని జతచేసికొని 2, 7, 8 సంఖ్యలవారిని తమ వృత్తిలో చేర్చుకొనకుండా జాగ్రత్తపడితే బాగుంటుంది. అలా చేయకపోతే నష్టపోవటమేకాక, వ్యాపారమే మూతపడే పరిస్థితి వస్తుంది.

## సహకరించే వ్యక్తులు

1, 10, 19, 28 తేదీలలో జన్మించినవారికి 1 సంఖ్యవారు సామాన్యంగా సహాయం చేస్తారు. 4 సంఖ్య వారు జీవితాన్ని సంస్కరించే సహాయాలు మరియు 8 సంఖ్య వారు చాలాకాలం కొనసాగే నిరంతర సహాయం చేస్తారు. 2,7 సంఖ్యలవారు తాత్కాలిక సహాయం చేస్తారు. అయితే వీరి సహాయం హఠాత్తుగా ఆగిపోవచ్చు.

## కుటుంబ జీవితం

ప్రేమలేని జీవితం వాసనలేని పూవు అని వీరి అభిప్రాయం. కాబట్టి యుక్తవయసులో ప్రేమలో పడతారు. అందం వైపు ఆకర్షింపబడుటచే అందమైనవారినే వివాహం చేసుకుంటారు. వీరిలో 19వ తేదీన జన్మించినవారిలో పలువురు అందమైనవారిని ప్రేమించి, ఎందరు అడ్డు చెప్పినా వినక, వివాహం చేసికొని సుఖంగా జీవిస్తారు.

28వ తేదివారు ప్రేమించినా వీరిలో మనోబలం తక్కువగా ఉండుటవలన, ఇతరులు

వీరి ప్రేమకు అడ్డు తగులుతారు. ఇన్ని ఆశలు ఉన్నా 1వ సంఖ్య గల వీరికి అందమైన తృప్తికరమయిన జీవిత భాగస్వాములు దొరకుట కష్టమే. చాలామందికి సంసార జీవితంలో చిక్కులు ఏర్పడతాయి. గ్రహ ప్రభావం బాగుంటే వీరి మనసుకు నచ్చినట్లే సర్దుకుపోయే గుణాలున్న వారే వీరితో జీవితం పంచుకుంటారు. పట్టుదల తగ్గించుకుంటే వీరికి వివాహ జీవితం సుఖమయంగా ఉంటుంది.

## వివాహ సంబంధాలు

1 వ సంఖ్య వారు ఒకరికి అణగి ఉండే స్వభావంవారు కారు. కాబట్టి వీరు 1వ సంఖ్యలో పుట్టినవారిని వివాహమాడరాదు. పట్టుదలలు వీరి జీవితాన్ని ఎంతో మనస్తాపాన్ని గురిచేస్తాయి. వీరు 2,4,5 తేదీలలో పుట్టిన వారిని వివాహమాడవచ్చు. 8 తేదీలవారిని కూడా వివాహం చేసుకోవచ్చు.

పుట్టిన తేది, నెల, సంవత్సరం కలిపితే వచ్చే సంఖ్యల తేదీలలో పుట్టినవారినీ వివాహమాడవచ్చు. 1 వ తేదీన పుట్టినవారికి 4,8 సంఖ్యలలో పుట్టినవారు అణిగిమణిగి ఉంటారు. 1, 4 సంఖ్యలు అయస్కాంతం, ఇనుము వంటివి. 1 అయస్కాంతం, 4 ఇనుము. వీరి మధ్య మంచి అన్యోన్య దాంపత్యం ఉంటుంది.

8వ తేదీన పుట్టినవారిని వివాహం ఆడితే సుఖసౌఖ్యాలు కలుగు తాయి. ఎందుకంటే 8 సంఖ్యవారు 1 సంఖ్య వారిని మనస్ఫూర్తిగా ప్రేమించి ఆరాధిస్తారు. వారు చెప్పినదంతా చేస్తూ వారిని తృప్తి పరచటమే వీరి లక్ష్యం. 1 సంఖ్యవారు 8 సంఖ్యవారిని ఆదరంగా చూసుకుంటారు. చెట్టుని అల్లుకొనే తీగవలె 8వారు 1 వారితో సుఖ జీవితం కొనసాగిస్తారు. 8 దురదృష్టకరమైన సంఖ్యే అయినా వివాహం అదృష్టకరమైన తేదీలో జరిగితే ఎలాంటి కష్టాలు ఉండవు. సామాన్యంగా 1 సూర్యుని సంఖ్య కావటంచేత వీరి వివాహ జీవితంలో సమస్యలు సహజమే. సూర్యుని వేడిని తాళలేక అతని భార్య అతనికి దూరంగా భూమికి తొలగి వచ్చింది అని కథగా చెప్పాలంటే ఇది పెద్ద కథగా మారుతుంది. భార్యను కోల్పోవుట లేదా స్త్రీ అయితే భర్తను కోల్పోవుట జరుగుతుంది. కాని అదికూడా ముహూర్త బలం పైనే ఆధారపడి ఉంటుంది. అదృష్టకరమైన ముహూర్తంలో వివాహం అయితే ఎలాంటి అవాంఛనీయ దుష్పరిణామాలు కలగవు. దురదృష్టకరమైన ముహూర్తమైతే మాత్రం దీని పరిణామం వెంటనే కనిపిస్తుంది.

1 సంఖ్య వారికి సంతాన భాగ్యం ఉంటుంది. వీరు అన్ని విధాల సుఖసౌఖ్యాలు అనుభవిస్తారు. సూర్యుని ప్రభావం మరీ ఎక్కువగా ఉంటే అది వీరి జీవిత భాగస్వాముల(భార్య లేదా భర్త)పై విపరీత పరిణామం చూపిస్తుంది. (సూర్యునికి ప్రకాశం మాత్రమే ఉంది. కాని చల్లదనం ఇచ్చే శక్తి లేదు. అందుకే సూర్యుని ప్రభావం ఎక్కువగా ఉన్నవారు చాలామంది భార్యలను లేదా భర్తలను పోగొట్టుకొనుట లేదా బ్రహ్మచారులుగా ఉండిపోవుట వంటివి జరుగుతాయి అని గమనించాలి).

1 సంఖ్యవారు 3, 5, 6 సంఖ్యలవారిని వివాహం చేసుకుంటే సుఖంగా ఉంటారు. కళత్ర నష్టం జరుగదు. సుఖంగా ఉన్నా వీరు పూర్తిగా మనసులు కలిసిన అన్యోన్య దంపతులు కాలేకపోవచ్చు.

1, 4, 8 సంఖ్యల వారే ఒకరి నొకరు ప్రేమించగలరు. గడచిన 40 ఏండ్లుగా వేలాది ప్రేమికులను చూసాను. వారి సంఖ్యలను గమనించగా తెలిసిన సత్యమిది. ప్రేమ ఆకర్షణపై ఆధారపడినది. ఎవరికైనా తన వంటి వారిని, తనకు తగినవారిని చూస్తేనే ప్రేమ కలుగుతుంది. కథలలో ప్రేమికులను సౌందర్యవంతులుగా వర్ణించెదరు. అది కథలవరకే. నిజ జీవితంలో అందంగా లేనివారే ఎక్కువగా ప్రేమలో పడుట జరుగు తున్నది. అందుకే అందం వేరు, ఆకర్షణ వేరు అని గ్రహించాలి. .

క్రింది పట్టికలో సుఖమయ వివాహజీవితం కొరకు వివాహ ముహూర్తములు (తేదీలు) ఎట్లు నిర్ణయించవలెనో చూపబడినది.

| **1 సంఖ్య కలిగిన వధువు లేదా వరుడు** | **జీవిత భాగస్వామి సంఖ్య** | **పెండ్లి తేది మరియు తేది, నెల, సంవత్సరం కూడిన పూర్ణసంఖ్య** |
|---|---|---|
| | | |

| (సూచన : 1వ సంఖ్య కలిగిన వారికి 1, 7, 9 సంఖ్యలవారు దురదృష్ట కరమైన జీవిత భాగస్వాములు అని గుర్తించాలి.) | 2 | 2&1, 3&1, 4&1, 1&1 |
|---|---|---|
| | 3 | 3&1, 2&1, 1&1 |
| | 4 | 4&1, 2&1, 6&1, 1&1 |
| | 5 | 1&1, 3&1, 6&1 |
| | 6 | 6&1, 4&1, 1&6, 1&1 |
| | 8 | 1&1, 6&1, 1&6 |

## దుస్తులు - రంగులు

1 సంఖ్య వారికి మంగళకరమైనది, దైవ కృప కలిగించేది అయిన పసుపు రంగే శ్రేష్ఠమైనది. పీతాంబరాలు అంటే పసుపు రంగు దుస్తులు ధరిస్తే అందం రెట్టింపవుతుంది. ఈ రంగు వీరికి జయం కలిగిస్తుంది. తెలుపు కలిసిన లేత పసుపుపచ్చ రంగు నుండి, ముదురు పసుపు రంగు వరకు అన్నీ వీరికి అదృష్టకరమైన రంగులే. లేత ఎరుపు, లేత

నీలం కూడా మంచివే. అయితే నలుపు, వక్క రంగు దురదృష్టకరమైన రంగులని వీరు గుర్తించాలి. తాము ధరించే వస్త్రాల అంచులకు కూడ ఈ రంగు వాడకుండా జాగ్రత్త తీసుకోవటం మంచిది.

## లోహాలు - వాటి ఉపయోగములు

లోహాలలో వీరికి బంగారమే మంచిది. కాబట్టి ఇతర లోహములకు బదులు వీరి శరీరమునకు మేలు చేయు లోహం బంగారం మాత్రమే అన్న విషయాన్ని మర్చిపోకూడదు.

## రత్నాలు - వాటి ఉపయోగములు

మాణిక్యం వీరి అదృష్టమును పెంపు జేయును. టోపాజ్ రాళ్ళు, కనకపుష్యరాగం శరీర సుఖాన్ని, జయాన్ని కలుగజేయును. పిల్లలకు టోపాజ్ ధరింపజేసిన ఎముకలు బలపడి చక్కగా పెరుగును. పెద్దవారు మాణిక్యం లేదా కనకపుష్యరాగం ధరించవచ్చు.

## ఒకటి సూచించే ఆంగ్ల అక్షరాలు మరియు వాటి గుణాలు - ఫలితాలు

A - ఇది జీవశక్తిని, అన్నిటా నిండియున్న పరమాత్ముని శక్తిని చక్కగా సూచించును. (ప్రాచీన గ్రంథాలలో ఆచార్య, ఆజానుబాహు మొదలయిన శబ్దములతో దీని ఫలితాలను వివరించుట జరిగినది.) ఈ అక్షరమునకు అద్భుతమైన శక్తి ఉంది. ఇది మేలైన స్థితికి చేరుస్తుంది. అంతేకాక, అచ్చటి నుండి జారిపడకుండా కూడా కాపాడుతుంది. ఇతరులకు మేలు చేయుట తప్ప కీడు చేయు ఆలోచనే రానివ్వనిది. పేరులో ఇది మొదటి అక్షరంగా ఉంటే, మహా అభిమానవంతులుగా ఉంటారు. ధారాళమైన స్వభావం ఉంటుంది. మనసులో ఎప్పుడూ కొత్త ఆలోచనలు కలుగుతాయి. నిర్వహణ శక్తి అధికంగా ఉంటుంది. గుణవంతులైనా, దుర్గుణవంతులైనా వీరు మహా మేధాశక్తి గలవారు. ఈ అక్షరం రంగు లేత పసుపు రంగు.

I- ఈ అక్షరం అవిరామ కృషి, ఏకాగ్రత, మనసులో తోచిన తలపులను చక్కటి భావాలలో వ్యక్తీకరించుట, నిర్మాణశక్తి, జనాకర్షణ శక్తి మున్నగువానిని సూచించును. పేరు మొదట్లో ఈ అక్షరమున్నచో హఠాత్తుగా తోచు ఆలోచనలు వీరిని ఆకట్టుకుంటాయి. గడ్డు సమస్యలు ఏర్పడినా పనిచేయు శక్తి కూడా ఏర్పడుతుంది.

కొన్ని వేళలలో శాంతి ఉండదు. (మానసిక వికాసం లేని వ్యక్తులు డబ్బు వడ్డీలకు తిప్పుతూ జీవితమంతా సుఖంగా, వ్యర్థంగా గడుపుతారు. వీరికి ధన సేకరణే జీవిత లక్ష్యం. పేరులో చివరి అక్షరంగా ఇది వచ్చిన వారికి ఈ ఫలితం చక్కగా సరిపోతుంది.) ఈ అక్షరం పేరులో ఒకసారి కంటే ఎక్కువ రావటం జరిగితే నరములు, కండరములకు సంబంధించిన వ్యాధులు రావచ్చును. ఈ అక్షరానికి రంగు ప్రకాశవంతమైన నీలం.

J - రెండు ధ్వనులను ఇచ్చే ఈ అక్షరం ద్వంద్వ స్వభావమును సూచిస్తుంది. వీరిలో స్త్రీ పురుష గుణములు రెండూ కలసి ఉంటాయి. వీరు తీవ్రవాదులుగా ఉన్నా వీరి మనసు ప్రేమతో నిండి ఉంటుంది. వీరు స్త్రీ పురుష ఇరు దృష్టి కోణముల నుండి సమస్యలను పరిశోధిస్తారు. తాము పురుషులైతే, స్త్రీ లు ఒక విషయం గురించి ఏవిధంగా ఆలోచిస్తారో ఖచ్చితంగా చెప్పగలరు. వీరిలో నిర్వహణ శక్తి అధికం. మిక్కుటమైన ఆత్మస్థైర్యం, ఉత్సాహం, సృజనాత్మకమైన కార్యాలలో ఆసక్తి కలవారు. ఇతరులు ఇచ్చు సలహాలు పాటించరు. అంతా తమకే తెలుసునని వీరు అనుకుంటారు. ఇతరుల, పరిస్థితుల మూలంగా తమ పురోభివృద్ధికి ఆటంకం కలుగుతుందని భావిస్తారు. పొగడ్తలు పదవులు ఆశిస్తారు. స్త్రీ పురుషులు ఇరువురి నుండి పూర్తి స్నేహం అభిలషిస్తారు.

వీరి స్నేహంలో ఎలాంటి దురాలోచన ఉండదు. ఇతరులు తమను అనుసరించాలని వీరు సదా కోరుకుంటారు. వీరిలో కొందరు సాహస వంతులైన నాయకులు, ఉన్నత లక్ష్యం కోసం అనేక కష్టాలకు తమంతట తామే ఎదురు వెళ్ళే సాహసికులు అయిఉంటారు. దీని రంగు పసుపు.

(ఈ అక్షరంతో మొదలయ్యే పేరు రచయితలకు, స్త్రీ పురుషులు ఉపయోగించే వస్తువులు అమ్మే వ్యాపారులకు, కళాకారులకు తగినది.)

Q- ఈ అక్షరానికి పైకి తీసుకుపోయి ఔన్నత్యానికి తీసుకెళ్ళే గుణం ఉంది. తనతో చేరు అక్షరాలకు దైవికశక్తిని ఇస్తుంది. మంచి ఫలములనిచ్చు అక్షరములతో కలవనిచో సందేహం, కలవరం సూచిస్తుంది. దీని రంగు ఎఱుపు, నీలం కలసినది. (సామాన్యంగా ఈ అక్షరం మన దేశం పేర్లలో కనిపించటం చాలా అరదు)

Y - మృదు స్వభావం, పరులపై ఆధారపడుటకు ఇష్టపడుట, స్త్రీ లవలె కఠినత్వం తక్కువగా ఉండుట, పెద్దమనిషి తరహాగా మసులు స్వభావం కలిగి ఉండుట అనేవి ఈ అక్షరం సహజ గుణాలు. ఇది ఎఱుపు కలసిన పసుపు రంగు కలిగినది.

| పేరు | జన్మతేది సంఖ్య | తేది-విధి సంఖ్యలు |
|---|---|---|
| AISHWARYA RAI<br>ఐశ్వర్యా రాయ్ | 1-11-1973 | 1 & 5 |
| ANNIE BESANT<br>ఆనీ బేసెంట్ | 1-10-1847 | 1 & 4 |
| BHIMSEN SACHAR<br>భీమ్సేన్ సచార | 1-12-1893 | 1 & 7 |
| DR. B.C. ROY<br>డా. బి.సి.రాయ్ | 1-7-1882 | 1 & 9 |
| DIANA<br>డయానా (వేల్స్ దేశ రాజకుమారి) | 1-7-1961 | 1 & 7 |
| G.M.C. BALAYOGI<br>జి.ఎమ్.సి. బాలయోగి (లోక్ సభ స్పీకరు, విమాన ప్రమాదములో మరణించినవారు.) | 1-10-1951 | 1 & 9 |

| | | |
|---|---|---|
| LIAQUATALIKHAN<br>లియాఖత్ అలీఖాన్ (16వ తేదీన కాల్చి చంపబడిన పాకిస్తాన్ మాజీ ప్రధాని) | 1-1-1895 | 1 & 7 |
| MARTIN LUTHER<br>మార్టిన్ లూథర్ (ప్రొటెస్టెంట్ మతాన్ని బహుశ్రమతో స్థాపించినవారు) | 10-11-1483 | 1 & 1 |
| LENIN<br>లెనిన్ | 10-4-1870 | 1 & 3 |
| PANDIT GOVIND BALLABH PANT<br>పండిట్ గోవింద్ బల్లబ్ పంత్ | 10-9-1887 | 1 & 7 |
| SIR BENEGAL RAMA RAU<br>సర్ బెనెగల్ రామారావు | 10-1-1889 | 1 & 1 |
| HAROLD MACMILLAN<br>హెరాల్డు మాక్ మిల్లన్ | 10-2-1894 | 1 & 7 |
| V.V. GIRI<br>వి.వి. గిరి | 10-8-1894 | 1 & 4 |
| P.V. RAJAMANNAR | 10-5- | 1 & 8 |

| | | |
|---|---|---|
| పి.వి. రాజమన్నారు | 1901 | |
| JAIPRAKASH NARAIN<br>జయప్రకాష్ నారాయణ్ | 10-10-1902 | 1 & 5 |
| R.K. NEHRU<br>ఆర్.కె.నెహ్రూ | 10-10-1902 | 1 & 5 |
| S. NIJALINGAPPA<br>ఎస్. నిజలింగప్ప | 10-12-1902 | 1 & 7 |
| JAMES WATT<br>జేమ్స్ వాట్ (నీటి ఆవిరి శక్తితో నడచు ఇంజన్ను కనుగొన్న వారు.) | 19-1-1736 | 1 & 1 |
| DR. GETULIO VARGAS<br>డా. గేతులియా వార్గస్ (బ్రెజిల్ దేశపు ప్రెసిడెంటు పదవిని ప్రాణముండగా వదలనని 24-8-54లో కాల్చుకుని మరణించిన) | 19-4-1883 | 1 & 7 |
| DR. U.V. SAMINATHA IYER<br>డా. యు.వి. సామినాధ అయ్యర్ | 19-2-1885 | 1 & 7 |
| JAVIER PEREZ DE CULLUR<br>జేవియర్ పెరెజ్ డి కుయర్ (UN సెక్రటరీ జనరల్) | 19-01-1903 | 1 & 5 |

| | | |
|---|---|---|
| KHWAJA NAZIMUDDIN<br>ఖ్వాజా నజీముద్దీన్ | 19-7-1894 | 1 & 3 |
| MAHOMAD ALI<br>మహమద్ ఆలీ | 19-10-1906 | 1 & 9 |
| WILLIAM J. CLINTON<br>విలియం జె. క్లింటన్. (అమెరికా సంయుక్త రాష్ట్ర మాజీ ప్రెసిడెంట్) | 19-8-1946 | 1 & 2 |
| BILL GATES<br>బిల్గేట్స్ (ప్రపంచ కోటీశ్వరుల జాబితాలో నెం.1 కంప్యూటర్ రంగంలో కూడ నెం.1) | 28-10-1955 | 1 & 4 |
| P.V. NARASIMHA RAO<br>పి.వి. నరసింహారావు | 28-6-1921 | 1 & 2 |
| N.T. RAMARAO<br>ఎన్.టి.రామారావు (ప్రసిద్ధ నటులు, మాజీ ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి) | 28-5-1926 | 1 & 6 |

# అంకె 2- చంద్రుడు

సృష్టిలో ఏకంగా ఉన్నది చలనముచే రెండుగా మారింది. ఇలా చలనం కారణంగా ఏర్పడినందున ఇది జలతత్వం అయింది. దీని నుండి పుట్టినది మనస్సు. ఇది చంద్రునిచే పాలింపబడుచున్నది. ప్రతినెలలోని 2, 11, 20, 29 తేదీలలో పుట్టినవారు మరియు విధి సంఖ్య 2గా గలవారు ఈ సంఖ్య ఆధిపత్యంలోనికి వస్తారు. చంద్రుడు అధిపతిగా ఉండుటచే ఈ సంఖ్య వారిని గూర్చి జనులు ఎల్లవేళల మాటలాడుతూనే ఉంటారు. మిక్కిలి ప్రసిద్ధి పొందినవారు, మిక్కిలి దుష్టులుగా పేరు తెచ్చుకున్న వారు కూడా వీరే.

తీవ్ర మనోభావములయిన భావుకత్వం, కల్పన, సందేహం, పరిశోధన మున్నగునవి వీరియందు కనబడుతాయి. వీరిలో పలువురు మనోశక్తిని పెంపొందించుకొని, అసాధ్యములని పేరుబడిన కార్యములను సాధించేవారు అవుతారు. ఈ సంఖ్యలో జన్మించినవారికి కల్ప నాశక్తియే జీవనాడి. కంటిముందు ప్రత్యక్షంగా కనిపించేవాటి కన్నా కల్పనలే వీరిని ఎక్కువగా ఆకర్షించును. సదా ఆలోచనలలో మునిగి తేలుచుందురు. భవిష్యత్తును గురించి బంగారు కలలో, భయంకరమైన సంఘటనలో ఏదో ఒకటి వీరి ఆలోచనలను ఆక్రమించుకొని ఉంటాయి. వీరికి కొత్త యుక్తులు, నూతన తలపులు తోచును. స్వాభావికముగనే వీరికి దృఢమైన మనో బలం ఉండదు. దైవభక్తియో, గురుభక్తియో, స్వశక్తిపై నమ్మికయో ఏర్పడినచో అది గొప్ప జీవితానికి పునాది అవుతుంది. దృఢమైన నమ్మిక ఏర్పడాలే గాని, అది ఏర్పడిన వెంటనే వీరు అసాధ్యమైన కార్యాలు కూడా అవలీలగా పూర్తిచేయగలరు. దైవనమ్మికతో గాంధీ మహాత్ముడు, స్వశక్తిపై నమ్మికతో హిట్లరు గత శతాబ్దిలోని ప్రసిద్ధ పురుషులు కావటం జరిగింది. దైవ నమ్మకంతో, తాను సరియయిన త్రోవనే పోవుచున్నాను అన్న నమ్మకంతో వీరు అన్ని విషయాలలో విజయం పొందగలరు.

దైవంవంటి దృఢమైన, మార్పులేని తత్వములలో ఒకదానిపై గురి కుదిరితే గాని వీరికి తమపై లేదా తమ స్వశక్తిపై **నమ్మకం** ఏర్పడదు. చంద్రునికి స్వయం ప్రకాశం లేనట్లే వీరికి కూడ తనపై కాక వేరే ఏదయినా విషయంపై ఆధారపడనిచో బుద్ధి

ప్రకాశవంతంగా ఉండదు, జీవితంలో ఉన్నతి ఏర్పడదు.

సహజంగానే వీరికి నమ్మకం తక్కువగా ఉంటుంది. వీరు ధైర్యంగా తనను కూడ నమ్మరు. ఇక ఇతరులను ఎలా నమ్మగలరు? చిన్న పనిని కూడా ఇతరులను నమ్మి అప్పగించటానికి వీరికి మనసు అంగీకరించదు. అన్ని పనులు తామే చేస్తే గాని వీరు తృప్తి చెందరు. వీరికి సమర్థత కూడా తక్కువే. కనుకనే వ్యర్థంగా దిగులుపడుతూ, జీవితాన్ని కష్టాలపాలు చేసుకొంటారు. దేనిని చూసినా సందేహం. (తలుపులు చక్కగా తాళం వేసినా కొద్దిదూరం వెళ్ళి తిరిగివచ్చి తాళం సరిగా వేసామా లేదా అని తాళం లాగి చూసే రకం మనుషులు). వీరు సహజముగానే పిరికివారు. వీరిలో కాస్త బుద్ధిమంతులు శాంతశీలురుగా జీవిస్తారు. మిగతావారు కఠినంగా, దుర్భాషలు మాట్లాడేవారై ఉంటారు. ప్రతిదానికి అతిశయంగా, ఉన్న దాన్ని రెట్టింపు చేసి మాట్లాడుతారు.

వీరు కొన్ని సమయాలలో అగ్నిపర్వత పగిలినట్లుగా రెచ్చిపోయి మాట్లాడుతారు. ఎవరయినా ఎదురించిన వెంటనే అణగిపోతారు. వీరు బెదిరించటంలోను, భయపెట్టి పని గడుపుకోవటంలోను సిద్ధహస్తులు. "అందితే జుట్టు, అందకపోతే కాళ్ళు' అన్నట్లు బ్రతిమలాడితే మాత్రం నెత్తికెక్కుతారు. బెదిరిస్తే కాళ్ళు పట్టుకుంటారు. పైకి ఎంత ధైర్యంగా మాట్లాడినా అది అంతా మేకపోతు గాంభీర్యమే. వీరి మనసులో భయం గూడు కట్టుకునే వుంటుంది. వీరిలో నిజం మాట్లాడేవారు, నిజం ఎన్నడూ మాట్లాడనివారు అని 2 రకములు. వీరి బుద్ధి ఎప్పుడు ఒకేలా ఉండదు. సందర్భానుసారం మారుతూ ఉంటుంది. కూడా తిరిగేవారి వేష భాషలు, ఉద్దేశాలు వీరిలో చోటుచేసుకుంటాయి. (కనుక ఇటువంటి గుణాలు ఉండే పిల్లలను తల్లిదండ్రులు జాగ్రత్తగా గమనించాలి. అబద్ధాలు చెప్పేవారితో గాని, జీవితపై శ్రద్ధలేని జులాయివారితోను కలవనివ్వరాదు)

వీరు ఇతరులకు బ్రహ్మాండమైన సలహాలు ఇస్తారు. తాము ఒక పని చేయవలసి వస్తే మళ్ళీ మళ్ళీ ఆలోచిస్తూ తికమక పడుతుంటారు. తనను చూసి భయపడని వారితో నయంగా మాట్లాడుతూ, భయపడేవారిని ఇంకా ఇంకా బెదిరిస్తూ బ్రతకటం వీరి స్వభావం.

వీరు మానసికంగా వేగంగా దూసుకుపోతారే తప్ప శారీరకంగా చేసే పనుల్లో ఆ వేగం

కనిపించదు. ఏ పని చేయవలసి వచ్చినా దాన్ని పదిసార్లు ఆలోచించి మెల్లగా మొదలుపెడతారు. వీరిలో సోమరితనం ఎక్కువే. ఏ పనైనా చేయవలసి వస్తే, అన్ని సామర్థ్యాలు ఉన్నా ఆచరణలో పెట్టటానికి, శ్రమించి సాధించడానికి తయారుగా ఉండరు. పనికి ముందు, ఎందరినో అభిప్రాయాలు అడిగి చివరికి ఏదీ చేయకుండా ఉంటారు. (నేనేం చేసేది? ఒక్కొక్కరు ఒక్కొక్కలా చెబితే ! అనేది వీరే!) తర్కం, వాదించడం అంటే వీరికి మహాప్రీతి. వీరు ఒక్కొక్కమాటకు పది అర్థాలు తీయగలరు. తర్కమయినా, కుతర్కమయినా వీరిలా ఇంకెవరూ చేయలేరు.

**వీరికి జీవితంలో గొప్ప లక్ష్యం ఉండాలి. వీరు స్వశక్తిపై నమ్మకం పెంచుకోవాలి. అనవసరపు భయాలను పారద్రోలాలి.**

చిన్న కష్టం కలిగినా, చిన్న నష్టం ఏర్పడునట్లు అనిపించినా తమ కల్పనాశక్తితో గోరంతను కొండంత చేసికొనుట వీడాలి. ఈ విధమయిన వ్యర్థ భయాలను, ఆలోచనలను ఆపుకొనకపోతే వీరు పిచ్చివారు అయ్యే ప్రమాదం ఉంది. ఇంగ్లీషులో పిచ్చి వారిని Lunatics (చంద్రుని ప్రభావం అధికంగా కలవారు -ఉన్మాదులు) అని అంటారు. **కల్పనాశక్తిని వశం చేసికొన్నవారు గొప్ప రచయితలో, కళాకారులో అవుతారు. కల్పనలకు వశీ భూతం అయినవారు పిచ్చివారు అవుతారు.** ఓటమి, కష్టం ఏర్పడినప్పుడు ఆత్మహత్య వంటి ఆలోచనలు వీరికి వస్తాయి. నీట్లో దూకి ఆత్మహత్యలు చేసుకొనేవారు ఎక్కువగా వీరే. దేవునిపట్ల నమ్మకం పెంచుట కోసమే వీరికి కష్టములు కలుగుతాయి. ఆత్మవిశ్వాసంతో ముందుకుపోతే వీరి కష్టములు తొలగి, తొందరలోనే వీరికి ప్రశాంత జీవితం లభిస్తుంది.

వీరి మనసులో గొప్ప ఆకర్షణశక్తి ఉంటుంది. తత్వాలనో, దైవాన్నో లేదా గురువు నో స్మరిస్తే వెంటనే శరీరమంతటా ఆ శక్తి నిండుతుంది.

వీరు తమకు తెలియకండానే గొప్ప సత్యములను, విషయములను చెబుతారు. రాగితీగలో విద్యుత్తు ప్రవహించినంత సరళంగా వీరి శరీరంలో దైవశక్తి ప్రసరిస్తుంది. నిరంతర దైవచింతన కలిగితే వీరు మహాత్ములుగాను, దూరదర్శులుగా ను కాగలరు. సదా ఆనందములో మునిగి తేలుతూ, జన ప్రచారం మరియు పొగడ్తలకు దూరంగా

ఉంటారు. గురుకటాక్షం ఉంటే సులభంగా పరిపూర్ణత పొందగలరు.

## స్నేహ సంబంధాలు

వీరికి నిజమైన స్నేహితులు ఉండుట అరుదు అని చెప్పవచ్చు. వీరు ఎంత సహాయం పొందినా ఇతరులకు కృతజ్ఞతగా ఉండరు. వీరి చుట్టు ఉండువారు అవసరమైనపుడు తప్పుకొంటారు. 1, 3, 4, 7, 8 లలో జన్మించినవారు వీరికి సహాయపడుతారు. తన సంఖ్య (2) వారితో స్నేహం బద్ధవిరోధంగా మారుతుంది. వీరు 7వ సంఖ్యవారిని కలవగానే వారికి వశమవుతారు.

**ముఖ్య గమనిక** : వీరి సందేహ ప్రవృత్తి వలన, వీరిని నిజంగానే అభిమానించువారు కూడా వీరితో కలసి జీవించుటకు ఇష్టపడరు. సదా తప్పులెంచుట, వితండవాదం చేయుట తగ్గించుకొంటే, వీరిలోని చక్కని గుణములు వెలలేని మూల్యాలుగా ప్రకాశిస్తాయి. వీరు శాంతమే ఆభూషణం అనుకుని, నిజాయితీతో ఇతరుల పట్ల ప్రవర్తించు స్వభావం అలవ ర్చుకొంటే త్వరలోనే అందరినీ వశపరచుకొన గలిగే అద్భుతమైన వశీకరణ శక్తి వీరు కలిగింటారు.

## శరీర నిర్మాణం

2 సంఖ్య ఆధిక్యత పూర్తిగా ఉన్న వారు పొడవుగా ఉందురు. లేనిచో సరాసరి ఎత్తును కల్గి గుండ్రని తలలతో ఉంటారు. సామాన్యంగా ఈ సంఖ్యవారు కండపుష్టి కలిగి ఒకింత లావు శరీరం కలిగినవారు అవుతారు. చూపులకు పుష్టిగా కనిపించినా దృఢశరీరం కాదు. గుండ్రటి తల, పొట్టి కేశాలు, పెద్దకండ్లు, బరువయిన రెప్పలు ఉంటాయి. ఆ కళ్ళని చూసినంతనే వీరు పగటికలలు కంటున్నారని తెలిసిపోతుంది. సామాన్యంగా ముక్కు పైకి తిరిగి వంకర లేకుండా ఉంటుంది. దంతములు చక్కని వరుసలో ఉండవు. ఎడముగాను పొడవుగాను ఉంటాయి. మెడ లావుగా ఉంటుంది. కాళ్ళు బలంగా ఉండవు. త్వరలోనే బొజ్జ వచ్చును. సన్న బడితే నిస్సందేహంగా ఉష్ణ సంబంధ వ్యాధులు ఉన్నవని తెలుసుకొనవచ్చును. వీరి శరీరంలో పొట్టభాగం పెరుగుతుంది తప్ప చేతులు, కాళ్ళు, కండరాలు పెరగవు. చేతులు పుల్లలవలె సన్నగా ఉంటాయి.

## వ్యాధి - ఆహారము

మానవ శరీరములోని ఛాతీ, పొట్టభాగం, జీర్ణప్రక్రియలో పాల్గొను అంగములు, పైత్యరసం సరఫరా చేయు పిత్తనాళం, ప్రేవులుకు అధిపతి చంద్రుడు. వీరికి జీర్ణప్రక్రియకు సంబంధించిన అంగములకు, మూత్ర అవయవములకు సంబంధించిన వ్యాధులు వస్తాయి. జీర్ణవ్యవస్థ అస్తవ్యస్తమగుట, **అతిమూత్రవ్యాధి** (Diabetes) మొదలయినవే వీరిలో అతి సామాన్యంగా కనిపించే జబ్బులు. సోమరితనం, శరీర శ్రమలేక జీవించుట వీరికి ఈ వ్యాధులు కలుగుటకు కారణాలు. కండ్లవెంట నీరు కారుట, కంటి వ్యాధులు కలుగుట కూడ సంభవం.

ఇతర ఆహారాలకన్న ద్రవ పదార్థములనే వీరెక్కువ ఇష్టపడతారు. క్రమశిక్షణ లేకపోతే కాఫీ, టీ, మద్యం వంటి మత్తు పదార్థములకు బానిసలయ్యే ప్రమాదం ఉంటుంది. (వీరికి త్రాగుడు అలవాటైతే దానికి అంతు ఉండదు).

వీరి శరీరానికి నీరు ఎక్కువ కావాలి. కనుక తరచుగా నీరు త్రాగుతూ ఉంటే మంచిది. నీరు ఎక్కువగా గల బూడిద గుమ్మడి, మంచి గుమ్మడి, దోస వంటి కూరలను క్యాబేజి, పెరుగు తోటకూర, మొదలయిన ఆకుకూరలను ఎక్కువగా ఆహారంలో చేర్చుకొనవలెను. పుచ్చకాయ, దోసపండు, అరటి, దానిమ్మ వంటి పండ్లు వీరికి మంచివి. నీరు, కండగల అన్ని పండ్లు వీరి ఆరోగ్యమునకు తగినవే.

వీరి ఆరోగ్యాన్ని వృద్ధిచేసేది సరస్వతి ఆకు. ఇది అతిమూత్రవ్యాధి నుండి వీరిని కాపాడుతుంది. ఆయుర్వృద్ధి చేస్తుంది. దీనిని నిత్యం తప్పక ఆహారంలో చేర్చుకుంటే శరీరంలో వేడి తగ్గుతుంది. దీని కాడలోగల తెల్లని భాగం మూత్రం నుండి చక్కెరను వేరుచేస్తుందని కనిపెట్ట బడింది. దీనిని సమయానికి భుజించినను మూత్రము నుండి చక్కెరను విడ గొట్టును. తామర దుంపలు కూడా వీరికి మేలు చేస్తాయి.

## విశిష్టతలు

2, 11, 20, 29 తేదీలలో పుట్టినవారి ప్రత్యేక గుణములు :

2వ తేదీన పుట్టినవారు మితిమీరిన కల్పనాశక్తి కలవారు. గొప్ప లక్ష్యములు కలవారు అవుతారు. మిగతా మూడు తేదీలలో పుట్టినవారి కన్న వీరు భయస్తులు,

శాంతిప్రియులు అయి ఉంటారు. మనో శక్తులు ఎక్కువగా కలవారగుటచే, కల్పనల్లో, పరిశోధనల్లో అధిక సమయం గడిపెదరు. సంఘమును సంస్కరింపవలెనని విప్లవకరంగా ఆలోచిస్తారు. కాని వీరి విప్లవం దెబ్బలు, రక్తము చిందించునవి కావు. మోసగింపబడినా వీరికి కోపం రాదు. వ్రాత మూలంగా లేదా మాటలతో దెబ్బలాడుటలో మాత్రమే వీరు ఘటికులు.

11 న జన్మించినవారికి మిగతా మూడు తేదీలవారి కన్నా దైవ నమ్మిక, దైవానుగ్రహం ఎక్కువ. నమ్మకంతో వీరు సర్వ కార్యాలను సులభంగా సాధిస్తారు. (ఈ తేదీన పుట్టిన పిల్లలను దేవునిపై నమ్మకము కలుగునట్లు పెంచుట తల్లిదండ్రుల విధి. చదువు, సంపదలు లేకపోయినా గాఢ నమ్మిక ఆధారంగా దరిద్రం నుండి గొప్ప స్థితికి చేరుకొన్న ఈ సంఖ్యవారెందరో నాకు తెలుసు). **వీరు తమయందు గల విశ్వాశము, దైవానుగ్రహం వల్ల దేనినైనా సాధిస్తారు.**

2, 11 తేదీలలో పుట్టినవారికి కూడా దైవ నమ్మకం ఎక్కువే. శాంతిప్రియులు. వీరు ఇతరులకు కీడు చేయదలచరు. శాంతియుత పరిష్కారములనే కోరుతారు. స్నేహమునకు కట్టుబడి ఉంటారు.

20న పుట్టినవారు మితిమీరిన కల్పనాశక్తి, దైవానుగ్రహం కలవారు. ప్రపంచమంతా వీరికి సులభంగా తలవంచి వీరి నాయత్వం స్వీకరించి ఆరాధిస్తుంది. స్వార్థం లేకుండా ఉంటే వీరు మనుషులమధ్య దేవతలా ఆ రాధించబడతారు. స్వార్థపరులయితే వీరికి, వీరితో కలసినవారికి పలు కష్టములు ఏర్పడతాయి. స్వలాభం ఆశించి, దైవశక్తిని పోగొట్టు కొందురు. పేరాశను వదలితే మంచి విశిష్టమైన జీవితం వీరికి లభించును. అనేకులకు మంచి త్రోవ చూపగల మార్గదర్శి కాగలరు.

29న జన్మించినవారు శాంతి, సామరస్యాలను కోరరు. ఇతరులని కష్టపెట్టుటకే పుట్టినవారిలా కనిపిస్తారు. ఎల్లప్పుడు అనవసరపు గొడవల మధ్య కనిపిస్తారు. ఎందుకు దెబ్బలాడుతున్నామని కూడా ఆలోచించక వివాదాలలో మునిగి, మిత్రులందరూ తనను మోసగిస్తున్నారని చెప్పుతూ ఉంటారు (నిజం ఏమిటన్నది పట్టించుకోరు). ఇతరులకు సహాయం చేయుటకు వీరికి మనసొప్పదు. తమ కార్యం

సాధించుకొనుటలో గొప్ప సమర్థులు. ఎవరితోను సామరస్యంగా ఉండరు. ఎంతో మంచివారివలె నటిస్తారు. ప్రగల్భములు ఎక్కువ. కాని నిజానికి వీరు చాలా పిరికివారు. లోలోన మహా భయస్థులు. ప్రత్యర్థి బలవంతుడైతే వీరు కాళ్ళ బేరమునకు దిగుతారు. తమకి భయపడువారిని ఇంకా లొంగదీస్తారు. అట్టివారిపై అధికారం చెలాయిస్తారు. దేనికయినను అభ్యంతరాలే చెబుతారు. చిన్న చిన్న తగాదాలకు కూడా కోర్టుకెక్కుతారు. బాల్యంలోనే వీరి దుర్గుణములను తల్లిదండ్రులు సరిచేయకుంటే లోకకంటకులుగా తయారగుదురు. వీరిని దుష్టుల స్నేహం చేయకుండా చూస్తూ తల్లి తండ్రులు కాపాడాలి.

ఈ తేదీలలో ప్రసిద్ధికెక్కిన మోసగాళ్ళు, ఇంద్రజాల విద్యలలో ఆరితేరినవారు, మాంత్రికులు జన్మించారేతప్ప సద్గుణములు కలవారు, మహాత్ములు జన్మించినట్లు తెలియుట లేదు. తగాదాలు, వితండ వాదనలు, వివాదములతో లాభించు వృత్తులలో ఉంటే వీరు మంచి ధనసంపాదన కలిగి ఉంటారు. అలాంటి వృత్తి అవలంబిస్తే ఇంట్లో వారికి కూడా మంచిది. లేకపోతే ఇంటినే రణరంగంగా మార్చివేస్తారు..

పుట్టిన తేది, నెల, సంవత్సరం ఈ మూడింటిని కూడితే 2 వస్తే, ఈ గుణాలు ఇంకా అధికం. ఈవిధముగా వ్రాసినందుకు 29న జన్మించిన పాఠకులు క్షమించాలి. వీరు తమని తాము మార్చుకోవాలన్న సదుద్దేశంతో విపులంగా రాయటం జరిగింది. ఈ తేదీన పుట్టిన అనేక మంది నా వద్దకు వచ్చారు. తమను చూసి రాసినట్లు ఆ గుణములన్నీ తమలో ఉన్నవని వారు అంగీకరించారు.

**సూచన**: మా తండ్రిగారు 29 గురించి కఠినంగా రాసారని తెలియుచున్నది. సత్యం దాచకుండా మీకు ఒక విషయం నేను గుర్తుచేయ కోరుతున్నాను. గత శతాబ్దంలో అత్యంత వైభవంగా జరిగిన బ్రిటిష్ యువరాజు చార్లస్-డయానాల వివాహం 29-7-1981 న జరిగింది. వైవాహిక జీవితంలో పలు సమస్య లేర్పడి, ఇద్దరు పిల్లల తరువాత కూడా ఆ వివాహం కొనసాగలేదు. 1996లో డయానాకు విడాకులివ్వబడ్డాయి. చివరికి 31-8-1997లో అనుకోనివిధంగా ఒక దుర్ఘటనలో డయానా మరణించుట కూడా జరిగింది. ఇది పాఠకులకు తెలిసినదే).

నామ సంఖ్య-రెండు

మీ పేరులోని అక్షరాలను కూడితే వచ్చు సంఖ్య 2 అయితే ఈ సంఖ్య ప్రభావం మీపై ఉంటుంది. రోజురోజుకీ ఈ సంఖ్య గుణాలు స్పష్టంగా కనిపిస్తాయి. 2 అంకె వచ్చు పేర్ల ఫలితాలని గమనిద్దాం.

11- పేరులోని అక్షరముల కూడిక 11 అయితే వారు దైవనమ్మికతో జీవితంలో వృద్ధిలోకి వస్తారు. అనేక లాభాలు సులభంగా పొందుతారు. వీరి నమ్మకముకు పరీక్షవలె హఠాత్తుగా ఆకస్మికంగా ఆపదలు వస్తాయి. ప్రయోజనంలేని వ్యవహారాలు, మిత్రులు మరియు బంధువుల మోసానికి గురి కావటం కూడా జరుగుతాయి. గట్టి నమ్మకం ఉంటే గొప్ప ఉన్నతి నిశ్చయం. అది లేకపోతే విపత్తు నిశ్చయం.

20- ఇది ఢంకా మోతను సూచించు దైవిక సంఖ్య. ఆ ఢంకా శాంతి కొరకు మ్రోగించేదే అయితే ఈ సంఖ్య కలవారు ప్రపంచ కష్టాలను, దుఃఖాలను తీర్చి స్వేచ్ఛని ప్రసాదించేవారు అవుతారు. ప్రపంచమే వీరికి తలవంచి దాసోహమవుతుంది. స్వార్థంతో మ్రోగించిన ఢంకా యుద్ధాన్ని సూచిస్తుంది. ప్రపంచ వినాశమునకు కారణం అవుతుంది. వీరికి విషంతో సంబంధం ఉంటుంది కాబట్టి వీరికి విషవైద్యం ఫలిస్తుంది. స్తబ్దుగా ఉన్న మానవజాతిని మేల్కొలిపి ఉన్నత లక్ష్యం వైపు తీసుకుపోయే శక్తి ఈ సంఖ్యకి ఉంటుంది. ఈ సంఖ్య వారు స్వార్థపరులయితే ఆలస్యం, ఓటమి ఫలితాలుగా మిగులుతాయి. (ఈ సంఖ్య పేర్లకు ఒక ఉదాహరణ 20వ తేదీన పుట్టి, జర్మను ప్రజల్ని రెచ్చగొట్టి, దేశ నాశనం తెచ్చిన నేత Hitler).

29 - ఈ సంఖ్యవారు తరచుగా కోర్టులో న్యాయాధిపతుల ఎదుట నిలువవలసి వస్తుంది. కుటుంబ జీవితంలో సమస్యలు వస్తూ ఉంటాయి. బంధుమిత్రులు విశ్వాసఘాతకులుగా మారుతారు. ముందురోజు పొగడి మరురోజు తిడతారు. పురుషులైతే స్త్రీ ల చేత, స్త్రీ లయితే పురుషుల చేత తీరని కష్టములకు లోనవుతారు. సంసారజీవితం సర్కసువలె ఉండును.

38 - ఈ సంఖ్య పేరువారు శాంతగుణంతో, నిజాయితీని ఇష్టపడే నిజాయితీపరులుగా ఉంటారు. వ్యక్తి పేరైనా, వ్యాపార స్థలం అయినా సరే ఈ సంఖ్య రాజాదరణను సూచిస్తుంది. మొదట్లో సామాన్యులుగా ఉన్న వీరు అంచెలంచెలుగా కీర్తి

ప్రతిష్ఠలు, సంపదలు అందుకొంటారు. అయితే అప్పుడప్పుడు ఎదురుచూడని విపత్తులు, వంచకులవలన కష్టములు వీరికి తప్పవు. **వీరి జీవితం ముగియటం కూడా ఎదురుచూడని విధంగా ఒక నమ్మలేని సంఘటనగానే ముగుస్తుంది.**

47- అతి వేగంగా జీవితంలో పైకి వచ్చే వారిని మనం ఈ సంఖ్యలో చూడవచ్చు. తమ అభివృద్ధిపైనే దృష్టిని నిలిపి, సర్వ కార్యములను సాధించుకొనుటలో వీరు సమర్థులు. వీరు ఆర్థికంగా అదృష్టవంతులనే చెప్పవచ్చు. ఈ సంఖ్య వారు అనేకమంది అంధత్వానికి గురి అవుతారు. చికిత్స వీరికి ఫలించుట లేదు. వేట అలవాటు ఉంటే జీవహింస మానుట, మాంసాహారం త్యజించుట మంచిది.

56 - ఇది అద్భుతమైన సంఖ్య. సామాన్యంగా లక్ష్మీ కటాక్షం, కీర్తి ఇచ్చేదని చెప్పినా ఇది ఇంద్రజాల విద్యల్లో ఉపయోగించే సంఖ్యయే. ఇది అన్ని బంధ విమోచనాలు కలిగిస్తుంది. వీరి శక్తికి తాళములు తెరచు కొంటాయి, సంకెళ్ళు విడిపోతాయి (సర్కస్లో ఈ విద్యలన్నీ అందరూ చూసినవే). ఇంతకు ముందు వివరించిన 29 సంఖ్య ఇచ్చే శరీర మనోశక్తులనీ ఇది సూచిస్తుంది. అయితే 56 సంఖ్య మనస్సు నకు మాయాజాల శక్తులు ఇచ్చునది కావటం చేత మాయాజాలం వలె వీరి సంపదలు, గొప్ప తనం కూడా ఏదో ఒకనాడు అదృశ్యమైపోతాయి.

65 - ఇది దైవాంశాన్ని, ఆధ్యాత్మికజీవితంలో ప్రగతిని సూచిస్తుంది. పరపతిగలవారి సహాయం , పూర్తి ఆదరణ వీరికి లభిస్తాయి. వీరి వైవాహిక జీవితం సంతోషమయంగా గడుస్తుంది. అయితే వీరికి జీవితంలో కొన్ని విపత్తులు, కత్తిగాట్లు, దెబ్బలు వంటివి ఎదురౌతాయి.

74 - వీరికి తీవ్ర మతాభిమానం, సంస్కరణాభిలాషలు ఉంటాయి. ఆర్థిక ఇబ్బందులు అధికం. వీరు తమ ఆశయాలని ప్రచారం చేస్తారు. ఇది అంతగా కోరదగిన సంఖ్య కాదు. ఆధ్యాత్మిక జీవితానికి మేలు చేస్తుంది. వీరు సదా ఏదో ఒకటి ఆలోచిస్తూనే ఉంటారు.

83 - ఈ సంఖ్య మిక్కిలి ఉన్నతమయిన పదవిని ఇస్తుంది. అందరూ గౌరవించే అంతస్థు కలుగుతుంది. వైభవమైన జీవితం, అందరిపై విజయం సులభంగా లభిస్తాయి.

92 - ఈ సంఖ్య స్వర్ణ, వస్తు, భూలాభములు, యోగసిద్ధి అందిస్తుంది. వీరికి ఆకాశగమన శక్తి సిద్ధింపగలదు.(ఖేచరి రహస్య సిద్ధి).

101 - ఈ పేరు సంఖ్యకు స్వంత ప్రయత్నం కన్న ప్రభుత్వ సహకారం అధికం. వృత్తి తరచుగా మందంగా ఉంటుంది. వీరికి వ్యాపారములో అనేక ఆటంకములు కలుగును. దీనిని అదృష్ట సంఖ్యగా పరిగణించలేము.

## అదృష్ట కాలం

పైన చెప్పినట్లు ఒకరి పేరు సంఖ్య యో జన్మించిన తేదియో 'రెండు " అయితే ప్రతి నెలలో వచ్చు 7, 16, 25 దినములు అదృష్టకరమయినవి. అనుకోనివిధముగా అనేక శుభములు జరుగుతాయి. చేసే పనులందు ఎదురుచూసే దానికన్న ఎక్కువ ఫలితాలు కనిపిస్తాయి. సంతోష కరమయిన పనులు జరుగుతాయి. తేది, నెల, సంవత్సరం కూడితే 7 వచ్చు సంఖ్యలలో మంచి జరుగుతుంది. కనుక వీరు అన్ని ముఖ్య కార్యములను పైన చెప్పిన 7 వచ్చే అదృష్ట తేదీలలో నే చేయుట మంచిది. కొద్ది దినములు ప్రయత్నించి ఆ దినములను గమనిస్తే తర్వాత అవి శక్తిని పుంజుకొని మనకు మేలు చేస్తాయి. క్రొత్త సంఘటనలను, సాధకమయిన సందర్భములను ఏర్పరుస్తాయి. అభివృద్ధికి కావలసిన సందర్భములను సిద్ధపరచి ఉంచుటను మీరు గమనిస్తారు. ఇందులోను 25వ తేదీకి తక్కిన రెండు తారీకుల కంటే శక్తి అధికం.

ఇవికాక 1, 10, 19, 28 తేదీలుకూడా సాధకమయినవే. ఈ తేదీలలో చేసే పనులలో ఇతరుల సహకారం లభిస్తుంది.

2, 11, 20, 29 తేదీలలో అనేక ముఖ్య సంఘటనలు జరుగుతాయి. కొన్ని అదృష్టకరంగా ఉన్నా, మరికొన్ని వేరు విధంగా ముగుస్తాయి. కనుక సాధ్యమైనంతవరకు పై నాల్గు తేదీలలో క్రొత్త ప్రయత్నములు చేయకుండుట మంచిది.

## దురదృష్టకరమైన తేదీలు

వీరికి 8, 9, 18, 26, 27 తేదీలు మంచిని చేయవు. ఈ ఐదు తేదీలలో ప్రయత్నాలు మానుట అవసరం. తేది, నెల, సంవత్సరం కూడితే 8, 9 వచ్చినచో ప్రయత్నాలు మానాలి. లేదా కీడు నిశ్చయము.

## వృత్తులు

నిజాయితీగా, కపటం లేకుండా ఉంటే వీరికి పలువురి సహాయం లభిస్తుంది. పేదరికం నుండి రాజరికానికి ఎదుగుతారు. దైవ నమ్మకం, నిర్మలజీవనం ఉంటే, వీరు లోటులేని సంపదలతో సుఖిస్తారు. (సాధారణ శ్రామికులుగా ఉండి నిజాయితీతో పైకి వచ్చిన అనేకులు దీనినే తమ విజయరహస్యం అని నాతో చెప్పి ఉన్నారు.) వీరు మాట్లాడునప్పుడే అవతలివారు ఎట్లు ఆలోచించుచున్నారని ఊహించి దానికి తగినట్లు చమత్కారంగా మాట్లాడుతారు. వివిధ కోణముల నుండి ప్రతి విషయమును ఆలోచిస్తారు. ఏ వైపు వాదించినను గెలిపించగలిగిన వీరు వకీలు వృత్తిలో బాగుగా రాణిస్తారు. కవిత్వం, చిత్రలేఖనం, సంగీతం, శిల్పం వంటి కళలలో వీరు ప్రకాశిస్తారు. నిరంతరంగా ఒకే పనిని చేయుటకు వీరికి మనో బలం ఉండదు. దృఢచిత్తులుగా ఏ వృత్తి అవలంబించినా తప్పక రాణిస్తారు. వ్యవసాయం, బట్టల వ్యాపారం, పాల వ్యాపారం, కాఫీ, టీ మొదలైన వ్యాపారాలలో, స్త్రీలు ధరించు నగలు, ముత్యములు మొదలైనవాటిలో రాణిస్తారు. అలంకార సాధనములు, తైలములు, ద్రవరూపంలోని మందులు, పెయింటింగులు, రంగులు మొదలైనవి అమ్ముట మూలంగా వీరికి ఆదాయం చేరుతుంది. ఫోటో స్టూడియో కూడ వీరి కల్పనాశక్తిని బహిరంగపరుస్తుంది. అదీ మంచిదే.

2 సంఖ్య వారికి కల్పనాశక్తిని ఉపయోగించే అన్ని వృత్తులు తగినవే. కథలు రాయుట, ఆటవస్తువులు, పానీయములు మొదలైనవి, మతం, దైవం, శాస్త్రాలకు సంబంధించిన పరిశోధనలు వీరికి తగినవి. రంగులు వేయుట, బట్టలు వేయుట, వస్త్రములు శుద్ధి చేయుటలో ఆరితేరినవారు. కూరలు, పండ్లు సాగుచేయుట, పువ్వులు, సుగుంధ ద్రవ్యములు, కాగితం, పుస్తకాలు, రాత పరికరాలు మొదలైనవాటిలో పెట్టుబడి పెట్టవచ్చు. 11వ తేదీన పుట్టినవారు ఆటలందును ప్రసిద్ధికెక్కగలరు.

భాగస్థులతో చేయు వ్యాపారాలలో 1, 3, 4, 7 సంఖ్యల వారినే చేర్చుకొనవలెను.

## సహకరించే వ్యక్తులు

2, 11, 20, 29, సంఖ్యల వ్యక్తులకి 7వ తేదీన పుట్టిన వ్యక్తులు విశేష సహాయం

అందిస్తారు. రెండవ సంఖ్య వారికి, మిగిలిన 1, 3, 4, 8 సంఖ్యల వలన కూడా సహాయం అందించ బడుతుంది.

## 'వివాహ జీవితం'

ఈ సంఖ్య వారిలో స్వశక్తిపై నమ్మకం కలిగిన కొందరు మాత్రమే భార్యతో సుఖంగా ఉండగలరు. తక్కినవారంతా భార్యలతో గొడవలు పడతారు. ఈ సంఖ్యలోని స్త్రీలు కూడా లేని తప్పులు కనిపెట్టి కలహానికి కాలుదువ్వుతారు. పురుషులలో అనేకులు 29 ఏళ్ళ వయసులో స్త్రీ లచే కోర్టుకు లాగబడతారు . (పాఠకులు నేను గోరంతను కొండంత చేస్తున్నానని అనుకోవద్దు. మీరే పరిశీలించి చూడండి). స్త్రీల వలన వీరికి మంచి జరుగుట లేదు. స్త్రీ లవలన వీరి జీవితంలో పెద్ద సమస్యలు ఏర్పడుట సహజం. వీరు చాలామటుకు మనసులు కలవని వ్యతిరేక గుణము కలవారిని వివాహమాడి కష్టముల పాలగుచున్నారు. వీరికి ఆక్షేపించదగిన ప్రేమలు ఉంటే కోర్టులు ఎక్కక తప్పదు. ఈ సంఖ్యలోని అనేకమంది తల్లి, తదితర కుటుంబ స్త్రీల చెప్పుడు మాటలు విని భార్యను కష్టాలపాలు చేయటం, సంసార జీవితం నరకప్రాయంగా మార్చుకోవటం, తరువాత తమ తప్పును తెలుసుకోవటం జరుగుతుంది. స్త్రీ లవలన కష్టములు అనుభవించవలసిన వీరు తమ తల్లి, చెల్లి, తదితర స్వజనులు కూడా స్త్రీ లేనని గుర్తుంచుకోవలెను.

2 సంఖ్యలో పుట్టినవారు 7 సంఖ్య వారినే ఎక్కువగా ఇష్టపడతారు. ఒకరిపై ఒకరికి ఆకర్షణ ఉంటుంది. మంచి సంతానం కలుగుతుంది. వీరు 3, 6, 4, 8 తేదీలలో పుట్టినవారిని కూడా పెళ్ళి చేసుకోవచ్చు. 3, 6 తేదీలవారు కూడా వీరికి మేలు చేసే జీవితభాగస్వాములు అవతారు. 4, 8 వారు వీరిని సరిదిద్దుతారు. 2 సంఖ్య పురుషుడైతే 7 సంఖ్య స్త్రీ ని వివాహం చేసుకోవచ్చు. (ఎందుకంటే, ఎంత గొడవపెట్టినా వాళ్ళు అణిగిమణిగి ఉంటారు). వీరు ఇనుము, అయస్కాంత సంబంధమువలె అన్యోన్యంగా ఉంటారు. 11 సంఖ్య స్త్రీ ని పెళ్ళి చేసికొని ఇలా గొడవలు పెడితే, ఆమె ఈ మొగుడే వద్దని పారిపోతుంది. 8వ సంఖ్య స్త్రీ 2వ సంఖ్య పురుషుని చేసికొన్నచో ఆ స్త్రీ కి అన్నీ కష్టాలే. 2 సంఖ్య వారికి సంసారం చక్కదిద్దుకొనుట చేతగాదు. ఈ సంఖ్యలో జన్మించినవారే ఇతరులచే కోర్టుకి లాగబడుతున్నారు. వీరికి ప్రేమ మేలు కలిగించుట లేదు. ఎందుకంటే వీరు చపలచిత్తులు. వీరి ప్రేమ నిరాశ, దూషణలనే మిగుల్చుతుంది.

వీరికి 7, 1 సంఖ్యల వారిపై ఆకర్షణ ఏర్పడుతుంది. 9 సంఖ్య వారి బారిన పడకుండా తప్పించుకొనుట ఎంతో మంచిది.

కుటుంబ జీవితం చక్కగా ఉండాలంటే, వివాహతేదీలను క్రింద పట్టికలో చూపినట్లుగా ఏర్పాటు చేసుకొనుట మంచిది.

| వధువు లేదా వరుడి సంఖ్య | పెండ్లి తేది మరియు తేది, నెల, సంవత్సరం కూడిన పూర్ణసంఖ్య |
|---|---|
| 1,4 | 4 & 1, 1 & 1 |
| 2 | 2 & 1, 7 & 1, 1 & 1, 3 & 1 |
| 3 | 3 & 1, 1 & 3 |
| 6 | 1 & 1, 1 & 6, 6 & 1 |
| 7 | 7 & 1, 1 & 1 |

రంగు

2 సంఖ్యవారికి లేత ఆకుపచ్చ రంగు ఎంతో అదృష్టకరమైనది. వీరు నివసించుచోట గదులకు, చుట్టూ గల వస్తువులకు ఈ రంగు ఉంటే అది వీరికి ఉత్సాహం మరియు ప్రశాంతత కలిగిస్తాయి. ఇకపోతే, పచ్చ కలిసిన ఇతర రంగులు లేత పసుపు రంగు, తెలుపు వీరికి మేలు చేస్తాయి. తెలుపు కన్నా పచ్చ అధిక జయం కలిగిస్తుంది. కాబట్టి పచ్చరంగు దుస్తులు ధరించుట మంచిది. కనీసం అంచులు పచ్చగా ఉన్నా చాలు).

నలుపు, ఎఱుపు, ముదురునీలం రంగులు కీడు కలిగిస్తాయి. కనుక ఈ రంగులు ధరించరాదు. బంగారం కన్నా వెండి వీరికి మంచిది. రెంటిని కలిపి కూడా వాడవచ్చు.

రత్నాలు - వాటి ఉపయోగములు

రత్నాలలో మంచి ముత్యం, జేడ్ అనబడే పచ్చరంగు రాయి ధరిస్తే మేలు కలుగుతుంది. ఇది ఉదర సంబంధ వ్యాధులను నయం చేస్తుంది.

వైఢూర్యం (పాలీష్ చేయని వజ్రం) కూడా వీరికి మిక్కిలి అదృష్టకరమైనదే. పశ్చిమ దేశాలవారు ఎక్కువ మక్కువ పడే మూన్ స్టోన్ అనే రాయి కూడా మంచినే చేస్తుంది. అయితే వీటన్నిటిలో మిక్కిలి లాభం కలిగించే ముత్యం సర్వ శ్రేష్ఠం.

రెండు సూచించే ఆంగ్ల అక్షరాలు
మరియు వాటి గుణాలు - ఫలితాలు

B. ఈ అక్షరం రంగు ముదుర నీలం రంగు ప్రకాశం కలిగి ఉంటుంది. ఇది ఆత్మశక్తికి ఆటపట్టు. శుభముల నివాస స్థానం. వెలుపలకు ప్రకటమయ్యే వాటికన్నా ఎక్కువ ఆలోచనలు, భావనలు వీరి మనసులో ఉంటాయి. కనుక కొన్ని సమయాలలో మనసులోనిదంతా చెప్పలేకపోతు న్నామే అని వీరు బాధపడతారు. ఆధ్యాత్మిక జీవితంలో ఆసక్తి ఎక్కువగా ఉంటుంది. వీరు నిజాయితీతో మంచి పద్ధతులతోనే దేనినైనా సాధించే ప్రయత్నం చేస్తారు. వీరు శాంతిప్రియులు కాబట్టి తమ శక్తులను, వస్తువులను వృధా చేయక పొదుపుగా వాడతారు. కట్టడములు కట్టుటలో నేర్పరులు. కనీసం తమ జీవితాన్నైనా ఒక చక్కని కట్టడంగా భావించి దానిని సుందరంగా నిర్మించుకుంటారు. వీరిలో మంచి గుణాలు లేకపోతే ఇతరులకు తగువులు పెడుతూ ఆనందిస్తూ ఉంటారు.

K. ఈ అక్షరం రంగు ఎఱుపు. తల్లి ప్రేమను ఎక్కువ చేస్తుంది. పలు కళలను నేర్పుతుంది. వృద్ధిలోనికి వచ్చుటకు ఉన్నత కార్యములు చేయుటకు వీరిలో ఆసక్తి ఉంటుంది. వీరిలో తమ తోటివారిని కాపాడే గుణం ఎక్కువ. మంచి గుణాలుంటే వీరిలో చాలామంది లోక సేవకులు.

R. వెండి రంగు కల్గిన ఈ అక్షరం పేరుకు మధ్యలో ఉండుటకన్నా ప్రారంభంలో ఉండుట శ్రేష్ఠం. వీరికి ప్రేరణ అనవసరం. వృద్ధిలోనికి రావాలని వీరు ఆరాటపడతారు.

తమను నలుగురూ గుర్తించాలని ప్రయత్నాలు చేస్తారు. ఫలానాది చేయాలని నిశ్చయించుకోకుండానే చురుకుగా ఏదో పని చేస్తూనే ఉంటారు. అతి సులభంగా ఇతరులను అర్థం చేసుకుంటారు. తనకు తోచినట్లే ఉండాలని ఎల్లప్పుడూ ప్రయత్నిస్తారు. వీరు సడలని పట్టు, అవిరళ కృషి కి నిదర్శనం.

**2 సంఖ్యలో పుట్టిన ప్రముఖుల పేర్లు, వారి జన్మతేదీల, తేది, మాసము, సంవత్సరము కలిపిన వచ్చు సంఖ్యలు క్రింద ఇవ్వబడినవి. వారి పేర్లను జీవితమును గమనింపుడు.**

| **పేరు** | **జన్మతేది సంఖ్య** | **తేది-విధి సంఖ్యలు** |
|---|---|---|
| HAVLOCK ELLIS<br>హావ్లాక్ ఎల్లిస్ (స్త్రీ పురుష సంబంధములపై గొప్ప పరిశోధనా గ్రంథములు వ్రాసినవారు) | 2-2-1859 | 2 & 9 |
| MIKHAIL GORBACHEV<br>మికైల్ గోర్బచేవ్ (మాజీ రష్యను ప్రెసిడెంటు) | 2-3-1931 | 2 & 1 |
| EMILE ZOLA<br>ఎమిలీ జోలా (ఇంగ్లాండ్లో ఆశ్రయం పొందిన ప్రఖ్యాత ఫ్రెంచ్ రచయిత.) | 2-4-1840 | 2 & 1 |
| M.K.GANDHI<br>M.K. గాంధి (భారత జాతిపిత) | 2-10-1869 | 2 & 9 |
| THOMAS ALVA EDISON | 11-2- | 2 & 6 |

| | | |
|---|---|---|
| థామస్ ఆల్వా ఎడిసన్ (విద్యుత్సరికరములను కనుగొన్నవారు) | 1847 | |
| C. SUBRAMANIYAM BHARATI<br>సి. సుబ్రహ్మణ్య భారతి (మహాకవి భారతిగా ప్రసిద్ధిగాంచిన దేశభక్తుడు) | 11-9-1882 | 2 & 3 |
| ALEXANDER<br>అలెగ్జాండరు (ప్రపంచమున గ్రీకు సామ్రాజ్యము స్థాపించిన వీరుడు) | 20-7-356 | 2 & 5 |
| MUNGO PARK<br>ముంగో పార్కు (అజ్ఞాత ఉపఖండం ఆఫ్రికాని కనుగొన్నవారు.) | 20-9-1771 | 2 & 9 |
| HIRO HITO<br>హీరోహిటో (జపాను దేశపు చక్రవర్తి) | 29-4-1901 | 2 & 8 |
| BENITO MUSSOLINI<br>(బెనిటో ముస్సోలిని) (ప్రసిద్ధ ఇటలీ నియంత) | 29-7-1883 | 2 & 2 |
| ROBERT CLIVE<br>(రాబర్ట్ క్లైవు) (తూరిండియా కంపెనీలో గుమాస్తాగా మొదలయి అతి ఉన్నత పదవికి వచ్చినవాడు. గుర్తింపులేని కారణముగా - కడుపు నొప్పి కూడ వుండెను - ఆత్మహత్య గావించుకున్నాడు) విధి సంఖ్య 8 గమనింపుడు. | 29-9-1725 | 2 & 8 |

| JOHN KEATS<br>(జాన్ కీట్సు) ప్రసిద్ధ కవి | 29-10-<br>1795 | 2 & 7 |
|---|---|---|

(మీకు మనస్తాపం కలగకూడదని అనేక ఇండియా, పాకిస్తాన్ ప్రముఖుల పేర్లు, వారి పుట్టిన తేదీలు ఈ పట్టికలో చేర్చబడలేదు).

పేరు మార్చుట : ఇది దురదృష్టకరమైన సంఖ్య. అందుకే చంద్రుని క్షీణత మరియు అభివృద్ధి దీని నియంత్రణలో ఉంటాయి. ఈ సంఖ్యవారితో వివాహ జీవితం సునిశ్చితంగా ఒకేలా ఉండదు. వృద్ధి క్షీణతలు సహజం. కావున తేది, నెల, సంవత్సరం కూడితే వచ్చు సంఖ్య ప్రకారం పేరు అమర్చితే మంచి జరుగుతుంది. 7 సంఖ్య కలిగిన పేరు ఉంటే పూర్ణప్రకాశం కలుగుతుంది. (7 సంఖ్య కష్టాలలో అనేక పరీక్షల అనంతరం చివరికి విజయం లభిస్తుంది. ఆధ్యాత్మిక జీవితం ఫలిస్తుంది). 1, 3, 5, 6 సంఖ్యలలో పేరు ఉంటే పదవి, సంపదలు చేరుతాయి. 4, 8, 9 సంఖ్యలు సరైనవి కావు. పుట్టిన తేదీ అంకెల మొత్తం వచ్చే పూర్ణ సంఖ్యని అనుసరించి పేరు పెట్టుకుంటే వ్యాధులు రావటం అరుదు.

## అంకె 3 - గురువు

అంకె 1 జ్ఞానమును సూచించునది. రెండు చలనమును సూచించు మనసు రూపమున ఉండుట గమనించితిమి. చలనమునకు ఫలితమయిన క్రియాశక్తినే ఆంగ్లములో Energy అనుచున్నారు. ఈ కార్యములను చేయుటకు కావలసిన శక్తినే మనము 'శక్తి' అని వాడుచున్నాము. ఈ శక్తి వల్లనే సూర్య కుటుంబములోని గ్రహములు తిరుగుచున్నవి. ఈ కారణముగనే, లోకమాతను 'శక్తి' అని మనం పిలుచుచున్నాము. ఆమెను త్రికోణముగా వర్ణించుట కూడా అందులకే. ఏవిధమయిన చలనమయినా శక్తిని బయలుపరచునదే. క్రియారూపమున గల శక్తి ఒకరి సొత్తు కాదు (ఇచ్ఛవలన ఏర్పడినది కాదు). జరుగవలసిన సమయము వచ్చినపుడు తానే జరుగును. అనగా క్రియకు సమయము ఆసన్నమయినపుడే అది, ఎవరి ప్రయత్నమునకు వేచి ఉండక తనంతట తానే క్రియారూపము దాల్చును. ఈ గుణమును మనుష్యులలో దర్శించునపుడు స్వార్థరహితమయిన 'సేవ'గాను త్యాగముగాను కనుపించును.

ఈ శక్తిని సూచించు సంఖ్యయే మూడు. 3, 12, 21, 30 తేదీలలో జన్మించిన వారందరూ ఈ సంఖ్య గుణములనే ప్రదర్శింతురు. కఠినశ్రమను, కృషిని సూచించు ఈ సంఖ్య ప్రపంచములోని అన్ని దేశములకు అనేక సాటిలేని నాయకులను సృష్టించినది. ఈ సంఖ్యలో జన్మించినవారు పలువిధముల నాయకులుగా సంఘములో మనకు కనుపించుటకు వారి పరోపకారబుద్ధియు, దేశభక్తియు, దేశపురోగతియందు వారికి గల ఆసక్తియునే కారణము. అనేక మంది దేశభక్తులు, జాతి శ్రేయస్సు కొరకు జీవితములను త్యాగము చేసిన మహాత్ములు, ఉన్నత సంస్థల అధిపతులు ఈ సంఖ్యకు చెందినవారే.

త్యాగధనులు, దేశ భక్తి కలిగిన జన్మభూమి అభిమానులు, దేశభక్తులు, క్రమశిక్షణ కలిగిన నౌకాసేన వంటి రంగములలోని ఉన్నతాధికారులు ఈ సంఖ్య కలిగిన తేదీలలో పుట్టినవారై ఉందురు. వీరిలో ఉత్సాహము తగ్గినవారిని, బ్యాంకులలో ను, ఉపాధ్యాయవృ త్తులలో ను చూడగలము. జన్మ సంఖ్య అయిన 3 ప్రభావము లేనివారు గుమాస్తాలుగాను, బ్యాంకులలో మరియు కార్యాలయములలో చిన్న చిన్న

అధికారులుగాను, ఉపాధ్యాయులుగాను జీవించెదరు.

**సామాన్య గుణములు** : తమకన్నా పైనున్న వారి ఆజ్ఞలను శిరసావహించి నిజాయితితో , బాధ్యతలని మనస్ఫూర్తిగా నెరవేర్చుతారు. స్వాభావికముగానే వీరు వినయము, ఓర్పు, పెద్దలయెడ అణకువ మొదలుగున మంచి గుణములు కలిగి ఉంటారు. పెద్దల మాట చద్దిమూట' అన్నట్లు గౌరవిస్తారు. ఏపని అయినా, విశ్వాసపాత్రులయి నిజాయితీగానే నెరవేరుస్తారు. పరువు, ప్రతిష్టలను ప్రాణాధికముగా తలచేది వీరే. తాము పెద్దల యందు చూపే వినయ, విధేయతలు, తమకన్నా చిన్న వారు తమ యెడ చూపాలని ఆశిస్తారు. వీరు శ్రమకు వెరవనివారు. ఇతరులపై అధికారము చెలాయించునపుడు కఠినచిత్తులవలె నగపడు వీరు నిజమునకు సున్నితమనస్కులు. ఇతరులు కష్టపడుట చూసి సహింపలేరు. వీరు ఏ పని చేసినను న్యాయమార్గములోనే చేయుదురు. నిండైన మతాభిమానముగల వీరు ఏమతస్థులయినను ఆచారవంతులుగనే ఉందురు. ప్రాచీన పద్ధతులు, అలవాట్లమీద నమ్మకము కల వీరు, క్రొత్త విషయములకు, నూతన అలవాట్లకు త్వరగా లో బడరు. నవనాగరికులకు వీరు పురాణకాలపు వారివలె కనబడుదురు. వీరు పూర్వీకులను అనుసరించియే జీవింతురు. తన స్వంత ఇష్టము ప్రకారము పనిచేయుట వీరి వద్ద లేదు. ఎట్లు చేయుట పద్ధతియో అట్లే చేయుదురు. ఇతరులకు సహాయపడుటకు తయారుగా ఉండు వీరు ఇతరుల నుండి ఒక్క సహాయమును కోరరు. ఆత్మాభిమానము వదులుకొనక, ఇతరుల జోక్యము లేకయే అన్ని సమస్యలను తామే పరిష్కరించుకొనుట వలన, తక్కినవారికి వీరు గర్విష్ఠులుగ కనపడెదరు. కాని వీరికి గర్వము ఇసుమంతయు లేదు. సహజముగనే వీరు పెద్దరికము కలవారగుటచే పరులవద్ద యాచించుటకు సంకోచము అడ్డువచ్చును. స్వంత పనులకన్న, సాంఘిక కార్యములు వీరిని ఎక్కువ ఉత్సాహపరచును. ఏరకమయిన స్వలాభములేని పనులలో వీరిని చూడవచ్చును. వీరు ఎడతెగని ప్రయత్నముల వలనను, మంచి గుణముల వలనను పెద్ద పదవులను వహించుచున్నారు. వీరిలో మహోన్నతస్థితిలో ఉన్న వారి జీవితమును పరిశీలించినచో వీరిని అదృష్టశాలురని అనరు. వారి యోగ్యతకు తగిన పదవియని అనిపించును. వీరు జీవితములో క్రమముగా నే పైకి వచ్చెదరు. తమ శక్తికి

మించిన పదవులకు ఎన్నడును ఆశపడరు. ఏస్థితిలో ఉన్న ను తృప్తితో ను, నిజాయితీతో ను పనిచేసెదరు. వీరిని స్వశక్తిపై నమ్మకము కలవారు, నమ్మకము లేనివారు అని రెండు రకములుగా విభజింపవచ్చును.

స్వశక్తిపై నమ్మకము కలవారు తనకు సరియని తోచినదానిని జంకుబొంకులేక బహిరంగపరచి ఆదరణ కోరతారు. ఇతరులను ఎన్నటికీ సలహాలడుగరు. తీర్మానించిన పిదప అది యే కార్యమయినను, ఎవరు ఎదురించినను, లక్ష్యపెట్టక ఆ కార్యమును కొనసాగింతురు. ఏపనినీ సగములో వదలరు. విరోధులెంత బలవంతులయినను భయములేక ఎదురింతురు. యుద్ధమున ఓటమి కన్నా మరణమే మేలని తలచువారు గొప్ప ఆశయములచే ఆకర్షింపబడి జీవితమంతా లక్ష్యవాదులుగనే గడుపుదురు. ఆశయములకై సర్వము త్యాగము చేయగల వీరిని 'భూలోకమున అవతరించిన దేవతలని' అనవచ్చును.

తమపై, తమ శక్తిపై నమ్మకము లేనివారు, బాల్యమున పెద్దల మాటకు కట్టుబడి మనసున తోచు విషయములను అణచుటచే, పెద్దవారయిన తరువాత స్వతంత్రమున్నను, కుటుంబ బాధ్యతలు, విధులు వీరికి అడ్డుపడి త్యాగమార్గమున పోనీయక సామాన్యులను చేయును. చివరకు ఇట్టివారికి మంచివారన్న పేరు మాత్రము మిగిలి, ప్రతిష్ఠ ఉన్నతపదవులను ఆశింపక చాకిరిచేయు స్థితి ఏర్పడును. ఇట్టివారే నేడు దైనందిక జీవితము సవ్యముగా నడచుటకు గల అన్ని పరిశ్రమలలో ను ఉండి ప్రపంచమున అన్ని పనులు చక్కగా నెరవేరుటకు తోడ్పడుచున్నారు. గుమాస్తాలు, సెక్రటరీలు, (ఇట్టివారిని సెక్రటరీలుగాగల అనేక ప్రముఖులు మిక్కిలి ప్రజ్ఞాశాలురుగా గుర్తింపబడుచున్నారు. నిజమైన ప్రజ్ఞ వీరి సెక్రటరీలదే). సాధు స్వభావము కలవారుగ ఉండునదియు వీరే. ఇతరులకు తోడ్పడుటలోనే ఎప్పుడూ వీరు ఆసక్తి చూపించెదరు. తన కుటుంబముకొరకు ఎంతటి త్యాగమునైనను చేసెదరు.

సునిశితబుద్ధియు, కృషియు కలవారగుటచే బాల్యమునందే ప్రజ్ఞాశాలురుగ గుర్తింపబడుదురు. చురుకుదనము గలిగిన ఈ సంఖ్యలో జన్మించిన బాలబాలికలు, తరగతిలో అగ్రగణ్యులుగ ఉండుట సహజము. చిన్నతనమందే తమ బాధ్యతలు గుర్తించి అందరి మెప్పు పొందుతారు. వీరిలో అనేకులు అతి చిన్నవయసులోనే

కుటుంబభారము వహిస్తారు.

దానధర్మములందు, ధర్మస్థాపనములను ప్రారంభించుటయందు వీరికి ఆసక్తి ఉండదు. సవ్యముగా నడుచుచున్న సంస్థలకు సహాయ, సహకారము లందించెదరు.

కుటుంబ గౌరవము, దేశరవములకై పోరాడగలిగిన వీరు ప్రతిష్ఠకు భంగము కలిగించు పనులలో ఎన్నటికిని దిగరు.

గురుబలము (సంఖ్యాబలము) తగ్గినచో బద్దకము, కుతర్కము, ఆడంబర ప్రియత్వము, జూదములందాసక్తి, మితిమీరిన ఖర్చులు, అప్పుల బారిన పడుటయు, తప్పుదోవలలో పోవుటయు జరుగును. కనికరము తగ్గును. మనసున ఇంద్రియ చాపల్యము కలుగును. ఈ గుణములు కనిపించినచో గురుబలము తగ్గినవని గ్రహింపవలెను. అట్లుండినచో ఉన్నతస్థితినుండి క్రిందకు పతనము చెందుదురు. గురు ఆధిక్యత విపరీతముగా ఉండినచో అధికార దాహము యెక్కువగును. ప్రజ్ఞ పెరిగి, కరుణ తరుగును.

వీరి వేషభాషలు, నడవడికలలో అణకువ, గంభీరత, శాంతము, ధృతి స్పష్టముగ ఉండును (ఏనుగువలె)

సహజముగనే ఏకాగ్రచిత్తులు కనుక వీరికి శక్తి శరీరమంతయు కలసి ఉండును. కండ్లు ప్రకాశముగా ఉండును. వాక్కు గంభీరమై స్పష్టముగా, గంట మ్రోగినట్లుండును. వీరిలో అనేకులు మంచివక్తలుగా ఉండుటకు, వీరి ఆకర్షణశక్తి నిండిన కన్నులును, శ్రోతల మనసులలో నిండు స్వరమును, గంభీర వనచములే కారణము.

## శరీర నిర్మాణము

సగటు ఎత్తు, అందమైన కనుబొమ్మలు, కరుణతో నిండిన కన్నులు (పైరెప్పలు స్పష్టముగా కనబడునట్లు కఠినముగా ఉండును). చక్కని నోరు, కొంచెము పెద్దవయిన రెండు ముందు పళ్లు గల అందమయిన పలువరుస కలిగిన వీరు చిరునవ్వులు చిందించెదరు. (పళ్ళు వరుసగా లేనిచో సంఖ్యాబలము తగ్గినదని గుర్తింపుడు). జుట్టు వంకీలులేక పొడవుగాను, మెత్తగాను ఉండును. (శిరస్సున ఉష్ణము అధికము కావున తల నెరయుట, బట్ట పడుట వంటివి త్వరలోనే జరుగును). ఎముకలు కనబడకుండ

తగుమాత్రపు కండపుష్టితోనే ముఖము, శరీరము ఉండును. మెడ, భుజములు బలముగా ఉండును. నిటారుగ ఉండు నడక గంభీరత నిచ్చును. ఎప్పుడూ ఏదో ఒక పనిలో నిమగ్నులగుటవలన వీరి శరీరము ఉష్ణముగా ఉండును.

## అనారోగ్యాలు

మానవుని కాలేయము, నడుము, తొడలు, కాళ్ళు అనువానికి గురువు అధిపతి. వీరికి కొద్దిగా ఆరోగ్యము దెబ్బతిన్నను, చర్మమునకు సమీపమున ఉండు నరముల కొనలు స్పర్శజ్ఞానమును పోగొట్టుకుంటాయి. కొంతమందికి కీళ్ళవాతము కలుగుటయు కద్దు. కాని వీరు జాగ్రత్తపడవలసినది చర్మవ్యాధులనుండియే. వీరిలో అనేకులు దాదాపు తమ 39వ యేట గజ్జి(Eczema) (ఎక్జిమా) అనబడు చర్మవ్యాధిచే పీడింపబడుచున్నారు. వీరికి వచ్చు కురుపులు, దురదలు కూడ త్వరగా నయముగావు. చికిత్స వలన నయముగాని ఎక్జిమా రాకుండా నివారించుటయే వీరు తీసుకోగలిగిన జాగ్రత్త. (ఈ వ్యాధిగల అనేకులు బల్లిమూత్రము మీదపడినందువల్లనే ఈ వ్యాధి కలిగినదని చెప్పుచున్నారు). ఇంగ్లండునకు ప్రధానిగా నుండిన క్లైమంట్ ఆట్లీ ఈ వ్యాధి బారినపడి, ఎన్ని వైద్యములు చేసినను ఫలించక, నీరు కారుటచే, కూర్చొనలేని పరిస్థితి యేర్పడి, పార్లమెంటు సభలకు తరచు గైరుహాజరు అయినారన్న సంగతి వార్తాపత్రికల ద్వారా పాఠకులు చదివియుందురు. కనుక, ఈ వ్యాధి రాకుండా కాపాడుకొనవలయునన్నది స్పష్టముగా గ్రహింపవలెను. వీరి జీర్ణవ్యవస్థలో వాయువు ఏర్పడుటచే, అజీర్ణము, ఆమ్లత, మలబద్ధత, కామెర్లు మొదలగు వ్యాధులచే బాధపడుదురు. 3 సంఖ్యాధీనంలో ఉండువారు సామాన్యముగా రాచపుండు, పక్షవాతం మొదలగు నరముల వ్యాధుల బారిన పడవచ్చును.

**ఆహారము-మూలికలు:** వీరి శరీరమునకు ధాన్యములలో గోధుమ, కూరగాయలు, పండ్లలో టొమేటో, నిమ్మ, దానిమ్మ, అనాస మేలు చేయునవి. బాదము వంటికి పడినచో కొద్దిగా చేర్చుకొనవచ్చును. చర్మవ్యాధులు రాకుండ కాపాడుటకు, జీవశక్తిని అధికము చేయుటకు మూడవ సంఖ్యవారి మూలిక ఉసిరికాయయే. కాయలు దొరకని కాలమున వరుగులు వాడవచ్చును. సాధారణ ఆరోగ్యకర జీవితము గడుపుటకు వాయువు, ఆమ్లకారక ఆహారము నిషేధించవలయును.

**ప్రత్యేక గుణములు:** 3-వ తారీకున పుట్టినవారు మంచి చింతనాశక్తి కలవారుగా ఉందురు. వీరు దైవభక్తిని, శరీరబలమును గౌరవించి పెంచుకొనవలయును. మనోభావములను సున్నితముగా బయట పరచుట అలవాటు చేసికొనవలెను. గణితములో వీరు చక్కగా రాణిస్తారు. కావ్యములను, చిత్రలేఖనము వంటి కళలను ఆస్వాదించుట వాడుక చేసికొనవలెను. జీవితము గౌరవప్రదముగాను, ఉన్నతమయినదిగాను ఉండును. నడివయసుకు పిదప ప్రతిష్ట ఎక్కువగును.

12 న జన్మించిన వారు నిస్వార్ధ కృషివలనను, త్యాగము వల్లను, కీర్తిని పొందుతారు. జీవితము లోకులకోసం చేయు తపస్సుగ ముగియును. పరోపకార కార్యములు చేయవలెను. త్యాగులకైన గుణములు పుట్టుకతోనే ఉండును. బాల్యముతోనే కష్టములను, బాధ్యతలను అర్థము చేసికొనవలసిన వారగుటచే (ఈతేదీలో పుట్టినవారనేకులు బాల్యమందే తండ్రిని పోగొట్టుకొనుచున్నారు. కొందరు తల్లిని పోగొట్టుకొనుచున్నారు. సంఖ్యాధిక్యము తగ్గుటయే దీనికి కారణము. ఆధిక్యత బాగుగానున్న వారు తల్లిదండ్రులతో ఉందురు. అయినను తండ్రికి, ధననష్టము కలుగు సూచనలున్నవి) ఆశ్చర్యము గొలుపు నంతటి వక్త కాగలరు.

21న జన్మించినవారు తక్కిన మూడు తేదీలవారికన్న స్వార్థులుగా ఉందురు. త్యాగము చేసి ఫలితము నాశించెదరు. వీరు వార్తాపత్రికలు చదువుట మంచిది. లోకానుభవము, లోకజ్ఞానము ఎక్కువ కానుకాను జీవితము కూడా అంత ఉన్నతి పొందును. కార్యశీలి కనుక విలేకరులుగాను, లోకాభిప్రాయములను మార్చి అమర్చగలిగిన వారుగాను ఉందురు. ప్రజ్ఞయే వీరికి విజయము చేకూర్చును. జీవితము, కఠిన పోరాటమయముగా ఉండును. దృఢచిత్తముతో ముందుకుసాగి పూర్తి విజయమును అనుభవించెదరు.

30వ తేదీన పుట్టినవారు లోతైన ఆలోచనలు, సూక్ష్మమైన బుద్ధిగలవారు. గంభీరముగా జీవనము గడుపుటకే ఇష్టపడెదరు. తనకు తోచినట్లు జీవించు ఉగ్రవాదులుగా ఉందురు. సునిశిత విమర్శచే దేనినయినా అర్థము చేసికొనగల ప్రజ్ఞాశాలురు. నేర పరిశోధన చేయగలిగినంత గొప్ప మేధావులు. అమిత ధైర్యము, ధీశక్తి కల్గిన వీరు ఓటమికి జంకరు. కళలలో సులభముగా ఆరితేరు వీరు కొంతమేరకు

ఏకాంతమును కోరుదురు. వీరు తమకి గల ప్రజ్ఞాశక్తులు అన్నింటినీ తమ జీవిత కాలంలో పూర్తిగా ఉపయోగించ తలచెదరు.

## నామ సంఖ్య-మూడు

మీ పేరులోని అక్షరముల సంఖ్యలను కూడినచో వచ్చు సంఖ్య 3 అయినచో, మీరు ఈ సంఖ్యాధిక్యము క్రిందకు వచ్చెదరు. ఈ సంఖ్యకు చెందిన పేరు సంఖ్యలను, వాటి గుణములను గమనింపుడు. జన్మించిన తేదియో, పుట్టినతేది, నెల, సంవత్సరము కలిపిన వచ్చు సంఖ్యయో మూడుగా ఉండినచో పేరు కూడా 3 సంఖ్యలో ఉండవచ్చును. తక్కిన సంఖ్యలవారికి 3 సంఖ్య పేరు ఉండిన వారి జీవితము నిష్ప్రయోజనమగును. (కష్టము వీరిది. ఫలితము పరులది. అనగా వీరు అనుభవించవలసిన ఫలములు ఇతరులు అనుభవింతురు.)

## కూడిక వలన 3 వచ్చు సంఖ్యల ఫలములు

3. కృషి, ప్రజ్ఞ, విజయములను సూచించుచున్నది. సంతోషకరమైన జీవితము, అంచెలంచెలుగా ప్రగతియు కలదు. ఉన్నతవిద్య కలదు.

12. శ్రోతలను ఆశ్చర్యపరుచగలిగినంత ప్రసంగి అగును. పరులకొరకు పలుకష్టములను సంతోషముగా భరించెదరు. పరులు మంచి ఫలితములు పొందుటకై శ్రమించెదరు.

21. తన సంతోషము, లాభమునందే దృష్టి సారించియుందురు. కడుప్రయాసతో మెల్లమెల్లగా జీవితములో ఉచ్ఛస్థితినందుకొందురు. ఏకాగ్రత ఉన్నతినిచ్చును. సమర్ధతతో దేనినయిన నిర్వహింపగలరు. జీవితములో మొదటి సగ భాగము సమస్యలమయంగా ఉండును. నడివయస్సుకుపై జయము, సంతోషము నిండిన జీవితమేర్పడును. నిరంతరపదవికూడ దొరకును.

30. వీరు ఊహాలోకములోనే విహరింతురు. కుశాగ్రబుద్ధియు, దూరాలోచన వీరికి ఎక్కువగానే ఉండును. వీరు తమకు నచ్చినట్లే చేసెదరు. స్వలాభము లేకపోయినా తన ఆత్మతృప్తి కోసం కష్టమయిన పనులనులో నిమగ్నమవుతారు. వీరు మిక్కిలి శక్తి కలిగి ఉంటారు. వీరికి ధనసంపాదనలో తగిన ఆసక్తి, ఏకాగ్రత ఉండవు. వీరి మనసును

సులభముగా అర్థము చేసికొని గెలవవచ్చును. మనోనిగ్రహము వలన కలుగు సిద్ధులు వీరికి చాలా సులభముగా సిద్ధించును.

39. తీవ్రమయిన కృషి చేయగల వీరు ఉన్నతస్థితిని అందుకొన్నప్పటికీ వీరికి చెందవలసిన కీర్తి వేరొకరికి చేరును. వీరు పరులకొరకే శ్రమపడుతూ ఉంటారు. తక్కిన మూడు సంఖ్యవారికన్న వీరికి అనారోగ్యము ఎక్కువ. చర్మవ్యాధులు సులభముగా వీరికి అంటుకొనును.

48. మత విషయములలో అధికశ్రద్ధ ఉండును. సామూహిక కార్యములలో ఎక్కువ వ్యతిరేకత ఉండును. సంఘ సంక్షేమమునకై అనేక పనులు సాధించెదరు. సమస్యలెక్కువ. శక్తికి మించిన పనులు చేయ ప్రయత్నించెదరు. విధి సదా అడ్డుపడును.

57. ప్రారంభములో విజయమునిచ్చే ఈసంఖ్య చివరలో అశ్రద్ధను వెనుకకు తగ్గుటను సూచించును. వేగముగా వృద్ధి చెందుచుండు జీవితము చటుక్కున ఒక్కచోట ఆగిపోవును. సామాన్యులు ప్రముఖులయి తిరిగి సామాన్యులుగ మారిపోవుదురు.

66. ఆశ్చర్యకరమయిన వాగ్దాటి, కళలలో నేర్పు, ప్రభుత్వ ఆదరణ, సుఖము, భోగభాగ్యముల జీవితము ఈ సంఖ్య ప్రత్యేకత.

75. వీరికి అకస్మాత్తుగా కీర్తి పెరుగును. త్వరగా అనేక మిత్రులను పొందుదురు. ఎదురుచూడని విధంగా ప్రముఖులవుతారు. సుఖము, కీర్తి వెదుకుతూ వస్తాయి. కవితా శక్తి కలుగును. వీరు రచయితలు అవుతారు.

84. ప్రారంభములో జీవితము దుఃఖమయముగా ఉండును. ప్రయాణమువలన మేలు కలుగును. అనవసరపు విరోధములు ఏర్పడును. దిగులు ఎక్కువగా ఉండును. ప్రయత్నమునకు తగిన ఫలితముండదు. ఆధ్యాత్మిక రంగములో కొంత వృద్ధియుండును. ఉత్సాహము కొంత తగ్గును. ఉగ్రవాదియగును. జన్మతేది సంఖ్యలు మంచివిగా ఉండి నచో అసాధ్యములైన కార్యములను సాధింతురు.

93. అద్భుతమయిన పనులను సాధించేశక్తి మెండుగా ఉండును. లోకజ్ఞానము ఎక్కువ. అనుకున్న ఆశలు నెరవేరును. కావ్యములు, నాటకములు రచించి పేరు

తెచ్చుకుంటారు. కళాకారులు అవుతారు. గౌరవము ఎక్కువగును. పలువృత్తులలో లాభము కలదు.

102. ప్రారంభమున విజయమును, మధ్యలో అలసటను చివరలో కొంత అయోమయమును ఇది సూచించును. అంత శ్లాఘ్యమైన సంఖ్య కాదు.

### ముఖ్య సూచన

ఈ సంఖ్య గురు గ్రహమును సూచించుచున్నది. తక్కిన గ్రహముల స్థానములను తన గుణములతో సరిచేయు గ్రహము గనుక స్వయముగా మేలు తప్ప కీడు చేయదు. జన్మించిన దినమున, తేది, నెల, సంవత్సరము కూడిన వచ్చు సంఖ్య ప్రకారము దాని ఫలితములను ఎక్కువచేసి ఆ ఫలితములనే ఇచ్చును కనుక ముఖ్య సంఘటనలు కూడా విధిసంఖ్య సూచించు వయసులోనే జరుగును. జన్మతేది, నెల, సంవత్సరము కూడితే వచ్చు సంఖ్య కూడ 3 అయినచో పేరు సంఖ్యలను అనుసరించియే అన్నియును జరుగునని గుర్తుంచుకొనవలెను.

### అదృష్ట దినములు

ప్రతినెలలోను వచ్చు 3, 9, 12, 18, 21, 27, 30 తేదీలు మిక్కిలి అదృష్టము నిచ్చును. ముఖ్యమైన పనులను ఈ రోజులలోనే ప్రారంభము చేయుడు. నిరంతర ఫలితములనిచ్చు పనులు (వివాహము, పరిశ్రమ, వృత్తి ప్రారంభములు) తేది, నెల, సంవత్సరము కలిపితే 3గాని 9, గాని వచ్చు దినములలో చేయవలెను.

### దురదృష్ట దినములు

6, 15, 24 తేదీలు కొన్ని సమయములలో సాధకముగా కనబడినా, తరువాత కీడు చేయును. ఈతేదీలు ఆటంకములను, శ్రమలను ఎక్కువ చేయును. ముఖ్యమైన ప్రయత్నములను తేది, నెల, సంవత్సరము మూడింటిని కూడితే 6 వచ్చే దినములందు చేయవద్దు.

### వృత్తులు

ఉపాధ్యాయ వృత్తి, బ్యాంకు, గుమాస్తా, సెక్రటరీ పదవులు ప్రారంభములోనే గౌరవనీయ ప్రభుత్వ ఉద్యోగములు, ధర్మసంస్థలు, మితిమీరిన క్రమశిక్షణగల మిలటరీ

ఉద్యోగము, వాక్చాతుర్యము ఉపయోగింపవలసిన వృత్తులు వీరికి తగినవి. సూక్ష్మగ్రాహులగుటచే వైజ్ఞానికులుగను, పరిశోధకులు (రిసెర్చి సాగను, తత్వశోధకులుగను, రాణింతురు. పరులకు సలహాలనిచ్చే ACS, CA, Cost Accountant వంటి వృత్తులు కూడ మంచివే. విధి సంఖ్య 4 అయినచో ప్రసిద్ధమైన వక్తగాను, 1 లేక 6 అయినచో అధికార పదవిలోను ఉందురు.

## వ్యాపారం

దయార్ద్ర హృదయులగుటవలన, ఇతరుల కష్టములను తనవిగా భావించు వారగుటవలన, వీరు వ్యాపారములో దిగినచో, అప్పులు ఇచ్చి నష్టమే వచ్చును. కాని చక్కగా, లాభకరముగా నడచు వ్యాపారములలో భాగస్వాములుగా చేరవచ్చును.

## సహకరించువారు

3 సంఖ్య వారికి, 3వారు, 9వారు, 2 సంఖ్యవారు సహకరింతురు. 5, 6, 8 వారి వలన మేలు జరుగదు. 1, 4, 5 వారి విధి సంఖ్య 3గా ఉండిన ఎడల వారి వలన సహకారము ఉండును.

## కుటుంబ జీవితం

3 సంఖ్యలో జన్మించినవారు 3, 9 సంఖ్యలవారినే మెచ్చుతారు. తేది, నెల, సంవత్సరము కూడగా వచ్చు సంఖ్యకు తగిన సంఖ్య కలవారిని వివాహమాడవచ్చును. సద్గుణములు, నిజాయితీగల వీరు, 3 సంఖ్యవారినే పరిణయమాడినచో నిండైన జీవితమును, దైవకృపయు కలుగును. 2 సంఖ్యవారివలన కూడా సుఖము, సంతానము కలుగును. 8 సంఖ్యవారిని మాత్రము వివాహమాడరాదు. పరుల కష్టముల నోర్వలేనివారు కనుక వివాహ జీవితము సంతోషకరముగానే ఉండును. నాగరికతపై వ్యామోహము లేకుండుటవలన మధ్య మధ్య అభిప్రాయభేదములు వచ్చును. మెత్తనివారే కాని ఇతరులు అన్యాయముగానో, అమర్యాదగా నో నడచుకొనినను, కుటుంబ గౌరవ ప్రతిష్ఠలకు భంగమేర్పడునపుడు కోపము తారస్థాయికి చేరుకొనును. కాని వివాహరద్దు గురించి మనసులో కూడా తలచరు.

**సుఖప్రదమయిన సంసార జీవితమునకు పెండ్లి తేదీలు ఈ విధముగా ఎంచుకోండి:**

| జీవిత భాగస్వామి సంఖ్య | వివాహ తేదిశి & దాని విధి సంఖ్య |
|---|---|
| 1, 2, 4 | 1 & 1, 4 & 1, 2 & 1 |
| 3 | 1 & 3, 3 & 3, 3 & 9 |
| 5 | 1 & 1, 3 & 1 |
| 9 | 3 & 3, 3 & 9, 9 & 3 |

**అదృష్టమైన రంగులు :** ఆరంజి, రోస్ వంటి అన్ని ఎరుపు రంగులును మేలు చేయును. తామరపూవు రంగు మిక్కిలి అదృష్టకరమయినది. వంగపూవు రంగును, పసుపు, ఎఱుపు, నీలము కలిసిన రంగులును శ్లాఘ్యమే.

**వాడకూడని రంగులు :** ముదుర నీలం, నలుపు, ముదుర పచ్చ.

రతము

వీరికి శుభముల నొసగి, మనశ్శాంతిని, సద్గుణముల పెంపును ఇవ్వగలిగినది Amethyst (ఎమెథిస్ట్). వంగపూవు రంగులో ఉండు ఈ రాయి జయవంతియనియు పిలువబడుచున్నది. జలక్రాంతమని కూడా కొన్ని గ్రంధములలో కలదు. పుష్పరాగము కూడా వీరికి మంచిదే. చర్మ వ్యాధులు రాకుండా, వీరు నీల మణిని ధరించవలెను. 5 కారెట్టులు గల దీనిని ఎడమ చేయి చూపుడు వేలుకు ధరించుటచే, సంపద, కీర్తి, సద్విద్య లభించును.

మూడు సూచించు అక్షరముల గుణములు

C పేరులోని మొదటి అక్షరముగా ఉండిన బలము అధికము. హింసను, మగతనమును సూచించును. సృష్టించు శక్తిని, పాలించుటకు తగిన బలమును

ఇచ్చును. ఏవృత్తిచేపట్టినను, గొప్పతనమును, అసాధ్య సాధనలను, మేధస్సును ఇచ్చును. ఈ శబ్దము, ఆతురత, వేగముగల తరంగములను కలిగియున్నది. బుద్ధి, వాక్కు, జననేంద్రియముల మూలముగా దీని శక్తివెలువడుటకై ఆతురపడును. ఎదుటివారు బద్ధకస్తులుగానో, నిదానస్తులుగనో ఉండిన వీరు ఓర్చుకొనలేరు. చేతులు ఉపయోగించి, శరీరశ్రమ చేసి జీవించుట వీరికి నచ్చదు. జీవితమున పైకి రావలెనన్న ఆత్రుత, తపన ఉండును. గొప్ప లక్ష్యములను ఏర్పరచుకొనుట ముఖ్యం. అట్లుగా దేని, ఇతరులు వీరిని క్రూరులనుటకు ఆస్కారమున్నది.

కళలలోను, శాస్త్రములలో ను మిక్కిలి ఆసక్తి ఉండును. ఏ పనిచేసినను ముగింపు తెలిసికొనుటకు తొందరపడుతారు. పనిచేయగల సమర్థులను ఈ శబ్దము సూచించుచున్నది. శక్తిని వీరు చెదరగొట్టుకొందురు. భోగములనుభవించుటలో కొంత నిదానము అలవరచుకొనవలెను. ఇది ఎఱుపు, నారింజ, వయొలెట్ రంగుల మిశ్రమము.

G పైన పేర్కొన్నం వంటిదే అయినను దానికన్నా గొప్పది. వారు ఇతరులపై అధికారము చేయ సమర్థులు. కాని ఆ అక్షరముతో పేరు ప్రారంభమగువారు తామే స్వయంగా అన్ని త్యాగములకు, అగ్ని పరీక్షలకు ఎదురేగుతారు. మితిమీరిన ఆత్మవిశ్వాసమును, ఎట్టి పరిస్థితినయిన భరించు శక్తిని కలిగియుందురు. క్రొత్త విషయములను కనుగొందురు. పథకము వేసి పనులు సాధించెదరు. ఏ పని మొదలిడినను దాని ముగింపును మొదటినుండియు సరిగా (దూరదర్శివలె) అర్థము చేసుకొనెదరు. సత్యము, ప్రేమ ఎక్కువ. సహనము కూడ ఎక్కువే. జబ్బు చేసినను త్వరలోనే బాగవు తారు. మంచివారుగా లేకపోతే మోసగాళ్ళుగాను, బద్ధకస్తులుగాను ఉందురు. ఎఱుపు, పసుపు, నీల వర్ణములను ఈశబ్దము సూచించును..

L ఇతరులచేత పనిచేయించటములో నిపుణులు. ఈ అక్షరమువారు ఇతరులకు సదా పని పురమాయిస్తూనే వుంటారు. దేనినీ మరచిపోరు. అనుకున్న దానిని సాధించియే తీరుతారు. పైకి కనపర్చకుండా, చాప కింద నీరులాగ కార్యములను కానిచ్చుకుంటారు. వీరు కార్యవాదులు. ఈ అక్షరము ఎరుపు రంగునకు ప్రాధాన్యతనిచ్చును.

S ఇది రెండుతలల పాములవంటిది. ఎఱుపుకు వ్యతిరేకమయిన పచ్చ వర్ణ ప్రకాశ కలది. ముఖ్య గుణము : తీవ్రమైన అభిప్రాయములను ఏర్పరచును. పొగడుతారు లేకపోతే తిడతారు. బాగా ఉత్సాహపరచి మాట్లాడుతారు లేకపోతే ముఖము వాచేటట్లు తిట్టి ఈటెలవంటి మాటలతో గుచ్చి గాయపరుస్తారు. శాంతి ఒడంబడికలు చేస్తారు లేదా తగువులు పెడతారు. అల్పత్వము నిండిన వారయినచో అందరినీ పీపుకు తింటారు. మేలుగుణములుగల వారయినచో ఇతరుల కన్నీరు తుడిచేవారుగ ఉందురు. రెండు విరుద్ధ గుణములు కలిసే ఉంటాయి. ఇతరుల దుఃఖము తీర్చెడి వైద్యవృత్తికి ఇది తగినది.

**3** తేదీలో పుట్టిన కొందరు ప్రముఖ వ్యక్తులు

| పేరు | జన్మతేది సంఖ్య | తేది-విధి సంఖ్యలు |
|---|---|---|
| DR. RAJENDRA PRASAD<br>డా. రాజేంద్ర ప్రసాదు | 3-12-1884 | 3 & 9 |
| SRI PRAKASA<br>శ్రీ ప్రకాశ | 3-8-1890 | 3 & 2 |
| V.K. KRISHNA MENON<br>V.K. కృష్ణమేనన్ | 3-5-1897 | 3 & 6 |
| SARDAR K.M. PANIKKAR<br>సర్దార్ K.M.పణికర్ | 3-6-1895 | 3 & 5 |
| HAR BILAS SARDA | 3-6- | 3 & 4 |

| | | |
|---|---|---|
| హర్ బిలాస్ సర్దా (బాల్య వివాహ నిషేధ చట్టమును తెచ్చి నవారు. సనాతనులను ఎదిరించి తేబడ్డ ఈ బిల్లు నేటికీ సర్దా బిల్లుగానే చెప్పబడుతోంది.) | 1867 | |
| ALEXANDAR GRAHAM BELL<br>అలెగ్జాండరు గ్రాహం బెల్ (టెలిఫోను కనుగొన్న శాస్త్ర జ్ఞుడు) | 3-3-<br>1847 | 3 & 8 |
| GERALD ERNEST GIBBS<br>ఎయిర్ మార్షల్ జెరాల్డ్ ఎర్నస్ట్ గిబ్స్ | 3-9-<br>1896 | 3 & 9 |
| STANLEY BALDWIN<br>స్టాన్లీ బాల్డ్ విన్ | 3-8-<br>1867 | 3 & 6 |
| CLEMENT ATTLEE<br>క్లెమెంట్ ఆట్లీ | 3-1-<br>1883 | 3 & 6 |
| JULIUS CAESAR<br>జూలియస్ సీజర్ (రోమన్ చక్రవర్తి. 16 ఏండ్లకే తండ్రిని పోగొట్టుకొన్న వాడు. జన్మతేది 12- గమనించండి.) | 12-7-<br>1000 | 3 & 2 |
| SIRC.P. RAMASWAMY AIYAR<br>సర్ సి.పి. రామస్వామి అయ్యరు | 12-11-<br>1879 | 3 & 3 |
| JOSEPH STALIN<br>జోసఫ్ స్టాలిన్ | 21-12-<br>1879 | 3 & 4 |

| | | |
|---|---|---|
| EDMUND BURKE<br>ఎడ్మండ్ బర్క్-ప్రసిద్ధ వక్త | 12-1-1728 | 3 & 4 |
| ABRAHAM LINCOLN<br>అబ్రహాం లింకన్ (ప్రసిద్ధికెక్కిన అమెరికన్ ప్రెసిడెంటు) | 12-2-1809 | 3 & 5 |
| GEORGE EASTMAN<br>జార్జ్ ఈస్ట్మన్ (సినిమాలకు ఉపయోగించు ఫిల్మ్ రీలు తయారీదారులు మరియు కొడాక్ కంపెనీ స్థాపించిన వారు. వీరు మేడమీద నుండి దూకి ఆత్మహత్య గావించుకొన్నారు.) | 12-7-1854 | 3 & 1 |
| SWAMI VIVEKANANDA<br>స్వామి వివేకానంద | 12-1-1863 | 3 & 4 |
| RAMSAY MACDONALD<br>రామ్సే మెక్డోనాల్డ్ | 12-10-1866 | 3 & 7 |
| SRI KRISHNA SINHA<br>శ్రీ కృష్ణ సిన్హా | 21-10-1887 | 3 & 1 |
| SIR ANTHONY EDEN<br>సర్ ఆంథోనీ ఈడెన్ (57 యేండ్లకే బ్రిటిష్ ప్రధాని అయి, సూయజ్ వ్యవహారములో రాజీనామా చేసారు) | 12-6-1897 | 3 & 7 |
| VIJAY MERCHANT | 12-10- | 3 & 7 |

| | | |
|---|---|---|
| విజయ్ మర్చంట్ (ప్రసిద్ధ క్రికెటర్) | 1911 | |
| V. MANKAD<br>వినూ మన్కడ్ (క్రికెటర్) | 12-4-1917 | 3 & 7 |
| FLORENCE NIGHTINGALE<br>ఫ్లోరెన్స్ నైటింగేల్ (రెడ్ క్రాస్ స్థాపకురాలు) | 12-5-1820 | 3 & 1 |
| K.R.K. MENON<br>కె.ఆర్.కె. మీనన్ | 21-6-1901 | 3 & 2 |
| SIR PHILIP SYDNEY<br>సర్ ఫిలిప్ సిడ్నీ | 30-11-1554 | 3 & 2 |
| SIR WINSTON CHURCHILL<br>సర్ విన్స్టన్ చర్చిల్ | 30-11-1874 | 3 & 7 |
| FRANKLIN DELANO ROOSEVELT<br>ఫ్రాంక్లిన్ డిలానో రూజ్వెల్ట్ \| (మాజీ అమెరికా ప్రెసిడెంటు) | 30-1-1882 | 3 & 5 |
| V.P. MENON<br>వి.పి.మీనన్ | 30-9-1894 | 3 & 7 |
| R.R. DIWAKAR<br>ఆర్.ఆర్. దివాకర్ | 30-9-1894 | 3 & 7 |

## అంకె 4 - రాహువు

ఇంతవరకు క్రిందటి మూడు అధ్యాయములలో జ్ఞానము, మనస్సు, క్రియాశక్తి అనువానిని సూచించు అంకెలను పరిశీలించినాము. ఆ మూడు శక్తులనూ ఏకోన్ముఖము చేసి సమాజమును సృష్టించు సంఖ్యయే నాలుగు. శాస్త్ర ప్రకారము నడుచుకొను మూడు సంఖ్యల వారిని చూసితిమి. ఇక ఇదే సంప్రదాయము" అని నొక్కి చెప్పు నాలుగు సంఖ్య వారిని పరిశీలించుదాము. సమాజములో విభాజనము, ప్రభుత్వ నిర్మాణము, చట్టములు, కట్టుదిట్టములు ఏర్పడుట, సంస్కరణలు చేయుట వంటివి అన్నియు వీరి సృష్టియే. "పూర్ణ స్వతంత్ర ప్రియులు), వీరే. చతురస్రము 4' సంఖ్యను తెలుపును. ఇది రాహువుకు గుర్తు.

హిందూ జ్యోతిష శాస్త్రములో అన్ని క్రియలలో 4 అను సంఖ్య రాహువును తెలుపును. కాని పాశ్చాత్య సంప్రాదాయం ప్రకారం 4 అను సంఖ్య యురేనస్ ను తెలుపును. హిందూ జ్యోతిష శాస్త్ర పద్ధతిలో యురేనస్, నెప్ట్యూన్ ప్రముఖ పాత్ర వహించుట చేత, మనం రాహువును 4 సంఖ్య ద్వారా తెలిపెదము.

వీరిని సమాజమునకు పునాదులని చెప్పవచ్చును. శ్రీయుత సామాన్య ప్రజలు'ను వీరే. ఇటువంటివారిని పార్లమెంటులోను, పత్రికాలయములందును, వీధి మొగదలలోను, రచ్చబండ వద్దను చూడగలము. ఎల్లవేళలా నలుగురిని కూడగట్టుకొని స్వారస్యంగా మాట్లాడుతూ కనబడుతారు. ప్రయాణములన్నా, వూళ్ళు తిరుగుటయన్నా ఇష్టపడే వీరిలాంటివారినే 'నాలుగూ చూసిన మనిషి' అని అంటారు. తాము చూసిన విశేషాలను కళ్ళకు కట్టినట్లుగా అందంగా వర్ణించి చెపుతారు. "నలుగురూ ఏమంటారో" అనే మాట వీరు ఏమనుకుంటారో అన్నదానినుండి వచ్చినదే. అన్ని ముఖ్య విషయముల గురించియు ఇతరులకు సలహాలిచ్చుమేరకు, వివరించుటకు, కావలసినంత జ్ఞానము సంపాయించుకొంటారు. అందుచేతనే వీరికి "నాలుగూ తెలిసిన వారు" అన్న బిరుదు ఇవ్వబడినది.

ఈ అంకెకు అధిపతి శ్రీ గణపతి. పంచభూతములలో ఈ సంఖ్య భూతత్వమును సూచించుచున్నది. ఈ సంఖ్య అన్నిటినీ విచారించి, పరిశోధించి తెలుసుకునే శక్తిని

ఇచ్చుటవలన బుద్ధిని శాసించునట్లు ఏర్పడి వున్నది.

4, 13, 22, 31 తేదీలలో పుట్టినవారు ఈ సంఖ్యకు గల గుణములు కలిగియుంటారు. వారి గుణలములన్నియు ఈ సంఖ్యచేతనే పాలింపబడును. పుట్టినతేది, నెల, సంవత్సరము కూడిన వచ్చు సంఖ్య మాత్రము 4 అయిన ఎడల, గుణములు పుట్టిన తేదికి తగినట్లుండినను, జీవితములో ఎదురుచూడని అనేక మార్పులు, ముఖ్యమైన నిర్ణయములు, సంస్కరణలు ఈ సంఖ్య ననుసరించియే జరుగును.

**వీరి సహజ గుణములు :**

పైన పేర్కొన్న 4, 13, 22, 31 తేదీలలో జన్మించిన వారు కఠిన వాక్ధోరణి కలిగినవారుగా ఉందురు. వ్రాతమూలకముగాను, మాటలతో ను, తోటివారిని, లోకమును, ముఖ్యముగా తాను జీవించు సమాజమును సంస్కరించాలని అనుకుంటారు. మాటలో కాఠిన్యమే తప్ప మృదుత్వం ఉండదు. అభిప్రాయములను దుడుకు గానే వెలిబుచ్చుతారు. తను నిజమని నమ్మినవానిని బాహాటముగా ఒప్పుకుంటారు. వినువారేమనుకుంటారో అన్న మొహమాటముండదు. జీవిత ప్రారంభములో ఇలా ఉన్నా చాలా మంది, అనుభవస్తులైన పిదప మారుతారు. తమ అభిప్రాయాలను ఇతరులపై రుద్దటానికి ప్రయత్నిస్తారు. ఎవరు ఏమి చెప్పినా వెంటనే దానికి వ్యతిరేకముగా ఒక విషయం చెపుతారు. ఇతరులు చెప్పు ఏ విషయమును ఆమోదింపక వ్యతిరేకముగానే తమ అభిప్రాయమును చెపుతారు. ఇతరులు ఇచ్చు తీర్పు, అది ఎట్టిదయినా ఒప్పుకోరు. పూర్తిగా వాదించి, విచారించి, పరిశోధించి ఒక అభిప్రాయానికి వస్తారు. **ఏ విషయమైనా, వారికొక ప్రత్యేకమైన అభిప్రాయం వుంటుంది.** ఆ అభిప్రాయాలను మార్చుకోవటానికి తయారయితేనే వీరి పథకాలు జయప్రదమవుతాయి. లేకపోతే వీరికి విరోధులు తప్ప స్నేహితులు మిగలరు.

మంచి మనసు, అందరినీ స్నేహితులవలె చూడగల గుణము కల వీరు సులభముగా మిత్రులను సంపాదించవచ్చును. కాని ఈ సంఖ్యవారికి పెక్కురు స్నేహితులు ఉండుట లేదు. దానికి వీరి అశ్రద్ధయే కారణము. ఎందరితో నో

పరిచయమున్నా , గాఢస్నేహమును అభిలషించేవారు గనుక, అతి కొద్దిమందినే స్నేహితులుగా మిగుల్చుకుంటారు. అతి బుద్ధిశాలురగుటచే చిన్నప్పుడే జీవితమును పరిశోధించుటకు పూనుకుంటారు. కథలు, శాస్త్రములు, వేదాంతము, మతపరమైన గ్రంథములు వీరినెక్కువగా నాకర్షించును. **తమకు అన్ని విషయములు తెలిసియుండవలెను అనునదియే వీరి ముఖ్య లక్షణము.** వీరు ఎట్టి ప్రయాసతో నయినా విషయ సేకరణ గావిస్తారు.

తక్కిన కొన్ని సంఖ్యల వారివలె వీరికి కీర్తి కండూతి లేదు. కొరత లేకుండా తృప్తిగా జీవించటానికే ఇష్టపడుతారు. ఆహార విషయములో బహుశ్రద్ధ చూపుతారు. భోజనము, చిరుతిండ్లలో యావ ఎక్కువ. జబ్బులు లేకపోయినా 'బలానికి, ఆయుర్వృద్ధికి ఏమైనా మందు తీసుకోనా? అని అడుగుతారు.

ఇతరుల చిన్న మాట, చేత కూడ వీరిని బాధిస్తుంది. సులభముగా వీరి మనసు గాయపడుతుంది. ఎక్కువ ఆవేశపరులుగ ఉంటారు. విశాల హృదయులయిన వీరు మిత్రుల యెడ ఉదారముగా నడచుకుంటారు. ధన సంపాదన, తక్కిన కొన్ని సంఖ్యలవారి వలె వీరికి సులభముగ ఉండదు. ఒక్కొక్క పైస కష్టపడి సంపాదింపవలసి ఉండును. అయినా దానిని మహా సంతోషంగా ఖర్చుపెడతారు. వీరికి డబ్బు ఖర్చుపెట్టుట ఇష్టము. అందమైన వస్తువులు కొని చేర్చిపెడతారు.

బాల్యములో, పరుగెత్తి ఆడే ఆటలలో ఎక్కువ పాల్గొంటారు. యౌవ్వనంలో, సుఖమైన జీవితము, జీవితంలో వృద్ధిపై తీవ్రకాంక్ష ఉంటుంది. వయసు కానుకాను, వేదాంతములోను, సంఘసేవలోను శ్రద్ధ పెరుగుతుంది. 3 సంఖ్యవారు, తమకేమి జరిగినను ఫరవాలేదని దేశీయ పోరాటములలో దూకుతారు. కాని 4 సంఖ్యవారు, తాము కష్టపడకనే, జయము నిశ్చయముగా లభించునన్న కార్యములలోనే దిగుతారు.

**ముఖ్య సూచన :** పైన చెప్పబడిన గుణములు, వీరిని పరిశోధించితేనే తెలుస్తుంది.

**శరీరము :** వీరు లావైన శరీరము గలవారే. వసతిగలవారయితే బాగా లావవుతారు. ఎత్తు సామాన్యంగానే వుంటుంది. (జన్మతేది, విధి సంఖ్య కూడ4 అయితే బాగా ఒడ్డూ పొడుగుగా వుంటారు). ముఖము పెద్దదిగా, గంభీరముగా ఉండును. 2 సంఖ్య వారివలె

కండ్లు పైకి లేకుండా, కొద్దిగా లోనికి వుండును. నవ్వితే కళ్ళు మూసుకున్నట్లు చికిలించుతాయి. గుండ్రటి పెద్దతల, చిక్కటి తలకట్టు ఉండును. జుట్టు అలలవలె అందముగా నుండును. మరీ వంకీలు తిరిగి ఉండదు. వీరికి శరీరములో జీవశక్తియు, నరములలో పటుత్వము అధికముగనే ఉండును. సామాన్యముగా వీరికి వ్యాధులు కలుగవు. మానసిక అలసట, పొరబాట్లు చేసి పశ్చాత్తాపపడుటయే వీరికి ఆయాసమును కలిగించును. ఏ అనారోగ్యమైనా చికిత్సచే నయమగును. యోగాభ్యాసమునకు వీరి శరీరము తగినది. త్వరగానే అభ్యాసములు మంచి ఫలితములనిచ్చును. ఈసంఖ్యగల బాలబాలికలకు, మితాహారము భుజించుట అలవాటు చేయవలెను. లేకపోతే, నలువదియేండ్లకు పైన (కొందరికి బాల్యములోనే) రక్తము పాలిపోవుట, ఆకలి మందగించుట, ప్రేవులు, తల వెనుక భాగము, నడుము భాగములలో నేప్పి ఏర్పడుట జరుగును. సాధ్యమైనంత మటుకు జీర్ణశక్తిని వృద్ధిచేయు ఆహారమునే భుజించుట మంచిది.

4 ఈ తేదీలో పుట్టినవారు 13, 22, 31 లో పుట్టినవారికన్న మిక్కిలి కఠినులుగా ఉన్నారు. మంచి ధైర్యము, బలము కలవారు. యుద్ధ వీరులవలె జీవింతురు. భోజనం, భోగములను అనుభవించుటలో మితముగా ఉండుటకు అలవాటుపడవలెను. జీవితంలో ఎదురు చూడని సంఘటనలు జరిగినప్పుడు, 'అంతా మన మంచికే' అని అనుకొని డస్సిపోకుండ నిలదొక్కుకోవలెను. మధురముగాను, ఆకర్షణీ యముగను మాటలాడుట నేర్చుకొనవలయును.

13న పుట్టినవారికి ఎదురు చూడని విధముగా అకస్మాత్తుగా కొన్ని సంఘటనలు జరుగును. ఆపదలు, అపాయములు వచ్చినట్లే వచ్చి తొలగును. బాల్యములోనే వీరిని ప్రభావితం చేయగలిగిన కొన్ని సంఘటనలు, మార్పులు వీరి కుటుంబములో జరుగును. మంచి శక్తిశాలురయిన వీరు నిజాయితీగాను, దాపరికము లేకుండను ఉండవలయును. అట్లు జీవించిన మిక్కిలి ఉన్నతస్థితి నందుకొందురు. స్త్రీ ల వలన వీరికి అనేకవిధములైన శ్రమలు కలుగును.

22 మంచి కన్న చెడు వీరిని ఎక్కువ ఆకర్షిస్తుంది. వీరిని చెడుమార్గములో త్రిప్పుటకు విధి ఎన్నో సందర్భములను ఇస్తుంది. అమితమయిన కార్యనిర్వహణశక్తి,

సామర్థ్యములు ఉండును. చుట్టూ ఉండువారు వీరిని మోసగించుటకు సందర్భము కొరకు ఎదురు చూస్తుంటారు. మిగతా వారికన్నా వీరికి ధనసంపాదన సులభముగా ఉండును. జూదము, పందెములు, పోటీలు మొదలయినవానిలోను, చెడుపనులవల్లనూ సులభముగా సంపద చేరుతుంది. కనుక యిటువంటి విషయములలో జాగరూకతతో ఉండుట మంచిది. ఈ సంఖ్యలో పుట్టినవారు అచ్చు యంత్రశాలలు, ప్రచురణ సంస్థలు, పలురకములయిన మిల్లులను నిర్వహించుట, చక్రములతో నడిచే మోటారుసైకిలువంటి వాహనములమ్ముట, బస్సు, లారీ కంపెనీలు నడుపుట, పుస్తకములు రచించుట, సినిమా థియేటర్లు నడపుట, ప్రజల ఆదరణతో నడిచే హోటలు, అంగడులు, పందెములు నడుపుట వల్లనూ, భవనములు కట్టుట మూలమునను మిక్కిలి ధనము సంపాదింపవచ్చును. అనేకుల సహాయమో, ఆదరణయో, పాల్గొనుటయో జరుగు అన్ని వృత్తులును వీరికి బాగా లాభించును. (ఈ ఫలితము జన్మసంఖ్య నాలుగైనను, తేది, నెల, సంవత్సరము కూడిన 4 వచ్చు వారలందరకును కొంతవరకు సరిపోవును. కాని వీరికే ఇది నూటికి నూరుపాళ్ళు తగినది.) మంచివారి స్నేహము కలిగియుండుట వీరికెంతో అవసరము.

31 ఇది పూర్తిగా మనోశక్తికి సంబంధించిన అంకె కావున ఇందు జన్మించినవారు మంచి ధైర్యశాలురుగను, అమితమైన మనోశక్తితో, బుద్ధిసూక్ష్మతతో ఉందురు. కొత్తగా పరిచయమైన వారికి కూడా కొద్ది సమయములోనే వీరు సామాన్యులు కారని తెలిసిపోవును. లాభనష్టముల గూర్చి ఆలోచింపక తన ఇష్ట ప్రకారమే నడచుకొందురు. ఎంతటి శత్రువునైనా అతి త్వరలో గెలిచెదరు. ఏకాంతవాసములో, వేదాంతములో ను ఎక్కువగా ఆకర్షణ ఉంటుంది. తీవ్రవాది. భోగములందు మితముగా ఉండుట మంచిది. ప్రజోపకారిగా ఉందురు.

## నామ సంఖ్య-నాలుగు

పేరులోని అక్షరముల అంకెలను కూడగా వచ్చు సంఖ్య నాలుగు అయినచో ఆ పేరు నాలుగు ఆధిపత్యము క్రింద వచ్చుచున్నది. 4 వచ్చు పేర్ల సంఖ్యలను విడివిడిగా పరిశీలిద్దాం.

చిన్నపేరుగా 4 వచ్చునది అయినచో అది ప్రముఖమయిన మనిషినో, వస్తువునో

సూచించును. కీర్తికి తగిన అదృష్టముండదు. అనవసరపు భయములుండును. వ్యాధులు, వ్యతిరేకతలు ఉండును. అన్నీ తెలిసినను ఇతరుల మాటకు లొంగి జీవింపవలసియుండును.

13 - పశ్చిమ దేశస్తులు ఈ పదమూడు అన్న సంఖ్య చూసి జడుసుకొంటారు (హోటల్ గదులే అయినా 13వ నంబరు గదిలో దిగరు. ప్రసిద్ధమైన హోటళ్ళలో అసలు 13వ నంబరు గది కూడా ఉండదు). ఈపేరుయొక్క ఫలితాన్ని తెలుసుకోవటానికి పురాణ పురుషుడైన శ్రీరాముడే సరియైన ఉదాహరణ. తనకు ఇష్టంలేకపోయినా అనేకులను దండింపవలసి వస్తుంది. ఎదురుచూడని కష్టపరంపరలు వస్తూనే ఉంటాయి. స్త్రీ లవలన దిగులు, కష్టము ఏర్పడును. గొప్ప స్థితిలో ఉన్నా సదా దిగులు, సంచలనము గల జీవితముగా ఉండును. ఇది అభిలషించదగ్గ సంఖ్య కాదు. దుఃఖపూరితమయినది.

22 ఇరవైరెండవ తారీఖున పుట్టినవారికి చెప్పబడిన ఫలములే వీరికిని వర్తించును. ఈ సంఖ్య ఉద్వేగముగా భావములను ప్రేరేపించునట్టిది. పందెములు, పోటీలు, జూదము, త్రాగుడు, ఇతర భోగములు వీటిలో ఒకటియో లేక అన్నిటియందునో ఆసక్తి మిక్కుటముగా ఉండును. జూదమాడుటకు ధైర్యముగా ముందుందురు. సంపదనంతటినీ పోగొట్టుకొను సందర్భములవైపు వేగముగా పోవుదురు. దుష్ట సలహాల నిచ్చువారే ఎప్పుడును వీరి చుట్టూ ఉందురు. (అయినను వీరు ఇతరులు చెప్పినట్లు నడచుకొనువారు కాదు). పుట్టినతేది సంఖ్య నాలుగయిన జయము లభించును. కాదేని పూర్తిగా ఓటమి పొందకుండ సంబాళించుకొనెదరు. స్వార్థులు సదా వీరిని ఉసిగొల్పుచునే ఉందురు. గొప్ప నిర్వాహకులు కనుక ఉన్నతస్థాయిలో సంస్థలను స్థాపిస్తారు. ఎట్టి కష్టము కలిగినను కలతచెందక నిలదొక్కుకుంటారు. అపకీర్తి కలుగుటయు సహజమే.

31 వీరికి లాభష్టముల ఆలోచనయే లేదు. స్వతంత్రమే లక్ష్యముగా ఉండును. ఎంత మేలు కలుగునని తెలిసినను మనసుకు నచ్చని పనులలో దిగరు. మనో వశ్యము, జ్యోతిషము, వేదాంతము మొదలగు శాస్త్ర ములలో ప్రవేశముండును. వేదాంతులవలె దేనిని లక్ష్యము చేయక ఉండెదరు. కార్య సిద్ధి లభించినను జయమువల్ల వీరు

పొంగిపోరు. జయము లభించినను, దానివలన లాభము పొందకనే వదలిపేతురు. 31వ యేట అన్నిటినీ త్యజించుటయో లేక పోగొట్టుకొనుటయో జరుగును. అటుపిమ్మట 37వ సంవత్సరము, ఆప్రాంతముననే పూర్వస్థితిని అందుకొనగలరు. ఎదురు చూడని సంఘటనలు జీవితమును ప్రభావితము చేయును. ముగింపు కూడా కొంచెమైనా తలచి చూడని విధముగా అకస్మాత్తుగా వచ్చును. (వీరికి మాత్రము తమ ముగింపు సూచనగా తెలియును). పుట్టినతేది 1 సంఖ్యగా ఉన్న ఎడల మాత్రము పెద్ద పదవులు వహించును.

40 ఎదురుచూడని మిత్రులను, వారి వల్ల గొప్ప అంతస్తును, అధికార ఉద్యోగములను ఈ సంఖ్య ఈయగలిగినది. పేరు, ప్రతిష్ట, బిరుదులు కలవు. అమితముగా ఆభరణములను, సంపదలను సేకరించెదరు. అయినను వీరి చెడుగుణములే అందరికీ ఎక్కువగా కనపడును. ధైర్యముతో ఏ కార్యమునయినను సాధింపగలరు. జీవితము చివరలో నిష్ప్రయోజనమగును. సమాజము తనసేవను గుర్తింపలేదని వాపోయెదరు. చేర్చియుంచిన సంపదయు నాశనమగును. జీవితములో పలురకములయిన చిక్కులు ఏర్పడును. ముగింపు ఘోరముగా ఉండును.

49 ఈ సంఖ్య పేరుగా గలదేని జీవితమున సంపద జలపాతమువలె వచ్చును. ఆశ్చర్యపరచు కార్యములను చేయుదురు. తుఫాను వేగముతో ప్రతిష్ఠ పెరుగును. జీవితము సంఘటనలమయముగా ఉండును. ప్రయాణములు ఎడతెరిపి లేకుండా వచ్చును. అనేక అపూర్వమయిన అనుభవములు కలుగును. నిలకడయయిన ఆస్తులు ఏర్పడును. అకస్మాత్తుగా అదృష్టము కలుగును. ఆపదలును అట్లే అకస్మాత్తుగా కలుగును. జన్మతేది సంఖ్యలు, మంచివిగా నున్నచో అదృష్టకరముగా ఉండును. లేనిచో ఈసంఖ్య పేరు కలవారు ఇతరులచే అసహ్యించుకొనబడి ఘోరమైన ముగింపును పొందుతారు. కల్పనాశక్తిని మేల్కొలుపు సంఖ్య ఇది.

58 ఈ సంఖ్య మిక్కిలి ప్రసిద్ధిని, వశీకరణశక్తిని ఇచ్చును. **కార్యసిద్ధి ఏర్పడును.** జీవితము వేగముగా వృద్ధిపొందును. ఆచారవంతులుగను, మతాభిమానము కలవారుగను ఉందురు. సంస్కరణాభిలాష యెక్కువ. జన్మతేది సంఖ్య 4 లేక 8 అయినచో పేరుతో బాటు బాధ్యతగల ఉన్నత పదవులు వహిస్తారు. చేయకూడని

పనులు చేయవలసి వచ్చును. మనసులో ఏదయినా భయము ఉండును. అదృష్టకరమయినదిగనే అనిపించును. ఇతర సంఖ్యలలో జన్మించినవారు ఈ సంఖ్య పేరు కలిగిన ప్రగతి పథముననున్న జీవితము కొద్దికొద్దిగా క్రిందకు జారును. గౌరవము అడుగంటును. స్వార్థపూరిత జీవితము గడుపుదురు. పలువిధములయిన కష్టములను అనుభవింపవలసి వచ్చును.

67 ఈసంఖ్యలో పేరు కలవారు ప్రసిద్ధ కళాకారులుగను, అలుపులేని పనిమంతులుగను ఉందురు. మిక్కిలి ఉన్నతస్థితిలో కలవారి ఆదరణ లభించును. ఉత్తమమైన కల్పనలను వెలిబుచ్చుతారు. స్త్రీల భ్రమలో పడకుండా జాగ్రత్త వహించవలెను. ప్రేమ, నిర్మలత్వము వీరిని గొప్పవారిని చేయును. దైవ కృప కూడా సులభముగా లభించును. స్వార్థపూరితమైన కార్యములు ప్రయత్నించినను సరిగా నెరవేరవు. వశీకరణశక్తి గల ఈ సంఖ్య కళాకారులు కానివారికి పనికిరాదు.

76 ఈ సంఖ్య పేరులో కలవారు అకస్మాత్తుగా అన్ని సంపదలను పోగొట్టుకొనుట జరుగును. పేరు, ప్రతిష్టలతో సమాజములో జీవింతురు. పరోపకారమయిన సాంఘిక కార్యములలో జయము కలుగును. ఆశ్చర్యము గొలిపే విధముగా క్రొత్త పద్ధతులలో ధనము సంపాదిస్తారు. దైవకృప కలదు. దానిని ధనసంపాదనకు ఉపయోగిస్తారు. వయసు మళ్ళిన తరువాత ఏమి చేయుటకు తోచక, తిని, పరుండి ఒంటరిగా కాలము గడుపుతారు.

85 శ్రమపడి ముందుకు వచ్చినవారిని ఈ సంఖ్య సూచిస్తుంది. చెడును గెలుస్తారు. ఇతరుల కష్టములను కూడ ప్రేమతో తీరుస్తారు. మతము, ప్రకృతి సంబంధమైన క్రొత్త ద్దేశ్యాలను బయలుపరుచుతారు. వైద్య వృత్తివల్లను వీరు ప్రసిద్ధులవుతారు. అందరూ గౌరవించే పదవి లభించును.

94 ఈ సంఖ్య కలవారు లోకమునకు అనేక మేళ్లు కలిగిస్తారు. పదిమందికి పనికివచ్చు సంఘ సంస్కరణలు గావిస్తారు. సుఖమయ జీవితము, కీర్తి తరచుగా కలిగి అదృశ్యమగును. జీవితము ముగిసిన పిదప కూడా నిలబడగలుగు మంచి పనులను చేయించు సంఖ్య కావున ఇది దురదుష్టకరమయినదని చెప్పవచ్చును.

103 ఇది కూడా అదృష్టమయినదే. ప్రారంభములో సంపదలందే వృద్ధి కనిపించును. పిదప వృత్తిలో మార్పు వచ్చును. పోటీ ఏర్పడును. జీవితపు ముగింపు మంగళకరముగా ఉండును.

## అదృష్టకాలము

పేరుగాని, జన్మతేదిగాని నాలుగు సంఖ్యగా ఉన్న వారికి 1, 10, 19, 28 తేదీలు అదృష్టకరమైన దినములు. అందు 28న జరుగు జయములు త్వరలోనే మాయమగును. 9, 18, 27 తేదీలు మంచి సాధకమైన ఫలితముల నిచ్చును. (అన్నీ కూడిన 1 గాని 5గాని వచ్చి నట్లయిన)4, 13, 22, 31 తేదీలు ఎదురుచూడని మార్పులను తెచ్చును. తలచినట్లుగా ఏదియు జరుగదు.

ఈ దినములందు ఏదయినా చేయదలచినచో తేది, నెల, సంవత్సరము మూడింటిని కూడగా వచ్చు సంఖ్య సాధకమయినదిగా ఉన్న ఎడల చేయవచ్చును. లేనిచో ఆ ప్రయత్నమును మానుకొనుట ఉచితము.

కొన్ని సందర్భములలో 4, 13, 22, 31 దినములందు శుభములు తమంతట తామే వచ్చును. 1, 10, 19 తేదీలలో ముఖ్యమైన కార్యములను చేయుటకు అలవాటు పడినవారికి అదృష్టము వృద్ధి చెందును. 4 అంకెకు గల ప్రతికూల గుణములును తగ్గును.

## దురదృష్ట దినములు

8, 17, 26 తేదీలు ఎన్నటికినీ కీడు కలిగించునవియే. ఎదురు చూడని కష్టములు ఈ దినములలో నే వచ్చును. కావున ఈ దినములందు క్రొత్త ప్రయత్నములు చేయరాదు. ఆవిధముగా చేయుట వలన అనేక దురదృష్టముల నుండి తప్పించుకొనవచ్చును. విజయవంతంగా జీవించిన అనేకులు ఇట్లు 8, 17, 25 తేదీలలో చేసిన పనులవల్ల పతనమయినారు. కనుక 4 సంఖ్యకు లోబడిన పాఠకులు ఈ విషయమున కడు జాగ్రత్తగా ఉందురుగాక, 7, 16 తేదీలు కూడా సాధకమయినవి కావు. 4 సంఖ్య వారు 1 సంఖ్యవారికి మొదటి చూపులోనే వశమగుదురు. 1 సంఖ్యవారు 4 సంఖ్య వారిని ఆటబొమ్మవలె నాడింపవచ్చును. ఇదేవిధముగా 4 సంఖ్య

వారికి 8, 17, 26 వారు వశమగుదురు.

## వృత్తులు

జన్మసంఖ్య 4 గా కలవారికి ఘాటైన ఉద్దేశ్యములను వెలిబుచ్చుట మూలమున కీర్తి పెరుగును. ఉపన్యాసములిచ్చుట, వ్యాసములు వ్రాయుట, జీవితమునకు పనికివచ్చు విధముగా కళలను ఉపయోగించుట, వేదాంత పరిశోధన, సర్కస్ వంటి శరీర అభ్యాసములు, వైద్యము, జ్యోతిష్యము వంటి శాస్త్రములతో పరిచయము, నాట్యము, సంగీతము వంటి లలితకళలను శ్రద్ధతో అనుష్టించుటయు వీరి అభివృద్ధికి కారణమగును. సహజముగనే వీరికి ఉద్యోగము మేలు చేయదు. (అధికారులుగా జీవితము మొదలయినచో వీరి తీవ్రమైన అభిప్రాయముల కారణముగా ప్రసిద్ధికెక్కుదురు). వీరికి మిక్కిలి అదృష్టకరమైన వృత్తులు, ఇతరులను ప్రోత్సహించుట, వారి ఆలోచనలను ఉపయోగకరముగా మరల్చుటయే. తక్కిన మనుష్యులను, విషయములను గురించి పరిశీలన కలవారు గనుక ఆశక్తిని వినియోగించు వృత్తులందు వీరుండవలెను. గ్రంథాలయములు నడపుట, పత్రికలు ప్రచురించుట, అమ్ముట, ఆవులు, గుఱ్ఱముల వంటి ప్రాణుల వ్యాపారము, కుర్చీ, బల్ల వంటి ఫర్నిచరు, బస్సు, లారీ వంటివాని వ్యాపారము, రవాణా సౌకర్యముల వృత్తులు (4 కాళ్ళపై నడుచునవి) మొదలైన 4 కాళ్ళ వస్తువులు, పటములు తయారీ, విక్రయించుట, పుస్తక ప్రచురణలు, ఇండ్లు కట్టుట, పోటీలు, పందెములు నడపుట వంటి అనేక వృత్తులలో ధన సంపాదన కలదు. (22 సంఖ్యగా ఉండినచో మేలు). సలహాదారులుగా నియమించబడినచో వీరు సమాజములోను, రాజకీయ ములలోను సంస్కరణలు తీసికొనివస్తారు.

## వ్యాపారము

అధిక ప్రయత్నము, అనేక ప్రయాసలకు పిదపనే వీరికి ధనము లభ్యమగుచున్నది. వ్యాపారమున అధిక శ్రమ చేయవలసి ఉండును. 1, 2, 4, 8 వారిని వాటాదారులుగా చేర్చుకొనవచ్చును.

## సహకరించువారు

4 సంఖ్య వారికి పెద్ద సహాయములు 1,8 వారు మాత్రమే చేయుదురు. వారి పిదప

2,4 వారిని లెక్కింపవచ్చును.

4 సంఖ్యవారు తను కట్టుబడి, ప్రేమింప భార్య/భర్త కావలెననిన 1 సంఖ్యవారిని వివాహమాడవచ్చును. తనను ప్రేమించి తనకు వశమయినవారు కావలెననిని వారిని ఎంచుకొనవలెను.4 సంఖ్యవారిని మంచి తేదిలో వివాహము చేసికొన్నను దీర్ఘకాలము సుఖముగా ఉండగలరు. సంతాన భాగ్యమును కలదు. ఎక్కువ ఖర్చు చేయువారు కనుక 4 సంఖ్య మగవారు 6 సంఖ్య స్త్రీ లను పెండ్లియాడిన ధనవంతులగుదురు.

వివాహతేదీని క్రింది విధముగా అమర్చుకొనుట మంచిది

| **జీవిత భాగస్వామి సంఖ్య** | **వివాహ తేది & తేది, నెల, సం\|\|ము కూడగా వచ్చు సంఖ్య** |
|---|---|
| 1, 4 | 1 & 1, 4 & 1, 4 & 6 |
| 6, 8 | 1 & 1, 6 & 1, 1 & 6 |

రంగు

లేత నీలము, లేక నీలము గీతలు, చారలు గల దుస్తులే వీరి ఆకర్షిస్తాయి. నిర్మల మనస్కులగుటచే నీలము వీరి నెక్కువ ఆకట్టుకొంటుది. లేత నీలిరంగు దుస్తులు మనశ్శాంతిని కలిగించును. మిక్కిలి అదృష్టకరమైన రంగు పసుపు.

నిషేధించవలసిన రంగు: **నలుపు.**

రత్నము

లేత నీలిరంగు రాయి వీరికి శుభమునిచ్చును. పరిశుద్ధతని, కార్య సిద్ధిని ఇచ్చు గోమేధికము కూడా మంచి అదృష్టకరమయినదే.

నాలుగు అంకెను సూచించు అక్షరములు
వాని ఫలితములు

D - ఇది నిజాయితీగల నడవడికను, ధైర్యముతో తెగించి పనిచేయుటను, నిశ్చితమైన అభిప్రాయములను, అవిరామ కృషి, కష్టతరమైన పరిస్థితులను కూడా లెక్క చేయక శ్రమించి విజయము పొందుటకు సూచించుచున్నది. ఈ శబ్దము ఉదరము, శ్వాసకోశములపై విశేష ప్రభావము చూపును. ఇది నీలవర్ణపు తరంగములచే సూచింప బడుచున్నది. తరంగపు నిడుపు 4

M - ఇది బుద్ధిని, కృషిని, ఎడతెగని ప్రయత్నమును సూచించుచున్నది. నిశ్చితమైన అభిప్రాయములును, పట్టుదలయు ఉండును. తరచుగా జీవితములో మార్పులేర్పడుచుండును. లేక కష్టపరంపరలు ఉండును. బాధ్యతను తీసుకొనరు. తీసుకుంటే, వేరెవ్వరి సహాయములేక తానే అన్నిటినీ చక్కగా నిర్వహిస్తారు. హోదా, ఉన్నత పదవి ఉండును. సూక్ష్మబుద్ధియు, రసికత్వమును కలిగియుందురు. నీలవర్ణము, శబ్ద తరంగపు నిడుపు 40.

T- ఇది 4 సంఖ్యని సూచించును. ఈ సంఖ్య క్రింద వచ్చు అన్ని అక్షరములలో T మిక్కిలి శక్తివంతమైనది. ఇది సూక్ష్మముగా మాత్రమే వినదగునది. ఇంకా ఇది వారాహి మొదలైన యుద్ధ దేవతల శబ్దమని చెప్పబడుచున్నది. దీని శబ్దతరంగపు నిడుపు 400. (మానవుని శ్రవణేంద్రియములు 300 వరకు నిడుపుగల శబ్దములే వినగలవు. గులాబి మొదలైన పుష్పములు మొగ్గలుగా ఉండు సమయములో వికసించునపుడు నాల్గు ఫిరంగులు పేల్చిన కలుగు శబ్దము కలుగునట. పరిశోధనా యంత్రముల ద్వారా దీనిని గుర్తింపగలమే గాని మానవుని చెవులకు ఇవి అందవు. కారణము, మన పంచేంద్రియములును అతి తక్కువ పరిమితిలోనే పనిచేయుటకు అలవాటు పడియుండుటయే). ఈ అక్షరము వీడని పట్టుదలను, మార్చతరముగాని తీర్మానములను సూచించుచున్నది. ఈ సంఖ్య వారు మంచి సలహాలనిచ్చెదరు. తీవ్రవాదులు. ఈ శబ్దము ముదురుపచ్చ (హరిత) వర్ణమును ఎఱ్ఱబరచును. దానిని వివరింపబూనిన గ్రంథం విస్తారమగును. 4 సంఖ్యవారు 1 అంకె వచ్చునట్టి పేరునో, లేక తేది, నెల, సంవత్సరము కూడగా వచ్చు సంఖ్య పేరు నో పెట్టుకొనుట మంచిది.

ఒక ముఖ్య గమనిక

4 సంఖ్యలో జన్మించిన వారికి మనోవేగము అధికము. స్థూల వస్తు

సముదాయమందు శక్తిని ప్రవేశపెట్టు సంఖ్యలలో ఇది మొదటిది. కావున వీరికి 5,6 వంటి తరువాతి సంఖ్యలవారివలె శరీరశక్తి ఉండదు. వీరు మానసికముగానే అన్ని విధములయిన సుఖములను కల్పనాశక్తితో అనుభవించెదరు. అయితే, అనుభవించవలసి వచ్చినపుడు త్వరలోనే అందు ఆసక్తి తగ్గిపోవును. ధనమార్జించుటకు కష్టపడి పనిచేస్తారు. అట్లు సంపాదించిన ధనమును చాలాకాలము దాచుకొను శక్తి ఉండదు. ఏవిధముగా నయినా ఖర్చు చేసి చేతులు దులుపుకొంటేనే హాయిగా ఉంటారు. ఏదైనా కావాలనుకొంటే అది లభ్యమయ్యేవరకు వేచివుండే ఓపిక ఉండదు. అభివృద్ధిలో ఆసక్తి ఉండునేగాని దానికి పాటుపడుటకు శరీరము లొంగదు. మాటలో ఉండు వేగము, వ్రాయుట, నడచుట వంటి కాళ్ళు చేతులు చేయు పనులందు ఉండదు. ఆ పనులు అతి మందగమనముతోనే నెరవేరును. ఏమాత్రం సౌకర్యం ఉన్నా సోమరిపోతు కాగలరు. మాటలాడుట తప్ప వీరికి తక్కినవన్నియు కఠినమైన పనులే. వీరి శరీరము వ్యాయామమునకు తగినది. శరీర వ్యాయామము చేస్తూ ఉంటేనే వీరిలో చురుకుదనము, జీవశక్తి వృద్ధి చెందుతాయి. అటు తరువాతనే వీరు తమ మెదడును, దాని శక్తిని పూర్తిగా వినియోగింప గలుగుతారు. మరీ చిన్నవయసులోనే లైంగిక వాంఛలు ఏర్పడును. వాటిని తగ్గించుకొన్నచో బుద్ధి ప్రకాశవంతమగును.

### శబ్దము గూర్చి పరిశోధించువారికి గమనిక

ఈ నాలుగు సంఖ్య శబ్దములను బాగుగా పరిశీలించుట కారణంగా శక్తిని గూర్చిన అనేక సత్యములను వీరు తెలిసికొనవచ్చును. 'మ్' అను శబ్దమే "M' అను అక్షరమునకు చెందినది. దీని కలయికతోనే 'లం' 'హం' 'యం' 'రం' 'వం' అని పంచభూతముల బీజాక్షరములు ఏర్పడి, స్థూల విషయములను ప్రభావితం చేయగల శక్తిని పొందుచున్నవి. T అను అక్షరమే ఆంగ్ల అక్షరములలో అమిత శక్తి కల్గినది. దాని ఫలితముగానే ఆ భాష ఇంత ఉత్కృష్ట స్థితిలో ఉన్నది. (ఫ్రెంచ్ భాషలో ఈ అక్షరము ఉన్నను వారు దానిని 'త'యని ఉచ్చరించుచున్నారు). ఈ శబ్దపుశక్తి యుద్ధ ప్రీతిని, ఆక్రమణ శక్తిని కలుగజేయును. తమిళ, ఫ్రెంచ్ భాషలలో కనబడు ళ, శ్రీ (ళ/జ ఉ|| తమిళ్, కజగం/ కళగం) ఈ శబ్దమునకు సరియయిన అక్షరము తెలుగున లేదు. కావున 'ళ' గనో, 'జ'గనో ఉచ్చరింపబడుచున్నది). శబ్దములు రసికత్వమును, అతిథి

మర్యాదలను, సుఖమయ జీవితముపై అభిలాషయు ఇవ్వగలిగినవి. మరకత మేనిఛాయగల మీనాక్షిదేవి, 'ఠ' శబ్దముచే గుర్తింపబడు వారహీదేవిని తన సేనానిగా కల్గి, దిగ్విజయములను సాధించుట ఈ శబ్దము యొక్క ప్రకృతిని విశదీకరించును. (హరిత వర్ణము శాంతి, సమరసము, నిదానము, సుభిక్షములకు ప్రతీక. యుద్ధము ఎఱుపు రంగు కలది). ప్రస్తుత శబ్ద శాస్త్రజ్ఞులు T శబ్దము, ముదురు హరిత వర్ణమును ఎఱుపుగా మార్చు నని కనుగొన్నారు. కాడలు పచ్చగా ఉన్నను పండ్లు ఎఱ్ఱగానో, పసుపుగానో ఉండుట శబ్దములవలన ప్రకృతిలో ఏర్పడు మార్పుల వలననే కాయలను **పండ్లుగా మార్చుటకు** ఉష్ణము ఉపయోగపడుచున్నది. ఇది స్థూల ఉష్ణమే.

ఇది పసుపు వర్ణమునే ఇచ్చుచున్నది. సూక్ష్మమైన ఉష్ణము శబ్దము నుండి పుట్టుటచే ఎఱ్ఱని వర్ణము కలిగి ఉండును.

**4** తేదీలో పుట్టిన కొందరు ప్రముఖ వ్యక్తులు

| **పేరు** | **జన్మతేది సంఖ్య** | **తేది-విధి సంఖ్యలు** |
|---|---|---|
| PERCY BYSSHE SHELLY<br>పి.బి. షెల్లీ - ప్రసిద్ధ ఇంగ్లీషు కవి | 4-8-1792 | 4 & 4 |
| SIR PHEROZE SHAH MEHTA<br>సర్ ఫిరోజ్ షా మెహతా | 4-8-1845 | 4 & 3 |
| J.C.KUMARAPPA<br>జె.సి.కుమరప్ప | 4-1-1892 | 4 & 7 |
| GHANTASALA<br>ఘంటశాల | (సుప్రసిద్ధ సినీగాయకుడు) | 4-12-1923 | 4 & 4 |

| | | |
|---|---|---|
| GULZARILAL NANDA<br>గుల్జారీలాల్ నందా | 4-7-1898 | 4 & 1 |
| TUSHAR KANTI GHOSH<br>తుషార్ కాంతి ఘోష్ | 4-10-1899 | 4 & 5 |
| SIR K.S. KRISHNAN<br>సర్ కె.ఎస్. కృష్ణన్ | 4-12-1898 | 4 वें 6 |
| BABURAO PATEL<br>బాబురావ్ పటేల్ | 4-4-1904 | 4 & 4 |
| S.P. BALASUBRAMANYAM<br>ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం (ప్రసిద్ధ సినీగాయకుడు) | 4-6-1946 | 4 & 3 |
| MARGARET THATCHER<br>మార్గరెట్ థాచర్ | 13-10-1925 | 4 & 4 |
| Mrs. SAROJINI NAIDU<br>శ్రీమతి సరోజినీ నాయుడు | 13-2-1879 | 4 & 4 |
| DR. CHENNA REDDY<br>డా. చెన్నారెడ్డి | 13-1-1919 | 4 & 7 |
| SARDAR ABDUR RAB NISHTAR<br>సర్దార్ అబ్దుల్ రాబ్నిష్తార్ | 13-6-1899 | 4 & 1 |
| IMMANUEL KANT | | |

| | | |
|---|---|---|
| ఇమ్మానుయేల్ కాంట్ | 22-4-1724 | 4 & 4 |
| GEORGE WASHINGTON<br>జార్జి వాషింగ్టన్ | 22-2-1732 | 4 & 1 |
| RAJARAM MOHAN ROY<br>రాజరామమోహనరాయ్ | 22-5-1772 | 4 & 8 |
| MICHAEL FARADAY<br>మైకేల్ ఫారడే | 22-9-1791 | 4 & 4 |
| S. RAMANUJAN<br>ఎస్. రామానుజం | 22-12-1887 | 4 & 4 |
| SIR ARTHUR CONAN DOYLE<br>సర్ ఆర్థర్ కానన్ డాయిల్ (షెర్లాక్హోమ్స్ రచయిత) | 22-5-1859 | 4 & 5 |
| RT. HONARABLE V.S.SRINIVASA SASTRI<br>రైట్ హానరబుల్ వి.ఎస్. శ్రీనివాసశాస్త్రి | 22-9-1869 | 4 & 1 |
| SIR MUHAMMAD IQBAL<br>సర్ ముహమ్మద్ ఇక్బాల్ | 22-2-1873 | 4 & 7 |
| GEN. DE GAULLE<br>జనరల్ డి గాల్ | 22-11-1890 | 4 & 6 |
| CHIRANJEEVI | 22-8-1955 | 4 & 5 |

| | | |
|---|---|---|
| మెగాస్టార్ చిరంజీవి | | |
| MIRA BEN<br>మీరా బెన్ | 22-11-1892 | 4 & 8 |
| SIR N. GOPALSWAMY AIYANGAR<br>సర్. ఎన్. గోపాలస్వామి అయ్యంగార్ | 31-3-1882 | 4 & 8 |
| SARDAR VALLABH BHAI PATEL<br>సర్దారు వల్లభ భాయ్ పటేల్ | 31-10-1875 | 4 & 8 |
| GEN. K.S. THIMAYYA<br>జనరలు కె.ఎస్. తిమ్మయ్య | 31-3-1906 | 4 & 5 |
| CHIANG KAI SHEK<br>చియాంగ్ కైషైక్ | 31-10-1887 | 4 & 2 |
| ACHARYA NARENDRA DEVA<br>ఆచార్య నరేంద్ర దేవ్ | 31-10-1889 | 4 & 4 |
| RENE DESCARTES<br>రినే డిస్కార్టిస్ (ఫ్రెంచ్ గణియశాస్త్రవేత్త) | 31-03-1596 | 4 & 1 |

## అంకె 5 - బుధుడు

మన ప్రాచీన జ్యోతిష శాస్త్రములు తక్కిన గ్రహములను గూర్చి వ్రాసినంతగా బుధుని గురించి విశేషములను అంతగా వివరింపలేదు. దూత, గణీకుడు, నపుంసక గ్రహము, క్రొత్తను అభిలషించువాడు అన్న వర్ణనలే అగుపడుచున్నవి. పూర్వకాలమున సాంప్రదాయకముగనే పనులు నిర్వర్తింపబడుచుండినవి. క్రొత్తగా ఎవరైనా దేనినైనా కనుగొన్నను, దానికి గుర్తింపు వచ్చులోపున వారి జీవితమే ముగిసి పోయేది. కాని ఇప్పుడు అట్లు కాదు. ఈనాడు పరులకు భిన్నముగా ఏదయినా చేయువారు ప్రసిద్ధికెక్కుచున్నారు. సమాజ నిర్మాణమును, సంస్కరణను సూచించు 4 సంఖ్య తరువాత, జనులు ఒకరు మరొకరితో కలిసి చేయవలసిన వాణిజ్యము, రాజ్యాంగము, **ప్రజాసంబంధిత కార్యములు** మున్నగువానిని సూచించు 5 అంకెను గమనించుదాం. ఈ అంకెకు సమ్మోహన శక్తి కలదు. 9 అంకెలకు మధ్యలో ఇది విరజిల్లుతూ ఉన్నట్లే ఈ అంకెగలవారు నలుగురూ మెచ్చుకొనే పదిమందికీ తెలిసిన ప్రముఖులుగా ఉంటారు. ఈ అంకె ముఖ్యంగా 'జనవశ్యము' సూచిస్తుంది. ఈ అంకెకు, **అందరినీ సమ్మోహింపజేయు శక్తి కలదు.** అందుచేతనే మంత్రశాస్త్ర వేత్తలు దీనిని 'యం' అను వాయు బీజముతో కలిపి, వ్యాపార వృద్ధికి మరియు జనవశ్య యంత్రములలో శక్తికి ఉపయోగించెదరు. ఈ అంకె బలము కలవారు జనులచే గొప్పగా అభిమానింపబడుచున్నారు.

ప్రతినెలలో 5, 14, 23 తేదీలలో పుట్టినవారును, పుట్టిన తేది, నెల, సంవత్సరము కూడగా 5 సంఖ్య వచ్చు వారును ఈ సంఖ్య క్రింద జన్మించిన వారుగానే తీసుకొనవలెను. ఇందు ముఖ్యముగా గమనించవలసిన విషయమేమనగా 5, 14, 23 తేదీలలో జన్మించినవారు ప్రారంభము నుండియే ప్రముఖులుగా జీవించి, తేది, నెల, సంవత్సరము కూడితే వచ్చు సంఖ్యని అనుసరించి వచ్చు ముగింపునే పొందుతారు. తేది, నెల, సంవత్సరము కూడిన 5 వచ్చువారు వారి జన్మ సంఖ్య ప్రకారమే గుణగణములు కలిగియుండి విధివశాత్తు మహా గొప్ప ప్రముఖులు అయిపోతారు. కాని 5 సంఖ్యవారికి ఉండు వశీకర గుణములు వీరికి ఉండవు. అయినా లోకం మరిచిపోలేని విధంగా చరిత్రలో నిలచి పోతారు. ప్రపంచము వీరిని చూసి భయపడునట్టివారుగాను, అసహ్యించుకొనేటట్లును కూడ ప్రసిద్ధికెక్కవచ్చును. రష్యాలోని ప్రపంచ వ్యాప్తంగా

ప్రసిద్ధుడయిన **రస్పుతిస్** (7జన్మసంఖ్య, విధి సంఖ్య 5), **హిట్లర్** (20 - జన్మసంఖ్య, విధి సంఖ్య - 5) మొదలైనవారు ఈ విధముగా విధి అనుకూలించుట వలన మహోన్నత స్థితిని పొందినవారే. ఈ అధ్యాయము చివర ఇవ్వబడిన పట్టికలో ఈ సంఖ్యలోని మంచివారిని కూడా చూడగలము.

### 5 సంఖ్యలలో పుట్టినవారి సామాన్య గుణములు

"వీరు శీఘ్రం, ఇంకా శీఘ్రంగా కావాలి" అని ఇతరులను తొందరపెట్టుతారు. రజోగుణము మిక్కుటమగుటచే వీరికి తక్కిన వారంతయు మందబుద్ధి కలిగిన సమూహముగనే కనపడును. వీరు ఎట్టి విషయమును అతి త్వరగా గ్రహించుకుంటారు. వీరు అతి వేగముగా మాట్లాడుతారు. ఇతరులు అర్థము చేసికొనకపోయిన కోపమే వచ్చును. వీరి ఆలోచనలు, బుద్ధియు మెరుపువంటి వేగము కలవి. తక్కినవారికి ఎన్నో రోజుల తరువాత తోచు సమాధానములు వీరికి వెంటనే దొరకును. కనుక తన అభివృద్ధి తన చుట్టు ఉండువారి మందకొడితనము వలన పాడవుచున్నదని వాపోవుదురు. వీరిలో అమిత వేగము కలిగినవారి ఆలోచనలను వారి మరణము తర్వాతనే ఈ లోకము అర్థము చేసుకొన్నది.

అతి సులభముగా ఎవ్వరితోనైనా చిన్నపిల్లలవలె కలిసిపోదురు. మనసున తోచిన దానిని సులభముగానే వెలిబుచ్చగలరు. దాపరికము తెలియదు. తమ చుట్టువారికి వీరి ప్రేమ వ్యవహారములు కూడా తేలికగా తెలిసిపోవును.

ఈ లోకమున అసాధ్యమయినదేదియు లేదని వీరి నమ్మకము. అందుచే ఎట్టి క్లిష్టమయిన కార్యమయినను, కొంచెమైనా జంకు, భయము లేక ప్రారంభింతురు. గెలుపు ఓటములు మన చేతుల్లో లేని జూదము, పేకాట వంటి వానిలో కూడ 'విజయం మనదే' అని అంటూ దిగుతారు. వీరు కనుక ఈ విధంగా ఉండకపోతే మనం ఈనాడు ఏ విధమయిన ప్రగతిని సాధించి ఉండేవాళ్ళము కాదు. ఇతరులు అసాధ్యం అన్నదానిని తాము చేసి చూపాలనేదే వీరి అభిలాష. **పాతను నిరసించి కొత్తను అహ్వానించి అటువైపు వేగంగా సాగుతారు.** నూతనంగా కనిపెట్టబడేవన్నీ మంచికేయని నమ్ముతారు. తక్కిన వారికన్నా తామెప్పుడూ ప్రత్యేకంగా ఉండాలని అభిప్రాయ పడుతారు. అతినాగరికులు, మహా మేధావులు, విశిష్ట అభిప్రాయములను, సాంఘిక పరమయిన మార్పులను

జనుల మధ్య ప్రవేశపెడతారు. ఈ సంఖ్య బలము తగ్గినవారు క్రొత్త క్రొత్త దుస్తులు, నగలు ధరించి నాగరికతను ప్రదర్శించుతారు. సంఖ్యాధిక్యత కలవారు అందరిచే పొగడబడుచు మేలైన కార్యములను ఎడతెగక చేయుచునే ఉందురు. కాని సంఖాధిక్యత పై వ్యతిరేక ప్రభావముకలవారు ఇతరులను సులభముగా మోసగించుచు, **కించిత్తు భయము కూడా లేక తిరుగుతారు.** ఇట్టివారు అబద్ధములాడుటకు కొంచెమైనా జంకక తక్కినవారిని నమ్మించి మోసగించియే కాలక్షేపము గావించుచున్నారు. ప్రసిద్ధమయిన మోసములు జరుగుచోట్ల వీరు భాగస్వాములుగా ఉండుట నిశ్చయము. ఈ సంఖ్యవారు చెడ్డవారుగా ఉండుట మంచిదికాదు. కనుక వారు మంచి గుణములను అలవరచుకొని, మంచివారుగ ఉండవలెనన్న ఉద్దేశ్యముతో వీరి చెడు గుణములను వర్ణించుట ఇక్కడితో ఆపుచున్నాను. గొప్ప అదృష్టశాలురైన వీరు మేలైన మనుగడ సాగించి, కీర్తి, సంపదలతో ఉండుట అందరికిని క్షేమము.

బాల్యము నుండియే వీరు ఎవరితో పరిచయము చేసుకొన్నను వెంటనే వారి అలవాట్లను, గుణములను అట్లే గ్రహించెదరు. కావున ఈ సంఖ్యలో పుట్టిన పిల్లలను మంచి లక్ష్యములు కలవారి ఉదాహరణలే చెప్పుతూ, మంచి సహవాసములో పెంచుట చాలా ఆవశ్యకము. వీరికి ఒకనాడున్న ఇష్టాయిష్టములు మరునాడుండవు. నేడు నచ్చిన ఆటవస్తువు రేపు నచ్చదు. బాల్యములో మార్పులను అభిలషించినవారు పెద్దవారైన పిదప కూడా అదే గుణముతో ఉందురు. మార్పు- చోటు మార్పు, ఉద్యోగం మార్పు, పరిసరాల మార్పుల కోసం పాటుపడతారు. ఎంతో శ్రమపడి ఒక పదవిని పొందుతారు. వెంటనే దాని మీద ఆసక్తి చప్పబడిపోతుంది. వేరేదయినా సాధించాలని మొదలుపెడతారు. సదా పరిసరములు మారు ప్రయాణములు చేస్తూ ఉంటారు. అయినా రమణీయ ప్రదేశములలో కూడా చాలాకాలము నిలువలేరు. ఏదయినా క్రొత్త క్రొత్తగా చూస్తూ, చేస్తూ ఉండటానికే ఇష్టపడతారు. తరువాత వీరు ఏమి చేయబోవుచున్నారనునది వీరికి కూడ తెలియదు. ఒక్కటి మాత్రం నిజం. ఈ నాడు చేసిన పని రేపు చేయరు.

వీరిని జీవిత భాగస్వాములుగా చేసుకొన్నవారు ఈ గుణములను అర్థము చేసికొనవలసియున్నది. ఆకర్షణీయమైన దుస్తులు ధరించుట చేతను, ఆహార

విషయములో వైవిధ్యము చూపించుట చేతను వీరిని త్వరగా ఆకట్టుకొనవచ్చును. వీరి గుణములను అర్థము చేసికొని వీరికి లేని గుణాతిశయములున్నవని పొగిడినా నిజమని నమ్ముతారు. ఇతరులకు **సహాయపడటానికి వెనుకాడనివారు అగుటచే వీరి ద్వారా ఎట్టి కార్యమునయినా సాధించుకోవచ్చును.** వీరి ఆశాపాశములు కూడా మార్పుచెందినవి. కాబట్టి వీరు సామర్థ్యముతో నడచుకోననిచో ఇతరులు వీరిని సందేహింపగలరు. జీవితములో ఏర్పడు సుఖదుఃఖములు వీరిని కొంతసేపే బాధించును. త్వరలోనే తేరుకొని తరువాతి కార్యక్రమము నిర్వహించుటకు తయారగుదురు. దీనికి కారణం వీరి మనోవేగం, మార్పులు చూసి కలతచెందని మనస్తత్వం అనే చెప్పవచ్చు.

ఎల్లవేళలా ఉత్సాహంగా కనబడే వీరు ఓటమికి బాధపడరు. వెంటనే సర్దుకుని ప్రణాళికను మార్చుకొని మరో విధంగా ప్రయత్నిస్తారు. **వీరు ఆత్మవిశ్వాసము పెంచుకొనవలెను. వీరికి ఓటమి అనునది లేదు. ఓటమి వలె అగుపడునవి కూడ భావిలో రాబోవు విజయమునకై ఏర్పడిన మార్పులేఅనిపిదప విశదమగును.**

వీరి తెలివి ఆత్మ ప్రబోధితము. కావున **వీరి మనసు దేనిని చేయమగుచున్నదో దానిని చేయుట మంచిది. ఇతరులకు అది 'సరి' అనిపించకపోయినను భయము లేదు. 'విశ్వవ్యాప్త దైవశక్తి'** అనబడు ఈశ్వరేచ్ఛ వీరి బుద్ధిని ఆడించుచున్నది కనుక "ఏల? అన్న ప్రశ్నకు జవాబు వెదకకుండా మనసున గట్టిగా తోచిన పనిని చేయ మొదలిడినచో "ఎందుకు?" అన్న ప్రశ్నకు సమాధానము తానే విపులమగును. బుద్ధి ప్రేరణ వలన జరుగు కార్యము కావున ఎట్టి అవాంతరములు కలిగినను అందుండి బయటపడుదురు. నాకొక సన్నిహిత మిత్రుడు కలడు. అతని జీవితమే వింతైన విపత్తులతో నిండినది. (26–న పుట్టినవాడు - ఈయన విధి సంఖ్య 5). ఈయన 70 మార్లు మరణమును వెంట్రుకవాసిలో తప్పించుకొన్న ఘనుడు. జీవితంలో హెచ్చుకాలము విదేశములందు పెక్కు చోట్ల గడిపినవాడు. ఈయన వరుసగా నెల రోజులయిన ఒక దేశమందు ఉండడు. గొప్ప కోటీశ్వరుడయినను ఒక్కపూట కూడ వేళకు భోజనము చేసి ఎరుగడు. కొన్ని యేండ్ల క్రితము విపత్తుకు గురియైన చెన్నై కోయంబత్తూరు విమానమున ప్రయాణమైనాడు. పత్రికల ద్వారా ఆ విమాన ప్రమాదము గురించి తెలుసుకొన్న మేము

దిగమ చెందినాము. (విమానము కూలినది, సర్వనాశనమయినదని తప్ప వేరు వివరములు దొరకలేదు). రెండురోజుల పిదప, తాను బెంగుళూరులో క్షేమముగా ఉన్నట్లును, విమానము బయలుదేరబోవునప్పుడు తనకొక స్నేహితుని చూడవలెనని అనిపించి ప్రయాణమును రద్దుచేసికొని బెంగుళూరు వెళ్ళినట్లును, రెండు దినములలో రైలు ద్వారా వచ్చునట్లును, దిగులుపడవలదని మాకు తెలియబరచినాడు. తాను మటుకు, తనకు తోచినట్లు ప్రయాణము కేన్సిలు చేసుకొనక, టిక్కెట్టుకొన్నచోటికి ప్రయాణించివుంటే తప్పక ఈ లోకము నుండి పరలోకయాత్ర చేసి ఉండేవాడు. ఇతనేగాక 14-వ తేదీన జన్మించిన అనేకులు ఇట్టే ఆఖరు నిముషమున ఆపదలు తప్పించుకొన్నామని చెప్పిఉన్నారు. కనుక వీరు తమ మనోభావములను శ్రద్ధగా ఆలకించి, వాని ప్రకారము నడచుకొనిన ఎంతో మేలు కలుగును అన్నది గ్రహించి అట్లు అలవాటు చేసికొనవలెను.

ధనసంపాదనకై కష్టపడి శరీర శ్రమ చేయుటకు వీరిష్టపడరు. సులభముగా ఎక్కువ ధనము సంపాదించుమార్గమునే అన్వేషింతురు. అతి తేలికగా అమిత ధనమును ఆర్జించు వ్యూహములు వారి మనసులో సదా తిరుగుచునే ఉండును. కించిత్తయినా బాధ లేకుండా చేతనున్నదానిని ఖర్చుపెడతారు. ఏవృత్తిలోనయినా ధనవంతులు కాగలిగిన వీరు జూదములలో పాల్గొనకుండుట ఆవశ్యకము. అట్లు పాల్గొన్నచో, ముందు కొంత విజయమేర్పడినా తరువాత అంతా పరాజయమే కలుగును. ఏలననగా వీరి బుద్ధిని ప్రకాశింపజేయు తెలివి, వీరి ద్వారా లోకమున కొన్ని ముఖ్యకార్యములను సాధించుటకే ఏర్పడినదిగాని వీరి స్వంత లాభమునకు కాదు. దీనిని మరువగూడదు. వీరు సహజముగనే వశీకరణముగా ఉండుటకును, అదృష్టశాలురుగ ఉండుటకును గల రహస్య కారణం ఇదే.

5 సంఖ్యలో పుట్టినవారు స్త్రీ పురుషులిరువురును చపలచిత్తులు, ప్రథమ వీక్షణములోనే ప్రేమింప మొదలెడుదురు. (కొందరయితే సమాజపు కట్టుబాట్లను కొంచెం కూడా గౌరవించరు. తొందరపడి పెళ్ళి చేసుకొని తరువాత పశ్చాత్తాప పడుటయు కలదు). వీరు వివాహ విషయమున జాగరూకతతోను, ముందాలోచనతోను వ్యవహరింప వలసి ఉన్నది. స్త్రీ పురుష విషయములలో నిదానము వహించుట అతి

ముఖ్యము. 9, 18, 27 తేదీలలో పుట్టిన వారు వీరి మనసును తేలికగా దోచుకొందురు. మనస్ఫూర్తిగా వీరిని ప్రేమించినను, వీరికి లొంగక, వీరిని ఒక ఆట ఆడించెదరు. 5, 14, 23 తేదీలలో పుట్టినవారు 9వ సంఖ్యగల వారి నుండి జాగ్రత్తగా ఉండవలెను.

## శరీరము - వ్యాధి - మందు

బుధుడు మానవుల శ్వాసనాళము, మెదడు, నాడీ మండలములను పాలించుచున్నాడు. సామాన్యమైన ఎత్తు, కొద్దిపాటి లావుగల శరీరము వీరికి ఉంటుంది (తేది, నెల, సంవత్సరము కూడితే వచ్చు సంఖ్య 6, 1, 9 అయితే మంచి పొడగరులు అవుతారు). కళ గల ముఖము, ఆసక్తి, ఉత్సాహము కలిగించే కాంతిగల కళ్ళు ఉండును. ముఖమున చురుకుదనము నిండియుండును. చూపులోను, మాటలోను ఆకర్షణ శక్తి ఉండును. చేతులు ఏదైనా చేయుచునే ఉండును. సంఖ్యాబలము తగ్గినచో శరీరము కృశించి, ఎముకల గూడువలె ఉందురు.

ఆలోచనలెక్కువగా ఉండుటచే, వీరి మనసు పరిపరివిధముల పోయి అశాంతిని పొందుదురు. నిద్రలేమి కలుగును. నరాల బలహీనత, పక్షవాతము, హఠాత్తుగా కాళ్ళు చేతులు అలసిపోవటము, మెదడు బలహీనత, చిత్తభ్రమ , హిస్టీరియా మొదలైన నరములకు సంబంధించిన వ్యాధులు కలుగవచ్చును. బాల్యమున మశూచి రావచ్చును.

ఏ జబ్బు చేసినా త్వరగా కోలుకొనుటకు కావలసిన శక్తి శరీరము కలిగి ఉండుటకు, మంచి నిద్ర, మనశ్శాంతి కొరవడకుండుటకు, మనసుకు ఆహ్లాదకరమైన యోగాసనములు, ప్రాణాయామము వంటి సాధనములు ఎంతో సహాయపడును. మన దేశ ప్రథమ ప్రధాని శ్రీ జవహర్ లాల్ నెహ్రూ 14వ తారీఖున జన్మించినా ప్రతిదినము అరగంటసేపు శీర్షాసనముతో ఉండుటచే చివరి వరకును యువకునివలె మంచి జవసత్వములతో ఉండుట మనందరికి తెలిసినదే. వేరెవరును ఆయన వలె అంత పని చేయువారు కారు గనుక, వారిని సరియైన ఉదాహరణగా తీసికొని అనుసరింపవచ్చును. స్థల మార్పు, విశ్రాంతి, నిద్ర, ప్రశాంతత ఇవియే 5 సంఖ్యవారికి కావలసిన మందు.

## నామ సంఖ్య-ఐదు

పేరులోని అక్షరముల అంకెలను కూడితే వచ్చు సంఖ్య 5 అయినచో ఆ పేరు 5 ఆధిపత్యము క్రింద వచ్చును. ఆవిధముగా వచ్చు వేర్వేరు సంఖ్యల ఫలితములను పరిశీలింతము.

5 - జనాకర్షణను, సుఖమయ జీవితమును, కీర్తిని, ఉన్నత అంతస్తును ఈ సంఖ్య ఇచ్చును. మంచి 'హుందా' గల జీవితమేర్పడును. ధారాళముగ ఖర్చుపెట్టవలసి వచ్చును. వీరు పట్టు వదలని ప్రయత్నము, ఏకాగ్రచిత్తము కలవారుగా ఉండుటకు ప్రయత్నింప వలెను.

14 - ఈ సంఖ్య వ్యాపారమునకు తగినది. ఈ పేరు కలవారు ఎల్లవేళలా 'నలుగురి మధ్యనే ఉంటారు. జన సమూహమును, పలురకములైన వస్తువులచే చుట్టుముట్టబడిన వారుగా ఉందురు. వీరికి అన్ని విధములయిన వ్యాపారములు లాభించును. నిత్యము అనేకులను కలిసికొను జీవితమేర్పడును. ఎడతెగని సంచారము కలదు. పిడుగులు, మెరుపులు, వరదలు, అగ్ని - దీని వలన భయము కలదు. వేగముగా వాహనములందు ప్రయాణించునపుడు అజాగ్రత్తగా ఉండినచో క్రిందపడు అపాయము కలదు. వీరు చేయు వ్యాపార వస్తువులును 14వచ్చు పేరుగలవి అయినచో వానిని జనులు మిక్కిలి ఆదరింతురు. క్రమం తప్పక తలంటు స్నానము చేయుటచే జ్వరము, మశూచిలను నివారింపవచ్చును.

23వ తేది: ఒక సారి వీరు దేనిపైనైనా మనసు లగ్నం చేస్తే, వీరికి సాధించలేనిది అంటూ ఏదీ ఉండదు. వీరు తమ శక్తితో జనాన్ని వశపర్చుకుని, నియంత్రించుట జరుగుతుంది. వీరి జనాకర్షణకి ముఖ్య కారణం వీరిలోని వాక్చాతుర్యం మరియు దౌత్యనీతి అని చెప్పవచ్చు. వీరి కంటె ఉత్తమ స్థానాలలో ఉన్న వారు కూడా వీరిని తరచు పొగడుట మనం చూస్తాం. వీరి నామ సంఖ్య వీరి భాగ్య సంఖ్యతో అనుకూలంగా ఉన్నచో, వీరు పూర్తి ప్రపంచాన్నే ఏలగలుగుతారు. ఉత్తమ లక్షణాలని మరియు ఆదర్శవంతమైన ప్రవర్తనని అలవర్చుకొనినచో, వీరు మహాత్ములు మరియ **చరిత్రలో ఘనతకెక్కిన గొప్ప వ్యక్తులగా** నిలిచిపోతారు.

వాల్నట్ (అక్రోట్), పిస్తావంటి పుష్టికరమైన పప్పులు, ధాతుపుష్టి, నరములకు

బలము చేకూర్చు ఆహార పదార్థములు, ఆవు పాలు, నెయ్యి మున్నగునవి మేలు చేయును. అత్తిపండ్లు, ఓట్సు అనే ధాన్యము దొరకునపుడు చేర్చుకొనవచ్చును. అన్ని రకముల పండ్లు వీరికి మంచివే.

## ప్రత్యేక ఫలితములు

5 - ఈ తారీఖున పుట్టినవారు చిన్నప్పటినుండియే గొప్ప లక్ష్యములచే ఆకర్షింపబడుదురు. ఆకర్షణీయమైన గుణములు : పరులను గౌరవించుట, అన్ని విధముల మేలైన గుణములు నిండినవారై ఉందురు. ఇతరులకు బోధింప గలిగినవారుగా ఉండెదరు. దైవకృప కలిగిన మనుగడ ఉండును.

14 - ఈ తేదీలో జన్మించినవారికి విసుగులేని ప్రయాణాసక్తి, కొంత పట్టుదలయు ఉండును. సంపద చేర్చు అదృష్టము కలదు. కావున అన్ని రకముల పెద్ద వ్యాపారములును వీరికి ఫలించును. పెద్ద మొత్తములో ధనము వీరి చేతులలో ఉండును. వీరి చుట్టును ఎల్లవేళలా జనసమూహముండును. ఇతరులను నమ్మటచే పెద్దయెత్తున నష్టములు కలుగును. వాన, పిడుగులు, అగ్ని, వరదలు - వీని నుండి దూరముగా ఉండవలెను. 14 ఏండ్ల వయసువరకు జ్వరము, మశూచి తాకకుండా కాపాడుకొనవలెను. ఈతేదీన పుట్టినవారు, చిన్నప్పుడే ప్రేమ గుండములో చిక్కుకొనక ఉండుట అతి ఆవశ్యకము. ప్రాణములున్నంత కాలము పరుల సహాయము కలదు. తరగని అదృష్టము వరించును. ప్రేమ, పెళ్ళి మొదలైన మనసుకు సంబంధించిన విషయములందు తొందరపడక నిదానముతో బాగుగా ఆలోచించిగాని నిర్ణయములు తీసుకొనరాదు. లేనిచో ఆశాభంగము కలుగును. ఇది మిక్కిలి అదృష్టకరమైన సంఖ్య అనియే చెప్పవలెను. జీవితాంతము వీరికి ఇతరుల సహాయము లభించును. అదే విధముగా వీరికి గొప్ప అదృష్టము, అభ్యుదయము కూడా లభించును.

23 - తక్కిన అన్ని సంఖ్యలకన్నా అదృష్టకరమయినదిగా దీనిని చెప్పవచ్చును. దీనిని పేరుగా కలవారికి 'పట్టినదంతా బంగారము'గను, తలచినవన్నియు విజయవంతముగా నెరవేరుటయు జరుగును. వీరి ప్రణాళికలన్నియు నిస్సందేహముగా విజయవంతమగును. ఇతరులు అసాధ్యమని తోసిబుచ్చిన కార్యములు కూడా వీరికి సులభముగా సాధ్యమగును. ప్రపంచము ఆశ్చర్యచకితమగునట్టి కార్యములు చేసి

చూపుతారు. అమితమైన అదృష్టము కలిగిన సంఖ్యయే అయినను, ఈ సంఖ్యను పేరులో కలవారు గొప్ప యత్నము చేయకపోయిన ఎడల, తన తాహతుకు మించిన అదృష్టశాలురయిన వీరు, సామాన్యులయి సగటు మానవులగుదురు. గొప్ప ప్రణాళికలు, యత్నములు, వీరిని ప్రసిద్ధులుగా చేయును. దీని ఫలితముగా, అత్యున్నత పదవిలో ఉన్న వారి ఆదరణ, పాలనా పీఠమును అధిష్ఠించినవారి రక్షణ ఉండును. చేయు యత్నములన్నియు విజయవంతమగును. కనుక వీరు ఎప్పుడును క్లిష్ట యత్నములు, కృత్యములు చేపట్టుటయే శ్లాఘ్యము. లేనిచో సోమరితనము నిండిన సుఖమయమైన మనుగడగా జీవితము ముగియును. ఈ సంఖ్యనే (రాజాకర్షణ) రాజవశ్యము నిండిన సంఖ్యగా పేర్కొందురు.

32- ఈ సంఖ్య వివిధ మనుష్యులను తనవైపు ఆకర్షింపగలిగినది. ఈ సంఖ్యను పేరుగాగల వారికి ఎన్నటికినీ ప్రజాదరణ కలదు. సరి క్రొత్త అభిప్రాయములను అప్రయత్నముగనే వెలిబుచ్చుదురు. మిక్కిలి శక్తిగల ఈ సంఖ్య సులభముగా ఎవరినయినను ప్రముఖులను చేయుచున్నది. ఆకర్షణ శక్తిని ఇచ్చుచున్నది. మనసున కలుగు ప్రేరణలననుసరించియే నడచుకొనిన జీవితము అద్భుతమయమగును. ఇతరుల సలహాల ప్రకారము నడచుకొన మొదలిడిన అపజయములే వరుసగా ఏర్పడును. ఈసంఖ్యనే జ్ఞానపీఠము అని పేర్కొనుచున్నారు. (ఇందువలననే విక్రమార్కుని సింహాసనము 32 మెట్లు కలదిగా వర్ణింపబడినది.) సమయోచిత బుద్ధియు, సరస హాస్య సంభాషణ చేయగలుగుటయు జరుగును. జీవితములో ఒడిదుడుకులు మారి మారి కలుగుచునే ఉండును. మేధావి అగుదురు. సులభముగా వార్ధక్య చిహ్నములు అగుపడవు.

41 - ఈ సంఖ్య జనాకర్షణను, ఈ సంఖ్య కలవారి మాట తక్కినవారికి శిరోధార్యమగుటను సూచించును. విజయవీరులుగా జీవింతురు. గొప్ప ఆదర్శవంతులుగా ఉందురు. ప్రపంచవ్యాప్తమైన కీర్తి, ప్రతిష్టలేర్పడును. అభివృద్ధియందు అపరిమితాసక్తి ఉండును. విజయము వలన కలుగు మత్తులో శక్తికి మించిన పనులందు తెగించి దిగుదురు. అందు కలుగు అపజయములను పరుల కంట పడకుండ సామర్థ్యముతో దాచి పెట్టుదురు.

50 - ఈ సంఖ్య వారు అపరిమిత బుద్ధిశాలురుగను, అన్నిటినీ తీవ్రముగా పరిశోధించు వారుగను ఉందురు. విద్యావిషయములలో సాటిలేని పాండిత్యము సంపాదింతురు. కొందరు ప్రసిద్ధ ఉపాధ్యాయులుగా ప్రకాశింతురు. మరి కొందరు తమ తెలివినంతను ధనము సంపాదించుటలోనే ఖర్చుపెట్టి జయమును పొందుచున్నారు. విశేషమైన అదృష్టము 50 యేండ్లకు మీదటనే. ఆయుస్సు కూడా దీర్ఘమైనదే.

59 - 50 సంఖ్య వారివలెనే వీరు కూడా పరిశోధకులుగా ఉండుటతో బాటు, హాస్యరసము తొణికించు రచయితలుగను ప్రసిద్ధులగుదురు. ఎన్నటికినీ హాస్యరచయితల లోకమునకు తలమానికము వీరే. వీరికి రచనల ద్వారా ఐశ్వర్యము కలుగును. జనాదరణ మెండుగ ఉండును. వీరిలో చదువులేనివారు కూడా ప్రజాదరణ సహాయముతో పెద్ద పదవులను వహిస్తారు. ధన సంపాదనపై దృష్టి ఉండును. దీర్ఘకాలిక అదృష్టము కలదు. నరములకు సంబంధించిన వ్యాధులు, పక్షవాతము మున్నగునవి వచ్చును కనుక మంచి అలవాట్లు కలిగి ఉండుట ముఖ్యము.

68 - ఇది కూడ ఒకింత అదృష్టకరమైన సంఖ్య అనియే చెప్పవలయును. కాని ప్రారంభించిన అదృష్టకరమైన జీవితము హఠాత్తుగా ఆటంకము కలిగి నిలిచిపోవును. అసాధ్యమయిన పెద్ద పనులలో ప్రవేశించి అనవసరముగా దుఃఖము పాలగుదురు. ప్రారంభమున అనుకోని అదృష్టము వచ్చిపడినా త్వరలోనే విఘ్నములు కలుగుటచే ఇది శ్రేష్ఠమయినది కాదు. పేరాశయే వీరి జీవితమును పాడుచేయుచున్నది.

77 - స్వంత ప్రయత్నమును, ఆత్మవిశ్వాసమును, కృషిని ఇది సూచించుచున్నది. జనాకర్షణ లభించును. గొప్ప ప్రతిష్ట కలుగును. ఆకర్షణీయమైన జీవితము కలుగును. దైవభక్తి ఉన్ననే ఇది పూర్ణ ఫలము ఇచ్చును. వీరు విదేశీ పర్యటన చేయుదురు.

86 - మిక్కిలి శ్రమపడి ఒక్కొక్క మెట్టుగా అభివృద్ధి సాధించుటను ఈ సంఖ్య సూచించును. అర్హత, దానికి తగిన ఆదరణ, మెప్పు కలదు. ధనవంతులు ధన సహాయము చేసి ఆదరింతురు. ఇతరుల ఆదరణతో సుఖజీవితము సంతోషకరమైన పరిస్థితులు ఏర్పడును. సంపద చేర్చి సుఖింతురు.

95 - ఈ సంఖ్య క్రమశిక్షణ గల జీవితమును, వీర ధీరత్వములను, కీర్తిని

సూచించుచున్నది. పలువిధములయిన నూతన వస్తువులతో వ్యాపారము చేయుట వలన సంపద కూడును. ప్రసంగించు శక్తి ఎక్కువగును. ప్రాబల్యము కలుగును. వీరు వ్యాపారము జయప్రదముగా ఉండి, ఉన్నతిని సాధిస్తారు. ఇంకా చక్కటి సంభాణా చాతుర్యము కలిగి, బహుళ ప్రచారము పొందెదరు.

104 - ఈ సంఖ్యవారికి గంభీరముగా జీవితము మొదలగును. పిదప అనుకోని మార్పులు కలుగుటను సూచించుచున్నది. అరుదైన కార్యములను సాధించెదరు. కీర్తి మటుకే మిగులును.

## అదృష్ట కాలము

5, 14, 23 తేదీలలో పుట్టినవారికి, తేది, నెల, సంవత్సరము కూడగా 5 వచ్చు తారీకులలో జన్మించిన వారికి ప్రతినెలలోని 5, 9, 14, 18, 23, 27 తేదీలు మిక్కిలి అదృష్టకరమైనవి. అన్ని దినములును వీరికి తగినవే. కనుక దురదృష్ట దినములని దేనిని విడిగా చెప్పుటకు లేదు.

## ముఖ్య గమనిక

ఈ అంకె అనుకోని మార్పులనేర్పరుచునది. కావున ఈ సంఖ్యవారు వివాహము చేసుకొనుటకు తమ కాబోవు భార్య/భర్తల అదృష్ట దినములను ఎంచుకొనవలెను. అప్పుడే జీవితము సంతోషకరముగా ఉండును. అట్లే పుట్టినతేదీ, విధి సంఖ్య వేర్వేరుగా ఉన్నచో విధి సంఖ్యకు అదృష్ట దినములలో వివాహమాడవచ్చును. ఏమైనను వివాహ దినము తేది, నెల, సంవత్సరము కూడిన 5 రాకుండా చూసుకొనవలయును.

వృత్తులు

జన్మతేదీ 5గా కలవారికి క్రొత్తగా చేయు అన్ని ప్రయత్నములును విజయవంతమగును. ఏది చేసినను జనాదరణ లభించును. వ్యాపారము వీరికి తగినది. (వీరు ఉద్యోగము చేసిన వీరి అదృష్టమును వీరి యజమానులు అనుభవింతురు). కూడిన విధి సంఖ్య 3, 1 అయినచో ఇష్టమైతే ఉద్యోగము చేయవచ్చును. అభివృద్ధి నిశ్చయముగా కలదు. అట్లుగానిచో ఉద్యోగమే వద్దు. సమయానుకూలముగా ఏ వ్యాపారమైనా చేయవచ్చును. కూర్చున్న చోటనే గుంపును చేర్చగలిగిన సంఖ్య

యగుటచే వ్యాపారము జోరుగా సాగును. వ్యాపారము చేయలేనివారు ఏజెంట్లుగా జీవితము ప్రారంభింపవచ్చును. బ్రోకరులుగాను, కమిషన్ ఏజెంటులుగాను లక్షలు గడించునది వీరే. ట్రావెల్ ఏజంట్లుగాను, బిజినెస్ ఏజెంట్లుగాను కావచ్చును. ఉత్సాహముతో మనసుకు నచ్చిన వృత్తిని చేపట్టవచ్చును. వృత్తిని విస్తరింపవచ్చును. కాని తరచుగా మార్చరాదు. దూత అనబడే I.K.S. ఉద్యోగములు వీరికి తగినవి. గణితజ్ఞులు గానో లేదా C.A. లు గానో ఉండిన మంచి లాభము కలుగును. భాగస్థులుగా 1, 4, 5, 9 సంఖ్యలవారిని చేర్చుకొనవచ్చును.

### తోడుపడువారు

వీరికి అన్ని సంఖ్యలవారును సహాయపడుదురు.

### కుటుంబ జీవనము

5 సంఖ్య వారికి 5,9 సంఖ్యల వారిపై మొదటి చూపులోనే ప్రేమ ఏర్పడును. విధి సంఖ్యకు తగిన వారిని వివాహమాడిన వివాహజీవితము వర్ధిల్లును. విధిసంఖ్య యు 5గా ఉండిన 1, 3, 6, 9లో పుట్టినవారిని పెండ్లియాడవచ్చును. జన్మతేదిని, విధిసంఖ్యగాని 5గా ఉన్నచో సంతానము తక్కువగా ఉండును. కనుక 5 వారు 5 సంఖ్యవారిని వివాహము చేసికొనరాదు. పేరు ననుసరించి పుత్రభాగ్యము ఉండును.

వివాహ దినమును ఈవిధముగా నిర్ణయించవచ్చు :

| **జీవిత భాగస్వామి సంఖ్య** | **వివాహతేది విధి సంఖ్య** |
|---|---|
| 1, 3 | 1 & 1, 1 & 2, 3 & 1 |
| 6 | 1 & 6, 6 & 1 |
| 9 | 3 & 9, 6 & 9, 9 & 3, 9 & 6 |

## రంగు

బూడిదరంగు వీరికి మిక్కిలి అదృష్టకరమైనది. తక్కిన అన్ని లేతరంగులు ధరింపవచ్చును. సిల్కువంటి మిసమిసలాడు వస్త్రములు ఆకర్షణను ఎక్కువ చేయును. ముదురు రంగులు (ముఖ్యముగా పచ్చ, నలుపు) ఎన్నటికినీ పనికిరావు, వాడరాదు.

## రత్నము

వజ్రములు, అవి లేనిచో రవ్వల వలెనే ప్రకాశించు వైట్ జర్కాన్ రాళ్లను ధరింపవచ్చును.

## అయిదును సూచించు అక్షరములు, వాటి ఫలములు

E - 5. ఏకాంబరం లేదా ఎడ్వర్డు వంటి పేర్లలో వచ్చునట్లు A శబ్దముగా నున్నచో ఇది ఎఱ్ఱని వర్ణమును, మిక్కిలి శక్తివంతమైన శబ్ద తరంగములను కలిగియుండును. తక్కిన సమయములలో ఇది నీలవర్ణమును సూచించును. ఈ అక్షరము, విషయములను పరిశీలించి చూసి నిర్ణయమునకు వచ్చుటను సూచించుచున్నది. పరిస్థితులను అనుసరించి సర్దుకొను గుణమును ఇచ్చును. అరుదైన పలు యోచనలు, నిర్ణయములు హఠాత్తుగ మనసున తోచును. దానిని అనుసరించెదరు. ఇది లోతైన మాయాశక్తి లీలను సూచించు సంఖ్య కనుక సులభముగా అందరు ఆకర్షింపబడుదురు. వేదాంతము, యోగములలో ఆసక్తి కలుగును. లోకుల అభిప్రాయములకు ఎదురీతకు జంకుతారు. రహస్యము అభిలషిస్తారు. లోపల తుఫాను రేగినా పైకి శాంతముగా కనబడుతారు. సదా ఏదైనా సాధింప ప్రయత్నించుచునే ఉందురు. ఆపద కలిగినను మిక్కిలి నిదానముతో దానిని దాటెదరు. పరులకు సహాయపడు గుణము కలదు. తమకు ఉత్సాహము కలిగిన తక్కినవారిని కూడా ఉత్సాహపరచుదురు. వీరు అలసిన తక్కినవారిని అధైర్యపరచుదురు. వీరి అభిప్రాయములు మారుచుండును. ఈశబ్దము జీర్ణశక్తిని, నరముల శక్తిని బాధించును.

N - 50. దీని వర్ణము ఎఱ్ఱని నిప్పులాంటి ఎఱుపు. మారుచునేయుండు అలల వేగము కలిగిన శబ్దమగుటచే ఉధృతమైన మనోభావములు దీనిలో ప్రతిఫలించును. అభిమానము నుండి ఆప్యాయత వరకు, కామము మొదలు కరుణ వరకు అన్ని

భావములును ఇందులో అగుపడును. భావావేశపరులు గాన మిత్రులు మనసును, భోగము, విలాసములనిచ్చు అన్ని విషయములు వీరిని ఆకర్షించును. కష్టములు కలుగును. వాటిని అధిగమించి వీరులనిపించుకొందురు. చిన్న మాట కూడ వీరి మనసులో బాణమువలె గుచ్చుకొనును. వీరిని భావముల ప్రోగుయని చెప్పవచ్చును. శక్తులను వృథాచేయుదురు. (ఇది పేరులోని మొదటి అక్షరముగా వచ్చిన ఎక్కువ శక్తిగలదిగా ఉండును). రక్త ప్రసరణలో శ్రమ, వాత ప్రకోపములు, నరముల బలహీనత కలుగును)

H - 5 ఆకుపచ్చ రంగు, దీని తరువాత అక్షరము యొక్క గుణములను బయలుపరచును. జరుగబోవు విషయములను ఊహింపగలశక్తి మెండుగా ఉండును. వీరికి విజయ ప్రణాళికలను ఏర్పరచుటలో సమర్థత ఎక్కువగా ఉండును. ఆపదలను ముందుగా గుర్తించి కాపాడుకొనగలరు. ఇది రక్షణను, జాగ్రత్తను, సుఖమయమైన నివాసమును సూచించుచున్నది. ధారాళ మనస్తత్వము ఉండదు. వృథా ఖర్చు, శక్తి వృథాయగుట జరుగును.

X - 5 పసుపు, ఎఱుపు కలసిన వర్ణము. సదా మారుచుండు స్వభావము కలది కనుక దీని స్వభావమును నిర్ణయింపలేము. దీనికి తెలిసికొనలేని లేక అర్థముగాని విషయములను తెలిసికొను శక్తి కలదు. (తెలియని అంకెను X అని అనుకొనుము అని గణితములో ఉపయోగించుటకు కారణములు చెప్ప మొదలిడిన అది పెద్ద వ్యాసమగును). దీని వలన ధైర్యము, నిదానము, పోల్చిచూచుట, ఇరు విషయములను సమీకరించుట, ఉన్నట్లుగానే దేనినైనను అర్థము చేసికొనుట, తరగని ప్రోత్సాహము సూచింపబడుచున్నవి. ఈ అక్షరము పేరులో కలవారు, అన్ని వాంఛలను పూర్తిచేసుకొనగలరు. అన్ని కోర్కెలను నెరవేర్చుకొనగలరు.

## 5 తేదీలో పుట్టిన కొందరు ప్రముఖ వ్యక్తులు

| **పేరు** | **జన్మతేది సంఖ్య** | **తేది-విధి సంఖ్యలు** |
|---|---|---|
| | | |

| | | |
|---|---|---|
| MERCATOR<br>మెర్ కాటర్ (ప్రపంచ పటమును మొదటిసారిగా తయారుచేసినవారు) | 5-5-1512 | 5 & 1 |
| KONRAD ADENAUER<br>కాన్రాడ్ ఆడా న్యూర్ (జర్మను అధినేత) | 5-1-1876 | 5 & 1 |
| ADLAI STEVENSON<br>అడ్లాయి స్టీవెన్సన్ | 5-2-1900 | 5 & 8 |
| CHESTER BOWLES<br>చెస్టర్ బౌల్స్ | 5-4-1901 | 5 & 2 |
| V.O. CHIDAMBARAM PILLAI<br>వి.ఒ. చిదంబరం పిళ్ళై (బ్రిటీష్ వారికి పోటీగా ఓడ నడిపినవారు) | 5-9-1872 | 5 & 5 |
| GUY DE MAUPASSANT<br>గయ్ డీ మోపోసాన్ (సుప్రసిద్ధ ఫ్రెంచ్ రచయిత. 43 సం.లకే మతి తప్పి, జబ్బుతో మరణించారు) | 5-8-1850 | 5 & 9 |
| DR. S. RADHAKRISHNAN<br>డా. సర్వేపల్లి రాధాకృష్ణన్ (భారత ప్రథమ ఉపరాష్ట్రపతి) | 5-9-1888 | 5 & 3 |
| P.T. BURNUM<br>PT. బర్నమ్ (ప్రసిద్ధిగాంచిన సర్కస్ అధికారి) | 5-1-1810 | 5 & 4 |

| | | |
|---|---|---|
| WALTER ELIAS DISNEY<br>వాల్ట్ డిస్నీ (డిస్నీ ల్యాండ్ స్థాపించినవారు) | 5-12-1901 | 5 & 1 |
| ALBERT EINSTEIN<br>ఆల్బర్ట్ ఐన్స్టీన్ | 14-3-1879 | 5 & 6 |
| EAMON DE VALERA<br>ఈమన్ డీ వలేరా | 14-10-1882 | 5 & 7 |
| SIR ALLADI KRISHNASWAMI AIYAR<br>సర్ అల్లాడి కృష్ణస్వామి అయ్యరు | 14-4-1883 | 5 & 2 |
| JAWAHARLAL NEHRU<br>పండిట్ జవహర్ లాల్ నెహ్రూ (భారతదేశపు మొదటి ప్రధాని) | 14-11-1889 | 5 & 6 |
| DWIGHT D. EISENHOVER<br>డ్వైట్ డి. ఐసన్ హోవర్ | 14-10-1890 | 5 & 6 |
| C.D. DESHMUKH<br>సి.డి. దేశ్ ముఖ్ (రిజర్వు బ్యాంకు గవర్నరుగాను, ఆర్థిక మంత్రిగాను ఉండినవారు) | 14-1-1896 | 5 & 3 |
| KING GEORGE VI<br>కింగ్ జార్జి VI | 14-12-1895 | 5 & 4 |

| | | |
|---|---|---|
| MC CARTHY (JOSEPH REMOND MCCARTHY)<br>మెక్ కార్తీ | 14-11-1908 | 5 & 7 |
| ROGER MOORE<br>రోజర్ మూర్ (జేమ్స్ బాండ్ - కథానాయకుడు) | 14-10-1927 | 5 & 7 |
| KING EDWARD VIII<br>కింగ్ ఎడ్వర్డ్-VIII (ప్రేమకోసం సింహాసనాన్ని త్యాగము చేసిన బ్రిటీషు చక్రవర్తి) | 23-6-1894 | 5 & 6 |
| ARCHIBALD EDWARD NYE<br>సర్ ఆర్చిబాల్డ్ ఎడ్వర్డ్ నై (ఒక సాధారణ సిపాయి స్థాయి నుండి మద్రాసు గవర్నరయ్యారు.) | 23-4-1895 | 5 & 5 |
| F.A.MESMER<br>ఎఫ్.ఎ. మెస్మర్ ('మెస్మరిజం" తత్వజ్ఞాని) | 23-5-1733 | 5 & 6 |
| SUBHAS CHANDRABOSE<br>సుభాష్ చంద్రబోసు (నేతాజీగా ప్రసిద్ధి చెందినవారు) | 23-1-1897 | 5 & 4 |
| SRI PUTTAPARTHI SAIBABA<br>శ్రీ పుట్టపర్తి సాయిబాబా | 23-11-1923 | 5 & 4 |
| MUMMADIVARAM SRI BALAYOGI<br>ముమ్మడివరం బాలయోగి | 23-10-1930 | 5 & 1 |

## అంకె 6 - శుక్రుడు

ఇప్పటివరకు శ్రమకు వెరవని వారిని, కల్పనాశక్తి మెండుగా కలవారిని, సంఘసంస్కర్తలను, జనాకర్షణ గల మేధావులను పరిశీలించినాము. ఇప్పుడు వీరందరను వశపరచుకొని, వీరిపై అధికారము చలాయించగలవారిని గమనింతుము. వీరు ముందటి అయిదు అంకెల వారివలె తనకు తోచినట్లు నడచుకొనువారుకారు. తక్కినవారిని వశపరచుకొని తన కార్యమునెట్లు సాధించుకొనవలయునో పుట్టుకతోనే వీరికి వచ్చిన విద్య. శుక్రుని ఆధిపత్యమున జన్మించిన వీరు అధికారము వహించుట, పరులను నియంత్రించుట, పరులను మెప్పించి ధనము సంపాదించుటలో దిట్టలు. మతపరమైన రంగములందును వీరిని చూడవచ్చును. అయినను గుణములు 6 స్వభావమునుంచియే ఉండును. 6, 15, 24 తారీకులందు జన్మించినవారు ఈ సంఖ్యలో పుట్టినవారని చెప్పవలెను. తేది, నెల, సంవత్సరము మూడింటిని కూడగా 6 వచ్చు దినములందు జన్మించినవారు వయసు పైబడుకొలది ఈ సంఖ్య గుణములు పెరిగి సంపదలు, పదవులు పొందుదురు. పేరు మాత్రము 6 సంఖ్యగా ఉండినవారు ఆసంఖ్య ఫలితములు పొంది చిరకాలము జీవింతురు.

### సహజ గుణములు

ధైర్యశాలురుగా, ఆకర్షించు కళ్ళు కలిగిన వీరిని చూడగనే శుక్రాధిక్యత కలవారిగా పోల్చుకొనవచ్చును. వీరి మనసు ఎప్పుడును అందమైన వస్తువులందును, సంగీతము, నాట్యము, కవిత్వము వంటి ఉల్లాసకరమైన విషయములందు నిమగ్నమై ఉండును. పంచేంద్రియముల ద్వారా అనుభవింపగల విషయములన్నిటినీ బాగుగా గుర్తించెదరు. సంతోషముగా జీవించుటయే వీరి ధ్యేయము. భోగములు వీరి మనసును ఆకర్షించును. వేదాంతులు చెప్పు 'ఈ లోకమే మిధ్య' అను మాట వీరికి నమ్మశక్యముకాదు. ఆశ్చర్యముగా ఉండును. ఇన్ని సుఖములు నిండిన ఈ లోకమున మిథ్య, భ్రమ అనుట అని అనుకొందురు. కాని వీరు నాస్తికులు కారని గుర్తుంచుకొనవలెను. అసురుల గురువయిన శుక్రుని ఆధిక్యమున గల సంఖ్య అగుటచే ఈ సంఖ్య వారు మంత్ర తంత్రములు, తపము ఆచరించుటలో, తలపెట్టిన కార్యము సిద్ధించుటకై దైవమును ఉపాసించుటలో తీవ్రతను చూపించుదురు. వీరు చేయు

త్యాగములు కూడ ఏదైనా పెద్ద సాధనకు పెట్టుబడిగా చెప్పవచ్చును. **బాగుగా ఆలోచించి నిర్ణయింపక ఏపనిలోను దిగరు**. అపజయమునకు అధైర్యము చెందరు. అసుర బలముతో మరల మరల ప్రయత్నించుచునే ఉందురు. “ఇహలోక జీవితము నిత్యము, సత్యము. ఇందు నేను గొప్ప ఉన్నత స్థితిలో ఉండవలెను” అన్నట్లు వీరి జీవితము అగుపడును. వీరు ఆకర్షణీయమైన ఆకృతి, ఎడతెగని కృషి, తన కార్యమును సాధించుటలో నిష్ఠ కలిగిన పరపతి, సంపదలతో ఉండుట ఆశ్చర్యము కాదు. కించిత్తయినా సంశయములేక వీరిని అదృష్టశాలురని అనవచ్చును.

కావ్యములు, చిత్రలేఖనము, సంగీతము, నాట్యము మున్నగు వానియందు అభిలాషగల వీరే మన ప్రాచీన నాగరికతా చిహ్నములను, కళలను మనకు అందించువారు. తన పరిసరములను ఉల్లాసకరముగా ఉంచుకొనదలచుటచే ఇల్లు, తోటల విషయమున శ్రద్ధ వహిస్తారు. పనివారు లేని జీవితము వీరికి చప్పగా ఉండును. ఎప్పుడూ కంటికింపయిన దృశ్యములే కావాలనుకోవటము వలన యింటిని అందమైన వస్తువులతో నింపుతారు. ఈసంఖ్య మగవారు కూడా నగలపై మోజు కలిగియుంటారు. తమకు నచ్చిన వారియెడ ప్రేమ, దయ, కరుణ కలిగి ఉంటారు. మిత్రులు కానివారిపట్ల శాంతముగ నడుచుకొందురు. ఎప్పుడూ నవ్వు ముఖముతో ఉంటారు. ధారాళమైన మనస్తత్వము కలవారివలెనే కనపడుతారు. కాని తనను సంతోషపరిచినవారికి, సహాయము చేసిన వారికి కూడా ఏదయినా ఇచ్చుటకు మనసు రాదు. వీరి తీయని మాటలకు, నటనకు మోసపోయిన కళాకారులకు అంతు లేదు. కీర్తికాసపడి ఒకింత ఖర్చుపెడతారు. తమకు పేరు రావాలనే కళాకారులను ఆదరించుటకు సిద్ధమగుతారు. ఈ సంఖ్యలో ప్రసిద్ధ కళాకారులు జన్మించియున్నారు. ఈనాటికీ ప్రసిద్ధ విద్వాంసులు, కళాకారులు ఈ సంఖ్యవారే. వీరికి బహుళ జనాదరణ ఉండుటకు ఆకర్షణీయమైన వీరి రూపు ముఖ్య కారణము. కళాభిమానము కలవారెందరో వీరికి సదా తోడ్పడుచునే ఉందురు. వీరు అభిమానము కలవారివలె ప్రేమ నటించే కృతఘ్నులు. వీరు ఈ దుర్గుణమును వదలుట ఆవశ్యకము. సమాజమును ఉల్లాసపరుచుటకై జన్మించిన వీరిని తప్పు పట్టిన ప్రయోజనము లేదు. ఇది శుక్రాధిక్యత యొక్క సహజగుణమని తెలిసికొని క్షమించాలి. వీరికి కనీస అవసరములయిన తిండి, బట్ట, నిద్రకు లోటుండదు.

ఎవరయినా సమయమునకు ఆదుకుంటారు. ఎప్పుడూ తమ ఆరోగ్య విషయములో జాగ్రత్త వహిస్తూ పుష్టిని కలిగించే పదార్థాలను భుజిస్తుంటారు. చదువుటతో, చూచుట చేతను, వినుట వలన మాత్రము తృప్తి చెందక అన్ని సుఖములను అనుభవించుటలో ఆసక్తిగల వీరు జీవశక్తిని ఎక్కువ ఖర్చుచేయుదురు. అధిక సంతానము కలవారు. (తక్కిన 7 సంఖ్యలవారికన్న 2, 6 సంఖ్యలవారే అధిక సంతానోత్పత్తి గావించుచున్నారు). వీరిని శుక్రాధిక్యతను బట్టి 3 వర్గములుగా విభజింపవచ్చును.

1. దోషరహితమై 6 సంఖ్య బలముగానున్న వారు శరీరమున జీవశక్తి అమితముగా కలిగియుందురు. ప్రేమ, శాంతములకు నిలయముగా ఉందురు. ఎట్టి పరిస్థితులలోను శాంతిని కోరుకుంటారు. ఇంట, బయట, ప్రపంచమంతట శాంతి, సామరస్యములు నిండి ఉండాలని ఆకాంక్షిస్తూ దానికోసం పాటుపడతారు. పరోపకార చింతన ఎక్కువ. పరుల కష్టములు తీర్చు మార్గములు చూపుతారు. గ్రహబలము చక్కగా ఉండినచో ఏసుక్రీస్తువంటి మనసు వుంటుంది. శరీరము యుద్ధవీరుని వలె ఉండును.

2. శుక్రాధిక్యత బలం తక్కువగా ఉండిన శరీరము లావగును. ఉల్లాసమున జీవితము అమరును. గొప్ప ఆదర్శములు ఉండవు. తినుట, తిరుగుట, నిద్రించుట అని విలాసముగా జీవించుటయే మిగులును. విందులు, వినోదములు, కీర్తిని వెదకుటయే నిత్య కృత్యములగును. సంపద చేర్చుటకు అవిరామకృషియు దానికి తగిన అదృష్టమును ఉండును. ఏ కొరతలేని తృప్తినిచ్చు జీవితము దొరకును. వీరిని లక్ష్మీపుత్రులనిన అతిశయోక్తి కాదు. వీరిలో పురుషులు మంచి అంతస్తు గల భార్యను పొందుతారు. భార్యవలన సుఖములను పొందుతారు. స్త్రీలు కూడా ఉన్నత అంతస్తున ఉండు భర్తలను పొంది, వారి మూలముగా సుఖసంపదలు పొందుతారు. ఈ సంఖ్య స్త్రీలు భోగభాగ్యములు అనుభవింపవలసినవారు. కనుక వీరిని మంచిస్థితిలో కలవారికే ఇచ్చి వివాహము చేయుట క్షేమము. లేనిచో తప్పుదోవలలో వీరి అదృష్టము తిరిగిపోవును. (ఎన్నో సంస్థానములలో బీద స్థితిలో ఉన్నవారు, ప్రభువుల దయకు పాత్రులయి జీవితమును మార్చుకొనుట చూచియున్నాను. విచారపడవలసిన విషయమే అయినను, దాచుట కిష్టములేక చెప్పవలసి వచ్చినది.) ఇది ఒక రకమయిన శుక్ర

దోషము సూచించు విపరీత యోగము. ఈ సంఖ్యవారు తమకన్న పై అంతస్థువారిచే ప్రేమించబడుదురన్నది నూటికి నూరుపాళ్ళు నిజము. అంతస్తు, సంపదలు పొందుటకు అందమును ఉపయోగించుట మన సంస్కృతికి విరోధమన్న సంగతి జ్ఞాపకముంచుకొనుట మంచిది.

3. శుక్రదోషము కలవారిని ఇప్పుడు పరిశీలిద్దాం. వాక్చాతుర్యము, వారికి గల వశీకరణ శక్తిని దుష్ప్రయోగము చేయునది వీరే. ఇటువంటివారు సమాజమును, దేశమును కూడ దుఃఖమున ముంచుటలో సమర్థులు. ప్రసంగశక్తి వీరికి ఎక్కువ. మాటలతో ఎట్టివారినయిన కట్టివేయుదురు. వీరివల్ల మోసపోవుచున్నామని తెలిసికూడ ప్రజలు మోసపోవుదురు. ఇట్టివారిని ఎట్లు గుర్తెరుగుట అని పాఠకులు ఆలోచించవచ్చును. పేరాశ, కపటము, వంచన, గొప్పగా మోసగించుటకు ప్రణాళికలు, మిత్రుల పట్ల కూడా విశ్వాసఘాతుకము, అధిక కామము, ధన వ్యామోహము వీరి మనసులో గూడుకట్టుకొని ఉండును. పలువురు మిత్రులు ఈ పుస్తకము మనుష్యులను గుర్తించుటకు గీటురాయివలె ఉండవలెనని కోరినందుననే ఇంత వివరముగా చెప్పవలసి వచ్చినది.

## గమనిక

ఈ ఆధిక్యతలో ఉన్నతులు అద్భుతములు జరుపుదురు. దైవశక్తి వారి జీవితములందు ప్రవేశించును. మధ్య వర్గమువారు నిత్య జీవితములో శ్రద్ధ చూపి సుఖముగా జీవింతురు. అధములు అద్భుత కార్యములు చేసెదమని చెప్పి జ్యోతిషము, వైద్యము, మంత్రముల పేరిట, మరెన్నో విషయముల పేరిట జనులను మోసగించి సుఖముగా ఉందురు.

## శరీరము

స్త్రీ అంశమయినందున పురుషులును స్త్రీ లవలె అందము, ఆకర్షణ కలిగియుందురు. అందమునకు కొలబద్ద వీరే. పొడవైన చక్కటి కన్నులు, ఆకర్షణశక్తి నిండియుండును. కేశములు అందముగా వంకీలు తిరిగి యుండును. అందమయిన కోటేరువేసినట్లు ముక్కు ఉండును. ముఖము గుండ్రముగానో, కోలగానో ఉండును.

దంతములు గట్టిగాను, కాంతులీనుచూ ఉండును. బుగ్గలు (కపోలములు) కండ కలిగి ఉండును. శరీరాకృతి, చెక్కిన విగ్రహమువలె ఉండును. చల్లని చూపులు, చూచుటకు రమ్యముగా ఉండు వీరు సగటు ఎత్తు కలవారు. (వారి విధి సంఖ్య ననుసరించి ఎత్తు వగైరా మారును). శరీరము పట్టువలె మృదువుగా ఉండును. చుబుకము వంపుదేలి కండగలిగి ఉండును. మెడ భాగము కూడా కండ కలిగి బలముగా ఉండును. నోరు తెరచునపుడే నవ్వుచున్నట్లుండును. ఒక్క మాటలో చెప్పవలెనన్న అంగములన్నియు తీర్చిదిద్దినట్లుండును. పనిలేకపోయిన నడుము, పృష్ఠభాగము కండలు పెరిగిపోవును. ప్రేమించుటకు తగిన మనసువలె శరీరము కూడా కలిగినవారు. వృద్ధాప్యములో కూడా వీరి అందము తరగదు.

## వ్యాధి

శుక్రుడు మన శరీరములోని గొంతు, మూత్రాశయము, మెడ భాగములను పాలించువాడు. గాలి ధారాళముగా వీచు స్థలములలో నివసించనిచో వీరికి గుండె బలహీనత, దానికి సంబంధించిన వ్యాధులు రావచ్చును. వీరిలో చాలామంది గుండె జబ్బులను, రక్తప్రసరణలో లోపమువల్ల కలుగు వ్యాధులను పొందుచున్నారు. స్త్రీలకు ప్రసవకాలమున, బాలింతలకు పాలు కట్టుకొని జ్వరము వచ్చుట సహజముగా ఉన్నది. సాధారణముగనే జననేంద్రియములకు సంబంధించిన బలహీనతయో, వ్యాధియో కలుగకుండ జాగ్రత్త పడవలెను. ముఖ్యమైన వ్యాధి గుండెజబ్బు మాత్రమే. మలబద్ధము కలుగకుండ చూచుకొనుటయు ముఖ్యము.

## ఆహారము - ఔషధము

వీరు వ్యాధుల బారిన పడకుండుటకు క్రింద చెప్పబడు పదార్థములను విరివిగా వాడవలెను. పండ్లలో పుచ్చ, (Musk Melon, దోస వంటి) కిరనీ, దానిమ్మ, ఆపిల్, అత్తి, ద్రాక్ష, కిస్ మిస్ (ఎండుద్రాక్ష), ఏప్రికాట్, వాల్నట్, బాదం వంటి పప్పులును, రోజా రేకులును వీరికి ఆరోగ్యమును కలుగజేయును. గుండెజబ్బు కలవారు వైద్యుల సలహా లేకుండ బాదం వాడరాదు.

ఇక ఈ సంఖ్య క్రింద జన్మించిన వారిని విడిగా పరిశీలించెదము.

6 - ఈ దినమున జన్మించినవారు నిజాయితీపరులుగను, ఉత్సాహవంతులుగను ఉందురు. అణకువ కలిగి, లోతైన ఉద్దేశములు కలవారిగ ఉందురు. కళలలో సులభముగా ప్రావీణ్యత కలుగును. సంపద కూర్చుకొనుటలో ఆసక్తి మెండు. ఒకింత ఆడతనము కానించును.

15 - ఈ సంఖ్యలో పుట్టినవారు ఆకర్షణీయమైన అందము కలవారు. ఎల్లరను అతి సులభముగా వశపరచుకోగలరు. ఆదాయము నిరాటంకముగ, ధారాళముగా ఉండును. భ్రమింపచేసే వాక్చాతుర్యమును, కళలలో ప్రావీణ్యమును ఉండును. మామూలుగా మాటలాడుటయే గొప్ప నటునివలెనో ఉపన్యాసకుని వలెనో ఉండును. సహజముగనే వాదము చేయుటలోను, హాస్యముగా మాటలాడుటలోను సమర్థులు. ఎట్టివారినయినను చూసిన మాత్రముననే అర్థము చేసికొనగలిగిన, సునిశితమైన, ఆకర్షణీయమైన కండ్లు కలవారుగా ఉందురు. సదా సంతోషముగా ఉండు మనస్తత్వము వీరిది.

24 - నిరాడంబర గుణములు నిండిన వీరు కార్యములు సాధించుకొనుటలో సమర్థులు. సమయోచితముగా మాట్లాడుటలో దిట్టలు. అదృష్టకరమైన వివాహము, పెద్ద పదవులు వీరిని వెదకివచ్చును. వీరికి తక్కిన (6, 15) తేదీల వారికన్న తెగింపు, తీవ్రత హెచ్చు. ఎడతెగని శ్రమతో అదృష్టమును పూర్తిగా వాడుకొంటారు. పై అధికారుల మెప్పుకు పాత్రులవుతారు.

### నామ సంఖ్య-ఆరు

మీ పేరులోని అక్షరముల అంకెలను కూడగా వచ్చు సంఖ్య 6 అయినచో ఆ పేరు 6 సంఖ్యకు చెందినదగును. ఆ విధముగా వచ్చు 6 సంఖ్యల ప్రత్యేక గుణములను చూతము.

6 - ప్రశాంతమైన జీవితము, కొరతలేని మనుగడ, తృప్తి కల మనసు, ఒడిదుడుకులు లేని జీవనములను ఈ సంఖ్య తెలుపుచున్నది. ఇది విడిగా నుండుట వలన అధిక బలము లేదు.

15 - కార్యసిద్ధిని, సదా లాభము నాశించి పొందుటయు, ఏవిధముగానయినను తన

పనిని సాధించుకొను గుణమును కలిగినది. కామ క్రోధములు, వంచన వీరిని క్రిందకు లాగజూచును. స్వార్థము నానాటికీ పెరుగును. అందము, వాక్చాతుర్యము ఎట్టి కార్యమునయినను సాధించుటకుపయోగింపబడును. ఇది మనసు కులీనత నివ్వగలిగిన సంఖ్య కాదుగాని ఇహలోక జీవితమునకు తగిన సంఖ్య. వశీకరమైన అందము చేతను, కళలవలనను, మాటలతోను, ధనార్జన చేయగలిగిన అన్ని పరిశ్రమలలో ను సాటిలేని లాభమునిచ్చును. వీరికి చేదోడుగా ఎప్పుడును అనేకులుందురు. సుఖములు నిండిన జీవితముండును. జన్మసంఖ్య కూడ అదృష్టకరమయినదిగా ఉన్నచో వీరు కీర్తి ప్రతిష్టలను, భోగభాగ్యములను కలిగి సుఖించెదరు.

24 - ఈసంఖ్య పేరులో కలవారు ప్రభుత్వముచేత ఆదరింపబడుదురు. అత్యున్నత పదవులను, అతి సులభముగా పొందుటకు ఈ సంఖ్య సహాయము చేయును. తనకన్న పై అంతస్థునుండియే భార్య/భర్త దొరకును. ఈసంఖ్యలో పేరుండినచో పోలీసు, సైన్యము వంటి యూనిఫారం వేసుకొను వృత్తులందు అతి త్వరగా అభివృద్ధి సాధించెదరు. మామూలు సిపాయిగా చేరినను సేనాధిపతికాగల సందర్భమును అదృష్టమేర్పరుచును.

33 - మంత్రశాస్త్రములందు ఈ సంఖ్యను కుబేరునిగా పేర్కొన్నారు. దైవశక్తియు, సంపదయు చక్కగా పెరుగుటను ఈ సంఖ్య సూచించును. ఈ సంఖ్య తమ పేరులో కలవారు ప్రయత్నముతోనో, అప్రయత్నముగా నో దేవి కటాక్షమునకు పాత్రులగుచున్నారు. దానివలన దైవశక్తితో పాటు, ధనధాన్య సమృద్ధి, తరగని సంపద బాగుగా కుదురును. (వీరి సంపదలలో పాత్రలు, మిల్లులు, తటాకములుండుట సామాన్యము). లక్ష్మీకరమైన అనేక వస్తువులు వీరివద్దకు చేరును. తరగని ఐశ్వర్యముండును.

42 - ఈ సంఖ్య పేరునందు కలవారు పేదవారయినను పెద్ద అధికార పదవిని పొందెదరు. ఒకింత పేరాశ కానబడును. పొదుపునందు ఆసక్తియుండును. ఆస్తులు చేర్చుటలో సమర్థులు. సుఖ జీవితమునకు డబ్బు ఖర్చు చేయుటకు వెనుకాడుతారు. మనో బలమధికము. దైవకృపయు వృద్ధి చెందును (స్వార్థము తగ్గినచో).

మధుమేహము గుణమగును.

51 - ఆరు సంఖ్యలలో ఇదియే అన్నిటికన్న శక్తిగలది. దీనివలన అనుకోని అభివృద్ధి హఠాత్తుగా కలుగును. ముందురోజువరకు సామాన్యమైన వ్యక్తి ఒక్క రాత్రిలో ప్రాబల్యము చెంది ప్రముఖులవుతారు. అనుకోని విధముగా అత్యున్నత పదవులను వహింపవలసి వచ్చును. శరీరము, మనసు శక్తిపూరితమై ఆ శక్తి అన్ని దిక్కుల ప్రవహించును. ఎడతెగని ఆలోచనలు, భావావేశము, అలుపు లేని కఠిన శ్రమ సాధ్యమగును. శరీరము, మనసు ఒక చోట నిలువలేవు. పడక కూడ కుదరక బోనులోని సింహమువలె అటు నిటు తిరుగుచునే ఉందురు. అమితమైన శరీరబలము, మనో బలము కానబడును. సంక్షిప్తముగా చెప్పవలెనన్న వేగము నిండిన శక్తియొకటి వీరి నాక్రమించుకొని ఉండును. వీరికి ప్రాణాపాయము కలిగించు శత్రువులేర్పడగలరు. కనుక వీరు పరుల మనసు గాయపడని విధముగా నడచుకొనుటకలవాటు పడవలెను. ఈ సంఖ్య మిక్కుటమైన సంపదలను సూచించుచున్నందువలన మంచి అదృష్టమయినదనియే చెప్పవలెను.

60 - ఈ సంఖ్య ప్రశాంతతను, సంపదను, కళారసికత్వమును, శాంత స్వభావమును, లోతయిన జ్ఞానమును సూచించును. వాక్కులో తీవ్రత, వాదించు శక్తి బాగుగా ఉండును. మిక్కిలి ఆనందదాయకమైన సంసారజీవితము కలుగును.

69 - ఈ సంఖ్యవారు మకుటము లేని మహారాజులవలె, ఏవృత్తిని చేపట్టినను ప్రకాశింతురు. స్వయంకృషితో అందరనూ గెలిచి తన స్థానమును బలపరచుకొందురు. సాటిలేని సంపద కలుగుట , మిక్కిలి గంభీరమైన రూపు, జంకు గొలిపేటటువంటి అంతస్థు కలుగును. భావావేశపరులు గాన తమ మనస్తృప్తి కొరకు డబ్బును వెదజల్లుతారు. రాజ గుణములు శరీరమున నిండియుండును. మరీ మంచి సౌఖ్యము నిండిన జీవితము గడుపుతారు. మాటలలో వీరు సాటిలేని మేటి..

78 - 6 సంఖ్యవారిలో వీరే ఉత్తములు. మితిమీరిన మత పట్టుదలయు, ఆచారములపై నమ్మకము వీరికి కలదు. కవితాశక్తి మెండు. శ్రోతలు ముగ్ధులగునట్లు మాట్లాడెదరు. వాక్కులో సరస్వతి తాండవమాడును. ధర్మస్థాపనము చేయుటలోను,

సమాజ సేవనందు మాత్రమే ఆసక్తి ఉండును. అతి సులభముగా వీరికి పెద్ద మొత్తములు లభ్యమగును. అయినా అతి జాగ్రత్తతో వ్యవహరించక పోయినా, దైవశక్తి తప్ప తక్కిన సంపదయంతయు వచ్చినట్లే పోవును. వీరికి మంత్రశక్తి కలదు. అందరిచే గౌరవింపబడుదురు.

87 - ఈ సంఖ్య గుప్తశక్తులనివ్వగలిగినది. చెడుత్రోవలలోనే ధనము వచ్చి చేరును. అర్ధరాత్రిలో దొంగతనమునకు, సర్పములు తక్కిన మృగములను వశపరచుకొనుటకు పనికి వచ్చును. చెడు దోవలు పట్టింప గలిగినది. కావున ఇంతటితో ఆపుదము.

96 - ఇది జనాకర్షణను, విద్యను లోపము లేకుండ ఇవ్వగలిగినది. తలచిన పనులన్నిటిలోను జయము, ఆకర్షణశక్తి కలుగును. సులభముగా కళలలో ప్రావీణ్యమేర్పడును. స్త్రీలు వశమగుదురు. మంచి అదృష్టకరమయినదే.

105 - ఈ సంఖ్య అదృష్టకరమైన జీవితమును, తృప్తికరమైన పరిస్థితులను, గొప్ప కీర్తిని కలిగించును. సంపదలు చేరును. సత్సంతానమును కలదు.

## అదృష్టకాలము

ఆరు సంఖ్యలో జన్మించినవారు తమకు ముఖ్యమైన పనులను 6, 15, 24 తేదీలలోను, తేది, మాసము, సంవత్సరము కూడగా 6 వచ్చు దినములందును చేసిన అదృష్టము పెరుగును.

**అనుకూల దినములు:** 9, 18, 27 తేదీలు

**ప్రతికూల దినములు:** 3, 12, 21, 30 తేది, నెల, సంవత్సరము కూడితే 3 వచ్చు దినములును దురదృష్టకరమైనవి. ఈ దినములందు సాధ్యమైనంతవరకు ఏప్రయత్నములు మొదలిడకుండుట మంచిది. తొందరపడి 5, 14, 23 తేదీలలో ఏ కార్యమును నిర్ణయింపరాదు.

**వృత్తులు:** పుట్టినతేది 6 అయినచో 64 కళలలో ఏదైనా అబ్బుచున్నదా అని చూడండి. అబ్బ నచో మరో ఆలోచన లేకుండా అందు దిగండి. తప్పక మంచి పేరు, ధనము వచ్చును. (6వ తేది పుట్టినవారు కళాకారులు, 15వ తేదీన జన్మించినవారు వశీకరణ

వృత్తి చేపట్టువారు, 24వ తేదీన జననమందిన వారు ప్రభుత్వ అధికారులుగను ప్రకాశింతురు). వీరికి తగిన ఇతర వృత్తులు : ఖరీదైన పట్టువంటి వస్త్రములు, రత్నములు, నవనాగరికతకు కావలసిన ఖరీదైన వస్తువుల తయారీ, అమ్మకము, కట్టడములు కట్టుట, విలాస వస్తువుల నమ్ముట, స్త్రీలకు కావలసిన సౌందర్య సాధనముల తయారీ, అమ్మకము, అద్దములు, చందనము వంటి వస్తువుల మూలంగా ఆదాయం ఎక్కువ.

**చేయూత నిచ్చువారు:** 6 సంఖ్యవారికి 3, 6, 9 సంఖ్యవారు మనసొప్పి సహాయము చేయుదురు. మరీ మంచి సహాయములు 3 వారే చేతురు.

**సంసార జీవనం:** తనవంటి అందమైన 6 సంఖ్య వారికే వీరు మనసిత్తురు. పుట్టినతేది, విధి సంఖ్య రెండును 6గ ఉన్న వీరి జీవిత సహచరులు 1, 4, 9వారుగా ఉండుట మంచిది. వారు కూడా 6 సంఖ్యవారేయైనచో విధి సంఖ్య బలముగా ఉన్ననే సంతానము కలుగును. విధిసంఖ్య 2, 7, 8 యైనచో పిల్లలుండరు. 6 సంఖ్య వారికి ఆడపిల్లలే ఎక్కువ. 5 సంఖ్య వారిని వివాహమాడవచ్చును.

**వివాహ జీవనము సంతోషదాయకముగా ఉండుటకు వివాహ తేదిని ఈవిధముగా ఎంచుకోండి :**

| జీవిత సహచరుల సంఖ్య | వివాహతేది& తేది, నెల, సం\|\|ముల సంఖ్య |
|---|---|
| 1, 4 | 1 & 1, 4 & 1, 4 & 6, 1 & 6 |
| 5, 6 | 1 & 1, 1 & 6, 6 & 1, 6 & 6 |
| 9 | 1 & 6, 6 & 1, 9 & 6, 6 & 6 |

## రంగు

ముదురు ఆకుపచ్చ, ముదురు నీలం, నీలము, ఎరుపు కలసిన రంగులు అదృష్టము నిచ్చును.

## పనికిరాని రంగు

తెలుపు, పసుపు, గులాబి రంగులు

## రత్నము

మిక్కిలి అదృష్టకరమయినది మరకతము (పచ్చ) గుండె దిటవు ను , అదృష్టమును, ఆనందమును పచ్చ ధరించుటవలన కలుగును. కడుపు నొప్పి కలవారు Jade ధరింపవచ్చును. Turquoise కూడా మంచిదే. అందు భాస్వరశక్తి ఉన్నందున మెదడునకు స్పష్టత కలుగును.

## 6 సంఖ్యను సూచించు అక్షరములు, వాని ఫలితములు

U(తరంగముల నిడుపు 60) 6 సంఖ్యయే అయినను ఇదిలేత పసుపు వర్ణము కలిగినది. ఈ అక్షరము పేరునకు మొదటలోగాని చివరగాని వచ్చిన ఆ పేరు కలవారిని వేదాంత జీవితము ఒకవైపు ఇహలోక ఇచ్ఛలు మరియొక వైపునకు లాగును. నేర్చుకొన్న విషయములన్నిటినీ జీవితమున ఉపయోగించు సమర్థత కలుగును. ఆత్మశక్తి సదా ఆకర్షించును. జీవితమున కట్టుబాట్లునేర్పరచుకొనుట వలన బలము కలుగును. ఇంద్రియ సుఖములన్నియు బాగుగా అనుభవింతురు.

వీరు కాస్త నిదానముగా కన్పించినా ఆలోచించే నిర్ణయాలు తీసుకుంటారు. ప్రయత్నించి ఎన్నో విషయములను నేర్చుకుంటారు. తెలియనిదానిని ధైర్యముగా తెలియదని ఒప్పుకుంటారు. మనసు చంచలము. మిత్రులయెడ కృతజ్ఞత కలిగియుంటారు. డబ్బుకు కొదువవుండదు. ఇతరుల సంపద కూడా వీరి వద్ద ఉండును. ప్రేవులు, రక్తమునకు సంబంధించిన వ్యాధులు కలుగవచ్చును. ఈ అక్షరమునకు వ్యాధి నిరోధక శక్తిగలదు.

V - (తరంగపు నిడుపు 6) హరిత వర్ణము. కొద్దిగా నీలము, ఎరుపు కలిసినది. ఈ అక్షరము పేరులో కలవారు స్వంత అభిప్రాయములు కలవారు. గాఢస్నేహమును

అభిలషిస్తారు. ఇతరులను బాగుగా పరిశీలిస్తారు. చురుకుదనమును, సడలని నమ్మకమును ఉండును. దైవపరమైన విషయములను కూడ తీవ్రముగా పరిశోధించుటను, జ్ఞానమును, తెలివిని దైనందిక జీవితములో లాభదాయకముగ ఉపయోగించుటయు సూచించును.

W - (అలల నిడుపు 3 నుంచి 6) హరితము, నారింజ వర్ణము కలసిన రంగు. దీనిమూలముగ శతృవులను కూడా సర్దుకొని పోవు సహనగుణము తెలుపబడుచున్నది. తెలివి, ప్రేమ మెండు. అభివృద్ధిలో అభిలాష, బ్రహ్మాండముగా మాటలాడుశక్తియు ఉండును.

6 సంఖ్యలో పుట్టిన ప్రముఖుల పేర్లు, వారి జన్మతేదీల, తేది, మాసము, సంవత్సరము కలిపిన వచ్చు సంఖ్యలు క్రింద ఇవ్వబడి నవి. వారి పేర్లను జీవితమును గమనించండి.

**6** తేదీలో పుట్టిన కొందరు ప్రముఖ వ్యక్తులు

| **పేరు** | **జన్మతేది సంఖ్య** | **తేది-విధి సంఖ్యలు** |
| --- | --- | --- |
| JOAN OF ARC<br>జోన్ ఆఫ్ ఆర్క్ (తన దైవశక్తితో బ్రిటిష్ ఆధిక్యత నుండి ఫ్రాన్స్ ని కాపాడిన వనిత. కాని, తరువాత బ్రిటీషువారిచే మంత్రగత్తె అనే నెపంతో 30.5.1431న సజీవదహనం గావింపబడ్డారు.) | 6-1-1412 | 6 & 6 |
| PANDIT MOTILAL NEHRU<br>పండిట్ మోతీలాల్ నెహ్రూ | 6-5-1861 | 6 & 9 |
| DR. RABINDRANATH TAGORE | | |

| | | |
|---|---|---|
| డా. రవీంద్రనాథ్ ఠాగూర్ (విశ్వకవి-నోబుల్ బహుమతి పొందిన మొదటి భారతీయుడు) | 6-5-1861 | 6 & 9 |
| ZAFRULLAH KHAN<br>జఫరుల్లా ఖాన్ (పాకిస్తాన్ డిప్లోమాట్) | 6-2-1893 | 6 & 2 |
| WARREN HASTINGS<br>గవర్నర్ జనరల్ వారెన్ హేస్టింగ్స్ (భారతదేశంలో బ్రిటిష్ పరిపాలనను సుస్థిరం చేసారు.) | 6-12-1732 | 6 & 4 |
| BABAR (ZAHIR-UD-DIN) MOHAMMAD<br>బాబరు<br>(భారతదేశమున మొగలాయి సామ్రాజ్యమును స్థాపించినవారు.) | 15-2-1483 | 6 & 6 |
| GALILEO (GALILEO GALILEI)<br>గలీలియో (సూర్యకుటుంబములో సూర్యుడు మధ్యలో ఉన్నాడని చెప్పి మత ప్రవక్తలచే దండింపబడిన ఇటలీ దేశ శాస్త్రజ్ఞుడు) | 15-2-1564 | 6 & 6 |
| NEPOLEON BUONAPARTE<br>నెపోలియన్ బోనాపార్ట్ (సామాన్య సిపాయిగా చేరి తరువాత ఫ్రాన్సు దేశమునకే చక్రవర్తి అయ్యారు. జ్యోతిష్కుల సలహా అనుసరించి తన పేరులోని U అక్షరమును తీసిన తరువాత | 15-8-1769 | 6 & 1 |

| | | |
|---|---|---|
| వాటర్లూ యుద్ధమున పరాజయము పొందారు.) | | |
| A.P.J. ABDUL KALAM<br>ఎ.పి.జె. అబ్దుల్ కలాం (అణు శాస్త్రవేత్త, భారత రాష్ట్రపతి) | 15-10-1931 | 6 & 3 |
| NERO (CLAUDIUS) CAESAR<br>నీరో (రోమన్ చక్రవర్తి - రోమ్ నగరం తగలబడి పోతున్నప్పుడు ఫిడేలు వాద్యముతో ఆనందించిన వ్యక్తి. ఆఖరుకి ప్రజలు తిరుగుబాటు చేసినప్పుడు 9.6.0068న ఆత్మహత్య చేసుకొన్నాడు) | 15-12-0037 | 6 & 1 |
| SIR WALTER SCOTT<br>సర్ వాల్టర్ స్కాట్ (గొప్ప కథా రచయిత) | 15-8-1771 | 6 & 3 |
| LORD MELBOURNE<br>లార్డ్ మెల్ బోర్న్ (1834-1841లో బ్రిటీషు ప్రధానిగా ఉండినవారు) | 15-3-1779 | 6 & 6 |
| ANDREW CARNEGIE<br>అండ్రూ కార్నేగీ (పెట్రోలు, కిరోసిన్ వ్యాపారాలపై ఆస్తులు సంపాదించుకొని, తరువాత కాలంలో అనేక విద్యా సంస్థలు నెలగొల్పారు.) | 15-11-1835 | 6 & 7 |
| SRI AUROBINDO<br>శ్రీ అరబిందో (పేరుకు శ్రీ చేర్చిన తరువాత వీరి జీవితం అభివృద్ధి చెందింది. అరవింద్ ఘోష్ అన్న పేరుతో | 15-8-1872 | 6 & 5 |

| | | |
|---|---|---|
| ఉన్నపుడు జీవితంలో చాలా ఒడిదుడుకులు ఎదుర్కొన్నారు.) | | |
| LORD KITCHENER<br>లార్డ్ కిచనర్ | 24-6-1850 | 6 & 8 |
| GEN PETAIN<br>జనరలు పెటేన్ (ఫ్రాన్స్ కి చెందిన వరల్డ్ వార్హీరో) | 24-4-1856 | 6 & 3 |
| P.A.C. RAMASAMI RAJA<br>పి.ఎ.సి. రామసామి రాజా (రామ్ కో పరిశ్రమ అధినేత.) | 24-4-1894 | 6 & 5 |
| ALEXANDER DUMAS<br>అలెగ్జాండర్ డ్యూమా (ప్రసిద్ధ ఫ్రెంచి రచయిత) | 24-1-1803 | 6 & 7 |
| QUEEN VICTORIA<br>విక్టోరియా మహారాణి | 24-5-1819 | 6 & 3 |

## అంకె 7 - కేతువు

ఇంతవరకు ప్రభుత్వము, వాణిజ్యము, కళలు మున్నగువానిలో ప్రకాశించువారిని పరిశీలించినాము. ఇక మతాభిమానిగా ఉండి, మతపరమైన మరియు దైవసంబంధమైన రంగములో కృషిచేయువారిని గురించి తెలిసికొందము.

7, 8 సంఖ్యలు రెండును మతపరమైనవి. ఇందు 7 సంఖ్యలో జన్మించువారు తీవ్ర మతాభిమానము, తన మతముపై పట్టుదల, శాస్త్రములపై అపార నమ్మిక కలిగి ఉంటారు. 8 సంఖ్యవారు దేవుని గురించి పరిశోధనలోను, వేదాంతములందును ప్రవేశించి మానసిక సన్యాసము తీసికొని ఈ లోకమునకు, మతమునకు, దైవమునకు గల సంబంధము గూర్చి పరిశోధించెదరు. 7 సంఖ్యవారికి వేదాంతములో ఆకర్షణ ఉండదు. యోగము, మంత్రము వంటి రహస్యమైన, ఇతరులకు అంతగా తెలియని మార్గములలోనే తీవ్రమైన ఆసక్తి కలిగి ఉంటారు. దైవభక్తి కలిగి కఠిన సాధనలు చేయగలిగిన వీరు సన్యాసులు కారు. కాని 8 సంఖ్యవారు కాషాయముచే ఆకర్షింపబడి అన్నిటినీ వదలుకొని సన్యాసమే శరణమనుకొనేవారు. ఇదియే వీరిరువురి మధ్య గల వ్యత్యాసము.

ఇక 7 సంఖ్యవారిని ప్రత్యేకముగా గమనించుదాము. 7, 16, 25 తేదీలలో పుట్టినవారు అందరు కేతువు అధిపతిగా గల 7 సంఖ్యకు లోబడినవారే. మనసుకి అతీతమగువానిని, దైవకృప నిండిన వానినే మన పూర్వీకులు 7గా విభజించినారు. ఈ 7 సంఖ్య మానవశక్తి దైవమునకు లోబడినది అని సూచించునట్లు, మానవుడు క్రమమును దాటి ప్రయత్నింపరాదన్నట్లు ప్రారంభములో దినములను 7 దినములు గల వారములుగా విభజించిరి. అదే విధముగా దైవపరమైన సంగీతమును సప్తస్వరములతో కూర్చిరి. అటువంటివే సప్తఋషులు, సప్తసాగరములు, సప్త కన్యలు, సప్తలోకములు, సప్త నాడులు మొదలయినవి.

### 7 సంఖ్యలో పుట్టినవారి సహజ గుణములు

చూడగానే వీరిని విశిష్టమైనవారిగా గుర్తింపవచ్చును. ఎప్పుడును శుభ్రమైన దుస్తులనే ధరిస్తారు. వీరు ఎక్కువగా అలంకారప్రియులు కాకపోయినా, నాజూకైన

దుస్తులు ధరిస్తారు. ఆకర్షణీయమైన ముఖముతో పొడగరిగా ఉందురు. కలుపుగోరుతనముగా ఉండరు. మాటలను తూచి తూచి వాడతారు. ఆత్మవిశ్వాసము ఎక్కువగా ఉన్నప్పుడు వాచాలురు వలె మాట్లాడుతారు. అది తక్కువయినప్పుడు మూగవలె మౌనము సాధిస్తారు. వీరికి తక్కినవారికి మధ్య అభిప్రాయ భేదములు ఎల్లప్పుడూ వుంటూనే ఉంటాయి. కనుక వీరికి జీవితములో మిత్రులు దొరకుట దుర్లభం. వీరిలో అధికశాతము ముక్కోపము కలవారు. చటుక్కున ఆవేశం వస్తుంది. పరిసరములు ఆనందదాయకముగా ఉన్నపుడు అరమరికలు లేకుండా వ్యవహరిస్తారు. లేకపోతే ఏకాంతములో ఉండుటకే ఇష్టపడుతారు. మనుష్యుల మధ్య కన్నా ఒంటరితనమే వీరికి బాగుంటుంది. కష్టసుఖములను కూడా ఇతరులతో పంచుకోరు. మనసులోనే ఉంచుకొని మధనపడుతూ ఉంటారు. ఏదో పోగొట్టుకొన్న వారిలాగా తరచు కనబడతారు. కళలకు సంబంధించిన మటుకు వీరిని రెండు రకములుగా విభజింపవచ్చును. ఒక రకమువారు పుట్టుకతోనే కళలపై అభిమానముతోపుట్టి కళలనే జీవిత లక్ష్యముగా ఎంచుకొందురు. మరియొక రకమువారు కళల గురించి కొంచెమయినా తెలియక, అవి సమయమును వృథా చేయు వ్యర్థమైన కాలక్షేపములు అనుకొంటారు. సంగీతము, కవిత్వము, రసాయన పరిశోధనలు, భ్రమింపజేయు రచనాశక్తి ఇవి అన్నియు వీరికి పుట్టుకతో వచ్చిన శుభలక్షణములు. పుట్టిన తేదిలు మాత్రము 7,16, 25గా ఉండి నవారు గాఢమైన దేశాభిమానులుగా ఉండి పిదప మారిపోవుదురు. కాని తేది, నెల, సంవత్సరము మూడు కూడితే 7 వచ్చువారును, పేరు సంఖ్య 7గా వచ్చినవారును హఠాత్తుగా అన్నిటినీ త్యజించి రాజకీయములలో దిగుతారు. 4 సంఖ్యవారివంటిదే వీరి స్వభావము కూడ. వారివలెనే వీరు కూడా బలగం ఉన్న పార్టీలో చేరక తెగింపుతో బలము తక్కువగా కల ప్రతిపక్షములో చేరి దానిని బలపరుస్తారు. వీరి ఉత్సాహమంతా దేనినైనా ఎదురించటములోనే ఉంటుంది. వ్యతిరేకత వీరికి బలమునిస్తుంది. కష్టములెక్కువైతే వీరు ఉగ్రవాదులగుదురు. వ్యతిరేకత అనునది వీరికి అన్ని రంగములలోను తప్పక కలుగును. వీరి న్యాయమైన విజయములు కూడా ఇతరులు వీరిని చూసి అసూయ చెందునట్లు చేయును. .

**7 సంఖ్యవారిలో వేయింట ఒకరికి కూడా మనసుకు నచ్చిన భార్య లేక భర్త కుదురుట**

**లేదు.** అట్లు దొరకినా పిల్లలు లేకపోవుటయో లేక వేరు విధములైన కష్టములు కలిగి సంసార జీవితము సంతోషముగా ఉండుటలేదు. (అయినా, వీరికి పేరు సరిగా అమరితే, అదృష్టకరమైన పేరుగా ఉంచితే, జీవితము తరువాయి భాగములో అన్ని దోషములు పోయి సుఖించుదురు). మొత్తముమీద వీరికి ఆనందదాయకమయిన వివాహజీవితము దుర్లభమే. ఈ సంఖ్య స్త్రీ లలో కొందరికి తమకన్న పై అంతస్థువారు భర్తలుగా దొరికెదరు. (సాధారణముగా 7 స్త్రీలలో కొందరు మంచి అందకత్తెలుగా ఉందురు. అనేకులు అంగసౌష్టవము తక్కువగా కలిగియుందురు). వీరందరునూ మంచి పనిమంతులు. పనిలో మునిగి ఉండమన్నా ఉంటారు. పరిసరాలు తగినవిగా ఉంటే ఎంత గొప్ప కార్యమైనా సాధిస్తారు.

ముఖ్య గమనిక

వీరికి శరీర బలముకన్న మనోబలమే ఎక్కువ. కొన్ని పర్యాయములు చిన్న కష్టము వచ్చినా అది పెద్దదగునో ఏమో అని వృధా కలత చెందెదరు. భవిష్యత్తును గూర్చిన భయము సదా ఉండును. పరిసరములచే ప్రభావితమగు వీరు, ప్రోత్సాహపరిచే వారి మధ్య వుంటే (జనాదరణ వుంటే) ఎంతటి సాహసకార్యమైనా తెగించి ధైర్యముతో చేసి విజయము సాధిస్తారు.

మామూలుగా వీరు ఇతరులను అనుసరించరు. ఏ వృత్తిలో ఉండినా స్వంత అభిప్రాయములను, స్వతంత్ర దృక్పథమును చూపుతారు. వీరిని ప్రజలు సులభముగా, మార్గదర్శకులుగా ఎన్నుకొని అనుసరిస్తారు. వీరి జీవితమును పరిశీలించిన, వీరివద్ద గల ఆకర్షణ శక్తి స్పష్టముగా కనుపించును. వీరి జీవితము ఇతరులను ఎంతో ఆకర్షించును. ఇంత ఉన్నా వీరిలో అనేకులు దురదృష్టవంతులుగనే అగుపడుచున్నారు. వీరు అదృష్టవంతులు కారు అని మరీ మరీ చెప్పవచ్చును. జన్మతః అపూర్వశక్తులు (మేధస్సు) కలిగిన వీరిలో కొందరు అవిరామకృషితో గొప్పవారగుచున్నారు. మహాత్ములుగాను, మేధావులుగాను కనుపించువారు కూడా అదృష్టవశాత్తూ గొప్పవారైనవారు కారు. కష్టపడి ప్రగతి సాధించినవారే. బాల్యములోనే సంగీత విద్వాంసులుగను, గొప్ప బాలనటులుగను, లేక మేధావులుగా ప్రసిద్ధికెక్కినవారు ఈ సంఖ్యవారే.

వీరిలో అనేకులకు కలలు ఫలించును. పలువురికి దివ్యానుభూతులు, సాక్షాత్కారములు కలుగును. మనసును వశ్యము చేసికొను శక్తులు వృద్ధి చెందినను, వీరిలో అనేకులు అభిలషించు త్రికాల జ్ఞానము, దానికి తగిన సిద్ధులును వీరికి కలుగుటలేదు. దానికి కారణము వారు ఈ జన్మ ధరించినదే తీరని కోరికలతో జీవించుట కోసం. చివరి వరకు వీరికి ఏదో ఒక కొరత ఉండి తీరును. సామాన్య విషయములలో కూడా వీరి ప్రయత్నములు ముగింపుకి చేరు సమయములో విఘ్నమగును. (పుట్టినతేది సంఖ్యలు 782 అయిన మంచి అభివృద్ధియు, 7 & 5గా అయిన అనుకోని గొప్ప విజయములను కలుగును. 7 & 1గా ఉండిన ఎదురుచూచిన గొప్ప విజయములు కలుగును. 7 & 9గా ఉన్న జీవితము గొప్పగా ముగియును. ధార్మిక విజయము తథ్యము. తక్కిన సంఖ్యలు విధిసంఖ్యగా ఉన్న వారికి దానినిబట్టియే ముగింపు వచ్చును).

వెనుకకు తగ్గు గుణము కూడా వీరియందు కలదు. గొప్ప పనులను సాధించే వీరు తమ తాహతుకు తగని చిన్న పనులు చేస్తారు. గొప్ప స్థితిలో జీవించినవారు పిదప అతి సామాన్యులవలె జీవించెదరు. (నామ సంఖ్యకూడ 7గానున్న ఇట్లు జరుగుట తథ్యము).

## విజయము

నిస్వార్థమైన, న్యాయమైన, లోకోపకారమైన ఏ కార్యము చేపట్టినను వీరికి మహోన్నత విజయము లభించును. పేరు అమరత్వము చెందును. **కీర్తి అష్టదిక్కులకు వ్యాపించును**. శరీర సుఖమును త్యాగము చేస్తూ ఉండగా వీరి కీర్తి ప్రతిష్టలు, లోకజ్ఞానం ఎక్కువగును.

**వీరికి గలమేలైన అభిలాషలన్నియు శీఘ్రమే నెరవేరును. కళంకము లేని ఆశలన్నియు చక్కగా పూర్తియగును. కల్లాకపటములేక పసిబిడ్డల మనస్తత్వము కలవారైనచో వీరు తలచినవన్నీ సమకూరును.**

## శరీరము - వ్యాధి - మందు

కేతు భగవానుడు మన శ్వాసకోశములకు, శ్వాసనాళము, శ్వాసములకు అధిపతి.

పొడగరులుగనే కన్పట్టు వీరు చక్కని ముఖ లక్షణములు కలవారు. కొద్దిగా వంపుగల ముక్కు, దృఢమైన గడ్డమును కలిగి ఉందురు. కనుబొమలు తీరిదిద్దినట్లుండును. తక్కిన భాగములు విధి సంఖ్యలను అనుసరించి ఉండును. మలబద్దము వీరి సహజ శత్రువు. దీనివలన పెద్దతనములో రుమేటిజం అనబడు కీళ్ళవాతము, వాత రోగములు కలుగును. కొందరికి చెమట సంబంధమైన చర్మవ్యాధులు కలుగుచున్నవి. స్వేదము తయారుకానందున చర్మము జీవము కోల్పోవుట, గడ్డలు మున్నగునవి లేచుట జరుగును. ఏదైనా కఠిన పరిశ్రమయో లేక శరీర వ్యాయామమో చేయుట మంచిది. ఆహారములో వీలైనంతవరకు ఆకుకూరలు చేర్చుకొనుట మంచిది. తక్కిన వానికన్న లెట్యూస్, క్యాబేజి, తోటకూర, కొయ్యతోటకూర మంచివి. మంచి గుమ్మడి, బూడిద గుమ్మడి, దోస ఒకింత ఉల్లిగడ్డలు కూడా మిక్కిలి మంచి చేయును. పండ్లలో రసముగల పండ్లు మంచివి. ముఖ్యముగా ద్రాక్ష, అనాస, ఎండుద్రాక్ష, అరటిపండ్లు కూడా మంచివే. వీరి జీర్ణవ్యవస్థ సున్నితమైనది కనుక వంటికి పడని వస్తువులు కొద్దిగా భుజించినను ఆరోగ్యము చెడును. ఆహార రుచులకు ముఖ్యత్వమిచ్చు వీరు తమకు నప్పిన ఆహారమునే భుజించిన ఆరోగ్యవంతులుగా ఉందురు. ఇక ఈ సంఖ్యలోని వివిధ తేదీలలో పుట్టినవారి ప్రత్యేక గుణములను పరిశీలించుదాము.

7- వతేదీన జన్మించువారు శాంత స్వభావము, ప్రశాంతచిత్తమును కలిగియుంటారు. సులభముగా పట్టువిడిచి, ఎదుటివారికి లోబడియుంటారు. విశేషమైన బుద్ధిచాతుర్యము, రసికత కలవారు. దైవకార్యములు గట్టి శ్రద్దతో చేస్తారు. కుటుంబ జీవితములో సదా చిక్కులు ఏర్పడుతూనే ఉంటాయి. పసిపిల్లల వంటి స్వభావము ప్రేమ, కళలందును పట్టుదల ఉండును.

16 - న జన్మించినవారు తక్కిన 7 (7, 25) వారికన్న గొప్ప మనోశక్తులు కలవారు. వీరిని సరిగా పరిశీలించిన వీరి అపూర్వశక్తులను ప్రకాశింపచేయగలము. ఈ తారీకున ఎందరో బాల విద్వాంసులు, బాల్యమందే ప్రసిద్ధులయిన కవులు, నటకులు జన్మించినారు. వీరిలో అనేకులు సమాజమునకు ఆశ్చర్యము గొలుపు కార్యములు సాధించినారు. సంఘము దండించే తప్పుడు పనులను అతి సహజముగా చేయుదురు. సంప్రదాయ విరుద్ధమైన ప్రేమ వ్యవహారములలో చిక్కుకొననిచో వీరి జీవితము

సఫలమగును.

25 - వ తేదీన పుట్టినవారు తీవ్ర మతాభిమానులుగా ఉందురు. తన మతమే గొప్పదని బహిరంగముగా వాదింతురు. వీరిని అనేకులు అనుసరిస్తారు. ఈ తేదీలో పుట్టినవారు వందనీయులగుచున్నారు. మతాధిపతులుగను, న్యాయాధిపతులుగాను, సభా నాయకులుగను, తక్కినవారిచే గౌరవింపబడి జీవించుచు న్నారు. అనేకులు వీరి సహాయము, మార్గదర్శకత్వము కొరకు ఎదురు చూస్తారు. అధికారము, గౌరవింపబడుట ఈ సంఖ్యకు తోడబుట్టినవి. వీరికి కూడా సంసార జీవితమున సుఖము లేదు.

## నామ సంఖ్య-ఏడు

ఇప్పుడు పేరులోని అక్షరముల అంకెలను కూడిన 7వచ్చు సంఖ్యల ఫలములను గమనిద్దాం.

7 - పేరు యొక్క సంఖ్య 7గా ఉండినచో, ఉన్నత లక్ష్యమును, కులీన స్వభావమును సూచించును. అనుకోని మార్పులు జీవితమున యేర్పడును. దైవకృప పెరుగును. ప్రయత్నములు అనుకొన్న ఫలితములు ఇవ్వవు.

16 - అతివేగముగా అభివృద్ధిగాంచుటను, హఠాత్తుగా తలక్రిందులుగా పడుటను ఇది సూచించుచున్నది. ఈ సంఖ్యను చిత్రించు ప్రాచీన చిత్రములలో ఒక గొప్ప గోపురముపై పిడుగుపడి కూలుటయు, దానిపైనుండి మకుటముతో సహా రాజు తలక్రిందులుగా పడుటయు చిత్రింపబడి ఉన్నది. (ఇది నూటికి నూరుపాళ్ళు నిజమే అని ప్రపంచ యుద్ధమున మొట్టమొదటి అణుబాంబు ప్రయోగింపబడిన జపాను దేశం నిరూపించినది. (Japan-16) జపాను రాజు దైవాంశ సంభూతుడు అనియు, అతనిని తలయెత్తి చూచుట కూడా దండన్గారమే అనియు ఉన్న నమ్మకమును అమెరికనులు దాడి చేయుటచే వమ్ము చేసినారు. రాజు సామాన్యుడయినాడు). మీ పేరు ఈ సంఖ్య కలదయితే మార్చుకొనుట మంచిది. ఈ సంఖ్యవలన కొత్తరకమైన కల్పనలు తోచును.

25 - ఈ సంఖ్య చివరకు మంచినే చేయుటవలన మంచిదనియే చెప్పవలసి ఉన్నది. ఈ సంఖ్యవారు పలు విధములైన పరీక్షలకు లోనవుతారు. జీవితములోని ప్రతి

అడుగు పోరాటముగాను, పరిశోధనగాను ఉండును. వాటిని అధిగమించుట వలన ఆత్మవిశ్వాసము, ఆత్మబలముము, జనాదరణ కల్గును. లోకజ్ఞానము, వ్యవహార జ్ఞానము, ఆలోచనలో స్పష్టత, చేయు పనులందు క్రమపద్ధతి అలవడును. తమకు తామే పథకములను, పద్ధతులను, ఆచారములను, నియమములను ఏర్పరచుకొని లక్ష్య మార్గమున పయనించెదరు. అరగతీసినకొద్దీ చందనమునకు పరిమళము అధికమైనట్లు, కరిగినకొద్దీ బంగారానికి వన్నె కూడినట్లు, వీరి జీవితము కూడ శోధనలకు పిమ్మట అమరత్వము చెందును (మహాత్మాగాంధీ “M.K.GANDHI” అనియే సంతకము చేయుట గమనింపుడు.)

ఈ గ్రంథమున, సంఖ్యలకు నేనిచ్చు అర్థములకు తగ్గ చిత్రములు, సూచనలు వేలాది సంవత్సరములకు పూర్వము వ్రాయబడినవి. పాఠకుల సౌకర్యము కోసం ప్రస్తుత కాలములో గొప్పవారిని ఉదాహరణగా చెప్పుచున్నాము. కనుక ఇట్టివారిని, ఇప్పటి కొందరిని చూసి ఈ శాస్త్రము తయారు చేసితిమని ఎవరును పొరబడకూడదు. మనకు తెలిసినంతలో కూడా ఇట్టివారు కలరు అని నిరూపించుటకే ఇట్టి ఉదాహరణలు ఇవ్వబడినవి.

34 - ఒకరకంగా ఇది అదృష్టకరమైన సంఖ్యయే. ఇది ఈ పేరు కలవారి మంచి స్వభావమును శక్తులను ఆకర్షణీయముగా వెలిబుచ్చును. ఇది యోగ్యతను అధికం చేయునదేగాని అదృష్టమును ఇచ్చునదిగాదు. పుట్టిన తేది సంఖ్య అదృష్టకరమైనవి అయితే అతిసులభముగా ఎక్కువ ధనము సంపాదించెదరు. అట్లుకానిచో డబ్బు సంపాదన మహా కఠినమగును. (కుటుంబములో ఎప్పుడు ఏదో కొరత ఉంటూనే ఉంటుంది). ఈ సంఖ్య వారిలో అనేకులు ఆడవారి మీదను, మధువు పైనను వ్యామోహము కలిగి ఉండెదరు. ఇది జాగ్రత్తగా గమనించవలసిన విషయము. సాధారణముగా వీరి మనసు ఏదైనా మత్తుపదార్థములను ఆశ్రయించును. ఈ విషయమే ఈ సంఖ్యను గూర్చిన భయము. వీరు ఈ సంఖ్యను మరొక అదృష్ట సంఖ్యకు మార్చుకొనుట మంచిది.

43 - ఈ సంఖ్య విచిత్రమైనది. వీరి జీవితమే విప్లవముగా తోచును. వీరు ఏ వృత్తిలో దిగినను నిముషమునకొక కొత్త విరోధిని తయారుచేసుకొందురు. తరచుగా

ఉద్యోగమునకు రాజీనామా ఇచ్చుట వీరికి సహజ కార్యము. తీవ్రమైన అభిప్రాయములను వెలిబుచ్చుచునే ఉందురు. కల్పనాశక్తియు, వాక్పటిమయు, రచనా పాటవమును తక్కిన 7 వారివలెనే వీరికిని కలదు. వీరి కోరికలు చివరకు నెరవేరును. దురదష్టకరమైనదిగనే భావింపబడు ఈ సంఖ్య పోరాటమును గొప్ప ఆటంకములను, విప్లవకరమైన మార్పులను సూచించును. లక్ష్యములు విజయవంతం అగును. జయము తథ్యము. (దురదృష్టకరం అనుటకు వీరు అనుభవించవలసిన సుఖములను అనుభవింపలేకపోవుట, అశాంతి మయమైన జీవితము అనుటయే అర్థము. వీరి జయము వలన వీరికి పెద్దగా లాభము ఉండదు.) వీరికి బుద్ధికుశలత వయసుతో బాటు అధికమగును. వీరి సామర్థ్యమునకు, తెలివికి ఆదరణ కన్న ఆక్షేపణలే ఎక్కువగా ఉండును.

52 - ఈ సంఖ్య కూడా ఒకవిధముగా తిరుగుబాటును సూచించునదే. జన్మసంఖ్య అదృష్టకరమయినదిగా ఉన్నచో ప్రపంచ ప్రసిద్ధులు కాగలరు. ఎటువంటి సమస్యకును పరిష్కారము సూచించ గలిగిన వీరు విజ్ఞులవుతారు. జనాకర్షణ మెండుగా ఉండును. ధార్మిక జీవనము కలవారయినచో మిక్కిలి ప్రసిద్ధియు, అసాధరణ సిద్దులును కలవారు అగుదురు. తలచినవన్నియు సాధించగలరు. **తక్కినవారి జీవితములో ఒక నూతన శకమును ప్రారంభించిన వారగుదరు.** (ఈ శక్తి 25 వారికి కూడా కొంతవరకు కలదు.) చేయవలసిన పనులు అసంపూర్తిగా ఉన్నపుడే జీవితము హఠాత్తుగా ముగియును. జీవితము అల్లకల్లో ముగా ఉన్నను ప్రసిద్ధి పొందుట తథ్యము.

61 - ఈ సంఖ్యవారు సుఖముగా అమరిన జీవితమును వదలి తమకు నచ్చినట్లు క్రొత్త ప్రయత్నములలో దిగుతారు. వీరికి జయాపజయములు మార్చి మారి వచ్చును. శరీర ఆరోగ్యమును కాపాడుకొన్నచో, తరువాత పెద్ద అధికార పదవి వహింపగలరు. కుటుంబ సౌఖ్యము గొప్పగా ఉండదు. బయటి ప్రపంచమునకు మటుకు బాగున్నట్లు కనుపించుదురు. పలు కార్యములందు విజయము పొందుతారు. గొప్ప ప్రయత్నములలో జీవితమును గడుపుతారు. వీరికి గొప్ప కీర్తి కలుగును.

70 - ఈ సంఖ్య వారు తీవ్రవాదులగుదురు. పరిస్థితుల ప్రభావము సుఖకరమైన జీవితమునకు ఆటంకమగును. వీరు తరచుగా ఓటమిని, ఆశాభంగములను,

కష్టములను ఎదుర్కొనవలసి వచ్చును. వయసు మళ్ళిన తరువాత జీవితం హఠాత్తుగా విజయపరంపరలతో నిండును. ముందు పడిన కష్టములకు మంచి ఫలితములు వచ్చును. మిక్కిలి విజయవంతముగాను, పుణ్య కరముగాను జీవితము మారును. (ఈ సంఖ్యకు గొప్ప బలము లేదు. పుట్టిన తేది సంఖ్యలు అదృ ష్టకరమైనవిగా ఉండినసే జీవితపు రెండవ భాగమైనా విజయవంతముగా ఉండును, లేనిచో వీరిని సమస్యలు దుఃఖములలో పడవేయును).

79- ఈ సంఖ్యవారు జీవత ప్రారంభములో అనేక కష్టములతో బాధలను అనుభవించెదరు. తరువాత వీరు తమ తెలివితేటలు, ఆత్మబలం ద్వారా త్వరగా ఉన్నత స్థితికి వస్తారు. సమస్యల నుండి గట్టెక్కి జీవతంలో స్థిరపడెదరు. మంచి ఆదరణ, సౌఖ్యవంతమైన జీవితముతో స్థిరమైన జయము కలుగును. కాలక్రమమున మంచి అదృష్ట శాలురు అగుదురు. ఉన్నత వ్యక్తులుగా రూపొందెదరు.

88 - ఈ సంఖ్యకు ఆధ్యాత్మిక ఉన్నతి కలదు. దయ, కరుణ మున్నగు మంచి గుణములు విశేషముగా వృద్ధి చెందును. సకల జీవరాశుల పట్ల ప్రేమ, ఆదరణ కలిగి ఉంటారు. మిక్కిలి కీర్తివంతులుగా జీవిస్తారు.

97 - ఈ సంఖ్య శాస్త్రములు, కళలందు ప్రావీణ్యతని ఇచ్చును. విశేషమైన ఆధ్యాత్మిక ఉన్నతి కలదు. సకలవిధములైన ప్రయత్నములు ఫలించును. లక్ష్మీకరము, భ్రమింపజేయు పనులు చేసెదరు.

106 - వీరి జీవితములో గొప్ప మార్పులు కలుగును. మధ్య వయసులో పలు విధములైన సమస్యలు ఏర్పడును. పిదప వీరికి తృప్తికరమైన జీవితము లభించును. అయితే వీరికి సులభముగా తీర్చలేని చిక్కులు కలుగును. కనుక ఈ సంఖ్య అదృష్టకరమైనది కాదు. ఈ సంఖ్య వారికి దైవభక్తి తగ్గి ధనాశ ఎక్కువగును.

## అదృష్టకాలము

7 సంఖ్యలో పుట్టినవారు ముఖ్యమైన పనులను 2, 11, 20, 29 తేదీలలోనే చేయుచూ వచ్చిన, వారికి జయము నిశ్చయము. అదిగాక తేది, నెల, సంవత్సరము కూడగా 2వచ్చు దినములు కూడా మంచివే. 25వ తేదీ కూడా వీరికి మంచి

అదృష్టమైనదే.

**సామాన్య దినములు :** 1, 10, 19, 28 తేదీలు కూడా మంచివే.

**ముఖ్య దినములు** : 7, 8, 16, 17, 26 తేదీలు దురదృష్టముగా నుండి అపజయములను తెచ్చును. అంతేగాక విధిసంఖ్యలు 7, 8గా గల తేదీలు దురదృష్టమైన రోజులు. ఈ రోజులలో ప్రారంభించబడు పనుల కారణంగా అనేక ఆపదలు వచ్చి అపజయములను ఎదుర్కొనేదురు. అందువలన ఎడతెగని దురదృష్టము కలుగును.

మొత్తం అంకెలు కూడగా 7, 8 వచ్చు తేదీలలో గూడా ఏ కార్యము చేయకుండా ఉండటం మంచిది.

## వృత్తులు

పుట్టినతేది సంఖ్య 7, 16, 25గా ఉండినచో మతము పేరిటను, మనసుకు కూడా అందని తత్వములను ప్రచారము చేయుట మూలముగా, రసాయన పరిశోధన మూలముగా, రచనల మూలమున ఐశ్వర్యము కలుగును. (7వ తేదియైన నడి వయసులో ను, 16వారికి బాల్యమునందును, 25 వారికి 40 యేండ్ల మీదటను అదృష్టము కలుగును). విదేశములతో సముద్రము ద్వారా జరుపు ఎగుమతి, దిగుమతి వ్యాపారములు, విదేశములను గురించి అక్కడి విషయములను ప్రచురించు పుస్తకములు, పత్రికల మూలముగను, ఎలక్ట్రికల్ పరికరముల (రేడియో, ఫ్యాను మొదలైనవి) వ్యాపారమునందును లాభములుండును. సినిమా పరిశ్రమలో (నటన, తక్కిన చిత్రసీమకు సంబంధించిన పనులలో వీరే దేశ విదేశములందు ప్రసిద్ధిగాంచి, ఐశ్వర్యవంతులుగా నున్నారు). అధిక ధన సముపార్జన గావించిన హాలీవుడ్ తారలు అధికశాతం ఈ సంఖ్యలో జన్మించినవారే). ఫోటోగ్రఫీనకు సంబంధించిన వృత్తులు, గడియారము సంబంధమైన వృత్తులు, అన్ని విలాస వస్తువుల వ్యాపారమును ఎక్కువ లాభమును ఇచ్చును. చిత్రలేఖనము, శిల్పము, సంగీతము, నాట్యము మొదలైన వాటియందు లేక బాల్యము నుండియు దేనియందు ఆసక్తిగలదో అట్టి వృత్తిని అవలంబించిన కీర్తి, ఐశ్వర్యము కలుగును. రాజకీయమందు వీరు ప్రముఖులు

కాగలరు. హఠాత్తుగానే వీరికి సంపద వచ్చిపడును. మందుల వ్యాపారము కూడ వీరికి తగినదే.

భాగస్థులతో కలిసి చేయు వ్యాపారములలో 1, 2, 5, 7 సంఖ్యలలో జన్మించినవారిని కలుపుకొనవచ్చును. పుట్టినతేది 7 సంఖ్య అయినచో 1, 2, 4, 7 వారు సహాయము చేయుదురు.

## వివాహ జీవితము

7 సంఖ్య కలిగినవారు ముఖ్యంగా వివాహ జీవితములో సుఖపడుట లేదు. తమకు పడని గుణములు కలవారిని చేసికొని కష్టపడుచున్నారు. వీరిలో స్త్రీలు విధిసంఖ్య శుభముగా ఉండు దినములలో జన్మించిన, సత్సంతానము కలవారుగను, సౌందర్యవంతులుగను ఉందురు.

అట్లుగాని పక్షమున కృశించి, అంగసౌష్టవముతగ్గి, పురుషులు మెచ్చని విధముగా ఆకర్షణ లేకుండా ఉందురు. వీరికి సంతానము కల్గుట కష్టమే. 2 సంఖ్యవారిని వివాహము చేసికొన్న మనసులు కలిసిన మనువగును. (జగడములు ఉండవని కాదు. అవి అలవాటైపోవును). 4 సంఖ్యలో పుట్టినవారిని వివాహం చేసుకుంటే వీరు సుఖింతురు. (4ఎంఖ్య వారు స్త్రీల ఎడల సానుభూతి చూపుతారు, స్వసుఖమునకు ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వరు). వీరు 8 సంఖ్యవారిని వివాహమాడితే దురదృష్టమే. 1 సంఖ్యవారిని వివాహమాడుట మంచిది కాదు. సంతానము ఆలస్యముగా కలుగును. అయినా సంసార జీవితము నిలువదు. వివాహ జీవితము ఆనందముగా ఉండవలెనన్న క్రింద పేర్కొన్న విధముగా ఎంచుకొనాలి :

| **కాబోవు భార్య/భర్త సంఖ్య** | **వివాహ దినము, తేది, నెల, సంవత్సరం కూడిన వచ్చు సంఖ్య** |
|---|---|
| 2 | 1 & 1, 2 & 1 |
| | |

| 4 | 4 & 1, 4 & 6, 6 & 1 |
|---|---|
| 6 | 1 & 1, 6 & 1, 1 & 6 |

**హెచ్చరిక :** అదృష్టములేని ఇతర సంఖ్యలవారిని మరచిపోవుట మంచిది.

రంగులు

తెలుపు వీరిని ఎక్కువగా ఆకర్షించును. అయినా వీరు తెలుపుకన్నా లేత పసుపు, లేత పచ్చ, లేత నీలము వంటి రంగులు ధరించుటయే మేలు కలిగించును. లేతవైన అన్ని రంగులను వీరికి తగినవే.

తగని రంగులు

అన్ని ముదురు రంగులు వీరికి కీడు కలుగచేయునవే. ముఖ్యముగా ఎఱుపు, నలుపు రంగులు దురదృష్టకరమైనవి.

రత్నము

వైడూర్యము వీరికి అదృష్టకరమైనది. దీనిని ధరించుటచే ధైర్యమును, దైవ బలమును ఎక్కువగును. (దీనిలో ఉండు సూత్రము రెండువైపులకు పూర్తిగా ఉండునట్లు చూసుకొనాలి). ఇదిగాక మంచి ముత్యము, చంద్రకాంత శిల అనబడు Moon stones కూడా మంచివే.

వీరికి లోహముల కన్నా మట్టి ఎక్కువ మేలు చేయును. కనుక వంటకు మట్టిపాత్రలు ఉపయోగించుట వలన శరీరారోగ్యమును వృద్ధి చేయును.

7 సంఖ్యను సూచించు అక్షరములు, వాని ఫలితములు

**O** (అలల నిడువు 70) ఎఱుపు, పసుపు, నీలము మూడు రంగులు కలది. అయినా ఇది నలుపును ఆకర్షించును. ఎఱుపు రంగు ఉండుట చేత సాటిలేని మనోశక్తులను ఇచ్చుచున్నది. నలుపును ఆకర్షించుట వలన భవిష్యత్తును తెలిసికొనుట వంటి విశేష శక్తులును కలుగజేయుచున్నది. శక్తులను, విషయములను

సమకూర్చు శక్తి, నిర్ణీత కార్యములను నెరవేర్చు శక్తి ఉంది. క్రొత్త రకములైన ప్రయత్నములు, ఉద్దేశములు కలుగును. వీరు తమకు తోచినట్లే పనులు చేసెదరు. మానవాతీత మనోశక్తులు వీరి జీవితమును పాలించును. కొంతమేరకు దూషణలను, వ్యతిరేకతలను ఎదుర్కొనుటకు, గొప్ప ప్రయత్నములందు నిమగ్నమగుటకు తగిన ధారాళమైన మనస్తత్వము కలదు. బుసకొట్టి లేచు ఇంద్రియములను అణచుటకు ఎక్కువ శ్రమిస్తారు. తరచుగా శరీరమున ఏదైనా అనారోగ్యము కలిగి అడ్డము కలిగించును. ఈ ఫలితములన్నియు "O" చివరి అక్షరముగా వచ్చిన ఎక్కువగా కనపడును. పేరు మొదటనున్నను ఈ ఫలములుండును. (మధ్యలో ఉన్నచో తక్కిన అక్షరముల ఫలములు ఉండును). విషయములను బాగుగా గ్రహించి, తీవ్రముగా యోచించిన వెనుకనే అద్భుతమైన అభిప్రాయములను ప్రకటించెదరు. ఎందరితో కలసియున్నను మనసు ఒంటరితనమునే కోరును. లోకమంతటికీ శ్రేయస్సునిచ్చు పనులందు మనసు లగ్నమగును. దైవభక్తి, నమ్మకము సంపూర్ణముగా ఉండును. పగలు కన్న రాత్రులందు వీరి మనోశక్తులు పెరుగును. వివరించ శక్యముకాని గాఢమైన ఈ శబ్దమే ఓంకారమునకు ప్రారంభము.

**Z** (అల నిడుపు 7) అన్ని ప్రధాన వర్ణములను ప్రతిఫలించును. బుద్ధిని సునిశితము చేయును. విజయమునకు కావలసిన అన్ని గుణములను కలిగియుండును. మాటలో వినయము, తంత్రము, మృదుత్వము నిండి ఉండును. వీరు కార్యశీలురు. జయము నిశ్చయము. అధికమైన దిగులు, నరముల అలసట కలుగకుండా కాపాడుకొనవలెను.

7 తేదీలో పుట్టిన కొందరు ప్రముఖ వ్యక్తులు

| పేరు | జన్మతేది సంఖ్య | తేది-విధి సంఖ్యలు |
|---|---|---|
| WILLIAM WORDSWORTH<br>విలియం వర్డ్స్ వర్త్ (ప్రసిద్ధ ఇంగ్లీషు కవి) | 7-4-1770 | 7 & 8 |

| | | |
|---|---|---|
| SIR JAMES YOUNG SIMPSON<br>సర్ జేమ్స్ యంగ్ సిమ్సన్ (క్లోరోఫాం కనుగొన్న విజ్ఞాని) | 7-6-1811 | 7 & 6 |
| CHARLES DICKENS<br>చార్లెస్ డికెన్స్ (ప్రఖ్యాత రచయిత) | 7-2-1812 | 7 & 3 |
| MADAME MARIE CURIE<br>మేరీ క్యూరీ (రేడియమ్ ను కనుగొన్న విజ్ఞాని) | 7-11-1867 | 7 & 4 |
| SIR C.V. RAMAN<br>సర్ సి.వి.రామన్ (1930లో నోబుల్ బహుమతి పొందిన విజ్ఞాని.) | 7-11-1888 | 7 & 7 |
| GREGORY EFIMOVICH RASPUTIN<br>గ్రెగరీ యెఫిమోవిచ్ రస్పుటీన్ (విద్యావంతుడుగాని ఇతను 38 సం. వరకు సామాన్య జీవితం గడిపాడు. పిదప తన మానవాతీత శక్తులను గుర్తించి వాటిని తన స్వార్థానికి ఉపయోగించుకొంటూ, రష్యా చక్రవర్తిని తన అదుపులో ఉంచుకొని, క్రమేణా రష్యాని తన ఆధీనంలోకి తీసుకొని ఒక నియంతలాగ పాలించాడు. కఠిన పాషాణముగాని, తుపాకి గుండ్లుగాని ఇతనిని చంపలేక పోయాయి. ప్రసిద్ధి చెందిన తరువాత అతని పేరు గ్రెగరీ రస్పుటిన్. ఇతడి అకృత్యాలకు విరక్తి చెందిన రష్యన్లు 15-12-1916లో అతి కష్టంమీద చంపగలిగారు.) | 7-7-1872 | 7 & 5 |
| | | |

| | | |
|---|---|---|
| QUEEN ELIZABETH<br>మొదటి ఎలిజబెత్ మహారాణి \| (అవివాహిత) | 7-9-1533 | 7 & 1 |
| SIR JOSHUA REYNOLDS<br>సర్ జోషువా రేనాల్డ్స్ (ప్రసిద్ధ చిత్రకారుడు, ఇంగ్లీషు చక్రవర్తి ఆస్థానమున చేరిన వెనుక చెవుడు, దాని తరువాత అంధత్వము పొందినాడు) | 16-7-1723 | 7 & 9 |
| MAHADEO GOVIND RANADE<br>మహాదేవ్ గోవింద్ రానేడ్ | 16-1-1842 | 7 & 5 |
| WILLIAM HANDYSIDE<br>విలియం హేండిసైడ్ (నార్వే దేశానికి చెందిన ఇతను మలేషియాలో కాఫీ మరియు టీ తోటల అభివృద్ధికి అందించిన సేవకు మలేషియా సుల్తాను వద్ద 5000 ఎకరాలు బహుమతి పొందికూడా అనారోగ్యం వలన దానిని అనుభవించలేక తన \| దేశమునకు తిరిగి వెళ్ళిపోయెను.) | 16-7-1848 | 7 & 8 |
| OSCARWILDE<br>ఆస్కార్వైల్డ్ (ప్రసిద్ధ కథా రచయత. తన 34వ సం. నుండి 40వ సం. వరకు తిరుగులేని రచయితగా పేరు పొందారు. కాని ఒక కేసుకి సంబందించి జైలుకి పంపబడ్డారు. 46వ సం.లో పేదరికంతో మరణించారు. | 16-10-1854 | 7 & 8 |
| WILBUR WRIGHT<br>విల్బర్ రైట్ (తన తమ్ముడు ఆర్విల్లీ రైట్తో (పుట్టిన తేదీ 19- | 16-4-1867 | 7 & 6 |

| | | |
|---|---|---|
| 8-1871)కలిసి మొట్ట మొదటి విమా నం తయారు చేసారు. వీరు ఒక సాధారణ సైకిల్ రిపేరు షాప్ నడుపుతూ, తమ తెలివితేటలు మరియు పట్టుదలతో 17-12-1903లో తన 33వ సం.న ఆకాశములో సుమారుగా గంటకు పైగా ఎగరగలిగారు. (అదృష్ట సంఖ్య 6 సహాయంతో ) | | |
| CHARLIE CHAPLIN<br>చార్లీ చాప్లిన్ (హాస్యచక్రవర్తిగా ప్రసిద్ధి చెందినవారు. పూర్తి పేరు \| చార్లెస్ స్పెన్సర్ చాప్లిన్. ) | 16-4-1889 | 7 & 1 |
| LEE KUAN YEW<br>లీ కువాన్ యూ (నూతన సింగపూరు సృష్టికర్త) | 16-9-1923 | 7 & 4 |
| SIR ISSAC NEWTON<br>సర్ ఐజాక్ న్యూటన్ | 25-12-1642 | 7 & 5 |
| PANDIT MADANMOHAN MALAVIYA<br>పండిట్ మదన్ మోహన్ మాలవియా | 25-12-1861 | 7 & 8 |
| GUGLIELMO MARCONI<br>గుగ్గిఎల్మో మార్కోని (రేడియో కనుగొన్న విజ్ఞాని) | 25-4-1874 | 7 & 4 |
| M.A. JINNAH<br>ఎమ్.ఎ. జిన్నా పాకిస్తాన్ (నం. 25) ఉద్భవాన్ని చూడాలని కన్న కలని నిజం చేసుకున్న నేత. అతని పేరు నం.23) | 25-12-1876 | 7 & 5 |
| | | |

| | | |
|---|---|---|
| LORD BEAVER BROOK<br>లార్డ్ బీవర్ బ్రూక్ (30 సం.లు వచ్చేసరికి ధనవంతుడయి పత్రికా రంగములో ప్రవేశించి ప్రసిద్ధి చెందినవారు.) | 25-5-1879 | 7 & 1 |
| JOHN FOSTER DULLES<br>జాన్ ఫోస్టర్ డల్లస్ | 25-2-1888 | 7 & 7 |
| S. SUNDARAM<br>ఎస్. సుందరం (యోగాచార్య, బెంగళూరు) | 25-2-1901 | 7 & 2 |
| SEAN CONNERY<br>సీన్ కానరీ (హాలీవుడ్ నటుడు. జేమ్స్ బాండ్ పాత్రధారి) | 25-8-1930 | 7 & 1 |

న్యాయాధిపతి పదవులను 25 తేదీలలో జన్మించిన అనేకులు వహించుచున్నారు.

## అంకె 8 - శని

**సంక్షిప్తంగా ముందుమాట:** ఈ అంకె ఆధిపత్యమున జన్మించిన పాఠకులు దేవుని దయవలన అదృష్టకరముగా ఉందురుగాక! ఈసంఖ్య వారిని అదృష్టశాలురుగ చేయుట ఎలా! అన్న ఆరాటమే (పలు సంవత్సరముల క్రితం, ఇప్పుడు కాదు) ఈ కళలో పరిశోధన సాగించుటకు నన్ను పురిగొల్పినది. ఈ కళ సంబంధితమైన పూర్వ గ్రంథములన్నియు ఈ సంఖ్య మహా దురదృష్టమయినదని చెప్పినవేగాని ఏవిధముగా వారు అదృష్టముతో ఉండగలరో ఒక్క మాట కూడా చెప్పలేదు. కనుక ఈ సంఖ్యలో జన్మించిన వారి జీవితములను పరిశీలింప మొదలిడినాను. ఎన్నో విషయములు దొరికినను పరిశీలన పూర్తి చెందినట్లు తోచలేదు. అటుపిమ్మట ఆ దేవియొక్క కరుణవల్ల, ఈ సంఖ్యలోని కీడును తీసివేయుటకు 5 సంఖ్య సహాయము చేయునన్న నిజము స్ఫురించి, ఆ ప్రకారమే సలహానివ్వగా, అనేకులయిన 8 సంఖ్య మిత్రుల జీవితములో మళ్ళీ వసంతము వచ్చినది. విధివంచితులైన ఈ సంఖ్యవారు సంతోషముగా జీవించిననే నా ఆశయము నెరవేరును. కనుక పాఠకులు ఈ సంఖ్య వారిని చూసిన, వారికిని ఈ ఉపాయము చెప్పి వారిని గట్టెక్కించ గోరుతు న్నాను!

ప్రాచీన గ్రంథములలో ఈ సంఖ్యను దైవకృపకు చెందిన విషయములకు మిక్కిలి అదృష్టకరమైనదిగా పేర్కొనబడినది. ఇది పూర్తిగా నిజమే. ఈ సంఖ్య వారికే వేదాంత సత్యములును, తత్వములను, మనసులో బాగుగా తోచును. ఇహలోక జీవితమును, సుఖములను తుచ్ఛముగా భావించి సన్యాసులవుతారు. వీరు వేదాంత సత్యములను చక్కగా అర్థము చేసుకోనెదరు. దైవకృపయందు మనసు నిలిపిని వీరికి అద్భుతమైన దివ్యానుభూతులు కలుగ గలవు. ఈ సంఖ్య పృధ్వి అంశమగును.

ఇది పాఠకులు జాగ్రత్తగా గమనింపవలసిన సంఖ్య. ఈ సంఖ్యలో జన్మించిన వారిని పరిశీలించుటకు ముందు, ఈ సంఖ్యకు అధిపతియైన శని గ్రహము గూర్చి ఒకింత తెలిసికొనుట మంచిది. శనీశ్వరుడు ప్రారబ్ధకర్మకు అధిపతి. దీని వలననే ఎవరికి ఎక్కడ, ఎప్పుడు చెడు జరిగినా కారణము శనిగా భావిస్తారు.

అది సరిగాదు. అన్ని గ్రహములకును మేలు, కీడు చేయు గుణములు కలవు. శనికి మేలు కీడులను సరితూచి సమత్వజ్ఞానమును ఇచ్చు శక్తి కలదు. (ఈ కారణము చేతనే జ్యోతిష శాస్త్ర ములో శనికి తులా రాశి గుర్తుగా చెప్పియున్నారు). తక్కిన గ్రహములు ఎంత బలముగా ఉన్నను, వాటినన్నింటినీ అనుసరించి జీవితమును శాసించునది శనియే. ఇందువలననే హస్తసాముద్రికమునందు కూడా శని రేఖ (శని మిట్టవైపు పోవు గీత) అభివృద్ధిని, జీవితములోని ఎగుడు దిగుడులను, కష్ట సుఖములను సూచించు 'విధిరేఖ'గా చెప్పబడుచున్నది. మానవుల పూర్వజన్మ, ప్రస్తుత జన్మలలోని పాప పుణ్యములను నడవడికను తూచి, లెక్కగట్టి వానికి తగిన ఫలితముల ఇచ్చుటచే ఈ గ్రహము అందరి చేతను నిందింపబడుచున్నది - ఇది అన్యాయమైన దూషణయే. ప్రాచీన గ్రంథములందు శని, ఒక పెద్ద సింహాసనమున కూర్చొని ఉండి ఎడమ చేత త్రాసు, కుడిచేత కత్తి పట్టుకొని కన్నులకు గంతలతో చిత్రీకరింపబడి ఉన్నాడు. భుజము మీద దయ, కరుణ, ఆత్మజ్ఞానములకు ప్రతీకమైన పావురము ఉండును. తన ఎదుట నిలచిన వారిని కన్నులతో చూడక ఉండును. త్రాసులో పాపపుణ్యములను టేరీజు వేసి, దాని ప్రకారము కత్తిసాయముతో వారికి చెందవలసిన దానిని అందజేయునన్నదే దీని తాత్పర్యము.

శనీశ్వరుని సూచించు తిరుపతి వెంకటేశ్వరుడు కత్తి ధరించి ఉన్నట్లుగా (తక్కిన వైష్ణవ ఆలయములలో ఇది కనిపించదు) కండ్లు రెండును ముక్కు మీద నుండి ప్రారంభమగు నామముచే కప్పబడినట్లును ఉంచుట మనమెరిగినదే. పొరపక్షములేక దండించు న్యాయాధీశుడు, శిక్షించు ఉపాధ్యాయుల వంటి వాడే శని. అతను మంచివాడా, చెడ్డవాడా అన్నది ఇప్పుడు తెలిసినది కదా! తక్కిన గ్రహములు ప్రవృత్తిని ప్రోత్సహించగా శని ఒక్కడే నివృత్తి మార్గమును చూపుచున్నాడు. ఈ గ్రహ ఆధిక్యము వల్లనే సమదృష్టియు, ఇష్టాయిష్టములను ప్రక్కకు నెట్టి విషయములను శోధించు స్వభావమును కలుగుచున్నది.

ఈ గ్రహాధిక్యమున జన్మించినవారే 8 సంఖ్యలో పుట్టిన 'విధి వంచితులు. వీరికి జీవితములో అరికట్టలేని సంఘటనలు కలుగును. ఎంత గొప్ప మేధావిగా ఉండినను (బుద్ధి శనికి లోబడినందువలన) వీరి సలహాలే వీరిని విధి మార్గములోకి తోయును. 8,

17, 26 తేదీలలో పుట్టినవారు ఈ సంఖ్య క్రిందకు వచ్చెదరు. పుట్టినతేది, నెల, సంవత్సరము మూడింటిని కూడిన 8 వచ్చు దినమున పుట్టినవారు అందరు ఈ సంఖ్యచే పాలింపబడుదురు.

## అదృష్టకరమైనదా?

ఎట్లు చూచినను ఈ సంఖ్య జంకి ఒదిగి పోవలసినదిగా ఉన్నదేగాని, సమీపమునకు పోయి ముద్దాడవలసినదిగా లేదు. ఈ సంఖ్య సమస్యలతో నిండినది. ఎక్కువ అదృష్టకరముగా కుదురునప్పుడు కూడా, అత్యున్నత పదవి నిచ్చి దానితో బాటు శక్తికి మించిన భయంకరమైన బాధ్యతలను మోపగలిగినది. చిన్న పొరపాట్లు కూడ గొప్ప ఆపదలు కలిగించును. మిక్కిలి అదృష్టవంతులుగ కనపడే కొందరు కూడా **నిజముగా అదృష్టశాలురు కారు**. ఆ మాట వారి నోటనే వినగలము. తమ స్థితికి, యోగ్యతకు, కోరికకు తగ్గ జీవితము దొరకుట కష్టమే. వీరిలో పై వర్గమువారు సద్గుణములతో ప్రకాశిస్తూ జీవించెదరు. తక్కినవారు ఎంత సమర్థులైనను, నడతకు తగ్గ ఫలములనే పొందెదరు.

**మనస్సు యొక్క స్వభావము:** ఈ సంఖ్యలోని మేలైన పైవర్గము వారిని, కరుణ, దయ, పరుల కష్టము చూసి సహింపలేకుండుట, సమాజములోని అవినీతిని ఎదురించి పోరాడుట, జంకులేక చెడును ఖండించుట, వేదాంత శాస్త్ర ములందు శ్రద్ధ, నిగూఢ కళా జ్ఞానము నిండిన సంస్కర్తలుగా ఉండుటచే గుర్తింపగలుగుచున్నాము. అతి తక్కువ శాతమే ఇట్టివారు.

వీరి తరువాత అతి గౌరవముగా మర్యాదస్తులుగా కనబడువారిని చూద్దాం. వీరి కులీనత అంతయు పైపై వేషమే. లోపలకు తొంగిచూసిన, పేరాశ, స్వార్థము, భోగలాలస జ్వలించుట కనబడును. ఇట్టివారు సందర్భమునకై కాచుకొని ఉందురు.

ఈ సంఖ్యలోని అనేకులు (ఉన్నత స్థితిలో ఉండువారు కూడా) తమకు భయము గొలుపు, చెడు తలపులు తరచు కలుగుచున్నట్లు నాతో చెప్పియున్నారు. దొంగతనము, వ్యభిచారము, పెద్దయెత్తున మోసములు, దోపిడీలు, హత్యలు , దొంగ సంతకములు, దొంగ నోట్లు అచ్చువేయుట మున్నగు పనులు వీరిని త్వరగా

ఆకర్షించుచున్నవి. పైనచెప్పినవారు ఈ పనులను మెచ్చుకొనువారేగాని ధైర్యముగా చేయువారు కారు. (బెర్నార్డ్షా 26వ తేదీన పుట్టినవారు. తమ కష్టస్థితిలో అప్పుడప్పుడు ఇట్లు చెప్పెడివారు, "నేను తక్కిన వృత్తులను అవలంబించుట కన్నా దోపిడి దొంగను కావటానికే మక్కువ చూపెడివాడను"")

ఇక ఈ సంఖ్యలోని నీచవర్గమును పరిశీలిద్దాం. వీరిలో అధిక శాతము చెరసాలలను నింపుచున్నారు. పైన చెప్పిన చెడు ఆలోచనలలోనే జీవితముగా తీసుకొన్న వీరు విధి వంచితులుగాను, తప్పుచేసి తప్పించుకోలేని వారిగాను దండింపబడుచున్నారు.

సహజ గుణములు

వీరు అమితమైన మనోశక్తులు, స్పష్టమైన తెలివి, మిక్కిలి పదునైన బుద్ధి కలవారు. సదా ఆలోచనలలో మునిగి ఉందురు. అతి పెద్ద సమస్యలతో మనసు సతమతమగును. మనసులో ఉత్సాహముండదు. ఎప్పుడూ దేనినో కోల్పోయినట్లు కనబడుతారు. సుఖమును కూడా మనసారా అనుభవింపలేరు (ఈ సంఖ్యలోని అయోగ్యులు ఎప్పుడూ నవ్వుతూనే ఉంటారు). ఎంతమేరకు సుఖములనుభవించినా వీరికి తృప్తి కలుగదు. వీరికి ఆత్మవిశ్వాసము అతి తక్కువ. **జీవితములో విజయములు గలిగిన పిదపనే వీరికి ధైర్యము వచ్చును.** పరులను కూడ సులభముగా నమ్మరు. ఇతరులతో మసలునపుడు కూడా చాలా జాగ్రత్తగా ఉంటారు. మనసు సదా ఏకాంతమునే కోరును. విచక్షణా జ్ఞానము గల వీరు అన్నిటా నిదానమునే ఆశ్రయిస్తారు. డబ్బు ఖర్చు చేయుటలో పిసినారితనము కనబడును. జీవితమునకు పనికివచ్చు అన్ని శాస్త్రములను బాగుగా శోధింప ఇష్టపడుతారు. **ఎల్లప్పుడు తమను అందరికన్న భిన్నమైన వారుగనే తలచుకొందురు.** ఇది వారి మాటలలో, చేతలలో స్పష్టముగా కనబడును.

వీరికి జీవితకాలములో అతి తక్కువ మిత్రులే ఏర్పడుదురు. అయినా వారివలన కూడ వీరికి నిరంతరముగా మంచి జరుగదు. పిరికివారు(2 సంఖ్యవారి తరువాత వీరే అనుమానమునకు, భయమునకు చెప్పుకోదగినవారు). జీవితమునకు భయపడి, ఆత్మహత్యలు ద్వారా మరణమును కౌగలించుకొనుటకు సిద్ధపడగలరు. ఆత్మహత్య కూడా కష్టములేనిదిగా ఉండుటకు, ఆపదలు చుట్టుముట్టినపుడు విషము వంటి వాటిని

ఆశ్రయించెదరు

విధి

వీరిలో పలువురు బాల్యముననే అనాథలై, ఆదరించువారు లేక చదువుకొనుటకు కూడా వీలుగాక కష్టపడుచున్నారు. బాల్యము కష్టములు నిండినదిగా ఉండును. ఎంతో శ్రమపడి కొందరు పైకి వచ్చుచున్నారు. వీరికి దొరకు ప్రతి చిన్న సుఖము, జయమును కూడ ఎంతో పోరాడిన మీదట కాని దొరకదు. సంఘములో వీరి అర్హతకు తగ్గ స్థితిని పొందుటకు వీరెంతో పోరాడవలసియుండును. వీరిలో పలువురు చిన్నప్పుడే కర్మ ద్వారా వచ్చే రోగములచే పీడింపబడుదురు. వీరికి జీవితములో ఆటంకములు కలుగుచునే ఉండును. 8 సూచించు సంవత్సరములైన 8, 17, 26, 35, 44వ యేండ్లలో జాగ్రత్తగా ఉండకపోయిన గొప్ప అపాయములు కలుగ గలవు. (పేరు సంఖ్య 8గా నున్న వారికి కూడా 8ని సూచించు సంవత్సరములలో ముఖ్య సంఘటనలు జరుగును. వీరిలో ఒక వర్గమువారు కష్టములలో చాలాకాలము జీవిస్తారు. మరియొక వర్గమువారు బాగుగా జీవించుచునే హఠాత్తుగా ప్రమాదములలో మరణింతురు. (దినపత్రికలో వచ్చు చెట్టు కూలి మరణము, పిడుగు పడి మృతి, కారు క్రిందపడి దుర్మరణమ, అగ్నికి ఆహుతి అగువారు అట్టి మరణము పొందినవారే. పేరు, వయసు తేదీలను గమనించిన ఈ నిజము అర్థమగును). ఇతరులు చేయు నేరములకు కూడ వీరు బాధ్యులుగా తరచుగా భావింపబడుదురు. అతి మంచివారుగను, గొప్పవారుగను, మేధావులుగను ఉన్నను వీరిని సమీపమున ఉండువారు సరిగా అర్థము చేసికొనరు. ఎన్నటికినీ వీరు ఎవరి అండదండలు ఎదురు చూడరాదు. తమ స్వంత ప్రయత్నముతో అభివృద్ధి సాధింపవలెను.

తక్కినవారికన్న వీరికి విచక్షణాజ్ఞానము అధికము. కాన వీరు ఇతరులతో చేర వీలుకాదు. దీని వలననే వీరు మిత్రులు అధికముగా లేక ఒంటరిగా ఉందురు. (1, 4, 8 సంఖ్యలవారు దగ్గరున్నచో వెంటనే వారిని దగ్గరి మిత్రులుగా చేసుకొందురు. ఈ 1, 4, 8 వారివలననే వీరికి సుఖము కలదు. ఇతరుల స్నేహము నిష్ప్రయోజనమే.

శరీరము - వ్యాధి - ఆహారము

**శరీరము:** ఈ సంఖ్య వారిని లక్షణములను బట్టి కనిపెట్టవలెననిన పాఠకులు తికమక పడిపోదురు. జన్మ తేది 8గా ఉన్నను, తేది, నెల సంవత్సరము కూడగా వచ్చు సంఖ్య 8గా ఉన్నను, శని యొక్క కాలమైన జనవరి, ఫిబ్రవరిలలో జన్మించినచో వారి శరీరమున శని ఆధిక్యత కనబడును. లేనిచో ఆయా మాసములకు అధిపతి అగు గ్రహముల లక్షణములు కలిసిపోవును. శని యొక్క ప్రభావము యదార్థముగా బాహ్యా దృష్టికి కనబడునది కాదు. పుట్టిన తేది 8గా ఉండి విధి సంఖ్య 5గా ఉన్నచో వారు ఆకర్షణీయముగాను, అందముగాను ఉందురు. శరీరమున రోగము కలదని ముఖమున తెలియదు. కొన్ని సందర్భములలో శని ఆధిక్యము కలవారిలో మిక్కిలి అందమైనవారిని చూచుట తటస్థించును. కాని వారి అందము యొక్క లోతులో (సీతమ్మవారి అందమువలె) దురదృష్టమే దృఢముగా కనబడును. ఇక వీరి సహజమైన శరీర నిర్మాణమును గమనించెదము. (గ్రహబలము తగ్గినచో శరీర నిర్మాణము వేరు విధముగా ఉండునని పాఠకులు మరువకూడదు)

వీరు మంచి పొడగరులు. దానికి తగినట్లు వారి కాళ్ళు, చేతులు పొడవుగా అమరి ఉండును. ముఖము పొడవుగా ఉండి సన్నగా రివటవలె ఉందురు. కొందరు కొంచెము లావుగా ఉన్నను, బుగ్గలు అంటుకొనిపోయి ఉండును. కొందరికి లోతుకుపోయి ఉండును. కండ్లు కూడా గుంటలు పడి ఉండును. కనుబొమలు దట్టముగా ఉండును. పదునైన చూపులయినను కనబడును. ముక్కు లావుగా ఉండక సన్నమగును, పొడవుగాను ఉండి చివరలో వంగి, మొనదేలి ఉండును. దీనివలన శ్వాస సహజముగనే ఒకే పద్ధతిలో ఉండదు. శ్వాస సంబంధమైన వ్యాధులకు చోటు కల్పించును. నోరు పెద్దగను, దంతములు వికారముగను ఉండును. అనేకులకు పళ్ళ వరుసగా ఉన్నను గట్టిగా ఉండవు. త్వరగా అరిగి రాలిపోవును. చిగురులు కూడ రక్తము లేక పాలిపోయి ఉండును. గడ్డము బలిష్టముగా ఉండి వీరి దృఢత్వమును చూపు నట్లుండును. (అట్లు లేకపోయిన శని ఆధిక్యత వీరికి కీడు చేయుచున్నదని అర్థము). సన్నముగా పొడుగుగా సాగిన మెడ, ఎముకలు, నరములు కనపడునట్లు ఉండును. స్వరములో ఆకర్షణ ఉండదు. తల వెంట్రుకలు ముళ్ళపందికి వలె నిక్కబొడుచుకొని ఉండును. (సూర్యకిరణముల నుండి తీసుకున్న జీవశక్తిని శరీరము తనలోనే ఇముడ్చుకొనుటను

అణగి ఉండు తలవెంట్రుకలు చూపును. జుట్టు నిక్కబొడుచుకొని ఉండుట ఆ శక్తిని శరీరము బయటకు పంపుటకు సంసిద్ధమైనదని సూచించును. శని సూర్యునకు సహజ శత్రువు. కనుక వ్యాధిని సూచించు లక్షణములను శరీరములోనే చూపును. తక్కిన గ్రహముల వారికి ఈ విధముగా బిరుసు తలవెంట్రుకలు ఉండిన, అప్పుడు వారికి శనిదశయో, ఏలిననాటి శనియో అట్టి శని ప్రభావమేదో ఉన్నదని గ్రహింపవలెను. సహజముగనే వీరికి శరీరము, చేతులు, గోర్లలో కొద్దిపాటి పసుపు కలిసియుండును. వీరు పైత్య శరీరులని దీనివలన తెలియుచున్నది. తెల్లమచ్చలు కనపడిన అప్పుడు వారు ఒంటరిగా ఉండుటను. ఏదో పెద్ద ఆలోచనలో ఉండుటను సూచించును. నఖములు, చేతులు ఎట్టి బారి ఉన్నచో అనుమానములు లేక కార్యరంగమున తెగించి దిగుటను చూపును.

**వ్యాధి - ఆహారము:** శని భగవానుడు మానవుని దంతములు, నఖములు, చర్మము, ఎముకలు, వెంట్రుకలు, మూత్ర నాళము, వీటిపైన అధికారము వహించుచున్నాడు. వీరు పిత్తదేహం కలిగినవారు. ప్రేవులు మరీ బలహీనమైనవి. బాల్యమునందే అనేకులకు కడుపు నొప్పి వచ్చి ఉండును. వీరి జీర్ణ శక్తి చాలా బలహీనముగా ఉండును. అరోగ్యముగా ఉన్నను వీరు 30 యేండ్లకుపైన రాత్రులు భోజనము చేయరాదు. తేలికగా పాలు, పండ్లు తీసుకొనవచ్చును. ప్రేవులవలెనే వీరికి మలవిసర్జనాంగములును బలహీనమైనవే. మలబద్ధకమునకు తావిచ్చిన, శరీరము ఉష్ణము చెంది తీరని కడుపు నొప్పియో, ఆస్థమా నో వచ్చును. దానిని అరికట్టుటకు ఆహారమున ఆకుకూరలు చేర్చుకొనుటకు అలవాటు పడవలెను. ఇవిగాక వీరికి రాగల రోగములు, తలనొప్పి, తలత్రిప్పుట , నెత్తురులో విషము కలియుట (నేను చెప్పిన పిమ్మట అనేకులు వైద్య పరీక్ష చేయించుకొని, వారి ప్రేవులే ఆ విషమును గ్రక్కుచున్నవని పరిశోధనలో తేలినట్లు తెలిపి ఉన్నారు). మోకాళ్ళలో వాతము (కీళ్ళవాతము) మొదలగునవి ఉండును. వీరు పొగాకు సంబంధమైన దేనిని కూడా వాడరాదు. ఇప్పుడే రక్తమునందు విషము కలసినదా అని తెలిసికొనుటకు చేతిగోర్లను పరిశీలించుడు. వానిలో క్రిందనుండి వేలు చివరివరకు నల్లని లేక నలుపు కలిసిన ఎట్టని చారలు కనపడిన విషం కలిసి ఉండుటను తెలుపును. గోర్లు మధ్యలో కుడుముల వలె

ఉబ్బి ఉండిన ప్రేవులు బలహీనమగుటను సూచించును. గోర్లలో ఎగుడుదిగుడుగా గీరలుండిన త్వరలోనే వాతరోగములు కలుగునని సూచించును. మాంసము భుజించు వారైన వెంటనే దానిని మానవలెను. కాఫీ, టీ వంటి పానీయములు ఎక్కువ తాగరాదు. పండ్లు తినగా తినగా వీరి జఠరము, దానికి చెందిన అవయవములు బలము పుంజుకొనును. వీరు ప్రతిదినము భోజనములో తప్పక చేర్చుకొనవలసినది నిమ్మపండు. దీని రసమును తెల్లచక్కెర చేర్చకుండ ఉపయోగించవలెను. అనాసపండు, అరటి, ఎండ ద్రాక్ష వంటి పండ్లు కూడా మంచివే. కూరలలో కారట్, ముల్లంగి, కంద, తోటకూర మిక్కిలి మేలుచేయునవి. పూర్తి ఆరోగ్యముగల వారైనా 40 సంవత్సరములపై బడిన రాత్రి పూట పూర్తి భోజనము చేయరాదు. కొంచెము పండ్లు, ఒక గ్లాసు పాలు సరిపోవును.

ఇక ఈ సంఖ్యలో పుట్టినవారి ప్రత్యేక గుణములను పరిశీలిద్దాం:

8 - ఈ తేదీన పుట్టినవారు ప్రశాంతమైన జీవనమునే కోరుదురు. పలు కార్యములను సాధింప ప్రయత్నించెదరు. మతము, ఆధ్యాత్మిక సాధనలు, దేవతార్చనలు, వేదాంతము వీరిని ఎక్కువ ఆకర్షించును. శరీరము సుఖమును కోరును. మనసు త్యాగము, సన్యాసమును స్మరించును. పరోపకారమైన పనులందు, స్వసుఖమును త్యాగము చేయు కార్యములందు పాలు పంచుకొనకపోయిన వీరి మనసుకు శాంతి ఉండదు. మనస్సాక్షి బాగుగా పెరిగియున్నందున నిజాయితీగల జీవితముండును. వీరు గొప్పగా కష్టపడేవారు. పలు అరుదైన కార్యములు సాధింపగలిగినవారు. సమాజ సంక్షేమమునకై పాటుపడువారు.

17-వ తేదీన పుట్టినవారు పుట్టుకతో ధనవంతులు కాకపోతే ఎట్లయినా ఆస్థితిని అందుకొనుటకు ప్రయత్నిస్తారు. పేరు సంఖ్య అనుకూలమైనదిగా కుదిరితే మితిలేని ఐశ్వర్యమును చేర్చి అన్ని విధముల సుఖములను అనుభవిస్తారు. శరీర సుఖమును వీరి మనసు ఎడతెగక వాంఛించును. పెద్ద మొత్తమున ధనము చేర్చు పథకములు తయారు చేయుచునే ఉందురు. సుఖమునందు మనసు చిక్కుకొన్నందున న్యాయమైన మార్గమున డబ్బు దొరకనిచో, మోసము చేసిన దానిని సంపాదించి చేర్చుదురు. (జనుల ధనమును తమది గావించుకొన్న అనేకులు ఒప్పుకొనిన

మీదటనే ఇది చెప్పుచున్నాను). రాజులవలె చూపించుకొనదలచి డబ్బు ఖర్చు పెట్టినను, మనసొప్పి తన సుఖము కొరకు కూడ ఖర్చు చేయ వెనుదీయుదురు. పిసినారితనము ఉండును. విధి సంఖ్య 5, 9గా ఉండిన మనసుకు తోచినట్లు ఆలోచనలేక ఖర్చుపెడతారు. ఈ సంఖ్య ఎడతెగని ప్రయత్నమును, ఏ కష్టము వచ్చినను భయపడక ముందుకు పోవుటను, ఆధ్యాత్మిక జీవనములో గాని, మరణమునకు తర్వాత కూడా గాని తగ్గని కీర్తియందు దృష్టి ఉంచుకొని దానికి ప్రయత్నించుటను సూచించును.

26-న జన్మించినవారు 8, 17 తేదీల వారికన్న దురదృష్టవంతులు అని చెప్పవలసియున్నది. వీరిలో అధిక శాతమువారు 17 సంవత్సరాలు వచ్చు సరికి తల్లిదండ్రులలో ఒకరినో లేక ఇద్దరినో కోల్పోవుచున్నారు. (అతి కొద్దిమందికే 17 యేండ్ల తరువాత కూడా తల్లిదండ్రులు బ్రతికి ఉన్నారు). చిన్న తనములోనే కష్టములు, అభివృద్ధికి ఆటంకములును ఏర్పడుచున్నవి. అభివృద్ధిలో అభిలాష కలవారగుటచే కష్టములను సహించి మిక్కిలి ప్రయాసతో, ఎట్లో ఒక విధముగ జీవితమును మొదలిడుచున్నారు. ఇతరుల వలన అపవాదుల, కష్టములకు గురియగుట సహజమే. లెక్కలేనంత మందిని విరోధులు గావించుకొందురు. కల్పనాశక్తి, హాస్యము, పదునైన బుద్ధి వీరికి ఉండును. చిన్నవయసులో కష్టములును, సుఖపడలేని వృద్ధాప్యములో సంపద, కీర్తియు కలుగును. (ఈ 8, 17, 26 వారికి విధి సంఖ్య, పేరు సంఖ్యలను అనుసరించే ఫలితములు కల్గును).

ఈ సంఖ్యలలో (8, 17, 26) జన్మించినవారు అందరూ పేద కుటుంబములలోనే పుట్టుదురని పాఠకులు తలచరాదు. అమిత ఐశ్వర్యవంతుల ఇంటను వీరు జన్మింతురు. అట్టి పరిసరములలో పుట్టి పెరిగినా తన చుట్టూవారందరునూ కోలాహలముగా ఉండగా, వీరు మాత్రము ఎవరితోను కలవక గుండెల్లో గుబులుతో, తన్ను గురించి మాత్రమే తలచుకొంటూ ఒదిగి ఉంటారు. ధనవంతులుగా జన్మించు వీరు తమ చుట్టూ ఉన్న వారందరి కొరకు ధారాళముగా ఖర్చుపెట్టి ఆనంద పరుస్తారు. తక్కినవారితో తమను కలుపుకొనక పోవుటయే వీరిలోని లోపము. మిత్రులు వీరిని తమతో కలుపుకొని, వీరి సంకోచమును వదిలించిన, తమ సునిశిత బుద్ధితో, మంచి

తలంపులతో, వీరు అందరినీ జయించి ప్రతిష్ట సంపాదించెదరు.

## నామ సంఖ్య-ఎనిమిది

పేరులోని అక్షరముల అంకెలను కూడితే 8 సంఖ్య వచ్చిన ఈ సంఖ్య వారగుదురు. విడివిడిగా 8 సంఖ్యల ఫలితములు తెలిసికొనుటకు ముందు కొన్ని అంశములను వివరించెదను.

పుట్టినతేది, విధి సంఖ్య ఇవి రెండును అదృష్టకరమైనవిగా ఉన్న, 8 సంఖ్యలో వచ్చు పేరు అదృష్టమును తగ్గించుటతో ఆగును. ఏ పనిలో జొరబడినను ఆలస్యము కలుగును. (శనికి మంద గమనుడని ఒక పేరు కలదు). ఈ సంఖ్య పేరులో ఉండువారికి సగటు తృప్తినిచ్చు సుఖ జీవితము ఎన్నటికీ దొరకదు. జీవితము పేదరికము, కష్టములు, ఓటమి నిండినదిగా ఉండును. లేక ధనము, పరపతి, గొప్ప అధికారము కలిగి జయముపై జయము పొందుతూ ఉందురు. ఉన్నత పదవులు వహించునపుడును (చూచువారికి అదృష్టశాలి అనిపించును). అనుకోని విరోధము, చిక్కులు, గుబులు పుట్టించు బాధ్యతలు కలిగి సుఖపడనీయవు. (శని వీరిని ఇతరులకు దుఃఖము ఇచ్చుటకు, దండించుటకు వాడుకొని వీరి అంతస్థుని పెంచును. ప్రతినిత్యము నలభై మందికైనా శిక్షలు వేయు మాజిస్ట్రేటు మున్నగువారిని ఈ పేరులో చూడవచ్చును). వ్యాధియో, వేరు విచారములో వీరిని వేధింపుచునే ఉండున. ఏదైనా ఒక పెద్దకొరతలేక వీరుండలేరు. కొందరు వివాహమే వద్దని ఉంటారు. మరికొందరు వివాహము చేసికొని అవస్థపడతారు. ఇంక ఎన్ని విధములో! కనుక మీరుగాని మీకు తెలిసినవారుగాని యీసంఖ్యలో పేరున్నట్లయితే మొదటిపనిగా దానిని మార్చుకొనుట మంచిది. ఇల్లు, వ్యాపార స్థలములకు కూడా ఈ సంఖ్య లేకుండా చూసుకొనవలెను.

8 - ఈ సంఖ్య పేరుగా కలవారు ధార్మిక జీవనములో అభివృద్ధి సాధిస్తారు. కోరికలకు సులభముగా వశమవక జయము ఆలస్యమగుచునే ఉండును. పెద్ద పోరాటమునకు పిదపనే జయము కలుగును. అనుకోని ఆపదలు, కష్టములు కలుగును.

17 - పేరు ఈ సంఖ్యగా ఉంటే అసుర గుణములు వచ్చును. పూర్తిగా శుక్ర

ఆధిక్యమువలె తోచుటచే కొన్ని ప్రాచీన గ్రంధములలో దీనిని శుక్రునికి చెందినదనే వర్ణించియున్నారు.

(జ్యోతిషము తెలిసినవారికి, శుక్రుని స్థానమైన తులారాశిలో శని ఉచ్ఛస్థితిలో ఉండుట తెలియును). కాని ఇది శని పూర్తి బలముతో ఉండుటనే తెలుపుచున్నది. ఈ సంఖ్యను పేరుగా కలిగినవారు పలురకములైన కష్టములకు, పరీక్షలకు గురియవుతారు. అయినా మళ్ళీ మళ్ళీ అలుపులేక పోరాడుతారు. (చిందిన ప్రతి రక్తపు బిందువు నుండి వేలాది రాక్షసులు పుట్టుకువచ్చినదిగా చదివి ఉందురు). ఓటమిని అలక్ష్యము చేసి మరల యుద్ధమునకు సిద్ధమగుట వీరికే చెల్లును. చివరలో అన్ని ఆటంకములును గెలిచి అమిత శక్తిమంతునిగా జీవించెదరు. ఈ సంఖ్య సిద్ధులనివ్వగలిగినది. అమితమైన ఐశ్వర్యము, కాలగతిలో మరుగుపడని కీర్తి కల్గును. లోక ప్రసిద్ధమైన పనులను చేసెదరు. తమ లక్ష్యసాధనకై ప్రాణమును, దేహమును కొంచెమైనా లెక్కజేయక శ్రమించి విజయమును పొందుతారు. ప్రపంచము వీరిని మరువలేదు.

26 - ఈసంఖ్య వృద్ధాప్యమున పేదరికమును, ఫలించని వ్యర్థ ప్రయత్నములను సూచించుచున్నది. మిత్రుల వలన, భాగస్తుల వలన పెద్ద నష్టములు కలుగును. అన్ని ప్రయత్నములందును ఓటమియే మిగులును. అస్పష్టత, ఓటమిలను సూచించును. ఈ సంఖ్య ఆయువును కూడా తగ్గించుచున్నది. హత్య గావించునంత విరోధులు ఏర్పడుతారు. ఆదర్శవాదిగా ప్రారంభించి పిదప ఆదర్శములను గాలికి వదలి, ధనము కొరకు, పదవి కొరకు శ్రమపడవలసి వచ్చును. (అయినా 8 సంఖ్య గుణము ప్రకారము ఆఖరు దినములలో కొంత యోగము కలుగును).

35 - ఇది చూపులకు అదృష్టమైనదిగనే కనపడును. వాటాదారులవల్లనూ, మిత్రులవల్లనూ గొప్ప నష్టములు కలుగును. ప్రముఖులయి సంపదను కోల్పోవుదురు. **అనుకోని విపత్తులు కలుగ గలవు**. చెడు దోవలలో ధనము ఆర్జించుటకు సహాయపడును. మిత్రులను పగచేసుకొందురు. దృఢచిత్తముండదు. ఖర్చులను కట్టుదిట్టము చేయలేరు. ఈ సంఖ్య తీరని కడుపు నొప్పిని ఇచ్చును. (గుండె జబ్బులు కలవారికి ఈ సంఖ్య నయము చేయును. పెద్దయెత్తున వ్యాపారములలో దిగునపుడు

జాగ్రత్త వహింపవలెను).

44 - సులభముగా ధనము సంపాదింప ఈ సంఖ్య సహాయపడును. జనాదరణతో సినిమా థియేటరు, ప్రింటింగ్ ప్రెస్, నేలబొగ్గు, ఇనుము, కుర్చీ, బల్ల వంటి నాలుగుకాళ్ళ వస్తువులు, రంగులు వేయుట, ఆటవస్తువులు, పందెములు, పందెముల తయారీ మొదలైన వానివలన ఎక్కువ సంపద చేరును. బాడుగకు పనిచేయు బస్సు, లారీ, అద్దె కారులు, మున్నగువానితో వ్యాపారము ఆదాయము ఇచ్చును. బ్యాంకులు నడుపవచ్చును. వృత్తి ఎన్నడో ఒకనాడు మూతపడుట తప్పదు. యజమానికి మాత్రము లాభమే. అగ్నివలన ప్రమాదము కలదు. కట్టడములు కూలి ప్రాణాపాయము కలుగును. **ప్రభుత్వ విరోధము, చెరసాల వాసము తప్పవు**. మనసు చెడు తోవలలో పోవును. చెరసాల బయట సుఖజీవనము గలదు. చెర లేకపోయినా రోగము పీడించును.

53 - ఈ సంఖ్య వారు ప్రారంభముననే జయాపజయములను అనుభవించెదరు. వయసు పెరుగుకొలదీ నిదానమేర్పడును. ప్రబలమైన జీవితమును కలుగును. తెలివైనవారే ఐనను అంతకు మించిన చిక్కులలో పడుదురు అపజయమును జయముగా మార్చుకొను సమర్థత గల వీరు మంచి పనులను చేసి పొగడ్తలను అందుకొందురు. (ఇది నిశ్చితమైన సంఖ్య కాదు. పుట్టినతేది వగైరాలు బాగుగా ఉన్ననే మంచి ఫలితములు ఇచ్చుచున్నది.) వృద్ధాప్యములో యోగము కలదు.

62 - ఈ సంఖ్య మిక్కిలి కీర్తిని, గొప్ప జయములను, సుఖ జీవితమును తెచ్చును. పెద్ద ఆపదలు, అపజయములు మధ్య మధ్య కనబడును. గొప్ప విరోధములు, బంధువుల మధ్య మనస్పర్థలు తెచ్చును. సంసారములో సుఖము ఉండదు. బుద్ధి తీక్షణముగా ఉండును. ఇతరులు మోసపోవునంత ఆకర్షణ ఉండును. విరోధులు కూడా వశమవుతారు.

71 - ఈ సంఖ్య జీవిత ప్రారంభమున పలువిధములైన ఆటంకముల ఏర్పరచినను, తరువాత విజయమును, సంపదను ఇచ్చును. పలువురకు బుద్ధి చెప్పు విజ్ఞులవుతారు. అదృష్టకరమైనదని భావింపవచ్చును.

80 - ఈ సంఖ్య మిక్కిలి సూక్ష్మమైన శక్తులు కలది. జీవితమును గొప్ప ఆపదలు మట్టుపెట్టవచ్చును. (పుట్టినతేది సంఖ్యలు మంచివిగా లేనిచో) తత్వశోధన చేయువారైన ఎడల తత్వములను జయించు శక్తి కలుగును. ప్రకృతి వీరియెడల సహాయకారిగా ఉండును. జీవితము ఆపదలచే చుట్టుముట్టబడినను, భయము గొల్పునదిగా ఉండినను సుఖముగనే జరుగును. అద్భుతములు నిండిన జీవితమగును. దీనిని అదృష్టకరమైనదని భావించవచ్చును.

89 - సత్ఫలితములను సూచించు ఈ సంఖ్య యు జీవిత ప్రారంభములో కష్టములనిచ్చును. పరోపకారచింతన ఎక్కువగా ఉండును. అమితముగా సంపదలు చేరును. భూమి, ఇండ్లు, ఆభరణములు అధికముగా ఉండును. పురుషులైన వీరిని స్త్రీలు అమితముగా ఇష్టపడుదురు. స్త్రీ లైనచో, తోటివారు మిక్కిలి గౌరవింతురు. అందము ఐశ్వర్యము కలిసి ఉండును. తీవ్రమైన మాటలు చేతలు ఉండును. భయములేని బ్రతుకుగా ఉండును. ప్రారంభములో అగ్ని వలన విపత్తులు ఏర్పడగలవు.

98- 71 సంఖ్య వారి వలెనే ఈ సంఖ్యవారును విజ్ఞులుగా ఉందురు. దిగులు నిండిన జీవితము, ఎదురుచూపులు ఉండును. తెలివి ఉండియు ప్రకాశించరు, కష్టములును, తీరని వ్యాధులును కలుగును.

107 - ఈ సంఖ్య ప్రసిద్ధిని, విజయమును ఇచ్చును. స్త్రీలవలన చిక్కులు కలుగును. (స్త్రీ లైన పురుషులవల్ల చిక్కులుండును). సంపద ఉండినను సుఖముండును. పరపతి కలుగును.

## అదృష్టకాలము

8, 17, 26 తేదీలలో పుట్టినవారు, పేరు విధి సంఖ్యకు తగినట్లు పెట్టుకొని ఆ సంఖ్యకు గల అదృష్టదినములందే అన్ని కార్యములను చేయుచుండిన మంచిది. అట్లు చేయుట వలన ఆ సంఖ్య బలము పెరిగి శనియొక్క ప్రభావము తగ్గును. ఇదిగాక వీరికి అదృష్టదినములు 1, 10, 19, 28 తేదీలు, తేది, నెల, సంవత్సరం కూడిన 1 వచ్చు దినములు.

4, 13, 22, 31 సాధకమైన ఫలితములనే ఇచ్చును. (అనుకోని మార్పులు, సంఘటనలు 4 సంఖ్య ఆధిక్యతలో కలుగును).9, 18, 27 తేదీలు కూడ మేలు చేయును. ప్రోత్సాహమిచ్చు 9 సంఖ్య ఆధిక్యత వీరికి మంచినే కలిగించున

## దురదృష్ట దినములు

8, 17, 26 తేదీలు వ్యర్థముగా వ్యవహారముల నేర్పరచి, కీడును కలిగించును. ప్రయాణములు మున్నగునవి ఈ దినములలో చేసిన అనారోగ్యమును, అపజయమును వదలవు. తేది, నెల, సంవత్సరము కలిపితే 8 వచ్చు దినములు కూడ వీరికి దురదృష్టకరమైనవే అని గమనించవలెను

## వృత్తులు

పుట్టినతేది సంఖ్య 8 గా ఉన్నచో ఇతరులకు గొప్ప విషయములను బోధించుట మూలముననను, శనికి ప్రత్యేకింపబడిన వృత్తియైన, జనులను ఒకచోటినుండి మరియొక చోటికి తరలించు, బస్సు వంటి సాధనములవల్లను, లారీ కంపెనీలు నడుపుటచేతను, గనుల ద్వారాను అమితమైన ఐశ్వర్యము కలుగును. గనులలో ఉండు ధాతువులు, ఉన్ని బట్టలు, ఇనుప వస్తువులు, ఆయుధములు, మురికిని తీయు సబ్బులు, నూనె మిల్లులు, నూనే వస్తువులు, ప్రింటింగ్ ప్రెస్లు, వీటి వలనను సులభముగా ధనము సంపాదింపవచ్చును. మంచి నిర్వహణాశక్తి కలవారగుటచే పెద్ద సంస్థలను చక్కగా నిర్వహిస్తారు. (17వ తేదిన పుట్టినవారు ఆర్థికశాస్త్ర మునందు నిపుణులగుదురు). న్యాయము నిర్ణయించు ఉద్యోగములందు ప్రకాశింతురు. పెద్ద జైలు అధికారులు కాగలరు. పుట్టినతేదిగాని, పేరుగాని 8 అయిన మిక్కిలి బాధ్యతతో రాజ్యమును కూడా ఏలవలసి వచ్చును.

## వాణిజ్యమునకు

1, 4, 5, 6 వారిని వ్యాపారములో చేర్చుకొనవచ్చును.

## సహాయపడువారు

8 సంఖ్య వారికి 1, 4, 8 సంఖ్యలవారే సహాయపడగలరు.

## సంసార జీవితము

8 తేదీలలో జన్మించినవారు, 1 గాని 4 తేదీల వారిని వివాహమాడవలెను. వీరికి 8, 4, 1 వారి ఎడనే ప్రేమ కలుగును. వీరు 2, 7, 9 తేదీలవారిని వివాహమాడరాదు.6 సంఖ్య వారిని చేసుకోవచ్చు. వీరికి కుటుంబ జీవితము సుఖమయమైనదిగా ఉండదు. అయినా మంచి తేదీలలో వివాహము చేసికొనిన వచ్చువారి సంఖ్యాబలము వలన సమస్యలు తగ్గును. వివాహ తేదీలు ఈ విధముగా నిర్ణయించాలి.

| **కాబోవు భార్య/భర్త సంఖ్య** | **వివాహ తేది& తేది, నెల, సంవత్సరము సంఖ్య** |
| --- | --- |
| 1, 4 | 1 & 1, 4 & 1 |
| 8 | 1 & 1, 6 & 1, 1 & 6 |
| 6 | 6 & 1, 1 & 6 |

రంగు

పసువు రంగు వీరికి శోభించును. ముదురు పచ్చయు, నీలమును మేలు చేయునవియే. విడిగా ఉండునపుడు నీలము ధరింపవచ్చును. ఇతరులతో కలసి ఉండునపుడు పసుపే ఉపయోగించాలి.

ధరింపరానివి

నలుపు, వక్కరంగు, తక్కిన ప్రకాశములేని ముదురు రంగులు, ఎఱుపు ఇవి కొంచెముకూడా పనికిరావు.

రత్నము

దోషములేని మంచి లక్షణములు గల జాతి నీలము ధరించిన మంచి అదృష్టము కలుగును. ఆరు సూత్రములు గల నీలములు వీరికి మిక్కిలి తగినవి. (17 వ తేది జన్మించినవారికి మిక్కిలి అదృష్టము ఇచ్చునవి). ధనవంతులయినచో దొరికితే

ఇంద్రనీలము ధరింపవచ్చును. (దేవియొక్క శరీరచ్ఛాయను, అందమును వర్ణించుటకు ఉపయోగపడు ఈ ఇంద్రనీలములు ప్రస్తుత కాలమున అరుదుగా కనపడుచున్నవి). ఈ ఇంద్రనీలం వలన సుఖమయ జీవితం, అభ్యుదయం, మంచి ఆరోగ్య ము, భూసంపద, ఆస్థులు, ఉన్నతమయిన స్థానము లభించును.

**8** సంఖ్యను సూచించు అక్షరములు**,** వాని ఫలితములు

F - ఈ అక్షరము పేరులో ఉన్న తెగించి ఎదురించు స్వభావము కలుగును. తన పనినే సాధించుటకును, తన అభిప్రాయములనే ఇతరులపై రుద్దుటకును సమర్థత కల్గును. వదలని పట్టుదలయు, నిర్వహణశక్తియు ఏర్పడును. వీరు మిత్రులపట్ల గాఢ విశ్వాసము కలిగియుందురు. నిశ్చిత అభిప్రాయములు కలిగియుందురు. ఎక్కువ మాటలు లేక తన కార్యమందే దృష్టిని నిలిపియుందురు. అపజయమేర్పడిన వెంటనే తాను ఓడిపోలేదని నిరూపించుకుంటారు. జయమునందు తిరుగులేని నమ్మకము గల వీరికి శరీరబలము, మనోబలము, భావములును ఎన్నటికినీ తగ్గవు. దృఢశరీరులై చిరకాలము జీవించెదరు. దీని రంగు నలుపు. కాని ఇందు తరచుగా కన్పించునది పసుపు వర్ణ ప్రకాశమే. ఇది దైవకృపను, నమ్మకమును సూచించు శబ్దమని విపులీకరింపుచున్నది.

P- నిగనిగలాడు నలుపురంగు కలిగిన ఈ అక్షరము వేదాంతిని, గొప్ప దానశీలురని సూచించును. మితిలేని రసికత్వమును, ఖర్చును ఉండును. వీరికి వృద్ధియు, కీర్తియు నోటి వల్లనే కలుగును. (నోరు అనుటచే పాట అని కూడా తీసుకొనవచ్చును). మాటలు బ్రహ్మాండముగా ఉండును. మాటలలో కనపడు భావావేశము శ్రోతలకు వీరి భావమును స్పష్టము చేయును. "మనసులో సత్యము ప్రకాశించిన మాటలలో ఆ ప్రకాశము ప్రతిఫలించును" అను తమిళ కవి సుబ్రహ్మాణ్య భారతి మాట వీరికి తగును. కల్పనలు స్వంతముగా మనసున తోచును. ఈ అక్షరము పేరులో ఉండుటచే ఆకర్షకరమైన అందమైన రూపము కలుగును. నిర్వహణా శక్తియు అధికమగును. "భ"కారం భయం నాస్తి" అని కాళిదాసు అన్నది భయమన్ననేమో తెలియనివీరికే పూర్తిగా వర్తించును. అధికముగా భోగములలో మునిగి తేలినచో జీవశక్తి తగ్గి రోగములు కలుగ గలవు.

**గమనిక:**- అధిక ఫలితము పొందుటకు పేరులో F మరియు P అను అక్షరము

మొదటి అక్షరముగా రావలెను.

పేరు మార్చుకొనుటకు

పుట్టినతేది 8 అయిన విధి సంఖ్యకు సాధకమైన పేరు పెట్టవచ్చును. రెండును 8 సంఖ్య యే అయినచో 5 సంఖ్యలో పేరు నిర్ణయించితే పట్టిన శని వదలును. జీవితములో విజయము కలుగును.

**8** తేదీలో పుట్టిన కొందరు ప్రముఖ వ్యక్తులు

| **పేరు** | **జన్మతేది సంఖ్య** | **తేది-విధి సంఖ్యలు** |
|---|---|---|
| JOHN DAVISON ROCKEFELLER<br>జాన్ డేవిసన్ రాకఫెల్లర్ (ప్రపంచపు అత్యధిక ధనవంతులలో నొకరు. 26వ యేట 8-9-1964 వివాహము చేసికొనిన కొన్ని నెలలకే పెట్రోలియం వ్యాపారం ప్రారంభించారు. స్టాండర్డ్ ఆయిల్ కంపెనీ అధినేత.) | 8-7-1839 | 8 & 9 |
| HARRY S. TRUMAN<br>హేరీ S. ట్రూమాన్ | 8-5-1884 | 8 & 7 |
| SWAMI SIVANANDA<br>స్వామి శివానంద | 8-9-1887 | 8 & 5 |
| GEORGI MALENKOV<br>జార్జి మెలాంకోవ్ (రష్యన్ ప్రధానిగా ఉండి కొద్దికాలానికే పదవి పోగొట్టుకున్న వారు) | 8-1-1902 | 8 & 3 |
| | | |

| | | |
|---|---|---|
| BENJAMIN FRANKLIN<br>బెంజమిన్ ఫ్రాంక్లిన్ (చిన్నప్పుడే ఇల్లు వదలిపోయి స్వయంకృషితో పైకి వచ్చిన అమెరికన్ శాస్త్రజ్ఞుడు) | 17-1-1706 | 8 & 5 |
| SIRIMAVO BHANDARANAIKE<br>సిరిమావో బండారు నాయకే | 17-4-1916 | 8 & 2 |
| ST. BERNADOTTE<br>సెయింట్ బెర్నాడెట్ (మేరీ మాత ఆశీస్సులు పొందినది. మతగురువులు ఈ బాలికకు మేరీమాత దర్శనం అయిందన్న నిజాన్ని జీర్ణించుకోలేక అనేక కష్టాలకు గురిచేస్తారు.) | 26-1-1764 | 8 & 9 |
| VICTOR (MARIE HUGO)<br>విక్టర్ మేరీ హ్యూగో | 26-2-1802 | 8 & 3 |
| ISHWAR CHANDRA VIDYASAGAR<br>ఈశ్వర చంద్ర విద్యాసాగర్ | 26-9-1820 | 8 & 1 |
| GEORGE BERNARD SHAW<br>జార్జి బెర్నాడ్ షా | 26-7-1856 | 8 & 8 |
| SIR BENAGAL NARSINGA RAO<br>సర్ బెనగల్ నర్సింగరావు | 26-2-1887 | 8 & 7 |
| PARAMHAMSA YOGANANDA | 26-3- | 8 & 4 |

| | | |
|---|---|---|
| పరమహంస యోగానంద (అమెరికాలో క్రియా యోగ - ప్రచారము చేసి అనేక మంది శిష్యులను పొందినవారు.) | 1892 | |

## అంకె 9 - కుజుడు

ఇప్పటివరకూ చూచిన ఎనిమిది రకములయిన మానవులకు ఇండ్లు కట్టించి ఇచ్చి, భూమిని బాగుచేసి, తక్కిన జీవతావసర వసతులు ఏర్పరచి, ఒకరికొకరితో సమరసముగా జీవించుడని సలహానివ్వదగిన 9 సంఖ్య వారిని గమనించెదము. ఇంజనీర్లుగా ఉండి గొప్ప కట్టడములు కట్టి ఇప్పించువారు వీరే. కట్టడములకు నిప్పు బెట్టి తగులబెట్టువారు, బాంబులు పడవేసి కూల్చు నట్టి యుద్ధవీరులు వీరే.

దైవకృప కలిగినట్టి శ్రీ సుబ్రహ్మణ్య భారతి శక్తి మాతను వర్ణించి ఇట్లు పాడుచున్నారు:

**ఓంశక్తి ఓంశక్తి ఓం పరాశక్తి**

**ఓం శక్తి ఓం శక్తి ఓం**

**పరాశక్తి పరాక్రమం వర్ణనాతీతం**

**శక్తిధాత్రి పరాశక్తి వర్ధిల్లు జననీ.... ||ఓం శక్తి ||**

**గణపతి దేవుని చరణం శరణం నిరంతరం ||ఓం శక్తి ||**

**సర్వ జయాలకు మూలం ఆనంద నిలయం**

**తారక మర్ధన స్కంధుని శౌర్యం ప్రశంసనీయం ||ఓం శక్తి ||**

**విరోధులారా! పైదొలగండి వస్తోంది స్కంధుని శూలం**

ఇలా సంక్షిప్తంగా, వర్ణన కందని శక్తి ప్రభావమును చెప్పిన పిమ్మట అది ఎట్లు క్రియాశక్తిగా పరిణమించుచున్నదో తెలిపి, తరువాత అదియే ఎట్లు సంహారశక్తిగా మారుతున్నది అనుదానిని శక్తి కుమారులైన గణపతి, కుమారస్వామి స్వభావముల మూలముగా వివరించుచున్నారు.

సర్వజగత్తులోను లోపల, బయట నిండియున్న శ్వేతవర్ణమైన విశేషమైన

తత్త్వమును శివమనియు, దాని చలనము నుండి జనించిన అరుణ వర్ణమును శక్తిగను ఆ శివ శక్తుల పుత్రులయిన శ్రీ గణపతి, శ్రీ సుబ్రహ్మణ్య స్వామియు మెరపువలె కనపడి మరగయ్యే ఆ శక్తిని, స్థిరమైన ప్రకాశముగా స్థాపించువారును, అదే శక్తిని నిప్పు కణికలుగా చేసి దౌష్టమును మాపుటకు ప్రయోగించుటను క్రమముగా తెలుపుచున్నారు.

**శక్తి :** 5 సంఖ్య కలది. సృజనశక్తి గణపతి 4 సంఖ్య. ఇది 1కి సహాయమునకు కలది. సంహారశక్తి - సుబ్రహ్మణ్యస్వామి : 9 సంఖ్య - 5 కు తోడుగ కలది.

ఇలా వివరిస్తూపోతే మరియొక తత్వశాస్త్ర మగును.

కుజునిచే పాలింపబడు ఈ సంఖ్య అవినాశమయినది. ఎలా అని చూద్దాం. గణితమును ఆదిలో కనిపెట్టినపుడు పూర్వీకులు ముందు చేతివేళ్ళను లెక్కించి చూచినారు. దీనివలన 10 కన్న ఎక్కువ లెక్కింపలేకపోయారు. లెక్కించుటకు, అక్షరములను కనిపెట్టినపుడే మరల మరల పెద్ద సంఖ్యలను లెక్కించునపుడు ఆఖరు సంఖ్యగా దేనిని తీసికొనుట అని పరిశీలించారు. కూడికలకు, పెద్ద కూడికలయిన హెచ్చవేతలకు తగినట్లుగా 9 ఉండుటను గమనించినారు. అనగా 9 అంకెతో దేనిని కూడినను, అలా కూడిన అంకె మారక అట్లే ఉండును. ఉదాహరణకు 9తో 7 ను కూడి చూచెదము. 16 అనగా 1+6=7 కూడబడిన 7 అట్లే మరల వచ్చినది. అనగా కూడబడిన అంకె మార్పు చెందలేదు.

ఈ గుణము 9కి తప్ప వేరు ఏ అంకెకును లేదు. 9ని ఎన్నిమారులు కూడినను, హెచ్చవేసినను వేరు అంకెగా మారక 9గనే మిగులును. ఉదాహరణకు - 9x5=45 = 4+5=9 ఆధార అంకెకు కావలసినది ఈ గుణములే.

కట్టడమునకు పునాదులు లేపు నపుడు ఆ పునాదులు, పైన కట్టబడు భవనము కూలకుండా ఉండును. దానితో బాటు తను కూలరాదనే కదా గట్టిగా లేపుచున్నాము. ఇక ఇంత గొప్పదైన 9 సంఖ్యలో జన్మించిన మనుష్యులను గమనించుదాము.

9, 18, 27 తేదీలలో పుట్టినవారందరు ఈ సంఖ్యాధిక్యము క్రిందనే వచ్చుచున్నారు. తేది, నెల, సంవత్సరము కూడిన 9గా వచ్చువారి జీవితమును యీ ఆధిక్యములో

ఉండునదే. 9 వారి జన్మతేది సంఖ్య యొక్క గుణములను తీవ్రతరము చేసి ఆ సంఖ్య నివ్వగలిగిన ఫలములను ఈ జన్మలోనే ఇచ్చునట్లు చేయును. ఇది వారికి ఫలప్రాప్తి నిచ్చు సంఖ్య అగును.

## 9 సంఖ్యలో పుట్టినవారి గుణాతిశయములు

వీరు పోరాడుటకే జన్మించినవారు. జీవితము మొత్తము పోరాటములు నిండినదిగనే ఉండును. వీరిలో తెలివిగలవారు మానసిక పోరాటములే ఎదుర్కొందురు. అనగా సాహసము, తంత్రము, మోసము, కపటవాక్కు, సంక్షిప్తముగా చెప్పిన మనసులో ఒకటి, బయట ఒకటిగా ఉందురు. అంత తెలివిలేని రెండవ రకమువారు నోటి తగవులతోనే జీవితమును గడుపుతారు. ఆఖరు వర్గము వారు పోరాటమునే జీవితమును చేసికొని సైన్యములో చేరుదురు. వీరికి మామూలు జగడములతో తృప్తి ఉండదు. రణరంగములు, జానపదములు, ఊర్లు మంటలకాహుతి అగుట వంటి భీతావహ వాతావరణమే వీరికి ఆహ్లాదము కలిగించును. వీరికి శాంతి, సమరసములపై నమ్మకము లేదు. సాధారణముగా వీరిలో అందరికి దేశసేవ చేయవలెనన్న ఉద్దేశ్యము పూర్తిగా ఉండును. దేశము కొరకు దేనినయిననూ త్యాగము చేసి పోరాడుతారు. ఈ సంఖ్యవారిలో సంకుచిత స్వభావము కలవారు కూడా తమ జాతివారికి మేలు చేకూర్చుటలో కృతనిశ్చితులుగా ఉంటారు. వీరు తమ ఇష్ట ప్రకారమే పనులు చెయ్యటానికి ఇష్టపడతారు. ఎవరైనా ఆక్షేపించిన వెంటనే యుద్ధమే. వీరి ఇష్ట ప్రకారము చేయనీయక పరులు ఆటంకించిన చేతులు దులుపుకొని కోపముతో ఇది నాశనమగుగాక అని పిల్లిశాపములు పెట్టి వెళ్ళుదురు. వీరిలో తెలివిగలవారు ఎల్లప్పుడూ శతృవు యొక్క బలమును అంచనా వేస్తూనే ఉంటారు. దాని అనుసరించి నిర్ణయములు తీసుకొనుటచేతనే వీరు గొప్ప రాజతంత్ర ధురీణులుగా పేరు పొందుచున్నారు. వీరు యుద్ధమున లాభమా, సమరసమున లాభమా అనునది తరచి చూచియే ఉచితమైన నిర్ణయము తీసుకొంటారు. (ఇట్టి సమయములందే ప్రజలు వీరిని శాంతి ప్రియులనియు, కోపమే లేని శాంతస్వభావవులని, పిరికివారని తలచి తప్పటడుగు వేయుచున్నారు). ఒంటికాలిపై జపము చేయు కొంగవలె వీరు సందర్భమునకై, సమయము ఆసన్నమగు వరకు ఓపికగా కాచుకుని ఉంటారు.

యుద్ధమున ఓడిపోవునట్లనిపించిన వెంటనే శాంతి సమాధానములకు దిగుతారు. శాంతిప్రియులుగా కనపడుతారు. ఒడంబడికలు తమకు సాధకమగునట్లే చేసుకుంటారు. సంఖ్య బలము తగ్గిన పైన చెప్పిన గుణములు ఉండవు. కోపము, అసూయ ఎక్కువగా ఉండును. యుద్ధమున మరణింతురు. మొరటుతనము వలన కీడు కలుగును. ఆధిక్యత సరిగా ఉన్నచో పదునైన బుద్ధియు, సర్దుకుపోవు గుణమును కలుగును. బలము తగ్గినచో చెడు గుణములు, మొండి పట్టుదలయు కనబడును. చిన్న విషయములకు కూడా ప్రాణమును పణముగా పెట్టుదురు. తెలివి గలవారు శత్రువును చంపక వదలుదురు. కాని వారు చంపక వదలరు. వీరిలో తెలివైన వారిని కనిపెట్టుట ఎట్లు అని పాఠకులు అడగవచ్చును. గమనించి చూడండి. వీరిలో తెలివైనవారు ఇతరులు మాట్లాడునపుడు మధ్యలో ఆపక పూర్తిగా వింటారు. వారిని వ్యతిరేకించినను ఓపికగా శత్రువును అర్థం చేసుకొనే ప్రయత్నం చేస్తారు. మనసులోనే వారిని పడగొట్టుకు ప్రణాళికలను రూపొందిస్తూనే ఉంటారు. ఎంత విన్నను తమ మనసులోనిది గుట్టుగానే ఉంచుకుంటారు. సామర్థ్యము కనబడునే గాని దుడుకుతనము ఉండదు. కాని వీరిలో సామాన్యులు త్వరగా అభిప్రాయములను ప్రకటించుదురు. కోపతాపములను బహిరంగపరచుదురు. నిశితమైన బుద్ధిగల వీరు తీవ్రమైన పరిశోధనలలో మునుగుట జరుగును. వీరిలో మంచి తత్వజ్ఞానులును, విజ్ఞులును సహజముగనే ఉందురు. జన్మసంఖ్య తేదీలలో ఒకటి (జన్మసంఖ్య/విధి సంఖ్య) 9గా ఉన్నను అది మరియొక సంఖ్య యొక్క గుణములను ఎక్కువ చేయును. రెండును 9యైనచో పేరుయొక్క గుణములను తీవ్రము గావించును. వీరికి తరగని ధైర్యము, పోరాడగలశక్తి ఉండుటతోపాటు, జీవితమునకు కావలసిన వస్తువులను కనిపెట్టుటలో ఉత్సాహముండును. వీరికి రసాయనము, వైద్యమువంటి శాస్త్ర ములందు మిక్కిలి అభిమానము ఉండును. ప్రావీణ్యము కలుగును. దైవీక సంబంధములైన రహస్యములను తెలిసికొని వాటి సహాయమున లోకులకు మార్గదర్శకము గావించునది వీరే. వీరి వద్ద కొన్ని అపూర్వశక్తులు కనబడును. ఇటువంటివారు పొగడ్తలను ఆశింపక జనులకు దూరముగనే జీవింతురు.

ఇక వీరి జీవితములను పరిశీలిద్దాం. వీరి జీవితము ముందు చెప్పబడినట్లు పెద్ద

పోరాటమే. ఎన్నో ఆపదలు వచ్చి తొలగును. సత్కార్యములు చేయునపుడు అవి మంచి ఫలితములనే ఒసగి ప్రోత్సహించును. వీరు పరోపకార పనులలో ఉత్సాహము చూపెదరు. అనుభవశాలురని పొగడబడుదురు. వీరి చుట్టును వంచకులు, మోసగాళ్ళు చేరి ఉందురు. ఈసంఖ్యను గూర్చి ప్రాచీన గ్రంథములు, "తెలివియను దీపమును చేతబట్టుకొని, కాలక్రింది పామును గమనింపక, సెత్తురు మరకలుగల త్రోవలో, ఒంటరిగా పయనించు అనుభవశాలి" అని చెప్పియున్నారు. వీరు దగాకోరులతో కలిసి ఉండవలసి వచ్చును. వీరికి క్రొత్త విధములుగా యుక్తులు తోచును. నిదానమును కోల్పోవక ఉండినచో గెలుపు వీరినే వరించును. వీరిలో అనేకులకు ప్రారంభమున జీవితము కష్టములు నిండినదిగా ఉండును. అపజయమునకు ఎన్నడూ భయపడరు. ఎట్టి కష్టమేర్పడినను సహింపగల శక్తి వీరికి కలదు.

ఈ సంఖ్య బలము తగ్గినవారు బలహీనులయి, ఇతరులకు లోబడి నడచుకొనువారు అగుచున్నారు. ఆధిక్యము ఎక్కువగా ఉండిన ఎల్లప్పుడు హుషారుగా ఉంటారు. సినిమా థియేటరులలో అందరినీ తోసుకుని ముందుకు వెళ్ళి టిక్కెట్లు కొనునది ఇటువంటి వారే. ఎప్పుడూ నవ్వుముఖముతోనే కనబడుతారు. పరులకు ఉత్సాహము కలిగేటట్లు ప్రోత్సాహిస్తారు. డబ్బు సంపాదించుట యిట్టి సమర్థతగల వీరికి ఒక కష్టమా ! వీరు తమ మనసుకు నచ్చినట్లు ఖర్చు కూడ పెడతారు. మంచివారివద్ద మర్యాదతో నడచుకొని వారి వద్ద మంచివాడన్న పేరుకు పాత్రులవుతారు. మనసుకు నచ్చిన స్నేహితుల కొరకు ఎట్టి సహాయమైనా చేస్తారు. మనసుకు నచ్చిన దోవలలో మరో ఆలోచన లేక ధనమును వెచ్చిస్తారు. వీరిలో చెడ్డవారు కలరు. వారు తరగని స్త్రీ మోహము కలిగి, మాదక ద్రవ్యములకు అలవాటుపడి, ఇతరులను హింసించి ఆనందించే వారుగా ఉందురు. వీరి మనసులో మృగలక్షణములే (జంతు ప్రవృత్తి) నిండి ఉండును తన సుఖమే గొప్పదని తలచెదరు. అయినా వీరివద్ద ఒక విశేష గుణము కలదు. పెద్దలెవరైనా వీరిని కరుణతో చూసిన మాత్రమున వీరు భావావేశము చెంది వారి కాళ్ళమీద పడి మంచివారుగా మారెదరు. వీరికి అపూర్వమైన స్వప్నముల మూలమున దైవ కృప లభించును. వీరి మనసును, యుద్ధము గావించిన దేవతా రూపములే ఎక్కువగా ఆకర్షించును. శ్రీరాముడు, కాళిమాత, సుబ్రహ్మణ్యస్వామి,

హనుమంతుడు. దుర్గాదేవి వంటి దేవతలనే వీరు మనసారా పూజిస్తారు.

## శరీర నిర్మాణము

వీరు సామాన్యముగా సగటు ఎత్తు కలవారుగనే ఉందురు. నిశితమైన మనోశక్తులు కలవారు మాత్రము పొడగరులుగా ఉందురు. వీరు దృఢగాత్రులుగ ఉందురు. శరీర పరిశ్రమను ఇష్టపడుతారు. ఇతరులు, సగటు పొడవు గలిగినను, పొట్టివారుగా కనపడుదురు. వీరి శరీరము బలిష్టముగా ఉండును. ఛాతి, భుజములు కండలు తిరిగి ఉండును. వీరిని చూచునపుడు పళని (తమిళనాడులోని సుబ్రహ్మణ్య స్వామి పుణ్య క్షేత్రము) దండాయుధపాణి దైవము గుర్తుకు వచ్చును. కొద్దిగా వ్యాయామము చేసినను వీరి శరీరము పహిల్వాను వలె తయారగును. దంతములు పొడవుగా ఉండి పెద్దవిగా తోచును. (వీరిలో అతి బలిష్టులకు మాత్రమే పళ్ళు చిన్నవిగా ఉండును. నోరు పెద్దదిగా ఉండును. మాట్లాడునపుడు వంకరగా తోచును). ముక్కు పొడవుగాను పెద్దదిగను ఉండును. నిటారుగా, వేగముగా నడచెదరు. తొడలు, ఛాతిభాగము, కడుపు భాగములు బలముగా కనబడుటచే చూపులకు వీరు పరాక్రమశాలురుగా కనపడుదురు.

## వ్యాధి - ఆహారము

కుజుడు మన శరీరములో తల, జననేంద్రియములు, కండరములపై అధికారము కలిగియున్నాడు. వీరి శరీరము ఉష్టమైనదిగనే కనబడును. మూలాధారమునందే ఉష్ణము కలవారగుటచే ఉదరమును ఈ వేడి బాధించును. వీరికి రక్తము వేడివలన బాధింపబడినదిగనే ఉండును. ఆరోగ్యమునకు పడని వస్తువులు తిన్న వెంటనే వీరికి జబ్బు చేయును. 9 సంఖ్యవారు బతికినంతకాలము శరీరమున మచ్చ లేమియు లేకుండా ఉండిరనిన అది ఆశ్చర్యకరమైన విషయమే. వీరికి ఎన్నో తడవులు ఆపరేషన్లు జరుగును. నెత్తురు గడ్డలు, కురుపులు, నెత్తురు విషపూరితమగుట, మొలలు మొదలైనవే వీరికి రాగల రోగములు. కొందరికి జ్వరము కూడా వచ్చును. నిప్పువలన గాయములు, ప్రమాదములు కూడ వీరికి సహజమే..

ఈ సంఖ్యకు బలము అధికమైనచో నెత్తురు గాయముల వల్లనే మరణము సంభవించును. ఆహార విషయమును క్రింద చెప్పబడిన సూచనలు పాటించిన

రోగములు రాకుండా ఉండవచ్చును.

వీరి శరీరమునకు మిక్కిలి మంచి చేయగల ఉల్లిపాయలను విరివిగా ఆహారములో చేర్చుకొనవలయును. వీలైన వెల్లుల్లి కూడా చేర్చుకొనుట మంచిది. (ముఖ్యముగా స్త్రీలు). ఆకుకూరలలో గోంగూర ఒక్కటే వీరికి మేలు చేయునది. సాధ్యమైనంతమటుకు మిరపకాయలు (కారము) తగ్గింపవలెను. అసలు వాడకున్నను మంచిదే. కొద్దిగా మిరియాలు చేర్చుకొనుట మంచిది. అల్లము తరచుగా చేర్చుకొనవలయును. చేమదుంపలు, కంద, బెండకాయలు వీరికి తగిన కూరలు. మాంసాహారము ప్రేవులలో వ్యాధిని కలుగజేయును. సువాసనకోసం మసాలా చేర్చిన ఆహారము అస్సలు తినరాదు. రోగము వచ్చినచో పండ్లనే ఆహారముగా తీసికొన్న వ్యాధి తగ్గుముఖము పట్టి త్వరలోనే ఆరోగ్యవంతులగుదురు. వీరు తలంటి స్నానము క్రమము తప్పక చేయుట మంచిది.

## ప్రత్యేక గుణములు

9 - ఈ అంకెలో పుట్టినవారు అసాధ్యమైన పనులు చేయుటయందాసక్తి కలవారు. నిశితబుద్ధి కలవారు. గొప్ప ఆదర్శములతో ఉండిన జీవితము అభివృద్ధిని గాంచును. అన్ని ఆటంకములను గెలిచి విజయముతో జీవింతురు.

18 - ఈ తేదీన పుట్టినవారికి స్వార్థమును వదలననే మంచి జరుగును. తొందరపడి ఏ వ్యవహారములో ను చిక్కుపడకుండ ఉండవలెను. అందరితోను మనస్తాపములు తెప్పించుదినము గనుక ఇందు పుట్టినవారు కోపమును, పట్టుదలను తగ్గించుకొనుట మంచిది. ప్రేమలో తొందర అపజయమును ఇచ్చును. భావములు మనసును తీవ్రముగ తొలుచుచునే ఉండును.

27 - ఈ తేదీన జన్మించినవారు మంచి పనులతోనే ముడిపడి మంచి ఫలితములనే పొందుతారు. వీరి యోచనలన్నియు నెరవేరును. తెలివియే జయమునిచ్చును. వీరు పైయిద్దరికన్న శాంతమయినవారు. లోతైన ఆలోచనలు, సడలని శ్రమ కలిగినవీరు అన్ని విషయములను తీవ్రముగా పరిశోధింతురు.

## నామ సంఖ్య-తొమ్మిది

పేరులోని అక్షరముల అంకెలను కూడితే వచ్చుసంఖ్య 9 అయినచో వారు ఈ సంఖ్య క్రిందకే వస్తారు. పుట్టిన తేది 9గా ఉండు వారికన్న పేరు 9 సంఖ్యలో ఉండు వారు విజయవంతముగా ఉందురు. ఏలననగా, ఇతర సంఖ్యలలో పుట్టినవారిని ఈ పేరు సంఖ్య (9) చురుకుదనము కలవారుగను, డస్సిపోని, తరగని ఉత్సాహము కలవారుగను, అమిత సామర్థ్యము కలవారిగను చేసి విజయము పొందుటకు సహకరించుచున్నది. ఇక 9 సంఖ్య ఆధిక్యముగల పేర్ల సంఖ్యలను చూద్దాం.

9 - ఇది పేరుకు గల సంఖ్య యైనచో తెలివిని, క్రియాశక్తిని సూచించును. బహుదూర ప్రయాణములను, పరిస్థితులను ఎదిరించి పోరాడుటను, చివరలో గెలుపును సూచించును. వ్యతిరేకతలను దాటిన వెనుక విజయము వరించి చిరకాలము సుఖముగా జీవించెదరు.

18 - దైవకృప తగ్గిపోవుటను సూచించు యీ సంఖ్య కష్టములను, కార్యములందు వ్యర్థమైన ఆలస్యమును, మోసములను, ప్రమాదకరమైన శత్రువులను తయారు చేయును. దీనిచే సంఘవిద్రోహులుగా స్వార్థపూరితులుగా ఈ సంఖ్యవారు తయారగుచున్నారు. మనసుకు తెలిసియే చెడు కార్యములను చేయుట జరుగును. స్వార్థమే పెరుగును. దైవకృప, శాంతిలేని పాపభూయిష్టమైన జీవితమేర్పడును. ఈ సంఖ్య ఆశలు పెరిగి, దైవత్వమును నశింపచేయుటను సూచించుచున్నది. ఆశలు తీరును. దైవత్వము నశించును. (భారత యుద్ధము 18 దినములు జరిగినది. 18 అక్షౌహిణుల సైన్యములు యుద్ధము గావించినవి. ఈ దాయాదుల పోరులో పాండవులకు బంధుమిత్రులను, పెద్దలను, గురువులను చంపవలసి వచ్చినది. 18 అధ్యాయములు కలిగిన భగవద్గీత గొప్ప గ్రంథమే అయినను అప్పుడు యుద్ధమునకు కారణం అయినది.) అసూయ, వంచన, అగ్నివలన, ఆయుధములచే ఆపదలను సూచించు ఈ సంఖ్య వర్జింపతగినది.

27 - ఈ సంఖ్య స్పష్టమైన తెలివిని, ఎడతెగని కృషిని, సంపద వృద్ధి చెందుటను, పరపతిని, అధికార పదవులను సూచించుచున్నది. (యూనిఫారం ధరించు పోలీసు, సైన్యము మున్నగువానిలో చేరినచో ఈ సంఖ్యవారు ఉచ్ఛస్థానమును ఆక్రమింతురు. ఇంతకుముందు చెప్పబడిన 24-వలెనే వీరి అదృష్టమును). ఏ వృత్తిలో ఉన్నను

నిపుణులుగా గౌరవింపబడుతారు. పరోపకారమైన పనులలో సంబంధముండును. మంచి ఫలితములనిచ్చు పనులయందే వీరు దిగుతారు. మంచి అదృష్టకరమైన సంఖ్యయే. ఆధ్యాత్మిక లాభము, మంత్ర సిద్ధియు తప్పక కలుగును.

36 - ఈ సంఖ్య అతి సామాన్యులను కూడా ప్రసిద్ధులుగను, ధనవంతులుగను చేయగలిగినది. పుట్టినస్థలమునుండి దూరముగా పోయిననే వీరు ప్రకాశింపుచున్నారు. ఎన్నో ప్రయాణములు చేయవలసివచ్చును. ఉన్నత పదవియును లభించును. చూపులకు అదృష్టకరముగా తోచెడి ఈ సంఖ్య కుటుంబ జీవితమున ఎన్నో చిక్కులనిచ్చును. చుట్టునుండువారు విశ్వాసము లేనివారుగా ఉందురు.

45 - ఇది మిక్కిలి అదృష్టకరమైన సంఖ్య. కష్టదశలో ఉండు వారికి ఇది ప్రసిద్ధిని, గొప్ప పదవిని ఇవ్వగలిగినది. వాక్కు మూలకముగా ప్రసిద్ధి ఏర్పడును. అందరినీ సంతోషపెట్టగలిగిన పనులందును, వృత్తులందును ప్రవేశిస్తారు. తీవ్ర కృషి చేయగలిగిన వీరు తాము చేపట్టు వృత్తిలో సాటిలేని స్థానమును వహిస్తారు. ఏవిధముగా అయినా తమ కార్యమును సాధించుకొంటారు. వీరు జీవితమే ఒక నాటకమా! అనునట్లు నడుచుకొందురు. తీరని కోరికలున్నను ఇతరులు ఊహింపలేనట్లు చిరునవ్వు చెదరక జీవితమును గడుపుతారు. సుఖ జీవితమును, కీర్తియు, సంపదను ఇచ్చు ఈ సంఖ్య మిక్కిలి అభిలషణీయమే. అనేక వ్యాధులు కూడా నయమగును.

54 - ఈ సంఖ్య జీవితమున అంచెలంచెలుగా జయమును, అభివృద్ధిని ఇచ్చును. అపజయములు కలవు. జీవిత మొదటి భాగములో విశేషమైన గౌరవము, కీర్తి, సంపదలు కలుగును. పట్టుదలయు, ముందాలోచన లేని పనులు ప్రతిష్టను కోల్పోయేలా చేయును. పేరాశ ఈ సంఖ్యకు శత్రువు. జాగ్రత్తగా ఉండనిచో అన్నిటినీ కోల్పోవుట సంభవించును. ఆఖరు దినములలో మళ్ళీ కొంత జయము కలుగును. స్వతంత్రతలేని జీవనము ఏర్పడును.

63 - ఇది కూడా అదృష్టకరమైన సంఖ్యయే. కాని ఇది పేరులో వచ్చిన, బుద్ధి మంచి త్రోవలలో పోదు. తప్పుడు పనులలోనే మనసు లగ్నమగును. ఇది దొంగలకు మాత్రమే తగినదని గ్రంథములలో కలదు గాన ఇక్కడితో ఆపుచున్నాను.

72 - 9 సంఖ్యలోనే దీనిని అన్నిటికన్న గొప్పదని చెప్పవచ్చును. దీని క్రిందకు వచ్చువారు, బాల్యమున కష్టపడినను, తరువాత ఎంతో సుఖపడుదురు. అనుమానములను వదలిన సుఖము కలుగును. వీరు చేర్చు ఆస్తులు ఎన్నో తరముల తర్వాత కూడా నాశనమవక ఉండగలిగినవి. ధనము వచ్చుచునే ఉండును. పోదు. (వ్యాపారులు గమనింపవలసిన సంఖ్య) కీర్తి కలదు; ఈ సంఖ్య నిలకడయైన ఐశ్వర్యమును సూచించును.

81 - ఈ సంఖ్య అదృష్టకరమైన జీవితమును సూచించుచున్నది. ప్రగతి, కీర్తి, ధనము కలదు. కాని జాగ్రత్తగా లేనిచో అదృష్టము మారిపోవును. ఎందరికో గురువుగా ఉండు సందర్భము కలుగును.

90 - ఈసంఖ్య 9 అంకెకు పూర్ణమైన ఫలమునిచ్చునది గాన దీనిని పేరుగా కలవారు తమ పనులు సాధించుకొనుటకు అసుర ప్రయత్నము గావించెదరు. జయము నిశ్చయము. ఐశ్వర్యమున కుబేరునకు సాటియగును. కీర్తియు కలుగును. ఆధ్యాత్మిక తపము ఆసక్తిగలవారికి ఇది పనికిరాదు.

99- ఈ సంఖ్య పేరులో ఉండిన, బుద్ధి పెడత్రోవలు పట్టును. జయముతోపాటు విరోధులును పెరుగుదురు. విరోధులచే దాడిచేయబడుటను సూచించుటచే ఇది మంచిది కాదు. (విద్య, సంపద, సుఖము కలవు.)

108 - ఈ సంఖ్య పెద్ద పదవులను, కార్యసిద్ధిని ఇవ్వగలిగినది. తలచినట్లే అన్నియు జరుగును. మంచి ప్రయత్నములను, దానికి తగిన ఫలములను ఇచ్చుటచే ఇది మంచి అదృష్టకరమైనదని భావింపవలెను.అమితమైన శరీర ప్రయాసతో చేయుపనులలో ప్రవేశించునది వీరే. పలుదేశములను సైకిలుపై చుట్టి వచ్చుట, కాలినడకనే యాత్రలు చేయుట, మైళ్ళకొలది దూరము ఈదుట, కొండలనెక్కుట మొదలైనసాహస కృత్యములందు వీరు ప్రవేశిస్తారు. పేరు సంఖ్య 9అయినను ఇట్టి పనులు చేసెదరు.

## అదృష్టకాలము

9 సంఖ్యలో పుట్టినవారికి మిక్కిలి అదృష్టకరమైన దినములు 5, 14, 23, 9, 18, 27, 6, 15, 24, 21, 30 తేదీలు. ఈ దినములు అభివృద్ధినిచ్చును. ముఖ్యమైన

పనులను ఈ దినములందే చేయుటకు అలవాటుపడవలెను. 1, 10 తేదీలు కూడా సాధకమైనవే. 27 తేదీలో మంచి ఫలములు ఉండును.

### దురదృష్టదినములు

దురదృష్టదినములు 2, 11, 20, 29 తేదీలు. 19వ తేదీలందును కొన్ని సమయములలో తప్పుడు ఆలోచనలు మనసున తోచును. ఈదినములు మనసును కలచివేయగలవి కనుక ముఖ్యమైన పనులను ఈ దినములలో చేయరాదు.

వృత్తులు పుట్టిన తేది సంఖ్య 9 అయినచో కట్టడములు కట్టుట, ఇంజనీరింగుకు సంబంధించిన ఇతర వృత్తులు, ఇనుప వస్తువుల తయారీ, యంత్రముల వ్యాపారము మొదలగునవి సహజముగా వీరికి తగిన వృత్తులు. యుద్ధము, అధిక సాహసము, సమర్థత కావలసిన ప్రభుత్వ పదవులందును వీరు ప్రకాశింతురు. ఏ వృత్తిని అవలంబించినను, అందు పోటీయో, వ్యతిరేకతయో ఏర్పడునప్పుడే వీరి సమర్థత బయటపడును. విధి సంఖ్య ఏ వృత్తులను సూచించునో అందు ప్రసిద్ధి కలుగును. అది కూడ 9 అయినచో పేరు సంఖ్య వృత్తులే చేపట్టవలెను.

### సహాయము చేయువారు

9 సంఖ్యవారికి 3, 5, 6, 8, 9 సంఖ్యలవారి సహాయము కలదు. 2 సంఖ్య వారివలన కీడు జరుగును. సమిష్టి వ్యాపారములలో 3, 5, 6 తేదీలలో జన్మించిన వారిని మంచి భాగస్వామ్యులుగా తీసుకొనవచ్చును.

### కుటుంబ జీవనము

9 తేదీలలో పుట్టినవారు 9 సంఖ్య వారినే వివాహము చేసికొనుట మంచిది. 5 సంఖ్యవారిని వివాహమాడుట 2వ పక్షమే. వీరు ఉష్ణశరీరులు గాన 6, 3 సంఖ్యలవారిని కూడ చేసికొనవచ్చును. తక్కిన 1, 2, 8 సంఖ్యలవారిని వివాహమాడుట మంచిదికాదు.

### వివాహ దినమును ఇట్లు ఎంచుకొనాలి

| **కాబోవు భార్య/భర్త సంఖ్య** | **వివాహ తేదీ, దాని విధి సంఖ్య** |
|---|---|
| | |

| 3 | 3 & 1, 1 & 2, 3 & 9, 9 & 3 |
|---|---|
| 6 | 1 & 6, 6 & 1, 9 & 6 |
| 9 | 9 & 3, 3 & 9, 9 & 6, 6 & 9 |
| 5 | 1 & 1, 2 & 3, 9 & 6 |

రంగు

వీరికి తగిన రంగు ఎఱుపు. ముదురు ఎఱుపు, నీలం తగినవే. కనీసము వీరి వస్త్రముల అంచులపై అయినాఎరుపు రంగు ఉంటే మంచిది.

ఉపయోగించ కూడనివి

లేత పచ్చ, తక్కిన లేతరంగులు దుస్తులలో అంచులందయినా ఎఱుపు ఉండుట మంచిది.

రత్నము

పగడము వీరికి ఆరోగ్యమును, ఆయుస్సును ఇచ్చి శరీరములోని లోపములను తీర్చును. ప్రేవులలో ఏర్పడు గడ్డలు రాకుండా బ్లడ్స్టోన్ (Blood stone) అనబడు నెత్తురు రంగు చుక్కలు గల పచ్చరాయిఅరికట్టును.

**సూచన: శబ్దముల కలయిక, ముగింపులను ఈ సంఖ్య సూచించుటచే విడిగా దీనికి ఏ అక్షరమును లేదు.**

9 తేదీలో పుట్టిన కొందరు ప్రముఖ వ్యక్తులు

| పేరు | జన్మతేది సంఖ్య | తేది-విధి సంఖ్యలు |
|---|---|---|
| | | |

| AMERIGO VESPUCCI<br>అమెరిగో వెస్పుకి (అమెరికా కనుగొన్న వాడు. అతని పేరే ఆ ఖండమునకు పెట్టబడినది.) | 9-3-1451 | 9 & 5 |
|---|---|---|
| JOHN MILTON<br>జాన్ మిల్టన్ - ఇంగ్లీషు కవి | 9-12-1608 | 9 & 9 |
| GALVANI<br>గాల్వాని (విద్యుత్తుకు సంబంధించిన పరిశోధన ప్రారంభించినవాడు.) | 9-9-1737 | 9 & 9 |
| V.M. MOLOTOV<br>వి.ఎమ్. మోరోటోవ్ | 9-3-1890 | 9 & 3 |
| RAMAKRISHNA PARAMAHAMSA<br>రామకృష్ణ పరమహంస | 18-2-1836 | 9 & 2 |
| DR. SAMUEL JOHNSON<br>డా. శామ్యూల్ జాన్సన్ (గొప్ప సాహిత్యవేత్త) | 18-9-1709 | 9 & 8 |
| VOLTA<br>వోల్టా<br>(బ్యాటరీలు మరియు విద్యుత్ లపై పరిశోధనలు చేసినవారు) | 18-2-1745 | 9 & 1. |
| NEVILLE CHAMBERLAIN | 18-3- | 9 & 9 |

| | | |
|---|---|---|
| నెవిల్లీ చాంబర్ లైన్ | 1869 | |
| BERTRAND RUSSELL<br>బెరండ్ రస్సెల్ (బ్రిటిష్ తత్వజ్ఞాని) | 18-5-<br>1872 | 9 & 5 |
| NELSON MANDELA<br>నెల్సన్ మండేలా (మాజీ సౌత్ ఆఫ్రికా ప్రెసిడెంట్) | 18-7-<br>1918 | 9 & 8 |
| SAMUEL FINLEY BREESE MORSE<br>సామ్యూల్ మోర్స్ | 27-4-<br>1791 | 9 & 4 |
| HERBERT SPENCER<br>హెర్బర్ట్ స్పెన్సర్ (ప్రసిద్ధ రచయిత) | 27-4-<br>1820 | 9 & 6 |
| RUDOLF STEINER రూడాల్ఫ్ స్టెయినర్ (ప్రసిద్ధ జర్మను తత్వజ్ఞాని) | 27-2-<br>1861 | 9 & 9 |
| SIR DONALD BRADMAN<br>సర్ డోనాల్డ్ బ్రాడ్ మాన్ | 27-8-<br>1908 | 9 & 8 |
| K.R. NARAYANAN<br>కె. ఆర్. నారాయణన్ (మాజీ భారత రాష్ట్రపతి ) | 27-10-<br>1920 | 9 & 4 |
| ELIZABETH TAYLOR<br>ఎలిజిబెత్ టేలర్ (సుప్రసిద్ధ హాలీవుడ్ నటి ) | 27-12-<br>1932 | 9 & 9 |

| | | |
|---|---|---|
| JOHANNESKEPLER<br>జోహన్ నేనెప్లర్ (ప్రసిద్ధ గణితజ్ఞుడు) | 27-12-1571 | 9 & 8 |
| GURUDUTT<br>గురుదత్ (ప్రసిద్ధ హిందీ నటుడు) | 9-7-1925 | 9 & 6 |

9 & 9 సంఖ్య వస్తే వీరిలో చాలా మంది మహోన్నత రాజుతంత్ర నిపుణులుగా జీవిస్తారు.

**సూచన:** వీరు ఆత్మ రక్షణకు కూడా ఆయుధాలు దగ్గర ఉంచుకో కూడదు. ఇది చాలా ముఖ్యమైన హెచ్చరిక. నేపాల్ యువరాజు దీపేంద్ర (సంఖ్య 9 - పుట్టిన తేది 27-6-1971) క్రోధావేశంలో రాత్రి భోజనం సమయములో తన కుటుంబ సభ్యులు అందరిని తుపాకీతో కాల్చి హత్య చేసాడు. కాబట్టి 9 సంఖ్యవారు జాగ్రత్తగా ఉండవలెను.

## తుది పలుకులు

ఇంతవరకు మీరు 1 నుండి 9 వరకు సంఖ్యలు వచ్చే తేదీలలో పుట్టిన మనుష్యుల వివిధ గుణములు, వైవాహిక జీవితం, వారు చేయ వలసిన వృత్తులు, వారికి అదృష్టం కలిగించే తేదీలు మరియు రంగులు, వారికి రావటానికి అవకాశం ఉన్న వ్యాధులు, దురదృష్టకరమైన తేదీలు, వారికి సహాయపడేవారు మొదలైన వివరములను చదివి తెలుసుకున్నారు.

పైన చెప్పబడిన విషయాల గురించి మరికొన్ని సలహాలు ఇక్కడ ఇవ్వబడినవి. ఈ సలహాలను మనసులో పెట్టుకుని మీరు ఏ పని ప్రారంభించినా దానిలో మీకు పరిపూర్ణ విజయం చేకూరుతుంది.

**(ఎ) పేరులో మార్పు:** మీరు ఏ సంఖ్య అధీనంలోనికి వచ్చే తేదీన పుట్టినవారో, మీ భాగ్య సంఖ్య ఏమిటో, మీ నామసంఖ్య ఏమిటో మొదలైన వివరాలు ఇప్పుడు మీకు తెలిసాయి కదా. మీ పేరు ఇప్పటివరకు ఎలాంటి ఫలితాలు ఇచ్చినదీ, భవిష్యత్తులో ఎలాంటి ఫలితాలు ఇవ్వబోతున్నది, నామ పరివర్తన మీ పుట్టిన తేది సంఖ్యలపై ఎలాంటి ప్రభావం చూపుతున్నది బాగా పరిశీలించి నిర్ణయించవలెను.

కొత్తపేరు మార్చిన పిదప, దానిని ప్రతిదినం కనీసం 32 మారులు రాయవలెను. కలిపి రాయకూడదు. ఒక్కొక్క అక్షరమునే మనసులో అనుకుంటూ రాయవలెను. ఇలా మీరు నిరంతరం మీ కొత్త పేరుని రాస్తూ అభ్యాసం చేయాలి. మీరు అనుకున్నవి మరియు మీ ఆశయాలు నెరవేరే వరకు మీరు ఇలా రాస్తూ ఉండటం మంచిది.

ఉద్యోగస్థులు తమ పేరుని సంఖ్యాశాస్త్ర సిద్ధాంతాల ప్రకారం చక్కగా ఆలోచించి, అదృష్టకరమైన సంఖ్య వచ్చేలాగా మార్చుకొంటే అతి త్వరలో చెప్పుకోదగిన అభివృద్ధి కనిపిస్తుంది.

ఉద్యోగంలో చేరిన రోజు అదృష్టకరమైనది కాకపోతే, కొద్ది రోజులు శెలవు తీసుకొని తిరిగి మంచి రోజున ఉద్యోగంలో చేరవచ్చును. ఇది అద్భుతమైన ఉపాయం. దీని ఫలితం అమోఘంగా ఉంటుంది. (ఇలాంటి సలహాసే అనుసరించి నాకు తెలిసిన ఒకరు బాగా

అభివృద్ధి చెందటమేకాక, ఏమాత్రమూ ఎదురు చూడకుండానే, ఎంతో ప్రముఖమైన దేశాన్ని ఏలే పదవిని కూడా కేవలం కొన్ని నెలలకు మాత్రమే పొందటం నాకే ఆశ్చర్యం కలిగించింది).

నామ సంఖ్య ఎంత అదృష్టకరమైనది అయినప్పటికి పుట్టిన తేది సంఖ్యతో లేదా భాగ్యసంఖ్యతో దానికి ఎలాంటి సంబంధం లేకపోతే దానివలన ఏమాత్రమూ ప్రయోజనం ఉండదు.

పుట్టినతేదికి తగినట్లు పేరు కూడా ఉంటే మనసుకు నచ్చిన మంచి ఫలితాలు లభిస్తాయి, మంచి జీవితం అమరుతుంది. పేరు మార్చిన వెంటనే మనసులోను, శరీరంలోను అనేక మార్పులు కనబడతాయి. ముఖ్యంగా 5, 6 సంఖ్యల పేర్లకు మారినప్పుడే ఈ మార్పులు స్పష్టంగా ఉంటాయి.

5 సంఖ్యకు మారినప్పుడు వివరించటానికి సాధ్యంకాని ఎన్నో ఆలోచనలు కలుగుతాయి. దీనికి కారణం మనసులో అనేక మార్పులు కలగటమే. 6 సంఖ్యకు మారినపుడు శరీరంలో ఒక వింత వేగం కలుగుతుంది. ఏదైనా చేయాలన్న తీవ్ర భావం ఏర్పడుతుంది. ఇదొక అద్భుతమైన శక్తిని మన శరీరంలో ప్రవేశపెడుతుంది. ఆ శక్తి మన శరీరం అంతటా వ్యాపిస్తుంది. ఈ పరిస్థితిలో మనం ఎంత కష్టపడి పనిచేసినా మనకు అలుపు అన్నదే తెలియదు.

అదృష్టమైన తేదీలలో జన్మించిన వారితో పోల్చితే, వారికన్నా పేరులో మార్పు చేసుకొనుట ద్వారా అదృష్టం పొందినవారు త్వరగా పైకి రావటం మనం చూడగలం. ఇక ఈ రెండు ఒకే చోట చేరితే ఇక అక్కడ అదృష్టం మచ్చలేనిదిగా ఉంటుంది. పట్టినదంతా బంగారమే. అన్నింటా జయమే. కాబట్టి పుట్టిన తేదీ సంఖ్య సరిగా లేనివారు ఎంతమాత్రమూ నిరుత్సాహ పడనక్కర లేదు. పేరులో మార్పు చేసి, అదృష్టకరమైన నామ పరివర్తన చేయుట ద్వారా నిస్సందేహంగా మీ జీవితం చక్కబడుతుంది.

నామ పరివర్తన ద్వారా మనసున మార్పులు కలుగును అని చెప్పడం మాత్రమేకాక, మరొక ముఖ్య విషయం కూడా చెప్పాలి. నామ సంఖ్య ఒకటిగా ఉన్న ఇద్దరు ఒకరినొకరు ప్రేమిస్తారు. ఉదాహరణకి, ఒక 7 సంఖ్య కలవారు మరొక 7 సంఖ్య

వచ్చేవారు చెప్పి నది చేస్తున్నారని అనుకుందాం. దీనివలన వారికి ఎన్ని కష్టాలు వచ్చినాసరే వారు ఈ అలవాటుని తప్పించుకోలేరు.

అయితే వారు తమ పేరును మార్చుకొని మరొక సంఖ్యకు మారినట్లైతే, తప్పకుండా వారినుండి బయట పడగలరు. ఇది ప్రతి అంకెకు వర్తిస్తుంది. అన్యోన్యత తగ్గిన దంపతుల విషయంలో ఇలా పేర్లను మిత్రసంఖ్యలు వచ్చేలా మార్చుకొనినచో వారి అన్యోన్యత పెరుగుతుంది. ఇది నేను ఊహించి రాయుట లేదు. అనుభవంతో చెప్తున్నాను.

అవసరమైనవారు గెజిట్లో ప్రకటన ఇచ్చి తమ పేరు మార్పుని నమోదు చేసుకోవచ్చు. అలా వీలు కానివారు తమ పేరు అదే అని మనసులో పదేపదే అనుకుని, నడచుకొంటే తప్పకుండా మంచి ప్రయోజనం ఉంటుంది. అలాగే, ముద్దు పేర్లు ఏవైనా ఉంటే వాటిని కూడా అశ్రద్ధ చేయకుండా తగిన విధంగా మార్చుకోవాలి.

**(బి) వ్యాపారం :** స్వంతగా వ్యాపారం చేసేవారు లేదా వ్యాపారం చేయదలచినవారు, తమకు మిక్కిలి అదృష్టకరమైన తేదీన (ఆనాటి తేది సంఖ్య మరియు తేది, నెల, సంవత్సరం కూడగా వచ్చే సంఖ్య ఈ రెండు అదృష్టమైనవిగా ఉండాలి) వ్యాపారం మొదలుపెట్టవచ్చు. అశుభ తేదీలలో ప్రారంభించబడిన మరియు వ్యాపారం కుంటుపడిన సంస్థలకు వారం రోజులు శెలవు ఇచ్చి, అదృష్టకరమైన తేదీన మళ్ళీ వ్యాపారం కొత్తగా మొదలుపెట్టవలెను.

అంతేకాక ప్రతి ఏడు అదృష్ట దినములందు (తేది, నెల, సంవత్సరం కూడితే వచ్చు సంఖ్య అదృష్టమైనదిగా ఉండుట ముఖ్యం) కొత్తగా లెక్కలు మొదలుపెట్టవలెను. అలా చేస్తే కొత్త సంవత్సరం లెక్కలు మొదలుపెట్టే లోపలే మంచి పురోగతి కనబడుతుంది. వ్యాపారం కొరకు సరకు కొనునప్పుడును, కొత్త ఒప్పందములలో సంతకం చేసేటప్పుడు, తేది, నెల, సంవత్సరం కూడగా వచ్చిన సంఖ్య అదృష్టమైనదిగా ఉండాలి. అలాగే వ్యాపార పరంగా చేసే ప్రయాణాలు అదృష్టదినములందే జరుగునట్లు చూసుకోవాలి.

భాగస్తులతో కలిసి వ్యాపారం చేయదలచిన, తన సంఖ్యకి సమానమైన సంఖ్యలవారినో, తనకు అదృష్టమైన సంఖ్యలవారినో కలుపుకొనవచ్చు. తన సంఖ్యకు ప్రతికూలమైన, దురదృష్టకరమైన సంఖ్యలవారితో కలసినట్లైతే ఫలితాలు శుభ్రంగా

ఉండవు. ఇతరులతో కలిసిచేసే వ్యాపారాలు మంచి దినములందు ప్రారంభించాలి. అలాగే కొత్త లెక్కలు కూడా రెండు సంఖ్యలూ (ఆరోజు తేదీ సంఖ్య మరియు తేది, నెల, సంవత్సరం కలిపినప్పుడు వచ్చే సంఖ్య) అదృష్టకరంగా ఉన్న దినములందే మొదలుపెట్టుట మంచిది. వ్యాపారమునకు రాహుకాలం, యమగండం, శూలలు, కృష్ణపక్షములను చూడనక్కరలేదు.

**(సి) ప్రయాణం** : ప్రయాణం మొదలుపెట్టు రోజు అదృష్టకరం అయినదిగా ఉండవలెను. (మనం చేరవలసిన చోటుకు ఎప్పుడైనా చేరగలం.) ప్రయాణం చేయు దినం మరియు తేది, నెల, సంవత్సరం సంఖ్య 5 అయినచో ఆ ప్రయాణం వలన ఎదురుచూడని సత్ఫలితాలు కలుగుతాయి. అనుకున్న దానికన్నా ఎక్కువ సౌఖ్యం కలుగుతుంది. ప్రయాణం తేది, నెల, సంవత్సరం కూడగా వచ్చే సంఖ్య అదృష్టకరం అయిన సంఖ్య వచ్చే దినములలో చేస్తే కార్యసిద్ధి కలుగుతుంది. ప్రయాణం తేది దురదృష్టకరమైనదిగా ఉంటే అన్నీ కలిసిన సంఖ్య అయినా అదృష్టకరంగా ఉండాలి. అప్పుడే కష్టనష్టముల తరువాత అయినా జయం కలుగుతుంది. ప్రయాణం తేది మాత్రం అదృష్టకరమైనదిగా ఉండి, భాగ్యసంఖ్య మాత్రం దురదృష్టకరమైనదిగా ఉంటే కూడా పర్వాలేదు, ప్రయాణం సుఖంగానే జరుగుతుంది. అన్నీ బాగుంటాయి, కాని ఫలితం మాత్రం ఆశాభంగం కలిగిస్తుంది. ఈ సంఖ్యలను కొద్ది రోజులు గమనిస్తే, వాటి అపూర్వ శక్తులు అర్థం అవుతాయి. ఉదాహరణకు ఒక ప్రయాణం గురించి చూద్దాం. ఏదో ఒక ఊరికి కొన్న రైలు టిక్కట్లు పై ఉండే సంఖ్య (Ticker No.) ను గమనించండి. దానిని కూడి చూడండి. అది ఏ సంఖ్య అయితే మీకు ఆ ఫలితం ఉంటుంది. మీకు అదృష్టమైన అంకె వచ్చుట ముఖ్యం. దురదృష్ట సంఖ్య వచ్చినదంటే ఆ టిక్కెట్టుతో పయనిస్తే, ఫలితం బాగుండదు. అన్నీ అనుభవంతోనే తెలుసుకొన వలసిన అవసరం లేదు. ప్రయాణ దినంకన్నా ముందే వాటిని తిరిగి ఇస్తే ఏదో కొంత తగ్గించుకొని మీ డబ్బు వాపసు ఇవ్వబడుతుంది. దాన్ని తీసుకొని ఇంటికి వెళ్ళండి. (ఇది కేవలం నా అనుభవం మాత్రమేనని అనుకోవద్దు. నాతో సన్నిహితంగా ఉండే వేలాది మిత్రుల అనుభవం కూడా. మీరు స్వయంగా అనుభవం పొందితే అది మిమ్మల్ని కూడా మాలో ఒకరిగా మార్చుతుంది).

**(డి) వృత్తులు :** మన దైనిక జీవితంలో, సంబంధంలేని వృత్తులు చేస్తూ, కష్టపడుతున్న అనేకమందిని మనం చూస్తుంటాము. తమ తాహతుకు, యోగ్యతకు, గుణములకు తగిన వృత్తులలోనే ఎవరైనా రాణించగలరు. ఒక ప్రత్యేకమైన వృత్తికి కావలసిన మనోశక్తులు కలవారు మాత్రమే ఆ వృత్తులలో ప్రవేశించి, అభివృద్ధిని పొందవచ్చు. వేరు సంఖ్యలవారు (వేరు గుణములుండుటచే) ఎంత ఘటికులయినా సరే పోటీకి నిలువలేరు. ఉదాహరణకు, 1 సంఖ్యలో పుట్టిన వారిని చూద్దాం. వీరు నిజాయితీపరులు, ఉత్సాహవంతులు, తెలివిగలవారుగా ఉన్నప్పటికీ, సర్దుకుపోవు గుణం లేనివారు. అంతేకాక, వీరు ముక్కుకు సూటిగా పోతారు. కష్టమో నష్టమో కలిగితే కలత చెందుతారు. వీరు వ్యాపారంలో ప్రవేశించి నష్టం కలిగితే, కోలుకొనుటకు ఎక్కువ సమయం పడుతుంది.

అదే 5 సంఖ్య వారైతే నష్టం వచ్చినా, "అన్నీ పోయినా నేను లేనా! వేరే ఏదైనా చేసి చూస్తాను" అని ధైర్యంగా అంటారు. సమయోచితంగా ఉపాయములు తట్టుట చేత ఇటువంటివారే వ్యాపారంలో రాణిస్తారు. వీరికి పరిస్థితులను అనుసరించి ఏర్పడే జీవితమే తగినది.

ఒకటి సంఖ్యవారికి నిర్దుష్టమైన ఇష్టాయిష్టములు ఉంటాయి. ఒక లక్ష్యమును సాధించుటకు ఎట్టిశ్రమనైనా భరించగలవారే. అయితే సక్రమంగా ప్రణాళికలేనిదే జీవితమును విజయవంతంగా గడిపే సమర్థత వీరిలో కనిపించదు. వ్యాపారములో, అప్పటికప్పుడు సందర్భం ప్రకారం పథకం మార్చగలిగితేనే లాభిస్తుంది.

ఇక 6 సంఖ్యవారిని చూద్దాం. వీరు భావావేశపరులు. శుక్రుని ఆధిక్యం వలన భావావేశం కలుగుతుంది. సహజంగానే వీరికి రమణీయమైన వస్తువులందు, శబ్దములందును మోహం ఉంటుంది. ఇంద్రియాలకు సుఖకరంగా ఉండని వృత్తులలో వీరు ప్రసిద్ధులు కాలేరు. వీరు ఏదైనా కళలో అభిమానం కలవారైతే దానినే సదా స్మరిస్తూ ఉంటారు. దానిని వృత్తిగా చేపట్టినా, అంతటితో ఆపుకొనక దానిలో ఐక్యమైపోతారు. అందువలన వీరికి జయం, కీర్తి కలుగుతాయి.

సఫలత కల్గుట అనేది సరియైన వృత్తిని ఎన్నుకొనుటపై ఆధారపడి ఉంటుంది. ఇది

తగు ప్రయత్నం మరియు ప్రోత్సాహాలపై ఆధారపడి ఉంటుంది. (సఫలత అంటే ధనం సంపాదించుట మాత్రమే కాదు). ఎవరికి తగిన వృత్తులలో వారు ప్రవేశించి, అభివృద్ధి సాధిస్తేనే మానసిక ఉల్లాసం కలుగుతుంది.

దీనిని చదివేవారికి ఒక సంగతి చెప్పవలసి ఉంది. కేవలం డబ్బు సంపాదించాలి అని ఆసక్తిలేని వృత్తులందు ప్రవేశించ కూడదు. అలా ప్రవేశిస్తే, సహజంగా శ్రద్ధాసక్తులు కలిగినవారితో పోటీ పడలేం.

ఇప్పుడు మన చుట్టూ ఎక్కడ చూసినా పోటీ కనిపిస్తుంది. ఇది పోటీతో నిండిన లోకం. గెలిచినవారిదే రాజ్యం. ఓడినవారికి సానుభూతి కూడా దక్కదు. కేవలం తెలివితక్కువవాడు అనే పేరే మిగులుతుంది. కాబట్టి, ప్రస్తుత కాలం ప్రకారం తమ అర్హత ఏదో తెలుసుకొని, తర్వాతే వృత్తులందు ప్రవేశించాలి. అమిత ధన వ్యయంతో మనం ఒక ప్రత్యేకమైన వృత్తివిద్యను నేర్చి, అందు జయం పొందలేక వేరే వృత్తులను చేపట్టడం జరుగుతున్నది. దీనికి ఇదే కారణం. (మీలో ప్రతి ఒక్కరికి ఇలాంటివారు కొందరైనా తెలిసి ఉంటుంది).

దేనిలోనైనా విజయం సాధించాలంటే దానికి తగిన అర్హత మనలో ఉండాలి అన్నది ఒక చేదు నిజం. కనుక తల్లిదండ్రులు తమ పిల్లలను వారికి తగిన వృత్తులందే వారు ప్రవేశించేలా చూడాలి. ఈ విషయంలో వారు తగిన శ్రద్ధ తీసుకుంటారనే ఉద్దేశ్యంతోనే ఇక్కడ ఈ విషయాన్ని ప్రస్తావించటం జరుగుతున్నది.

ఈ పుస్తకంలో 9 రకాల మనుష్యుల సహజ గుణాల గురించి చెప్పబడినది. పుట్టిన తేది సంఖ్య పుట్టుకతో వచ్చు గుణములను తెలుపుతుంది. తేది, నెల, సంవత్సరం కూడి తేవచ్చు సంఖ్య జీవితం ఎలా సాగుతుందో తెలుపుతూ, అదృష్టపథం గురించి సూచిస్తుంది.

ప్రతి ఒక్కరు తమ జన్మతేదీ సూచించు వృత్తికి అర్హులుగా ఉంటారు. వారు తమ భాగ్యసంఖ్య సూచించు వృత్తులలోనే రాణిస్తారు. విధివశాత్తు (పరిస్థితుల వలన)వ్యక్తి వయసు పెరిగేకొలది నామసంఖ్య బలంగా మారి, అది మనకు అనుకూల వాతావరణాన్ని కలిగిస్తుంది. అంతే కాక, అది మనకు కావలసిన స్వభావాన్ని మరియు

పరిస్థితులను కూడా ఏర్పరుస్తుంది.

**(ఇ) యంత్రములు** : ఈ పుస్తకంలో ఇవ్వబడిన నామసంఖ్యలకు కలిగే ఫలితములను పొందుటకు ఇంతవరకు యంత్రములు, మంత్రములనే ఆశ్రయించుట జరిగింది. ఈ పుస్తకంలో చెప్పబడినట్లు అన్నీ స్పష్టంగా చెప్పటం ఇష్టంలేక చాలా విషయాలను రహస్యముగా గురుశిష్యుల మధ్య మాత్రమే ఉంచటం జరిగింది. ఒక్కొక్క సంఖ్యకు ఒక యంత్రము, దానిని తయారుచేయుట కొరకు మంత్రపద్ధతి ఉండేది. అన్నీ స్పష్టముగా వివరింప బడవలెనని, వానిని అందరూ సరిగా అర్థం చేసికొనకపోతే, అవి తప్పుగా ప్రయోగింప బడతాయనే భయంతో, ఈ పుస్తకం అర్థం చేసికొనుటకు అది ముఖ్యం కాదని దానిని ఇందులో పొందుపరచలేదు.

# రత్నములు మరియు వాటి ప్రభావాలు

మన దేశంలో రత్నములు ధరించు అలవాటు తక్కువగా ఉన్నది. ఆంగ్లేయుల, రష్యన్ల, దక్షిణాఫ్రికా వశంలో ఉన్న వజ్రములు మాత్రమే ప్రజలని ఆకర్షిస్తున్నవి. అతి తక్కువ ధరలకే కొన్నప్పటికి వ్యాపారస్థులు తమ వ్యాపార సామర్థ్యంతో వాటిని అతి ఎక్కువ ధరలకే అమ్ముతున్నారు.

వజ్రాలు అంటే రవ్వలు అందరికీ తగినవి కావు. శరీరంలోని నీటిని శుష్కింపచేయు గుణం కలది కావటం చేత ఊట శరీరం అంటే వాత సంబంధమైన శరీరం కలవారికే ఇది మంచి చేస్తుంది. తక్కిన సన్నని దృఢ శరీరం కలవారు ధరిస్తే దానివలన క్షయ రోగం, చెవులు మందమగుట, గొడ్డుతనము మొదలైన దుష్ప్రభావాలు కలుగవచ్చు.

వజ్రాలలో త్రికోణాకారంతో చెక్కబడి నవి శరీరం కుడివైపున ధరిస్తేనే దానివలన పూర్ణ ఫలితములు పొందగలమని భృగువు మొదలైన మహర్షులు తెలిపి ఉన్నారు. వలయాకారం కలవి వంధ్యత్వాన్ని కలు గించే ప్రమాదం ఉంది. (ఈ విషయాన్ని స్త్రీలు తప్పక గమనించవలసిందిగా నా అభ్యర్థన).

దక్షిణ దేశంలో అనేకులు అధిక వెల ఇచ్చి కొన్న నీలములు నకిలీ రాళ్ళుగా ఉన్నవి. రత్నపరీక్షకుల సంఖ్య కూడా అతి తక్కువగా ఉంది. కాబట్టి పాఠకులు ఈ విషయమై జాగ్రత్త వహించవలెను. మంచి ముత్యములు నకిలీ ముత్యముల ధరలకే దొరకుచున్నప్పటికి అనేకులు నకిలీ ముత్యములనే ఎందుకు ధరిస్తారో అర్థం కాదు. దీనంతటికి కారణం రత్నాల పట్ల ప్రజలకు సరియైన అవగాహన లేకపోవటమేనని నాకు అనిపిస్తున్నది.

ఒక్కొక్క అదృష్ట సంఖ్యకు సంబంధించిన రత్నముల గురించి వివరాలు ముందు అధ్యాయాలలో మీరు చూసారు. అవి జీవిత కాలం అంతటికి మన శరీరమునకు మంచి చేస్తాయి అని చెప్పటంలో ఎలాంటి సందేహం లేదు. ఒక్కొక్క గ్రహ దశ జరుగుతున్నప్పుడు, దానికి తగిన రత్నమును ధరించుట వలన మనం మంచి ఫలితాలు పొందగలం. ఇప్పుడు వివిధ దశలకు తగిన విలువైన రత్నముల వివరాలు

చూద్దాం.

| అనుకూల రత్నములు | |
|---|---|
| సూర్యుడు (1) – మాణిక్యం | బుధుడు (5) – వజ్రం |
| కుజుడు (9) – పగడం | శుక్రుడు (6) – మరకతం(పచ్చ) |
| గురువు (3) – పుష్యరాగం | రాహువు (4) – గోమేధికం |
| శని (8) – నీలం | కేతువు (7) – వైఢూర్యం (పాలీష్ చేయని వజ్రం) |
| చంద్రుడు (2) – ముత్యం | |

ఇక్కడ బుధుడికి వజ్రం, శుక్రుడికి పచ్చ అని ఉంది. జ్యోతిష శాస్త్ర మునకు వ్యతిరేకంగా ఉన్నదని భావించకూడదు. శుక్రుడు శుభములను మేలుగా మార్చు నది పచ్చలే. శుక్రునికి తగిన వజ్రాలు ప్రస్తుతకాలంలో దొరకుట లేదు. ప్రాచీన గ్రంథములలో ఇవ్వబడిన వర్ణనకు సరిపోవు వజ్రములు గోల్కొండ గనులనుండి వచ్చినవి. వాటి రంగు గరికను పిండితే వచ్చు రసంతో పోలి ఉండును. పచ్చ వర్ణమే ఎక్కువగా ఉండును. ఇప్పటి వజ్రములు ఆఫ్రికా ఖండము నుండి వచ్చుచున్నవి. అతి ఉష్ణ ప్రదేశంలో తయారైనవి కావటంచేత వాటిలో పచ్చరంగు అతి తక్కువగా ఉండును. ఎఱుపు, నీలము, తెలుపు మాత్రమే కనబడును. నేను చెప్పునది రాయి సహజ వర్ణము గురించే. ప్రకాశ కిరణముల గురించి కాదు. పలు రంగులు ధగధగ కనిపించు ప్రస్తుత కాల వజ్రములు బుధునికి చెప్పు ఫలితములనే ఇచ్చుచున్నవి.

రత్నములలో అతి చౌక అయినది గోమేధికం. మిక్కిలి సత్ఫలితములను ఇవ్వకలిగినను ఇవి ఆశ్చర్యకరంగా అతి తక్కువ ధరలకే దొరకుచున్నవి.

అనాది కాలం నుండి ఎంతో గొప్ప రత్నములుగా పొగడబడే జాతి రత్నములను కొందరు క్రమ పద్ధతిలో గుర్తించక, వాటిని అనవసర వస్తువులుగా భావించుట జరుగుచున్నది. అందుచేతనే ఇక్కడ ఈ విషయం రాయవలసి వచ్చింది.

**కుటుంబ జీవితం :** మన దేశమునకు అతిముఖ్యమైన ఈ సూచనలు, వివాహము చేసికొనదలచిన ప్రతి ఒక్కరు తెలిసికోదగ్గవి. ప్రస్తుతం వివాహ పొంతనలు పంచాంగలో ఇవ్వబడినట్లు చూస్తున్నారు. ఇలా యాంత్రికంగా గణించే ఆ పొంతనలు నిజమైనవేనా అని కాస్త ఆలోచిద్దాం.

ఈ విధంగా వివాహ పొంతనలు చూడటం ఒక పురాతన లోపభూయిష్టమైన పద్ధతి. మరో సరియైన పద్ధతిని ఎవరూ ప్రవేశపెట్టక పోవటంచేత అందరూ ఇక్కడే తిరుగుట శోచనీయం. ఈ పొంతనలన్నీ బాగున్నవని చెప్పి జరిపించిన వివాహములు అన్నీ సంతృప్తికరంగా ఉన్నవా? దీనికి సమాధానం చెప్పవలసినది వైధవ్యం ప్రాప్తించిన మహిళలు, సంతానం కొరకు డాక్టర్ల చుట్టూ ప్రదక్షిణలు చేస్తున్న దంపతులు, నిత్యం మూషిక మార్జాలాలవలే కీచులాడుకునే దంపతులు మొదలైనవారి పొంతనలే.

తరువాత చూడదగినది శుభముహూర్త దినములు. (మొదటి అధ్యాయాలలో వీటి గురించి చదివిన మీరు, ఒక్కొక్క సంఖ్యవారికి విడివిడిగా ఒక్కొక్క అదృష్ట సమయం ఉండటం గురించి గమనించే ఉంటారు). పంచాంగములలో సర్వముహూర్తముల కొరకు ఏవో కొన్ని దినములను గుర్తించి ఉంటారు. ఆయా ముహూర్తములలో వివాహం చేసికొంటే భార్యలను కోల్పోయిన భర్తలు, భర్తలను పోగొట్టుకున్న భార్యలు ఎందరో తయారుకాక తప్పదు. ఇలాంటివారిని నిత్య జీవితంలో ఎందరినో మనం చూడటం జరుగుతుంది.

వివాహ శుభముహూర్తం నిర్ణయించేటప్పుడు చాలా శ్రద్ధ చూపవలసిన అవసరం ఉంది. వివాహానికి నిశ్చయించిన ఆ శుభ ముహూర్తాలు దురదృష్ట దినములుగా మారటం జరుగుతున్నది. (కాని పంచాంగంలో ఆ దినములను సర్వముహూర్తములని పేర్కొనబడటం ఇక్కడ గుర్తించవలసిన విషయం). ఇలా జరగటానికి 2 కారణాలు ఉన్నవి.

1. పంచాంగాలలో ఇవ్వబడిన ముహూర్తములు, చంద్రుడు , గురువు, బుధుడు, శుక్రుడు మొదలైన గ్రహాల విషయంలో అవి శుభదృష్టి కలిగి ఉన్నవే. వారి స్థానాలను బట్టి అవి తృప్తికరమైన లగ్నములుగానే పరిగణింపబడినవి.

(శుక్రాది గ్రహ ప్రభావంలో ఉన్న వారికి గురువు ఎట్లు కీడు చేయుట జరుగుచున్నది అనేది మరియు కుజాది గ్రహ ప్రభావంలో ఉన్న వారికి చంద్రుడు ఎట్లు కీడు చేయగలడు అన్నది మీకు తెలిసింది అనుకుంటాను. దీనిని ఇంకా వివరించి రాస్తే కొత్తగా ఈ పుస్తకంను చదివేవారు తికమకపడతారు. ఇవి జ్యోతిషం తెలిసినవారికి మాత్రమే అర్థమయ్యే నిజాలు).

కనుక కొందరికి మాత్రమే తగినవిగా ఉండే ముహూర్త దినములందు ఆ ముహూర్తాలకు అనుకూలం కాని వారు వివాహమాడి అవస్థ పడవద్దని మా సలహా. వివాహం ద్వారా, సుఖం, సౌఖ్యం, సౌభాగ్యం ఆశించేవారు ఈ విషయంలో జాగ్రత్త వహించగోరుతున్నాం.

'ఇక పదిరోజులే ఉన్నాయి, త్వరగా లగ్నం పెట్టండి' అని సిద్ధాంతి మీద వత్తిడి తీసుకువస్తే వారేమి చేయగలరు? అంతేకాక, కొందరు తామే ఏదో ఒక ముహూర్తం చెప్పి అది మంచిదేనా అని అడుగుతారు.

ఈ విధంగా జరిగే పెళ్ళిళ్ళు ఇలా కాక ఇంకెలా ఉంటాయి? పెళ్ళికి ముహూర్తం ముఖ్యం కాదు. నిజం. అదృష్ట దినం ప్రధానం. వివాహ దినం నుండి జీవితం విరబూయటం ప్రారంభమవుతుంది. కాబట్టి వివాహ జాతకం అదృష్టకరమైనదిగా ఉండాలి. (జ్యోతిష్కులకు : వివాహం జరుగునప్పుడు లగ్నం, ఇతర గ్రహముల స్థానాలు గుర్తుపెట్టుకొని, ఆ లగ్నమున జన్మించు శిశువు అదృష్టశాలియా అని చూడవలెను).

సుఖం, భోగం సౌభాగ్యవృద్ధి మొదలైన విషయాలు గమనించాలి. కొన్ని నెలల క్రితం, మంచి వసతి కల గొప్ప కుటుంబానికి చెంది, ఇప్పుడు దిగజారిపోయిన ఒక బ్రతికి చెడ్డ మనిషి, తన వివాహ జాతకం నాకు చూపించారు. కొత్తగా జోతిష్యం నేర్చుకొన్నవారు కూడా ఆ జాతకం చూస్తే, అది భాగ్య నాశనం, అప్పుల వృద్ధి ఫలితాలను చూపుట విషయం సులభంగా కనిపెట్టగలరు. వివాహానికి కొన్ని లక్షలు ఖర్చుపెట్టినట్లు వారు చెప్పారు. ఇది ఏ పుణ్యాత్ముడు నిశ్చయించిన లగ్నమో! పాపం వారికి ఇలా శాపంగా మారింది. వివాహమన్నది కొద్దిసేపటితో ముగిసిపోయేది కాదు. నూరేళ్ళ జీవితానికి నాంది అనే అంటారు. మరి ఇలాంటి వివాహం ద్వారాసైనా పూర్ణ అదృష్టం అందించే

జాతకంగా దానిని మార్చుకోరాదా?

గడచిన సంవత్సరంలో కొన్ని అపూర్వమైన ముహూర్తాలు, వాటిలో లెక్కకు మించిన వివాహాలు జరగటం మనం చూసాం. ఇలాంటి వివాహాలకి నాకు ఆహ్వానం అందినా నేను వెళ్ళను. పండంటి జీవితం గడపవలసిన ఆ నూతన దంపతులకు ఇలా దుర్ముహూర్త ఫలితంగా కష్టాలపాలు కావలసిందేనా? ఇలా మనసులో అనుకుంటూ వారి నెత్తిన అక్షతలు వేయగలమా? ఆ ముహూర్త దినముల సంఖ్యలను చూడండి. అవి- 8 & 7, 7 & 5, 8 & 5, 7 & 1, 2 & 2. 7 & 8, 5 & 7, 5 & 8.

ముందు అధ్యాయాలలో ఒక్కొక్క తేదీకి తగిన అదృష్ట సంఖ్య కలవారిని, వివాహ తేదీలను ఇచ్చి ఉన్నాము. ఇట్టి సరియైన పొంతనలు కలవారే ఒకరినొకరు ప్రేమించి సుఖంగా జీవించగలరు. అంతేతప్ప పొంతన లేనివారు దంపతులైతే, వారికి ఎన్ని భాగ్యములు ఉన్నా వారు ఒకరికొకరు జతగా హాయిగా ఉండలేరు. కేవలం కుటుంబం అనే ఒక కార్యాలయంలో ఇద్దరు అధికారులు మాదిరిగా యాంత్రికంగా వారు బ్రతుకు సాగిస్తారు. ఎన్ని బాగున్నా వారిద్దరూ మనసా ఒకటి కాలేరు.

ఈ పుస్తకమును సరిగా అర్థం చేసుకొనేవారు భవిష్యత్తు గురించి ఎంత మాత్రం భయపడవలసిన అవసరం లేదు. వారికి అనుకొన్నట్లుగానే అన్నీ జరుగుతాయి.

మీ అందరికీ ఈ పుస్తకం వలన సర్వ శుభాలు మరియు ఆయురారోగ్యాలు కలిగేలా చూడవలసిందిగా నేను ఆ జగన్మాతని ప్రార్థిస్తున్నాను. ఆ తల్లి కృపా కటాక్షాలు సదా మీ పై ఉండుగాక!

ఈ పుస్తకంలోని విషయాలను మన దేశంలో ప్రచారం చేసే సమయాలలో, ప్రజలు తమ అజ్ఞానం కారణంగా వారు తమ జీవితంలో ఈ కళను ఉపయోగించుకొనరని అనిపించేది. "వీరు ఆకలితో శోషిల్లి పడినవారే అంతేకాని భుక్తాయాసంతో కాదు". అయితే వీరిని మూర్ఛ నుండి లేపితే ఉత్సాహంతో ఉరకలు వేస్తారు. మీద పడి మొత్తం లాక్కోవాలని చూస్తారు. అదండీ సంగతి. ఇకపోతే, ఇది అందరికి అందించవలసిన 'శివప్రసాదం'... దీనిని అందరూ ఆరగించాలి...అనే ఈ అద్భుతమైన దృశ్యాన్ని నాకు చూపించిన శ్రీ శంకర భగవత్పాదుల వారి ఆజ్ఞానుసారం లక్షలాది ప్రజలను జాగృత

పరిచే ప్రక్రియలో నేను కొనసాగుతూ ఉన్నాను. ఎవరికి కావలసినంత ప్రసాదం వారు తీసుకో వచ్చు. హాయిగా ఆరగించవచ్చు. ఇదంతా ఒక్కొక్క వ్యక్తి వ్యక్తిగత సామర్థ్యం పై ఆధారపడి ఉన్న సత్యం.

## ప్రపంచంపై
## సంఖ్యాశాస్త్ర ప్రభావం

సంఖ్యాశాస్త్రం ధ్వని, తరంగాలు, విద్యుత్తు, వాయువు వంటి అదృశ్య రహస్యమయ శక్తులు మరియు ప్రకంపనల శాస్త్రం. వీటి శక్తిని మనం మన కళ్ళతో చూడలేం, కాని వీటిని మనం మన ఇంద్రియ శక్తితో గ్రహించగలం. నా ద్వారా సంఖ్యాశాస్త్ర నియమాల ప్రకారం పేరు మార్చుకున్న వ్యక్తులు ఆర్థికంగా నిమ్న స్థాయినుండి పెరిగి ధనవంతులు కావడం, అదీ త్వరితంగా జరగడం నేను గుర్తించాను.

వ్యాపార రంగంలో వెనుకబడ్డ కొన్ని కంపెనీలు సైతం, వాటి యజమానుల పుట్టిన తేదీలకు తగిన విధంగా పేర్లు మార్చి సంఖ్యాశాస్త్ర నియమాల ప్రకారం మార్పులు చేసినప్పుడు, అభివృద్ధి పథంలో పయనించి, లాభాలు ఆర్జించటం నిజంగా చూసేవాళ్ళకి ఆశ్చర్యం మరియు అద్భుతంగా కనిపించటం సహజం నేను ఇలా అనేక కంపెనీల పేర్లు మార్చి వాటి అభివృద్ధికి సహకరించటం జరిగింది. అవి అద్భుతంగా నష్టాల బాట నించి లాభాల మార్గంలో దూసుకు పోవటం జరిగింది. ఇదంతా చూస్తే ఎవరికైనా ఏమనిపిస్తుంది? నిజంగా అక్షరాల వెనుక, వాటి రహస్యమయ ధ్వని తరంగాల వెనుక ఏదో ఒక అదృశ్య శక్తి దాగి ఉందని అనిపించదా? సందేహం లేదు. వీటి వెనుక నిజంగా ఒక అద్భుతమైన అనంత శక్తి దాగి ఉంది. ప్రతి నిర్జీవ అక్షరం నాభిలో ఒక అనంత నిద్రాణ మహా శక్తి దాగి ఉంది. దీనిని బయటకు తీయవలసిన బాధ్యత మనపై ఉంది.

ఇదొక అద్భుతమైన విజ్ఞానం. దీని గురించి ఎక్కడా సరియైన ప్రచారం జరుగలేదు. అయితే దీని శక్తిని గుర్తించి ఉపయోగించుకోవలసిన అవసరం మనకి ఎంతైనా ఉంది. ఇది తనదైన పద్ధతిలో సహజ ప్రకంపనలకు అనుకూలంగా పనిచేస్తుంది. స్వానుభవం ద్వారా మాత్రమే మనం దీనిని గుర్తించగలం.

దేశాల పేర్లు కూడా ఈ నియమానికి అతీతం కాదు. వీటిపై కూడా సంఖ్యాశాస్త్ర ప్రభావం నిర్ద్వంద్వంగా కనిపిస్తుంది. అనుకూలంగా పెర్లు మార్చినప్పుడు ఈ దేశాలు కూడా అద్భుతంగా ప్రగతిపథంలో పయనించటం జరిగింది, జరుగుతున్నది. కాబట్టి, ఇది ఎంత మాత్రమూ అశ్రద్ధ చేయవలసిన శాస్త్రం కానే కాదు.

ముందుగా మన దేశం పై ఈ సంఖ్యాశాస్త్ర ప్రభావాన్ని వివరిస్తాను. కొన్ని ఉదాహరణల ద్వారా ఇది ఎంత వరకు నిజమో చూపించే ప్రయత్నం చేస్తాను. ఆ తరువాత దీని నిజానిజాలు మీరే గుర్తించగలరు.

## INDIA

## 15411=12=3

భారత దేశం దీని పౌరుల అనంత భక్తి మరియు అసాధారణ త్యాగాలకు ప్రతీకగా నిలుస్తుంది. అనేక భాషలు మరియు మతాలకు నిలయంగా మారిన ఈ దేశం పుట్టినప్పటినుండి అనేక సమస్యలతో సతమతమవుతూ ఉంది. మన దేశం ఒక సంవేదన కలిగిన స్పందనాత్మక, ధర్మ నిరపేక్ష గణతంత్ర దేశంగా రూపుదిద్దుకొంది. అయితే దేశ విభజన, మత కలహాలు, జాతిపిత మారణకాండ మొదలైన చరిత్రను కుదిపేసే సంఘటనలతో మన దేశం సుఖశాంతులు ఆవిరిగా మారిపోయాయి. అహింస మరియు స్నేహభావానికి పట్టుకొమ్మగా నిలిచే మన దేశం నిశ్సందేహంగా ఒక గొప్ప దేశం. ఇది ఇప్పుడు ఇండియాగా ప్రపంచం అంతా పిలువబడుతోంది. ఆనాడే మనం సంఖ్యా శాస్త్ర ప్రకారం దీని పేరులో మార్పులు చేసి సరిదిద్ది ఉంటే ఇది ఎన్నడో ఒక మహాశక్తిగా అవతరించి ఉండేది. ఇప్పటికి మించిపోయిందేమీ లేదు!...

త్యాగానికి ఒక విశిష్ట ఉదాహరణ- భారతీయ జాతీయ కాంగ్రెస్ (Indian National Congress = 75=7+5=12=3) కూడా ఈ అంకె ప్రభావంలోనికే వస్తున్నది.

కాంగ్రెస్ పార్టీ గురించి కొంత వివరణ :

పేరు : I N D I A N   N A T I O N A L   C O N G R E S S

1 5 4 1 1 5   5 1 4 1 7 5 1 3   3 7 5 3 2 5 3 3

17 + 27 + 31=75

దీనిని స్థాపించిన తేది: 28.12.1885 = 35 = 8 (1 మరియు 8)

ఈ పార్టీ పేరు దేశం పేరుతో సమానంగా ఉండటం చేత ఈ పార్టీ సామాన్య భారతీయుల ఆలోచనలకు ప్రతిబింబంగా ఉంటుందని అనుకోవటం జరిగింది.

అదృష్ట సంఖ్య 8 కావటం చేత ఈ పార్టీ అనేక కష్టాలను ఎదుర్కొని, అనేక సంఘర్షణలతో ముందుకి సాగవలసి వచ్చింది. ఈ పార్టీ నేతలకు జైలుకు వెళ్ళటం సామాన్య విషయంగా మారింది. (ఇంతకు ముందు అధ్యాయాలు శ్రద్ధగా గమనిస్తే 6అంకె 3అంకెకి విరోధి అని, 3అంకె 6అంకె మధ్య పొంతన కుదరదని అర్థమవుతుంది. ఈ అంకెల మధ్య సంబంధం అగ్నికి ఆజ్యానికి మధ్య ఉండే సంబంధం వంటిది. భారత దేశానికి స్వాతంత్ర్యం 15 ఆగష్టున వచ్చింది.)

కాంగ్రెస్ పార్టీకి, అనేక కష్టాలు ఎదుర్కొన్న అనంతరం, తన సంఘర్షణల 62(8)వ సంవత్సరంలో విజయం లభించింది. అనేక మంది జ్యోతిష్కులు ఏదైనా ఒక శుభ దినాన స్వాతంత్ర్య ప్రకటన చేస్తే బాగుంటుంది అని అనటం జరిగింది. అయితే స్వాతంత్ర్యం పొందేందుకు దేశం ఎంతమాత్రమూ వేచి ఉండవలసిన పని లేదు అని ఒక గొప్ప నాయకుడు గట్టిగా చెప్పటం జరిగింది. కాబట్టి పరిస్థితులలో మార్పులు తీసుకువచ్చే శుభ దిన నిర్ణయం జరుగలేదు. ఆ తరువాత మన దేశం పరిస్థితి ఎలా ఉన్నదీ, ఎలాంటి ప్రభావాలకు గురి అయినదీ మనందరికీ తెలిసినదే.

భారతదేశం మరియు ఆపలేని సంఘటనలు

| సంఘటన | తేది | అంకె |
|---|---|---|
| స్వాతంత్ర్య దినం | 15.08.1947 | 6మరియు 8 |
| మహాత్మా గాంధీ హత్య | 30.01.1948 | 3 మరియు 8 |
| గణతంత్ర దినం | 26.01.1950 | 8 మరియు 6 |
| భారత దేశపు మొదటి ప్రధాన న్యాయాధిపతి ప్రమాణం చేసిన దినం | 26.01.1950 | 8 మరియు 6 |
| చైనా సైన్యం నేఫాలో భారతీయ స్థావరాలపై మొట్టమొదటి సారిగా దండెత్తిన తేది (దీనివలన ఇలా 20.10.1962 తేదీన యుద్ధం ప్రారంభమై, అనేక శతాబ్దాల పురాతన భారత-చైనా మైత్రి దెబ్బతిని శత్రుత్వం ప్రబలింది.) | 17.10.1962 | 8 మరియు 9 |

| సంఘటన | తేది | అంకె |
|---|---|---|
| పాకిస్థాన్‌తో జరిగిన 1965 యుద్ధం తరువాత భారత దేశం చక్కగా ఆలోచించేందుకు బదులు తొందరపాటుతో యుద్ధ విరమణ ఒప్పందం పై సంతకం చేసినది. | 23.09.1965 | 5 మరియు 8 |
| భారత దేశం పోఖ్రాన్‌లో మొదటి అణు పరీక్ష జరిపినది. | 18.05.1974 | 9 మరియు 8 |
| జాతీయ అత్యవసర పరిస్థితి ప్రకటన, దాని ద్వారా లేచిన వివాదాలు | 26.06.1975 | 8 మరియు 9 |
| గుజరాత్‌లో భూపకంపం, దీనితో చెలరేగిన కష్టాలు | 26.01.2001 | 8 మరియు 3 |
| గోద్రా రైల్వే స్టేషన్‌లో ప్రయాణికులతో సహా కాల్చి వేయబడిన ‘‘సబర్మతి ఎక్స్‌ప్రెస్’’ అలహాబాద్ రైల్వే స్టేషన్‌లో బయలు దేరిన తేది | 26.02.2002 | 8 మరియు 5 |
| **సునామి** – ఎవరూ ఊహించలేని సునామి దుర్ఘటన మరియు దాని ద్వారా భారతీయ తీర ప్రాంతంలో సంభవించిన దారుణమైన సంపూర్ణ నష్టం ఏర్పడింది | 26.12.2004 | 8 మరియు 8 |
| పాకిస్తాని ఉగ్రవాది అజ్మల్ కసాబ్ మరియు అతని అనుచరులు ముంబైలో జరిపిన అతి దారుణమైన దాడి, అమాయకులైన 300 మంది భారతీయులు ఆ సంఘటనలో ప్రాణాలు కోల్పోయిన తేది | 26.11.2008 | 8 మరియు 2 |

ఇప్పుడు శరణార్థులు, ఆంతరిక సమస్యలు, ఉగ్రవాద సమస్యలు, కరువు , వరదలు

వంటి అనేక సమస్యలను దృష్టిలో పెట్టుకొని మనం మన దేశ భవిష్యత్తు గురించి ఆలోచించ వలసిన అవసరం ఎంతైనా ఉంది. మన దేశానికి ఎక్కువ అనుకూలమైన స్నేహ పూర్వక అంకె వచ్చే కొత్త పేరు ద్వారా శని కోప దృష్టి నుంచి మనం మన దేశాన్ని రక్షించవచ్చు.

## అంకె **18** మరియు దాని ప్రభావం

ఈ గ్రంథంలో, 1954లో తమిళ మూలంలో ఈ అంకె 18 గురించి వివరించిన సమయంలో, ఇది దుర్ఘటనలు మరియు రక్తపాతానికి నిలయమైన అంకె అని చెప్పబడింది. మహాభారత యుద్ధం 18 రోజులు వరకు జరిగింది. అత్యంత పవిత్రమైన గ్రంథంగా పేరుపడిన 18 అధ్యాయాల భగవద్గీత కూడా యుద్ధం ప్రారంభానికి ఒక సాధనంగా నిలిచింది. ఈ విధంగా 18 అంకె ప్రభావాన్ని మనం తక్కువగా అంచనా వేయకూడదు.

ఇప్పుడు మనం మన దేశంలోని కొన్ని ముఖ్య నగరాలను తీసికుని, వాటి మీద 18 అంకె ప్రభావం ఎలా ఉన్నదో పరిశీలించి చూద్దాం.

**KASHMIR** **SRINAGAR**

**2135412 = 18** **32151312 = 18**

**GUJARAT** **AMRITSAR**

**3611214 = 18** **14214312 = 18**

## KASHMIR - 18

మన దేశంలో అత్యంత రమణీయమైన స్థలంగా పేర్కొనబడే కాష్మీర్ 18 అంకె ప్రభావంలోనికి వస్తుంది. మనకి స్వాతంత్ర్యం వచ్చినప్పటి నుండి ఇంతవరకు మన దేశం ఈ రాష్ట్రం పై విపరీతంగా ధనం వ్యయం చేయటం జరిగింది, జరుగుతూ ఉన్నది. దీనికి పాకిస్థాన్ దేశం వలన ఎప్పుడూ ఏదో ఒక ప్రమాదం ముంచుకువస్తూనే ఉన్నది. ఇక్కడ జరిగినన్ని హత్యలు, మారణహోమాలు మరే రాష్ట్రంలో కూడా జరగటం లేదు అన్నది

మనందరికీ తెలిసినదే. ఇక్కడ ఎప్పుడూ అశాంతి, ప్రాణ భయంతో ప్రజలు దినదిన గండంగా బ్రతుకుతూ ఉన్నారు. ఈ రాష్ట్రంలో చుట్టూ అప్రమత్తంగా తిరిగే సైనికులు మరియు పొంచి ఉండి అమాయకులపై కాల్పులు జరిపే ఉగ్రవాద శక్తులు కలిసి ఈ రాష్ట్రాన్ని నిత్య యుద్ధ భూమిగా మార్చి వేసాయి. ప్రపంచంలో ఎవరైనా సరే, ఇక్కడకు పర్యటనకు రావటానికి భయపడే సంచలనాత్మకమైన వాతావరణం ఈ రాష్ట్రంలో నెలకుని ఉంది. ఈ రాష్ట్రం రాజధాని అయిన శ్రీనగర్ కూడా 18 అంకె ప్రభావంలోనికి రావటంతో ఈ పరిస్థితి ఇంత దారుణంగా మారింది. 18 అంకె ప్రభావాన్ని అర్థం చేసుకోవడానికి ఇదొక ఉదాహరణ.

## GUJARAT = 18

గుజరాత్ రాష్ట్రం కూడా 18 అంకె ప్రభావంలోనికి వస్తుంది. అనేక ప్రాకృతిక ఆపదలు, సాంప్రదాయక అలజడులు, రాజకీయ గొడవలు ఈ రాష్ట్రానికి సర్వసామాన్యంగా మారాయి. ఈ కారణంగా ఇక్కడ ఎందరో ప్రాణాలు కోల్పోతున్నారు. (ఇక్కడ జరిగిన అతి పెద్ద భూకంపం తేదీని ఒకసారి పరిశీలించండి. అది 26.01.2001.)

## AMRITSAR = 18

దీని మొదటి పేరు అమృత సరోవరం. తరువాత ఇది అమృత్సర్ గా మారింది. ఈ చరిత్రాత్మకమైన మహా నగరం కూడా సంఖ్యా శాస్త్రం ప్రకారం 18 అంకె ప్రభావంలోనికి రావటం ఒక విశేషం. ఇది మంగళ గ్రహానికి సూచకమైన సంఖ్య. శని గ్రహానికి సూచకమైన అంకె 8 మరియు మంగళ గ్రహానికి సూచకంగా ఉండే 9 అంకె ఈ ఐతిహాసిక నగరానికి రెండు దుష్ప్రభావా ఛాయలుగా నిలిచాయి.

- ROWLOATTACT=35 దీని లక్ష్యం భారతీయుల దేశ భక్తి భావనను నిర్దాక్షిణ్యంగా అణచివేయటం

- సిక్కు నాయకులను మూకఉమ్మడిగా అరెస్టు చేయటం ప్రారంభించిన తేది 11.4.1919 =2 & 8

- JALLIANWALA= 26 = 8 బాగ్ అంటే అర్థం పూదోట అని. దీనిని వేరుగా రాస్తాం కాబట్టి ఇక్కడ అవసరం లేదు.

- జనరల్ డయర్ ద్వారా జరపబడిన నరసంహారం జరిగిన తేది 13.4.1919 (భయంకరమైన రోజు) GENERAL DYER=36=9(యుద్ధగుణం)

- భయానకమైన 'క్రాలింగ్ ఆర్డర్' సంతకం చేయబడిన తేది 17.4.1919 = 8 & 5

- దీనికి ఆర్డర్ జారీచేసిన లెఫ్టినెంట్ గవర్నర్ - SIR MICHAEL O'DWYER = 53 = 8

- ఆయన్ని లండన్లో హత్య చేసిన ఊధమ్ సింగ్ పుట్టిన తేది 26.12.1899 =8 & 2

- ODWYER (ఒ' డయర్) హత్య 13.03.1940 తేదీన జరిగింది. (ఇది మరొక భయంకరమైన రోజు)

బొంబాయి మొదట షష్ఠి ద్వీపంగా పిలువబడేది. 1535లో దీనిని పోర్చుగీసు వారు పాలించేవారు. తరువాత వారు 18.2.1665 (9 & 2) దీనిని బ్రిటీష్ వారికి బహుకరించారు. అప్పుడు బొంబయి మరియు సాల్సెట్టె ద్వీపాలను ఒక కాజీపే ద్వారా ముఖ్య భూమితో కలుపుట జరిగినది. ఆ తరువాత హమ్ ఫ్రీ కుక్ అనే బ్రిటిష్ అధికారి దీనికి బొంబాయి (నెం. 17) అని పేరు పెట్టడం జరిగింది. మన దేశంలో ఈ పట్టణం ఎలాంటి ఆర్థిక, రాజ నైతిక మరియు సామాజిక భూమిక నిర్వహించిందో మనందరికి తెలిసిందే.

ఇప్పుడు దీనికి ముంబాయి (నెం. 18) అని కొత్త పేరు పెట్టబడింది. ఇక ఈ సంఖ్య ప్రభావం ఏమిటన్నది మనకి తెలిసినదే. అల్లర్లు, కొట్లాటలు, రక్తపాతాలకు నిలయమైన సంఖ్య ఇది.

'ముంబాదేవి' పేరులో ఎలాంటి మార్పు చేయకుండా, ఇంగ్లీషులోని వాడుకలో ఉన్న పరస్పర వైరుధ్యం కలిగిన తత్త్వాలను తొలగించి ముంబాయి (18) సంఖ్యా శాస్త్ర నియమాల ప్రకారం సముచితంగా మార్చవచ్చు, ముంబాదేవి కృపా కటాక్షాలను మనం పుష్కలంగా పొందవచ్చు కూడా. దీనిని ఆ విధంగా ఈ దేశంలోకెల్లా అత్యంత మహత్తరమైన నగరంగా మార్చవచ్చు. జరిగిపోయిన సంఘటన తేదీని మనం సరి చేయలేము అని అనుకోవటం అనవసరం. ఏదైనా ఒక స్థానంలో పరిపాలనలో ఉన్న

నాయకులందరి పేర్ల ప్రభావం విషయంలో కూడా ఇది వర్తిస్తుంది. కాబట్టి దీనిని అసంభవం అని అనుకోరాదు.

మనం ఏదైనా ఒక నిర్ణయం తీసుకునే ముందు, సంఖ్యా శాస్త్రం ప్రకారం ఆలోచించి, మిక్కుటమైన అప్రియ సంఘటనలు, వ్యాపారంలో నష్టం కలిగించే మార్పులు, ప్రజల ఆరోగ్యంలో ఏర్పడే దుర్భర పరిస్థితులను మనం మార్చలేమా?...

దయచేసి ఒక విషయాన్ని గుర్తు పెట్టుకోండి. మందులేని అనారోగ్యం, జవాబు లేని ప్రశ్న ఉండటం చాలా అరుదుగానే జరుగుతుంది. అయితే సమస్యకి తగిన చక్కని పరిష్కారాన్ని వెదుక్కోవడం అనేదే ఇక్కడ ముఖ్యమైన విషయం.

**POONA** **PUNE**

**8 7 7 5 1 = 28** **8 6 5 5 = 24**

మహారాష్ట్రంలో ఒక ప్రముఖ పారిశ్రామికుడు మరియు లోక శ్రేయోభిలాషి అయిన ఒక మహానుభావుడు తమ వ్యాపారం మరియు తమ వ్యక్తిగత జీవితం మొదలైన విషయాలలో సంఖ్యా శాస్త్రం ప్రకారం భవిష్యత్తు ఎలా ఉంటుంది అన్నది తెలుసుకునేందుకు మా తండ్రిగారిని తరచుగా కలుసుకునేవారు. ఆ సమయంలో మా తండ్రిగారు 'పూనా' (POONA) నగరం పేరుకి ప్రతికూలంగా సంఖ్యా శాస్త్రం ప్రకరం తమ అభిప్రాయాలను వెలిబుచ్చారు. అయితే, ఈ పూనా నగరం మా తండ్రిగారి వద్దకు వచ్చే ఆ పారిశ్రామికునికి కావలిసిన ఒక ముఖ్యమైన నగరం. దాని పేరుని మరాఠీలో దాని మౌలిక నామం అయిన 'పుణె'గా ఎందుకు మార్చకూడదు? అని మా తండ్రిగారు అన్నారు. ఆ సందర్భంలో వారు పేరులోని అక్షరాల సంఖ్యా ప్రభావాన్ని తెలియ చేసారు. (POONA = 28; PUNE = 24).

ఆ నగరానికి పూనా నుండి పుణె అని పేరు మార్చితే దాని అభివృద్ధి, దాని మహాత్మ్యం విశేషంగా పెరుగుతాయని ఆ పారిశ్రామికుడు మా తండ్రిగారి ద్వారా తెలుసుకున్నారు.

సమయం గడవసాగింది. ఆ పారిశ్రామికునికి రాజకీయ మరియు సామాజిక రంగాలలో మంచి పేరు మరియు చక్కని సత్సంబంధాలు ఉన్నవి. వారు తమ

సంబంధిత ఉన్నత వర్గాలలో పూనాకి 'పుణె' అని నూతనంగా నామకరణం చేస్తే బాగుంటుందని తరచుగా చెప్పేవారు. ఈ విధంగా ఈ విషయానికి విశేష ప్రచారం జరిగింది. ఈ ప్రచారానికి ఫలితం ఏమిటన్నది మనందరికి తెలిసినదే. దీనికి చరిత్ర సాక్షి. పూ నాకీ పుణే అని పేరు మార్చి, మా తండ్రిగారి మాటకి పరోక్షంగా గౌరవం అందించారు. ఇలా పేరు మారిన తరువాత పుణే అభివృద్ధి అమోఘంగా జరిగింది.

ఇలా మనం పరిశీలిస్తూ పోతుంటే ఇంకా చాలా ఉదాహరణలు కనిపిస్తాయి. BARODA (17) మారి VADODARA (26) అయినప్పుడు దాని పరిణామం ఎలాంటిదన్నది మనకి తెలిసిందే కదా! మంచి అదృష్ట సంఖ్య కలిగిన పేరుతో ఉన్న రాష్ట్రం KERALA (14) ఎందుకు పూర్తిగా సత్ఫలితాలు ఇవ్వలేకపోతున్నది? ఎందుకంటే దీని రాజధాని పేరు 67 సంఖ్య ఆధీనంలోనికి వస్తున్నది. దాని మొదటి పేరు సంఖ్య అయిన 35 కంటే ఇది ఏమంత గొప్పది కాలేకపోయిందా ? (67ని మనం శ్రద్ధగా పరిశీలిస్తే ఒక విచిత్రమైన సమస్య బయటపడుతుంది- ఇదే KERALA అనే మంచి పేరుని బలహీనంగా మార్చుతున్నది.) KOCHIN (24) మారి KOCHI (18) అయింది. అయినా ప్రయోజనం లేకపోయింది. రాష్ట్ర ప్రముఖ పాలా నధికార వ్యక్తి ద్వారా, అతను పుట్టిన తేదీ మరియు నామ తిథి ప్రకారం లెక్కించి నిజమైన శుభ తిథిని పదవీ స్వీకారం చేయడం జరిగితే దానివలన నిజంగా ఆశ్చర్యదాయకమైన శుభ ఫలితాలు లభిస్తాయి.

CALCUTTA (25) మారి KOLKATA (20) అవటం జరిగింది. 25 మరియు 20 సంఖ్యల చరిత్రను పరిశీలించి సరిపోల్చండి. 26 సంఖ్య కలిగిన ఒక శక్తిమంతుడైన నాయకుడు తెరమరుగుకి పోవలసి వచ్చింది, ఇది ఎంతో స్వాభావికంగా జరిగినట్లు కనిపిస్తున్నా సరే. ప్రస్తుతం 20 సంఖ్య కలిగిన ధ్వని పరికరం ఉంటే దాని ద్వారా శాంతిని కలిగించే ధ్వనులు ఉద్భవిస్తాయి. ఏమైనప్పటికి, విపరీతంగా ఏమీ జరగకూడదు.

ఏదేనా ఒక లాభదాయకమైన సంఖ్యతో అవసరమైన మార్పులు చేస్తే దాని ద్వారా అన్ని స్థానాలకు సముచితమైన ప్రయోజనం లభిస్తుంది. ఈ పరివర్తన ద్వారా శాంతి, సుఖసమృద్ధులు మరియు ప్రజలలో సద్భావనా సంచారం మొదలైన అనేక

ప్రయోజనాలు లభిస్తాయి.

కాబట్టి నడుం బిగించండి.నిజాన్ని గుర్తించి మేల్కొనండి. లక్ష్య సిద్ధి పొందే వరకు నిరంతరం శ్రమించండి.

అంకె **18** మరియు దేశాలపై దాని ప్రభావం

కొన్ని దేశాల పేర్లు మార్చిన తరువాత 18 సంఖ్య ప్రభావం అధీనంలోనికి వెళ్ళటం జరిగింది. ఈ పరివర్తన వలన ఆ దేశాలు ప్రగతి పథం నుంచి దారి తప్పి పతనం వైపు పయనించటం జరిగింది. ఈ సంగతిని కొన్ని ఉదాహరణల ద్వారా ఇప్పుడు పరిశీలిద్దాం.

| **CEYLON** | **SRI LANKA** |
| --- | --- |
| **351375 = 24** | **32131521 = 18** |

CEYLON దక్షిణ భారత దేశానికి చాలా దగ్గరలో ఉన్న దేశం. ఈ దేశం చెప్పుకోతగిన రీతిలో అభివృద్ధి సాధిస్తూ ఉంది.

ఈ విధంగా ప్రపంచంలో ఇది ఒక అభివృద్ధికరమైన దేశంగా పేరు గడించింది. తేయాకు ఎగుమతి ద్వారా ప్రపంచ విపణిలో సిలోన్ కి అధిక భాగం ఉంది. ఆర్థికంగా మాత్రమేకాక అందమైన దేశంగా పర్యాటక స్థానంగా కూడా దీనికి గుర్తింపు లభించింది. అయితే, దురదృష్టవశాత్తు దీని పేరు శ్రీలంక (SRILANKA) అని మార్చారు. అదే ఈ దేశానికి దురదృష్టంగా పరిణమించింది. దీని అదృష్ట సంఖ్య 18 అయింది. ఈ సంఖ్య సంఖ్యాశాస్త్ర సిద్ధాంతాల ప్రకారం దుష్పరిణామాలు కలిగిస్తుంది. రక్తపాతం, అల్లర్లు, హత్యలు, ప్రకృతి ప్రకోపం కారణంగా ఏర్పడే ప్రమాదాలు మొదలైనవాటికి ఈ సంఖ్య ఆలవాలం.

సిలోన్ పేరు శ్రీలంకగా మారిన తరువాత నుంచి ఇక్కడ పరిస్థితులన్నీ తారుమారు అయ్యాయి. పైన చెప్పిన దుష్పరిణామాలన్నీ దీనిని చుట్టుకున్నాయి. అనేక సాంప్రదాయక పోరాటాలు, మారణ హోమాలు సామాన్య విషయంగా మారాయి. 20 సంవత్సరాల అనంతరం కూడా ఈ సమస్యలకు సామరస్య పూర్వకమైన పరిష్కారం లభించలేదు.

ఈ గ్రంథం తమిళ మూలంలో 1954లో ఈ 18 అంకె గురించి రాస్తూ, ఇది చాలా

దురదృష్టకరమైన అంకె అనీ, దీని ద్వారా భయంకరమైన దుర్ఘటనలు, రక్తపాతాలు, ప్రాణహాని జరుగుతాయని రాయటం జరిగింది. ఉదాహరణగా 18 రోజులు కొనసాగిన మహాభారత యుద్ధం గురించి చెప్పటం జరిగింది. అందుచేత 18 సంఖ్య ను ఏవిధంగాను తక్కువగా అంచనా వేయకూడదు. అయితే, 18 సంఖ్య వచ్చే దేశాలలో తిరిగి సమృద్ధి, సుఖ శాంతులు మరియు ప్రగతి తీసుకురావటం అసంభవం ఏమీ కాదు. అయితే సంఖ్యా శాస్త్ర ప్రకారం పేరులో సముచితమైన మార్పు చేయటం చాలా అవసరం.

| **BURMA** | **MYANMAR** |
|---|---|
| **26241 = 15** | **4115412 = 18** |

15 సంఖ్య క్రిందకు వచ్చే బర్మా విషయంలో నిజానికి అంతా బాగానే ఉండాలి. దీనికి అన్నీ ఉత్తమ ఫలితాలే ఉండాలి. బర్మాని ఆసియా ఖండంలో ధాన్య నిలయంగా పేర్కోటం జరుగుతుంది. ప్రపంచానికి ధాన్యం మరియు మాణిక్యాలు (RUBIES) ఎగుమతిలో బర్మా దేశానికి ప్రాముఖ్యత ఉంది.

అయితే ఈ దేశం పేరు మార్చి, మ్యాన్ మార్ (MYANMAR) అని కొత్త పేరు తీసుకురాగానే 18 సంఖ్య దురదృష్టకర ప్రభావంలోనికి ఇది వచ్చేసింది. ఇలా పేరు మార్చాక ఈ దేశం పరిస్థితి ఎలా మారిందన్నది మనందరికి తెలిసిందే. ఈ దురదృష్టకరమైన సంఖ్య 18 ప్రభావాన్ని తప్పించుకోవటం ఎవరికీ సాధ్యం కాదు, సంఖ్యా శాస్త్రం ప్రకారం అదృష్ట సంఖ్య అనుకూలంగా వచ్చే పేరు మార్చితే తప్ప.

ప్రపంచంలో ధాన్యం ఎగుమతిలో అగ్రస్థానంలో ఉన్న బర్మా, పేరు మారి మ్యాన్ మార్ అయింతర్వాత అనేక సమస్యలని ఎదుర్కొంది. ధాన్యాన్ని ఎగుమతి చేసే స్థానంలో ప్రస్తుతం దిగుమతి చేసుకోవలసి వస్తుంది. ఈ విధమైన దురదృష్టానికి కారణం నిశ్సందేహంగా పేరు మార్పే. ఇప్పటికైనా అదృష్టకరమైన సంఖ్య వచ్చే అనుకూలమైన పేరుని ఆశ్రయిస్తే ఈ దేశం సమస్యలు గట్టెక్కి, ఇది మళ్ళీ ప్రగతి పథంలో పయనించడం ఖాయం. సంఖ్యా శాస్త్ర ప్రభావాన్ని తక్కువగా అంచనా వేయకూడదని ఈ ఉదాహరణలు తెలియజేస్తున్నాయి.

అంకే **16**మరియు జపాన్

**JAPAN**

**11815= 16**

16 సంఖ్య ఆధీనంలోనికి వచ్చే దేశం జపాన్. ఈ సంఖ్య గురించి ప్రాచీన గ్రంథాలలో ఈ విధంగా చెప్పబడింది- 'ఒక మహోన్నత భవనం మీద పిడుగు పడింది. ఆ భవనం శిఖరం మీద నిలబడ్డ మహారాజు కిరీటంతో సహా తల్లక్రిందులై నేలను తాకాడు.'

ఈ విషయం జపాన్ విషయంలో నూటికి నూరు పాళ్లు నిజం. ప్రపంచ యుద్ధంలో హీరోషిమా మరియు నాగసాకి పట్టణాల మీద బాంబు దాడులు జరిగినప్పుడు ఈ దేశం నేలమట్టం అయింది. ఆ విధంగా ఈ సంఖ్య జపాన్ దేశానికి దురదృష్టంగా పరిణమించింది. భూకంపం వంటి ప్రకృతి సిద్ధమైన ఈతి బాధలు కూడా జపాన్ ఎదుర్కోవలసి వస్తున్నది.

లక్కీ స్విట్జర్లాండ్

**SWITZERLAND**

**36147523154=41**

నేను ఐరోపా యాత్ర చేసినప్పుడు స్విట్జర్లాండ్ లో ఒక సభలో మాట్లాడుతూ, "ఈ ప్రపంచం రెండు ప్రపంచ యుద్ధాలను చూసింది. ప్రపంచ యుద్ధాల పరిణామంగా అనేక దేశాలు ఎన్నో ఇబ్బందులకు గురి అయ్యాయి. ఒక విధంగా ఆ దేశాలలో అభివృద్ధి నిలిచిపోయింది అని చెప్పవచ్చు. జర్మనీకి చాలా దగ్గరలో ఒక దేశం ఉంది. ఇంత దగ్గరలో ఉన్నప్పటికి ఈ రెండు ప్రపంచ యుద్ధాలలో ఈ దేశంపై ఎలాంటి దురాక్రమణా జరగలేదు. ఈ దేశం ఏమిటని ఆలోచిస్తున్నారా? ఇదే, స్విట్జర్లాండ్ (SWITZERLAND = 41) - ఈ సంఖ్య ఒక తటస్థ సంఖ్య. అంతేకాక ఇది శాంతి మరియు సమరస భావనలకు నిలయం కూడా. అందుకే, స్విట్జర్లాండ్ పై ఎలాంటి దురాక్రమణా జరగలేదు. అలా ప్రక్కనే ఉన్నప్పటికి ప్రపంచ యుద్ధాల ప్రభావానికి దూరంగా ఉంది." (సభలో కరతాళ ధ్వనులు మిన్ను ముట్టాయి.)

అంకె శాస్త్ర ప్రభావం ఎడారిలో పూలతోట లాంటిది. సముచిత పద్ధతిలో నామ పరివర్తన చేసి ధ్వని ప్రకంపనల ప్రయోజనాన్ని సువ్యవస్థిత పద్ధతిలో మార్చితే, ఈ మార్పు వలన సమస్త మానవ జాతి మరియు దేశాలు సముచిత లాభం పొందగలవు.

ఇంతెందుకు, **సంఖ్యలు ప్రపంచాన్ని శాసిస్తాయి** అని చెప్పటం సముచితంగా ఉంటుంది. మనిషి పేరు మార్చితే మనిషికీ, దేశాల పేర్లు మార్చితే ఆ దేశాలలోని సమస్త జనానికి ప్రయోజనం లభించడం నిశ్చయం.

సంఖ్యా శాస్త్రం ప్రకారం సముచితనామ పరివర్తన ద్వారా సర్వతో ముఖ పురోభివృద్ధి సాధ్యం. సమస్త జనులు సుఖశాంతులతో సర్వైశ్వర్యాలతో తులతూగటం సాధ్యం. కాబట్టి, ఈ శాస్త్రాన్ని తక్కువ అంచనా వేయటం లేదా కించ పరచటం తగదు.

ఏ శాస్త్రం అయినా ఒక ప్రయోజనం కలిగించటానికే ఉద్భవిస్తుంది. దానిని గ్రహించి, సక్రమంగా దానిని ఉపయోగించుకోవటం బుద్ధిమంతుల పని. సంఖ్యా శాస్త్రం నిస్సందేహంగా సమస్త మానవ జాతికి కళ్యాణం చేకూరుస్తుంది. దీని నుండి పరిపూర్ణ ప్రయోజనం పొందటం ఇక మన వంతు. ఇందుకు విశ్వాసం ముఖ్యం. నమ్మకం లేనిదే అడుగైనా ముందుకు కదలదు.

ఈ గ్రంథాన్ని శ్రద్ధగా, క్షుణ్ణంగా అధ్యయనం చేసి, దీని సారాన్ని గ్రహించ వలసిందిగా పాఠకులను కోరుతున్నాను. సమస్యల నుంచి బయటపడి, మనశ్శాంతితో హాయిగా బ్రతికేందుకు ఈ గ్రంథం సముచిత నామ పరివర్తన విషయంలో దోహదం చేస్తుంది.

ఈ ప్రపంచంలో ఎవరూ ఎవరికీ సహాయం చేయరు. ఎవరికి వారే సహాయం చేసుకోవాలి. ఇది స్థూలంగా చెప్పిన విషయమే అయినా దీనిని సూక్ష్మంగా ఆలోచించి అర్థం చేసుకోవలసిన అవసరం ఉంది. మీకు మీరు సహాయం చేసుకుంటే, భగవంతుని సహాయం దాని వెనుకే ఉంటుంది.

అక్షరాలు మరియు అంకెలు మానవునికి రెండు కళ్ళతో సమానం అని ఈ పుస్తకంలో ప్రారంభంలోనే చెప్పాం. వీటి సహాయంతో వీరు భవిష్యత్తుని చూసే ప్రయత్నం చేయాలి. సముచితంగా ఆలోచించి ఇచ్చిన సలహాలు మరియు చక్కగా విశ్లేషించి తీసుకున్న నిర్ణయాలు ఎన్నడూ మంచే తప్ప చెడు చేయవు. వీటి ద్వారా భాగ్య చక్ర పరిభ్రమణంలో అమోఘమైన ప్రయోజనాలు సాధించవచ్చు.

మీకు, మాకు మధ్య ఉన్నది ఒకే ఒక రహస్యం. దీనిని మీరు మర్చిపోకూడదు. **సంఖ్యలు ప్రపంచాన్ని శాసిస్తాయి...**

# ధనప్రాప్తి, గణితయుక్తి, మనశ్శాంతి

మా తండ్రిగారు నిరాడంబరులు. స్వాతిశయం ఎరుగనివారు. ప్రచారం అంటే బొత్తిగా ఇష్టపడనివారు. వారి జీవితంలో లెక్కకు మించిన ఎన్నో ఆసక్తికరమైన సంఘటనలు జరిగాయి. వాటన్నిటినీ నేను ఇక్కడ రాయటం ప్రారంభిస్తే ఇది ఒక పెద్ద గ్రంథంగా మారుతుంది. వారు తమ జీవితంలోని అనేక సంఘటనలను విపులంగా తమ డైరీలో రాసేవారు. మానవ జీవితంలో ధనప్రాప్తి, గణిత యుక్తి, మనశ్శాంతి అనే వాడుకలోని పదాలకు ఎన్నో గూఢార్థాలు వివరించటం జరిగింది. ఈ విషయాలను ఆసక్తికరంగా ఉంటాయనే ఉద్దేశంతో మాత్రమేకాక, వాటివలన పాఠకులకు ఎంతో కొంత ప్రయోజనం కూడా ఉంటుందనే అభిప్రాయంతో వాటిని ఇక్కడ పొందుపరుస్తున్నాను.

“గణితయుక్తి అనేది జీవితంలో చాలా ముఖ్యమయిన లెక్క. ఇది మన జీవితం నుండి వేరుచేయటానికి వీలులేని ముఖ్య విషయం. అలాగే, కొన్ని నియమాలకు కట్టుబడి ప్రవర్తించేలా చేసేది కూడా. అయితే ఈ నియమాలు ఎన్నటికీ మారవు. వీటిని కాలం గాని, మనుష్యులు గాని మార్చలేరు. ఐదు, మూడు కలిస్తే ఎనిమిది అనేది ప్రపంచమంతటా అంగీకరించబడేదే. కాని వాడుక విషయంలో ఇది నిజం కాదు. దీనికి ముఖ్యంగా రెండు అర్థాలు చెప్పుకోవచ్చు. ఒకటి, మామూలుగా మనకు తెలిసింది. మరొకటి జాలతో మొదలై కోర్టు వ్యవహారాలు, తగువులు వరకు తీసుకువెళ్ళేది. దీనిని కొంచెం వివరంగా చూద్దాం.

బ్యాంకులు, వ్యాపార సంస్థలు, దుకాణాలు మొదలైనవాటిలో కేవలం లెక్కలు మాత్రమే ఉంటాయి. మనం ఎంత ఇచ్చినా అక్కడ తమకు చేరవలసినది మాత్రమే తీసుకుంటారు. మిగతాది అణాపైసలతో సహా తిరిగి ఇచ్చేస్తారు. మన స్నేహితుడే అయినా సరే, బ్యాంకు అధికారి రూ.99కి బదులుగా 100 రూపాయల నోటు ఇవ్వరు కదా? ఎందుకంటే, బ్యాంకు వంటి సంస్థలకు లెక్కలు వెన్నతో పెట్టిన విద్య వంటివి.

కుటుంబ జీవితం, ఇల్లు, మనోభావాలు, అవసరాలు మొదలైనవాటిని బట్టి జీవితంలో గణితయుక్తి మొదలౌతుంది. జాలి దీనికి తల్లి వేరు లాంటిది. ఈ గణితయుక్తి

హద్దులు దాటి, స్వాతంత్ర్య పరిధిలో నడుస్తూ ఉండేది.

ఒకరికి ఒక పని చేయమని చెప్తాం. దానికి కూల నిర్ణయించి, ఆపని ముగిసిన తరువాత అతను, 'కాస్త చూసి ఇప్పించండి బాబూ' అని అడిగితే సామాన్య వసతి కలిగినవారు రూ. 19 ఇవ్వవలసిన చోట రూ. 20 ఇవ్వవచ్చు. ఎక్కువ గణితయుక్తి కలిగినవారు (వీరే ప్రపంచంలో గొప్ప ధనవంతులు, స్వయంకృషి మరియు నిజాయితీతో పైకి వచ్చినవారు) ముందుగా మాట్లాడిన కూలి తీసికొని పొమ్మని అంటారు. వీరికి తమ జీవితంలో వాడుక అన్న మాట లేనేలేదు. అన్నీ వ్యవహారబద్ధంగానే నడుస్తాయి. వీరి పనులన్నీ గణితయుక్తిని అనుసరించే ఉంటాయి.

మరో రెండు ఉదాహరణలు చేస్తే ఈ విషయం ఇంకా స్పష్టం అవుతుంది. మలేషియా దేశంలో ఉండే ఒక వ్యాపార స్నేహితుడు ఒకరు 35 ఏళ్ళ క్రితం నాకు పరిచయం అయ్యారు. ఈయన ఈ శాస్త్ర మును మిగతావారికంటే ఎన్నో రెట్లు ఆనందంగా అనుభవించేవారు. అప్పటికే ఆయన కోట్ల ఆస్తులకు అధిపతి. " నా పేరు ప్రపంచంలో అందరికన్నా ధనవంతునిగా వచ్చునా? ' అని ఆయన తరుచుగా అడిగేవారు. నేను విశ్రాంతిగా ఉన్న సమయం చూసి, నన్ను కలవటానికి వచ్చే తక్కిన మిత్రులతోపాటు వీరు నా ప్రక్కనే ఉండేవారు.

ఇలాంటి సమయాల్లో ఆయన తమ రకరకాల సందేహాలు అడిగి తమ మనసులోని అనేక సమస్యలకు పరిష్కారం వెదికే ప్రయత్నం చేసేవారు. వీరు డబ్బు విషయంలో 'మహాగట్టి' అని పేరు బడ్డారు. వీరు లేనప్పుడు నా మిగతా మిత్రులు, "వీరెందుకు తరచుగా మిమ్మల్ని ప్రశ్నలు అడుగుతూ ఉంటారు ? మీకు ఫీజిచ్చి మీవద్ద సలహాలు తీసుకోవచ్చు కదా? మీరు వారి ప్రశ్నలకు సమాధానాలు ఇవ్వవద్దు" అని వారు అనేవారు.

"ఆయన శాస్త్ర సంబంధమైన ప్రశ్నలే అడుగుతున్నారు కదా? ఆయన బాగా చదువుకొన్నవారు. కాబట్టి వారు ఏ సందేహాలు అడిగినా వాటికి సంతోషంగా సమాధానాలు ఇవ్వటం నా ధర్మం." అని నా స్నేహితులకు చెప్పి సమాధాన పరిచేవాడిని.

ఒకనాడు, మిగతావారంతా వెళ్ళిన తరువాత ఆ మిత్రుడు నావద్దకు వచ్చి, “బాగా ఆలోచించి, మీ సలహా పొందాలని వచ్చాను. మీరు మరో వారం రోజులుదాకా మిగతావారికి సమయం కేటాయించారు. కాబట్టి దయచేసి ఈరాత్రే నాకు మీ సలహా కావాలి. వారం రోజులు నేనాగలేను” అన్నారు.

సరే అని అప్పుడే మొదలుపెట్టి, తెల్లవారుజామున 4 గంటలకి పూర్తి చేసాను. వారికి పట్టలేని సంతోషం. వారు కృతజ్ఞతతో నమస్కరించి, “స్వామీ, నేను కొన్ని ఆదర్శములకు అంకితమైపోయాను. ఒక్క చిల్లి గవ్వ కూడా వృధా చేయను. ఎందుకంటే, మా పూర్వీకులు ఓడలమీద దేశ దేశాలు తిరిగి, ఎంతో కష్టపడి కూడబెట్టిన ధనం ఇది. ఇప్పుడు నేను ఏ కష్టం లేకుండా విమానాల్లో తిరుగుతున్నాను. విరివిగా ధర్మకార్యాలు చేస్తున్నాను. నేను మిమ్మల్నే నా ఇష్టదైవంగా నమ్మాను. ఈ ఊరిలో నా అకౌంట్లో 38 లక్షల డాలర్లు ఉన్నాయి. మిగతా చోట్ల కూడా ఎక్కువగానే ఆస్తులు ఉన్నాయి. కాబట్టి నేను మనస్ఫూర్తిగా మీ మనస్సుకి సంతోషం కలిగేలా ఎంత కావాలన్నా ఇవ్వటానికి నేను సిద్ధం. కాబట్టి మీరు ఎంతమాత్రమూ సందేహించకుండా అడగండి. మీకు కావలసినంత నేను ఇస్తాను. నేను ప్రాణం కన్నా మాటకు ఎక్కువ విలువ ఇస్తాను. నేను రేపు తెల్లవారు జామునే అత్యవసరంగా బయటి ఊరికి వెళుతున్నాను. కాబట్టి మీకు మా మేనేజరు నేను చెప్పిన మొత్తం తెచ్చి ఇస్తాడు. మీ మర్యాదకు భంగం కలుగుతుందని అనుకోకండి. నేను ఎంతమాత్రమూ ఆలస్యాన్ని ఇష్టపడను. మీకు ఇవ్వాల్సింది ఒక్క రోజు కూడా ఆలస్యం కాకూడదు” అని అన్నారాయన.

దీనికి నేనిచ్చిన సమాధానం ఆయనని ఆశ్చర్యపరచింది. “మీరు భోజరాజు వంటి రసిక శిఖామణులు, మహాదాతలు. నేను విద్వాంసుడినే, కాని యాచకుడినో లేదా పేదనో-పేరాశపరుడినో కానేకాను. మీ మిత్రులకన్నా 10డాలర్లు నాకు అధికంగా ఇస్తే చాలు” అని నేను అన్నాను.

“మీరు అలా అనటం సరికాదు. మీకు నాపైన ప్రేమ లేదు. అందుకే నేను ఇస్తానన్నా మీరు తీసుకోనంటున్నారు” అని ఆయన వాదించారు. అయితే నేను ఒకే మాటపై ఉన్నాను. మాట మార్చేవాడిని కానని చెప్పాను .

ఆయన మారు మాటాడకుండా వెళ్ళిపోయారు. నేను దీనికి అంతగా ప్రాధాన్యత ఇవ్వలేదు.

మరునాడు ఉదయం 9 గంటల ప్రాంతంలో ఆయన మేనేజరు ఒక పెద్ద పళ్ళెంలో పువ్వులు, పండ్లు, నూతన వస్త్రాలు, డబ్బు పెట్టి తీసుకు వచ్చారు. వాటిని నాకు ఇచ్చి, సాష్టాంగ నమస్కారం చేసారు. నేను ఎంతగా వద్దన్నా ఆయన ఆపటంలేదు. ఇదంతా నాకు చాలా ఆశ్చర్యం కలిగిస్తూ ఉంది. బహుశా, ఆయన తన మేనేజరుకి నా గురించి గొప్పగా చెప్పారేమో అని నాకు సందేహం కలిగింది.

" మీ యజమాని ఇలా చేయమని అన్నారా?" అని నేను అడిగాను.

“మా యజమాని ఈ డబ్బుని మీకు పూజా ద్రవ్యములతో కలిపి ఇవ్వమని చెప్పారు. “ఈ డబ్బు పెద్ద మొత్తంలో వుందే, దీనిని ఏ లెక్కలో రాయాలి?' అని నేను ఎప్పటిలా అడిగాను. దానికి ఆయన, “ ఇది వారికి వారి అమూల్యమైన సలహాలకు నేను ఇచ్చే ప్రతిఫలం మాత్రమే ' అని అన్నారు.

దానికి నేను, “ అందరూ ఇంత ఇవ్వరు కదా? మనం కూడా వారిలా తక్కువ ఇవ్వవచ్చు కదా!” అన్నాను. అప్పుడు ఆయన కోపంతో, 'చూడు, ఆయన మనకి ఇచ్చింది డబ్బు కన్నా ఎంతో గొప్పది. ఈ విషయాలు నీకు అర్థం కావులే. నేను చెప్పినట్లు చేయి' అని చెప్పి, ఈ ఉదయమే ఊరికి బయలుదేరి పోయారు.

నేను వీరి తండ్రిగారి సమయం నాటి నుండి వీరి దగ్గర పని చేస్తూ ఉన్నాను. నాకు తెలిసినంత వరకు, వీరింట తరచుగా వినబడేది డబ్బే తప్ప మరే విషయమూ ఉండదు. వీరికి ధనమే ప్రధానం. బంధుత్వం కూడా దాని తరువాతనే. వీరి ఇంట్లో ధనమే వేదవాక్కు. అదే సర్వస్వం. అయితే అది ఒక్క వినాయకుని విషయంలోనే వర్తించదు. వినాయకుని పేరు చెప్పి ఎవరు ఎంత అడిగినా కాదనరు. వెంటనే ఇచ్చేస్తారు. మరే దేవుని పేరు చెప్పి అడిగినా ఏమీ ఇవ్వరు.

ఇప్పుడు ఆయన ఇంత సంతోషంగా మీకు ఈ డబ్బు ఇస్తున్నారంటే మీరు తప్పక వినాయక భగవానులే అయి ఉండాలి. అందుకే వస్తూనే నేను మీకు నమస్కరించాను” అని అతడు అన్నాడు.

ఇదంతా విన్న నాకు నవ్వాగలేదు. అతని యజమాని నాకు ఇస్తానన్న డబ్బు వివరములు చెప్పగా ఇంకా ఆశ్చర్యపోయి, బొమ్మలా నిలబడ్డాడు. కొంతసేపటికి తెప్పరిల్లి, "మా యజమాని తామే అంత ఇస్తానని అంటే మీరు ఇంత తక్కువగా స్వీకరిస్తున్నారంటే నిజంగా మీరు సాక్షాత్తు ఆ వరసిద్ధి వినాయకులే అని స్పష్టం అవుతున్నది. వారు అంత ఎక్కువ ఇవ్వబోతుంటే ఇదే చాలని మీరు అన్నారంటే చాలా ఆశ్చర్యంగా ఉంది. ఇదే మరెవరైనా అయితే, కొన్ని లక్షలైనా అడిగి తీసుకొని ఉండేవారు! " అని చెప్పి మళ్ళీ నాకు నమస్కారాలు పెట్టసాగాడు.

మరొకసారి ఆ మేనేజరు, "మా యజమాని దయ వలన ఇప్పుడు నేను ధనవంతుణ్ణి అయ్యాను. ఆయన ఏదైనా అంటే ఆ మాటని తప్పక నిలబెట్టుకొనే గొప్ప వ్యక్తి. నాకు జీతంతో పాటు కొంత పైరాబడి కూడా ఏర్పాటు చేసారు. నేను శెలవుల్లో ఇంటికి పోయేటప్పుడు లెక్క చూసి నాకు ఇవ్వాల్సింది ఇచ్చి పంపుతారు. సుమారు 3 లక్షల డాలర్లే అయినా సరే ఖచ్చితంగా లెక్క చూసి దాని ప్రకారం3 లక్షల, 86వేల డాలర్లు 40 సెంట్లు అని లెక్క పెట్టి ఇస్తారు. (మిగతావారెవరైనా సరే తమ మేనేజర్లకు తగ్గించక ఇంత ఖచ్చితంగా అన్నది ఇవ్వరు. అంతేకాక, ఆయన తన డబ్బుతో నాకు మా ఊరికి టిక్కెట్టు తీసి, ఇంకా బట్టలు, పండ్లు, స్వీట్లు కూడా ఇచ్చి సంతోషపెట్టి పంపుతారు" అని సంతోషంగా చెప్పారు.

ఆ తరువాత నేను ఆయన్ని కలిసినప్పుడు, "మీరు లెక్కల్లో ఎంతో ఖచ్చితంగా ఉంటారు కదా? మరి మీ మేనేజరుకి మాత్రం టిక్కెట్టు, బట్టలు మొదలైనవి మీ ఖర్చుతోనే ఇస్తారట. మరి మీరు వీటిని ఏ లెక్కల్లో చూపిస్తారు ?" అని అడిగాను. అప్పుడు ఆయన, " ఈ అలవాటు అన్ని దుకాణాలలోనూ ఉంది" అని నవ్వేసారు.

ఈ మిత్రుని గురించి మరికొంత వింటే ఎక్కువ శాతం మనుషులకి డబ్బు గురించిన జ్ఞానం ఎంత తక్కువ అన్నది మనకి స్పష్టమవుతుంది. ఒకరోజు ఆయన నావద్దకొచ్చి, "నేనో నిర్ణయం తీసుకోవాలి. దానికి నాకు మీ సలహా కావాలి. ఈ వారంలో ఒక పగలు మీరు నాతో గడపాలి. రాత్రి దాకా నాతో ఉండి, నేను చెప్పింది విని నాకు మీ సలహా చెప్పాలి" అన్నారు.

నేను రెండు రోజుల తర్వాత వీలు చూసుకుని వెళ్ళాను. అప్పుడు ఇంటిలోని అందరినీ రాత్రి వరకూ తిరిగి రావద్దని ఏవేవో పనులు చెప్పి వారికి కావలసినంత డబ్బు ఇచ్చి పంపారు. 'డబ్బు దండగ కదా ? ఎందుకీ ఖర్చులు?' అని నేను అన్నాను. అందుకు ఆయన, ఓ పెద్ద లాభం కోసమే ఈ ఏర్పాటు' అన్నారు.

తన కుమారులు ఇద్దరినీ 3 సంవత్సరాలకి తగ్గని చదువు కొరకు లండను పంపాలని అనుకుంటున్నారు. ఎవరిని ఏ కోర్సులో చేర్చాలని అడిగారు. వీరిని లండను ఎందుకు పంపాలని అనుకుంటున్నారు? ఇక్కడి ఆస్తులను చూచుకొనుటకు ఈ చదువు చాలదా?' అని అడిగాను. దానికి ఆయన, 'మీరు బ్రాహ్మణులు. మీకు ఈ డబ్బు విషయాలు అర్థం కావు' అని అన్నారు.

"నేనూ లోకం చూసినవాళ్లే. వివరంగా చెప్పండి" అని నేను అన్నమీదట ఆయన ఇలా చెప్పారు. " పిల్లలు ఇక్కడ చేసేది ఏమీ లేదు. వీరి అవసరమేమీ ఇక్కడ లేదు. కాని వీరు 3 సంవత్సరాల పాటు విదేశాల్లోనే ఉంటే సుమారు 75 లక్షల ఆదాయం పన్ను మిగులుతుంది. వీరిపై ఎంత ఖర్చుపెట్టినా, హాస్టలు, చదువు ఖర్చులు కలిసి3 లక్షల కన్నా ఎక్కువ కాదు. చూసేవారు ఖర్చుకు వెరవకుండా విదేశాలకు పంపి చదివిస్తున్నారని ఎంతో గొప్పగా చెప్పుకొంటారు కదా?" అని అన్నారు.

"నేను కూడ బొంబాయి షేరు మార్కెట్టులో 1946-47 లో ఆడుకున్నవాడినే. ఎంతో సంపాదించి, ధరల హెచ్చుతగ్గుల గురించి పరిశోధించినవాడినే. అయినా ఇలాంటి ఆలోచన ఎన్ని జన్మలకైనా నాకు రాదు' అనుకొని ఇల్లు చేరాను. దీనిని వీరు ఆదాయం పన్ను వెసులుబాటు ఆలోచనే తప్ప ఆదాయంపన్ను ఎగవేత కాదని నిరూపించారు. గొప్ప విషయం ఏమిటంటే వీరు ఇతరుల సొత్తుకి ఆశపడరు. దేశపు చట్టాలను అతిక్రమించరు.

"తనకు చేరవలసిన దానికన్న ఎక్కువ కోరువాడు దురాశాపరుడు. అర్థతకు మించి మరీ ఎక్కువ అడుగువాడు పేరాశపరుడు. న్యాయమునకు విరుద్దంగా ఎదురుచూడటమే సకల అనర్థాలకు, తగాదాలకు కారణం"

ఇలా మా తండ్రిగారు తమ డైరీలో అనేక విషయాలు రాసుకున్నారు.

జీవితంలో డబ్బు విషయంలో జాగ్రత్త కావాలి. సాధారణంగా ఎక్కువ సమస్యలు డబ్బు సమస్యలే కదా? కాబట్టి మనకి **ధనప్రాప్తి, గణితయుక్తి, మనశ్శాంతి** గురించి మనకి మంచి అవగాహన కావాలి.

**ధనప్రాప్తి** అంటే ధన సంపాదన. ధనం కూడబెట్టటం. రేపటి కోసం దాన్ని సమర్థవంతంగా పెంపొందించుకోవటం. ఇది జీవితంలో చాలా ముఖ్యమైంది. కాబట్టే అనేక బ్యాంకులు, ఆర్థిక సంస్థలు మరియు ఎక్స్ చెక్కర్లు లెక్కలు సరిగ్గా ఉండటం కోసం గణితయుక్తి అంటే లెక్కలు-పద్దుల్ని ఆశ్రయిస్తారు.

**గణితయుక్తి** అంటే లెక్కలు-పద్దులు మాత్రమే కాదు. మా వ్యాపార మిత్రుడి ఉదాహరణ గుర్తుంది కదా? ధన నిర్వహణలో సమర్థత కోసం కావలసింది ఈ గణిత యు అంటే అతిశయోక్తి ఉండదు. ఎందుకంటే దీని వలన డబ్బు విలువ మరియు లెక్కల ప్రాముఖ్యత మనకి అర్థమవుతుంది. ఆర్థిక కష్టాలు వచ్చి నప్పుడు ఇదే మనల్ని కాపాడుతుంది.

**మనశ్శాంతి** అద్భుతమైన హాయి. దీని కోసమే అందరి ఆరాటం. పండిట్ జీ వంటి గురువు' కి పండ్లు-పూలుతో అజ్ఞాతంగా ధన సహాయం అందించటంలోని మనశ్శాంతి అనుభవించలసిందే తప్ప చెప్పేది కాదు.

పాఠకులారా, జీవితంలో **ధనప్రాప్తి** ముఖ్యం. **గణితయుక్తితో** చక్కగా మీ ఆర్థిక లావాదేవీలను నిర్వహించి, ధనాన్ని చక్కగా ఉపయోగించుకోవాలి. జీవితంలో మీరు **మనశ్శాంతితో** హాయిగా ఉండాలి. ఇవే నా ఆశీస్సులు.

**V.S. GURUSWAMY**

# జననం - మరణం

మానవుని జననం మరియు మరణం అనేది సహజం. అయితే ఇది కేవలం భగవంతునికొక్కడికే తెలిసిన విషయం అని అంటూ ఉంటారు. ఇదే నిజమైతే మా తండ్రిగారిని దేవునిగా చూడవలసిందే. ఎందుకంటే, ఎంత గొప్ప డాక్టరయినా బిడ్డ ఎప్పుడు పుట్టునో ఖచ్చితంగా చెప్పలేడు కదా. మా తండ్రిగారు తమ పరిశోధనల ఫలితంగా ఇటువంటి గొప్ప విషయములను అవలీలగా చెప్పేవారు. మా అన్న పుట్టుటకు సరిగా 5 నెలలకు ముందు, ఎంతో మామూలుగా నాకు రాబోవు ఆగస్టు 19వ తేదీన మగబిడ్డ కలుగబోవుచున్నాడని చెప్పేవారు. ఏ ఆధారంతో ఈయన ఇలా చెప్పుచున్నాడు? ఇది ఒకవేళ తప్పయినచో పాపం ఈయన ఏమి చేయునో అని జాలిపడేవారు. మా తాతగారు, బామ్మగారుకూడ ఆశ్చర్యపడ్డారు. ఎందుకీ విషమ పరీక్షలు? అనవరముగా ఇతరులతో ఈ విషయం తర్కించటం? అని అనేవారు కూడా. సరిగ్గా ఆగష్టు నెల 19వ తారీకు వచ్చింది. అలవాటు ప్రకారం మా తండ్రిగారు తన పని చూసుకోసాగారు. మా తల్లిగారు కూడా మామూలుగానే ఉన్నారు. ఆత్రుత ఆపుకోలేని బంధువులు మాఇంటికి వచ్చి ఎదురుచూడ సాగారు.

అప్పుడు కూడా ఈరోజే తప్పక పుడతాడు అని సమాధానం ఇచ్చారు. ఇది ఎలా ముగుస్తుందో అని అందరూ ఎదురుచూడ సాగారు. ఆ రోజు సరిగా మధ్యాహ్నం 3.45 గంటలకు నొప్పులు రావటం, అమ్మను దగ్గరలో ఉన్న ఆస్పత్రికి తీసుకుపెళ్ళటం జరిగింది. 4.40 గంటలకు సుఖ ప్రసవమై మగబిడ్డ పుట్టటం జరిగింది. బంధుమిత్రులు అందరు మా తండ్రిగారి భవిష్య వాణిని తెగ పొగడసాగారు.

ఇలాగే మా సోదరి పుట్టుటకు 5 నెలల ముందు మా తండ్రిగారు మలేషియాకి వెళ్ళారు. వారు బయలుదేరుటకు ముందు మా తల్లి మరియు వారి సోదరులతో, "నేను తిరిగి వచ్చుటకు 6 నెలలు అవుతుంది. వచ్చే సంక్రాంతికి మర్నాడ, జనవరి 15వ తేదీన ఆడబిడ్డ పుడుతుంది. నేను ఇక్కడ ఉండను గనుక జనవరి 15 ఉదయం నీవు ఈమెను ఆసుపత్రిలో చేర్చు" అని తన సోదరునికి చెప్పివెళ్ళారు. ఆ ప్రకారమే వారు జనవరి 15 ఉదయం మా అమ్మను ఆసుపత్రిలో చేర్చారు. సరిగా ఉదయం 10.30

గంటలకు నొప్పులు వచ్చి, మా సోదరి పుట్టింది. అన్నీ సవ్యంగా జరిగాయి. మా తండ్రిగారికి ఫోనులో మలేషియాకు కబురు పంపగా వారు నిర్లక్ష్యంగా, "నాకు తెలిసిందేగా, అయినా ఇందుకు ఫోను చేసి చెప్పాలా? నేను 5 నెలల క్రితమే చెప్పానుగదా? తల్లీ బిడ్డా క్షేమమేనని ఉత్తరం రాస్తే చాలదా!" అని అన్నారట. వారి శాస్త్ర జ్ఞానం అంత గొప్పది.

ఇంకొకసారి 73 ఏళ్ల పిల్లలు లేని, భార్య కూడా చనిపోయిన ఒక రిటైరయిన హెడ్ మాస్టరు మా నాన్నగారి వద్దకు వచ్చారు. తనకి వారసులు లేరని, తర్పణం చేసేవారు ఎవరూ లేరు కాబట్టి తానే కాశి మరియు గయకి పోయి దానధర్మాలు చేసి, ఆత్మపిండం సమర్పించుకొని రావాలని అన్నారు. కాబట్టి తనకు మృత్యు ఘడియలు ఎప్పుడు వస్తాయో చెబితే , తాను దాని ప్రకారం తగిన ఏర్పాట్లు చేసుకుంటానని ఆయన మా నాన్నగారిని అభ్యర్థించారు. మా నాన్నగారు ఆయన్ని 3 రోజులు తువాత రమ్మన్నారు. ఆయన అలాగే 4వ రోజన మళ్ళీ వచ్చారు. అప్పుడు మా నాన్నగారు, " మీకు సరిగ్గా సెప్టెంబరు నెల 16వ తేదీ మరణ సమయం వస్తుంది" అని చెప్పారు. అప్పుడు ఆయన కాశి మరియు గయ పుణ్య క్షేత్రాలకి వెళ్ళి, తమ విధులు పూర్తి చేసి తిరిగి వచ్చారు. మా నాన్న గారు చెప్పిన ప్రకారమే సరిగ్గా సెప్టెంబరు నెల 16వ తేదీన ఎప్పటిలా పూజలు చేసికొని, సరిగ్గా మధ్యాహ్నం 3 గంటలకి గుండె నొప్పి రాగా ఆయన 3 గంటల 10 నిమిషాలకి ప్రాణాలు విడిచారు.

మా తండ్రిగారు ఇతరుల మరణం గురించి చెప్పినట్లే తన మరణం గురించి కూడా తెలిసిన వ్యక్తి కావటం ఒక విశేషం. వారు తమ దైవశక్తివల్లనే అంత సరిగ్గా తూచినట్లు చెప్ప గలిగేవారు.

మా తండ్రిగారి వంటి చాలా తక్కువమంది మాత్రమే ఇలా జననం-మరణం గూర్చి చెప్పగలరు అన్నది నిర్వివాదాంశం. ఈ శక్తి అంత సులభంగా అందరికీ అలవడేది కాదు.

ఈ గ్రంథం ఒక సామాన్య వ్యక్తి కాక, ఒక అసాధారణ పండితుని అపూర్వ సృష్టి అని ఇప్పటికే మీకు అర్థం అయిఉంటుదని అనుకుంటాను. ఈయన గొప్ప దేవీ ఉపాసకులు. కాబట్టి ఆ జగన్మాత కృపతో వీరు ఇంత ఖచ్చితంగా భవిష్య ఫలితాలు చెప్పగలిగేవారు.

పాఠకులు ఈ గ్రంథంలోని అనేక అమూల్యమైన విషయాన్ని అర్థం చేసుకొని, పరిపూర్ణమైన లాభం పొందుతారని ఆశిస్తాను.

# పాఠకుల గమనికకు కొన్ని ముఖ్యాంశాలు

ఈ ప్రపంచంలో ఎన్నో కొత్త కొత్త ఆవిష్కరణలు జరిగాయి. ప్రకృతి ఒక మహాశక్తి. అది మనుషుల్లో కూడా ప్రతిబింబిస్తుంది. దీని ప్రభావంతో కొందరు మహానుభావులు మానవ జాతికి ఉపయోగపడే అనేక కొత్త కొత్త ఆవిష్కరణలు చేశారు. ఇలా ఆ జ్ఞాన సంపన్నులు తమ పై ఏదో ఒక మహాశక్తి ప్రభావం తమకు సహాయపడి ముందుకు నడిపిందని రాసారు. విద్యుత్తు సహాయంతో మొదటిసారిగా విద్యుత్తు దీపం వెలిగినప్పుడు, మెన్లో పార్క్ మంత్రవాది అని ప్రసిద్ధిగాంచిన థామస్ అల్వా ఎడిసన్ తన అపూర్వ ఆవిష్కరణ గురించి వివరిస్తూ ఇలా అన్నారు:

"ప్రకృతి మాత గర్భంలో లేని ఏ వస్తువునూ ఎవరూ సృష్టించలేరు. నేడు ఈ ప్రపంచంలో నా ద్వారా ప్రారంభించబడిన ఈ విద్యుచ్ఛక్తి అనే ఈ శక్తి ఇంతకు మునుపే ప్రకృతిలో ఉన్నదే. ప్రకృతి నాపై దయతలచి, నన్ను సాధనంగా ఉపయోగించుకొని ఇలా బయటపెట్టింది. కనుక నేను విద్యుచ్ఛక్తిని సృష్టించినవాడిని కాదు, ప్రకృతిలో ముందే ఉండి పనిచేస్తున్న మనందరికి అతీతంగా అదృశ్యంగా ఉన్న ఆ మహాశక్తి నాలో ఉండి పనిచేసి, ఈ విద్యుచ్ఛక్తిని వెదికి, తీసుకొచ్చి మీ ముందు ఉంచేందుకు నాకు సహాయపడింది. కాబట్టి ఈ ఆవిష్కరణలో నేను ఒక సాధనాన్ని మాత్రమే." (I have not invented anything like electricity. I have discovered its presence in nature. Nature has used me as a tool and through me it was revealed to the world. So the credit for this discovery should go to the big force which is above me and which had acted through me).

పైన పేర్కొన్న విధంగానే మా తండ్రి పండిట్ సేతురామన్గారు రాత్రింబవళ్ళు నిద్రాహారాలు మరచి, తమ 18వ ఏట నుండి 28వ ఏట వరకూ వివిధ పరిశోధనలు చేసి, వేదాల జనని గాయత్రీదేవి కృపతో సంఖ్యా శాస్త్రం గురించి జ్ఞానం సముపార్జించుకొని, పూర్తిగా ఆ వెలుగులో రూపొందించిన ఈ 'అదృష్ట విజ్ఞానం' అనే పుస్తకాన్ని 1954లో ప్రచురించారు. మా తండ్రి ఇందుకుగాను ఎదుర్కొన్న కష్టనష్టములు ఇతరులకు తెలిసే అవకాశం లేదు. అదే ఆ దివ్యమాత ఆజ్ఞ.

ఏ ప్రకటనలు చేయక, సంఖ్యా జ్యోతిషశాస్త్రం అనే ఈ మహత్తర గ్రంథాన్ని ప్రజల శ్రేయస్సు కోసం వెలుగులోకి తెచ్చారు. దోరగా పండిన పండ్ల కొరకు వృక్షాల చుట్టూ ఎగిరే పక్షులవలె అనేకమంది ప్రజలు ఎన్నో దేశాల నుండి వచ్చి వారిని కలిసేవారు. ఈ శాస్త్రం మూలంగా వారంతా తమకు కావలసినవి పొందేవారు. ఈ శాస్త్రం లాభం ఇలా అనేక మందికి లభిస్తూనే ఉన్నది.

నేను అనేక సార్లు ప్రపంచ పర్యటన చేసాను. మా తండ్రిగారి అశేష కీర్తి వారి మరణానంతరం కూడా ఆచంద్రతారార్కంగా ప్రకాశిస్తూనే ఉన్నది. గత 46 సంవత్సరాలుగా ఈ పుస్తకం (తమిళం) మార్కెట్లో ఎలాంటి ప్రచారం లేకుండానే పాఠకుల వద్దకు చేరుతున్నది. దీని కోసం వెదికి వస్తున్నవారికే ఇది సొంతమయ్యేది. ఈ విషయం ఈ గ్రంథం గురించి తెలిసిన విజ్ఞపాఠకులందరికీ విదితమే.

ఈ మధ్య కొందరు స్నేహితులు మార్కెట్లో అమ్మబడుతున్న సంఖ్యా శాస్త్ర పుస్తకాలను తీసుకొచ్చి నాకు చూపారు. వాటిని చదివిన తరువాత నాకు చాలా ఆశ్చర్యం కలిగింది. అంతకంటే ఎక్కువగా బాధ కలిగింది. ఎందుకంటే ఎవరో కొందరు విషయ పరిజ్ఞానం లేకుండానే మా తండ్రిగారి ద్వారా రాయబడిన ఈ అమూల్యమైన పుస్తకంలో చెప్పబడిన అనేక విషయాలను యథాతథంగా నకలు చేసి, మరి కొంత కలిపి, 'అదృష్టం' లేదా మరేదో పేరుతో ప్రచురిస్తూఉన్నారు.

ఈ విధంగా వీరు అమాయకులైన పాఠకులకు పరోక్షంగా చాలా కీడు చేస్తున్నారు. మా తండ్రిగారి ద్వారా అనేక పరిశోధనల అనంతరం అనుభవ ఆధారంగా రాయబడిన ఈ మహత్తర గ్రంథంలోని విషయాన్ని ఇలా అపహరించి, పత్రికల్లో మరియు టీవీలలో 'సంఖ్యా శాస్త్ర పండితులు' లేదా 'పండిట్ జీ' అని ఏదో పేరుతో జనాన్ని మోసగిస్తున్న వీరిపై చర్య తీసుకోబడుతున్నది. ఈ మౌలిక గ్రంథం వేలాది ప్రజల జీవితాలను చిగురింపచేసిన పవిత్ర గ్రంథం. దీని విషయంలో ద్రోహం తలపెట్టినవారు, సామాన్య ప్రజానీకానికి హాని కలిగించేవారు ఎంత మాత్రమూ శిక్షను తప్పించుకోలేరు. ఇప్పటికే ఇలాంటివారు తాము చేసిన తప్పుకి ఫలితం అనుభవిస్తూ ఉన్నారు. ఇలాంటి వారి వలన వీరి స్వార్థం కోసం అనేక మంది అమాయక పాఠకులకు ఎదురుచూడని కష్టం కలుగుతున్నది అన్నదే నన్ను బాధిస్తున్న విషయం.

వ్యాపార రహస్యం అన్నది ప్రాచీన కాలం నుండి ప్రచారంలో ఉన్నదే. ఈ విషయం మా తండ్రిగారికి తెలిసినదే. తన తరువాత తనకు ప్రత్యర్థులు ఏర్పడవచ్చునని, వారు తన పరిశోధనలను నిర్లజ్జతో తమవిగా చెప్పుకొని జనులను మోసగించవచ్చునని, అలాగే వారు తమని ఏదోలా ప్రక్క దోవ పట్టించే ప్రయత్నం చేయగలరని ముందుగానే మా తండ్రి పండిట్ సేతురామన్గారు ఊహించారు. అందుకే వారు సంఖ్యా శాస్త్రం గూర్చి నిజాలను కేవలం పాఠకులకు కావలసినంత వరకే ఈ పుస్తకంలో పొందుపరచారు. వివరములు అన్ని పూర్తిగా ఇవ్వటం వీలుకానిది కూడా ఎందుకంటే అలా చేస్తే ఈ పుస్తకానికి 2000 పేజీలైనా చాలక పోవటం ఆశ్చర్యం కాదు.

సగటు పాఠకులు అంత పెద్ద పుస్తకం పెద్ద మొత్తం ఇచ్చి కొనలేరు. కొనగలిగేవారు కూడా వెనుకాడుట తప్పనిసరి. ఈ నిజాన్ని అర్థం చేసుకున్న కారణంగానే మా తండ్రిగారు ఈ పుస్తకాన్ని ఇలా నిడివి పెరగకుండా అవసరమైనంత వరకే వివరాలను పొందుపరిచి ప్రచురించారు.

ఒక సంఖ్యలో పుట్టినవారు అదృష్టంలో మార్పు కొరకు మరో సంఖ్యకి పేరు మార్చుకొనిన సందర్భంలో కలిగే మానసిక, శారీరక, ఆర్థిక, సాముదాయిక మార్పులను గురించిన వివరములను తనను ప్రత్యక్షముగా కలసికొనువారికి మా తండ్రిగారు విపులంగా, తేలికగా అర్థమయ్యేటట్లు చెప్పేవారు.

వారి పద్ధతినే అనుసరిస్తూ నేను కూడా వారి మార్గంలోనే నడుస్తున్నాను. మందుల గురించి ఎక్కడో ఏదో చదివి ఆ ప్రకారం వైద్యం చేసుకుంటే రోగాలు నయమవుతాయా? అలాగే పుస్తకాలలో రాసినవి చూసి పేర్లు మార్చుకోవటం కూడా. పైగా ఇలా పేరు మార్చుకోటానికి మీకు నమ్మకమైన గ్రంథం దొరకటం కూడా అరుదే. ఈనాడు మార్కెట్లోకి నకిలీ పుస్తకాలు పుట్టగొడుగులు మొలుచుకొస్తున్నట్లు రావటం జరుగుతోంది. ఇలాంటివాటిని చూసి దయచేసి మోసపోకండి.

ధననష్టం, మనసుకి కష్టం, శరీరానికి అరిష్టం. అనధికృత గ్రంథాల విషయంలో పాఠకులకు లభించేది ఇదే. కాబట్టి కోరి కష్టాలు కొని తెచ్చుకోవద్దని మీకు నా సలహా.

పుస్తకాలే కాదు, ఈ రోజుల్లో జ్యోతిష్కులు కూడా నిన్న కురిసిన వర్షంలో మొలిచిన

విషపు పుట్టగొడుగులవలె పుట్టుకొస్తున్నారు. వీరు అనేక ఊర్లలో, పట్టణాలలో ఏదో లాడ్జిలో రూమ్ తీసుకుని, ప్రచారం చేసుకుంటూ ప్రజల్ని దోచుకుంటున్నారు. ఇలాంటి వారికి నీతి నియమం లేదా జాలి, దయ ఉండవు. వీరికి కావలసింది టకరా లాంటి అమాయకులు కావాలి. వీరి జేబులు నిండాలి.

ఇప్పుడు ఇలాగే సంఖ్యా జ్యోతిష్కులు కూడా తయారయ్యారు. వీరు తామే 'సంఖ్యాశాస్త్ర మేధావి' అని లేదా 'మహా పండిట్ అని గాని తమ గురించి ప్రకటనలు చేసుకుంటూ ఉంటారు. ఇలాంటివారిని కని పెట్టుట ఎంతో సులభం. వీరిని గురించి, వీరి వృత్తిని గురించి ఎన్నో విధాలుగా వచ్చే అద్భుతమైన ప్రకటనలను చూస్తే ఎవరైనా బుట్టలో పడక తప్పదు. వీటిలో అంత గొప్ప పదజాలం ఉపయోగించబడుతుంది. వీరు ఇలా తమ స్వలాభం కోసం అనేక మంది జీవితాలను బలి తీసు కుంటున్నారు. ఇది అమానుషం. అయినా ఎవరూ ఎదిరించరు.

బాగా చదువుకొన్నవారు, తాము చేయు వృత్తికి ఆ విద్యను చక్కగా నేర్చినవారు ఇలా ప్రకటించుకోవటం తప్పు కాదు. ప్రపంచమంతటా ఉన్న ఆచారమే ఇది. కానీ ఇలాంటి ప్రచారాలకు అందరూ ముందుకు రారు. అసలు అంగీకరించరు కూడా.

మాతండ్రిగారి కాలంలో గాని లేదా నా కాలంలో గాని మేము మా వృత్తికి ఏవిధమైన ప్రకటనలు చేసుకోలేదు. ఇప్పుడు వైద్య వృత్తిలో అనేక ఊర్లలో నకిలీ వైద్యులు తయారయినట్లుగానే, అద్భుతమైన ఈ సంఖ్యా జ్యోతిష శాస్త్రం విషయంలో కూడా కొన్ని విద్రోహశక్తులు మొలకెత్తి, ఈ కళకు అపారమైన కళంకం తీసుకొస్తున్నారు. అంతేకాక ఎలాంటి అవగాహన, పాండిత్యం లేదా పరిచయం లేకుండానే తమ ఇష్టప్రకారం ప్రజలకు ఏవేవో పేర్లు మార్చి వారికి అనేక విధాలుగా విపరీత పరిణామాలు తీసుకువస్తున్నారు. ఇలాంటి నకిలీ శాస్త్రజ్ఞుల నుండి మిమ్ము మీరే కాపాడుకోవసిందిగా మనవి చేస్తున్నాం.

సాధారణముగా జాతకం, సాముద్రికం, సంఖ్యాశాస్త్రం వంటి ఏ శాస్త్రం అయినా చాలా నిగూఢంగా ఉంటుంది. కాబట్టి దానిని బాగుగా చదివి, అర్థం చేసికొని, అనుభవం ద్వారా దాని గురించి విశేషంగా తెలిసిన వారి వద్దనే మనకు కావలసిన సమస్యలకు పరిష్కారం మరియు ఫలితాలు మనకు లభించే అవకాశం ఉంది. అంతే గాని, అనేక పుస్తకాలు

చదివి ఆ జ్ఞానంతోనే అంతా తెలుసునని అనుకోవటం పొరపాటు. అది చాలదు. అనుభవజ్ఞానం, అర్థం చేసుకునే గ్రాహ్యత, దైవ కృప మొదలైనవి అపూర్వ తేజస్సు మరియు ఆత్మ ప్రకాశంతో నిండి ఉండాలి. పూర్వ జన్మ పుణ్య ఫలం కూడా ఒక విధమైన బలం చేకూర్చుతుంది.

జాతకాలు చూసేవారు అసత్యం చెప్పకుండా నిజమైన ఫలితాలే ఒక పద్ధతి ప్రకారంగా చెప్పితే దోషం ఉండదు. అంతే తప్ప, వాక్శుద్ధి లేకుండా వీరు వివిధ గ్రహాలను తమ పనివారివలె, చాలా హీనంగా ఇంకా ఘోరంగా తిట్టి, వీడు ఇలా వాడు అలా అంటూ ఏవేవో లోపాలు చూపుతూ జాతకాలు చూడటం నిజంగా చాలా తప్పు. ఇదొక అహంకార జనితమైన అజ్ఞానం. ఇలాంటి వారి వద్ద జాతకాలు చూపించుకోవటానికి వచ్చినవారు దగా పడటం తప్పదు. ఈ పుట్టగొడుగు పండితుల డబ్బు ఆశ అనంతం. ఈ దురాశతో వీరు అబద్ధాలు చెబుతూ ఎంత డబ్బు సంపాదించినా చివరికి వీరు ఆ గ్రహముల ఆగ్రహానికి గురి కాక తప్పదు. అలాంటి వారికి ఎన్నడూ దైవ సహాయం లభించదు. అందుకే పండితులు ఎన్నడూ ధనాశతో కన్నూ మిన్నూ కానక అన్నృత పాపం ఒడికట్టుకో కూడదు. ఎన్నడూ అబద్ధాలు చెప్పి అమాయకులను మోసం చేయరాదు. నిజాలే చెప్పి, గ్రహనింద మాని న్యాయానికి కట్టుబడి ఉంటే ఏ పండితునికైనా వాక్శుద్ధి పెట్టనిగోడగా మారటం నిశ్చయం.

అగస్త్యుడు ఒక వైద్యుడు. మండూకుడు మరొక వైద్యుడు. కర్కోటకుడు అనే ఒక పాముకి కడుపు నొప్పి వచ్చింది. కర్కోటకుడు అగస్త్యుని వద్ద మందు తీసుకుని వాడినా, కడుపు నొప్పి నయం కాలేదు. ఒకనాడు మండూకుడు అగస్త్యులవారిని చూడవచ్చినాడు. కర్కోటకుని అక్కడ చూసినాడు. విషయమేమిటని అడిగి తెలిసికొన్నాడు. అప్పుడు అగస్యులవారిని చూసి ఏమి మందు ఇచ్చారని అడుగగా, మందు పేరు చెప్పారు అగస్త్యులు. ఆ తరువాత మండూకుడు ఒక సన్నని వెదురు గొట్టం తెమ్మని ఒక శిష్యునికి చెప్పాడు. అది వచ్చాక ఆయన మందును ఆ గొట్టం ద్వారా కర్కోటకుని నోటి నుండి సరాసరి అతని కడుపులోకి పంపించాడు. వెంటనే మందు ప్రభావం కనిపించింది. కర్కోటకుని కడుపు నొప్పి మాయమైంది.

అగస్త్యులు శాస్త్రాలు బాగా చదువుకొన్నవారే, వారి వైద్య శాస్త్ర జ్ఞానం గొప్పదే. కాని

వైద్యంలో ఆయనకు తగినంత అనుభవం లేదు. అందుకే వారు ఆశ్చర్యపడి, "వ్యాధి ఇంత తొందరగా ఎలా నయమైంది? నేను కూడా అదే మందు వాడాను కదా ? నేను వాడితే పని చేయని ఆ మందు మీరు వాడినప్పుడు ఎలా పని చేసింది?" అని అడిగారు.

అప్పుడు మండూకులవారు ఇలా చెప్పారు, "కర్కోటకుని నోట్లో మందు వేసినప్పుడు, ఆ పాము నోట్లోని విషపు తిత్తి నుంచి స్రవించే విషం కూడా ఆ మందుతో కలిసి కర్కోటకుని కడుపులోనికి చేరుతున్నది. అలా మందు ప్రభావం కనిపించలేదు. లేకపోతే మీరు ఉపయోగించిన అంత చక్కని మందు ఎందుకు పని చేయదు? నేను ఈ విధంగా ఆలోచించి, మందు పనిచేయకపోవటానికి అసలు కారణాన్ని కనుగొన్నాను. వైద్యునికి కేవలం శాస్త్ర జ్ఞానం చాలదు. రోగికి అవసరానికి తగినట్లు తగిన మందుని తగిన రీతిలోనే ఉపయోగించడం చాలా అవసరం. కాబట్టి మీ విషయంలో పనిచేయని మందు నా విషయంలో పని చేయటానికి కారణం ఇదే "

కాబట్టి మనం ఎంత నేర్చినా, అనుభవం చాలా ప్రధానం. మనం తెలిసిన విషయాలను అనుభవం ఉంటేనే అధికారపూర్వకంగా చెప్పగలం. ఆ సందర్భంగా ఏర్పడే సమస్యలకు తగిన పరిహారాలు కూడా చూపగలం. ఇలాంటి అనుభవంతోనే అనేక విజయాలు మమ్మల్ని వరించటం జరిగిందని ఇక్కడ ప్రత్యేకంగా చెప్పనవసం లేదు.

ఈ పుస్తకం చదివే పాఠకులు ఏదో కాలక్షేపం కోసం ఎవరికో పేర్లు మార్చే ప్రయత్నం చేస్తే కష్టాలను కొనితెచ్చుకోవడం అవుతుంది.

ఎందుకంటే ఇది ప్రమాదకరమైన సంగతి. సామాన్యంగా పుస్తకం చదువుకునేవారు తమ పేరునో, తమ కుటుంబ సభ్యుల పేర్లనో మార్చితే కీడు కలుగకపోవచ్చు. కాని అలాకాక బైటవారికి పేర్లు మార్చుతూ సాహసం చేస్తే ఫలితం నిస్సందేహంగా మంచిదిగా ఉండదు. కాబట్టి ఈ శాస్త్రం గురించి పూర్తిగా తెలియకుండా, కేవలం ఈ పుస్తకంలో ఇచ్చిన కొన్ని వివరాల ఆధారంగా బైట వారికి పేరు మార్చే ప్రయత్నం చేయకపోవటమే మంచిది. లేకపోతే మీకు, ఇలా పేరు మార్చుకున్నవారికి అనేక కష్టములు కలగవచ్చు. కాబట్టి దీనిని మనసులో పెట్టుకుని, మీకేమైనా సందేహాలు కలిగితే పూర్తి వివరముల కొరకు మా వద్దకు వచ్చి మా సలహాలు పొందగోరుతున్నాం. మీకు మా సహాయం

**M. ANANTHANARAYANIER**
23, 1st Stage, 2nd Cross,
Sudhama Nagar
Bangalore - 560 027

నేను శ్రీమాన్ పండిట్ సేతురామన్ గారిని కలిసి, పేరు మార్చుకొన్న తరువాత చాలా పురోభివృద్ధిని పొందాను. నాకు చాలా ఏళ్ళుగా జ్యోతిష్యంతో పరిచయం ఉంది. ఆసక్తి ఎక్కువగా ఉండుటచే నాకు తెలిసిన మిత్రులు అందరికి పేర్లు మార్చి సహాయ పడ్డాను. వారికి కూడా మంచి జరిగింది. అయితే నాకు చాలా కష్టాలు ఎదురయ్యాయి. భరించలేని కష్టములు, ఆర్థికపరముగా చిక్కులు కలిగినవి. కారణం తెలియక నేను మళ్ళీ సేతురామన్ గారిని కలుసుకొని, నేను ఏమీ తప్పు చేయ లేదే? నాకేం ఇలా జరుగుతున్నది అని అడిగాను. నీవెవరికైనా పేరు మార్చావా? అని నన్ను ఆయన అడిగారు. నేను ఔనని తల ఊపాను.అప్పుడు ఆయన అసలు విషయం చెప్పారు.

"ఇదంతా దాని ప్రభావమే. అది కూడా నీవు ఎలాంటి ప్రతిఫలం ఆశించకుండా చేసావు కాబట్టి ఇది ఇంతవరకే వచ్చి ఆగింది. అదే గాని నీవు ధనం కొరకు చేసిఉంటే, దాని ఫలితం ఇంతకన్నా ఘోరంగా ఉండేది" అని చెప్పి, నాకు కొన్ని వివరములు చక్కగా అర్థం అయ్యేటట్లు చెప్పారు. ఖైదీని బయటకు వదలాలంటే జామీను అడిగినట్లు పరుల కర్మల నుండి ముక్తి కలిగించాలంటే దానిని భరించగల శక్తి కూడా ఉండాలి. అట్టి దైవశక్తి లేకపోతే, ఆ తాకిడిని పేరు మార్చినవారు, వారి కుటుంబ సభ్యులు కూడా అనుభవింపవలసి వస్తుందని చెప్పారు.

ఇతరులకు పేరు మార్చవలెనన్న దైవకృప, తపశ్శక్తి అతి ముఖ్యం అని వివరించారు. ఆనాటి నుండి నేను పేరు మార్చే పని మానుకున్నాను. నాకు కావలసినవారిని పండిట్ గారి వద్దకు తీసుకుని వెళ్ళేవాడిని. ఆ తర్వాత నా సమస్యలు తొలగి మళ్ళీ మెల్ల మెల్లగా అభివృద్ధి చెందాను. ఇప్పుడు నా అనుభవం ఇతరులకు చక్కని మార్గదర్శకంగా మారాలని నేను ఈ వివరాలు ఇక్కడ తెలియజేస్తున్నాను.

నమస్కారములు

M. Ananthanarayanier

# నవ రత్నముల గురించి
# కొన్ని ముఖ్య విషయాలు

ఇప్పుడు మనం రోజు టీవీ, కేబుల్ ఛానళ్ళలో చేతివేళ్ళకు ధరించే ఉంగరాలపై నగల దుకాణాల ప్రకటనలు చూస్తూనే ఉన్నాం. మామూలుగా నావద్దకు వచ్చే వారికి నేను ఏ ఉంగరాలు ధరించమని చెప్పను. వారికి పేరు మార్చి, నేను చెప్పినట్లు చేస్తే అదే వేయిరెట్లు ఎక్కువ ఫలితం ఇస్తుంది అనే చెప్తాను.

అయినా సరే, అప్పటికీ వారు రత్నాల ఉంగరాలు ధరించాలని పట్టు పడితే, ముందుగా వారికి మార్చిన నామ సంఖ్యకు తగినది ఏమిటన్నది చూసి, వారి జాతకంలో జరుగుతున్న దశను కూడా నేను పరిశీలిస్తాను. ఆ తరువాత ఆ గ్రహస్థితి బాగా వుందా లేదా అన్నది కూడా తరచి చూసి, అప్పుడు వారికి తగినది నిర్ణయించటం, అదే ధరించమని వారికి సలహా ఇవ్వటం జరుగుతుంది. అంతే తప్ప, నగల దుకాణాలవారు తమ ఉంగరాల అమ్మకం కొరకు చెప్పే పద్ధతిని నేను ఎన్నడూ అనుసరించను. ఎందుకంటే అది ఎంతమాత్రమూ సరియైన పద్ధతి కాదు.

నగల దుకాణములవారు చంద్రుణ్ణి ప్రధానంగా ఎంచి రాళ్ళను ఎంపిక చేస్తుంటారు. అది తప్పు. శాస్త్రాలలో ఫలానా సంఖ్యవారికి ఫలానా రత్నం మంచిది అనే చెప్పబడింది. కాబట్టి రాశికి తగినట్లే, లగ్నానికి తగినట్లో లేదా దశాభుక్తిని అనుసరించో, రెండు లేక మూడు రకాల మణులను జ్యోతిష్కులు చెప్పుతూ ఉంటారు. అది విని ప్రజలు నగల దుకాణాలకు వెళ్ళి, వారిచ్చే రాళ్ళనుకొనటం, వాటిని ఉంగరంగానో లేదా డాలరుగానో చేయించుకొని ధరించటం జరుగుతున్నది.

ఇలా రత్నాలని ధరిస్తున్న కొందరు కొంత కాలం తర్వాత తమకు సమస్యలు ఎక్కువయ్యాయని, మరేవో కొత్త సమస్యలు వచ్చాయని వచ్చి చెప్ప సాగారు. వీటికి కారణం ఏమిటని దీర్ఘంగా ఆలోచిస్తే, నాకు క్రింద వివరించిన నిజాలు స్ఫురించాయి :

1. ఏ విధమైన దోషాలు, లోపాలు లేని రత్నాలు ప్రస్తుతం అతి తక్కువగానే దొరకుతు న్నాయి. అయితే వినియోగదారులు పెరిగి, వాటి అవసరం కూడా పెరగటం

జరిగింది. ఈ కారణంగా వీటి ధరలు కూడా ప్రపంచవ్యాప్తంగా బాగా పెరగటం జరిగింది. ధరలు ఆకాశాన్ని అంటుతున్న చందంగా అధికంగా ఉండుట చేత మంచి రత్నాలు అందరికీ అందుబాటులో ఉండుట లేదు.

2. ఈ రత్నముల రంగులకు తగినట్లు కనిపించే భూమిలో దొరకు మామూలు రంగు రాళ్ళు ఈ రత్నాల పేరుతోనే కాస్త ధర తగ్గించి అమ్మటం జరుగుతున్నది. నిజానికి వీటి వలన ప్రయోజనం లేకపోయినా సరే వీటికి విపరీతంగా గిరాకీ పెరిగి ఇవి ఎక్కువగా అమ్ముడు పోవటం జరుగుతూ ఉంది. జనం కూడా తక్కువ ధరకి వస్తున్నాయని వీటిని కొంటున్నారు తప్ప ఇవి ఎంత వరకు పనికొస్తాయన్నది చూడటం లేదు.

3. రాశినాథుడు, లగ్నాధిపతి, దశాభుక్తి గ్రహం ఎవరైనా సరే తమ మిత్ర, స్వంత, ఉచ్ఛ స్థానంలోని, తమకు తగిన చోటున ఉంటేనే ఈ మణులను ధరించినవారికి సత్ఫలితాలు ఇవ్వగలగటం జరుగుతుంది. అంతే తప్ప, అవి ప్రత్యర్థి స్థానంలోనో లేదా ప్రచ్ఛన్న స్థానంలోనో ఉంటే, మంచి గ్రహాలు కూడా సత్ఫలితాలని ఇవ్వలేవు. ఇది ఒక జ్యోతిష సత్యం.

పైన పేర్కొన్న కారణాల వలన, నవరత్నాలు ధరించుటకు మునుపే గ్రహముల స్థితిని బాగుగా పరిశీలించి, అవి లాభం చేకూర్చు స్థితిలో ఉంటేనే వాటిని ధరించటం మంచిది. జాతి రత్నాలను ధరించగల స్తోమతు ఉంటే వాటినే ధరించుట చాలా మంచిది. ఏ కారణం చేతనైనా నవ రత్నాలను ఒకటిగా ఉంగరం లేదా మరే ఆభరణం (ఉంగరము, డాలరు, దండగా) రూపంలో చేయించి ధరించటం మంచిది కాదు. అది మిక్కిలి ప్రమాదకరమైనది. ఇవన్నీ ఒకే చోట చేరకూడదు.

రత్నాలను చక్కగా పరీక్షించి మంచివాటిని మాత్రమే గుర్తించి ఇవ్వగలిగిన పరిపక్వత చాలా కొద్దిమందికి మాత్రమే ఉంటుంది. ఈ శక్తి అందరికీ ఉండదు. రత్నాల గురించి ముఖ్యమైన విషయాలను పాఠకులకి వివరించాలనే నేను ఇంత వివరంగా రాస్తూ ఉన్నాను.

మా తండ్రి శ్రీ సేతురామన్ ఒకనాడు నాకు విలువైన పచ్చని చూపి, “ దీని ధర చాలా ఎక్కువ. దీనిని నేను ధరించబోతున్నాను.ఇంకా పది రోజులలో కొత్తగా ఏమి

మేలు జరుగుతుందో చూద్దాం" అని అన్నారు. ఆనాటి నుండి సరిగ్గా మూడవ రోజున మా తల్లిగారికి విపరీతంగా జ్వరం వచ్చింది. వైద్యుడిని సంప్రదించి మందు తీసుకోసాగారు.

ఐదవ రోజున మా అన్నకి కూడా అలాగే జ్వరం వచ్చింది. ఆ తరువాత ఎనిమిదవ రోజున మా తండ్రిగారికి కొద్దిగా ఒళ్ళు వెచ్చబడింది. వెంటనే వారు నన్ను పిలిచి, "ఇది ఎంత విలువైనది అయినా వచ్చిన రోజునించి జబ్బు వార్తలే వినవలసి వస్తున్నది. ఇంట్లో ముగ్గురికి జ్వరం వచ్చింది. అంటే ఇది మనకి రాశియైనది కాదు" అని దాన్ని తీసి ఆవతల పెట్టేసారు. ఆ తరువాత కేవలం మూడు రోజులలో ఇంట్లోని వారు అందరు కోలుకోవటం జరిగింది.

మరోసారి మా తండ్రిగారు కొంచెం చౌక రకం ఓనీలం' పొదిగిన ఉంగరం తెచ్చి ధరిస్తూ, "దీని ఫలితం కూడా చూద్దాం. నీవు కూడా గుర్తుంచుకో" అని చెప్పారు.

అది ధరించిన మరునాడు వారు మా ఊరిలో జరిగే పూజకు వెళ్ళారు. సామాన్యంగా అక్కడివారు ఎవరూ మా తండ్రిగారివద్ద సలహా తీసుకునేందుకు వచ్చేవారు కాదు. ఐనా సరే, టెలిఫోను ద్వారా అక్కడి పూజ గురించి తెలిసికొన్న ఒక పారిశ్రామికవేత్త (ఈయన మా తండ్రిగారి వద్దకు సలహాల కొరకు వచ్చుట అలవాటే) ఆ పూజకు వెళ్ళారు. ఆయన మా తండ్రిగారికి ఒక పళ్ళెం నిండా పళ్ళు, పూలు, రూ. 3,000 ఉంచి, "స్వామీ, నేను గత సంవత్సరం అనుకొన్న దానికంటే ఎక్కువ లాభం గడించాను. మీకు నా కృతజ్ఞతగా దీనిని సమర్పిస్తున్నాను' అని చెప్పి ఇచ్చారు. అప్పుడు నేను కూడా మా తండ్రిగారి పక్కనే ఉన్నాను.

ఆ తరువాత పూజకి వచ్చిన మరొకరు కూడా మా తండ్రిగారికి రూ. 3,000 ఇచ్చి వెళ్ళారు. అప్పుడు మా తండ్రిగారు, "చూసావా ఈ రాయి మహిమ? అనుకోని విధంగా ఇంత ధనం మన చేతికి వచ్చింది" అని, అది అదృష్టకరమైనదనీ, దానిని జాగ్రత్తగా ఉంచుకోమని చెప్పారు.

దీనినుండి రత్నాలు ధరించిన పది రోజులు లోపలే మహిమను చూపిస్తాయి అని మనకి తెలుస్తున్నది. అవి ధరించాక మనకు అదృష్ట దాయకంగా కనిపిస్తే

ఉంచుకోవచ్చు, లేకపోతే అనర్థం కలుగుతున్నది అన్న సందేహం రాగానే ఉపయోగించటం మానాలి. ఉంగరాలలో రాళ్ళు ఎంచుకునేటప్పుడు బాగా ఆలోచించి చేయాలి. గుర్తు పెట్టుకోండి! అనుభవాలు లేదా ప్రయోగాలు ద్వారా సర్వదా మన పరిజ్ఞానం పెరుగుతూనే ఉంటుంది.

ఈ గ్రంథాన్ని అనేక మార్లు చదవ వలసిందిగా నేను పాఠకులకు సలహా ఇస్తున్నాను. మీరు దీన్ని చదివే ప్రతి సారీ, మీకొక కొత్త సందేశం లభిస్తుంది. అనేక సంఖ్యలచే శాసించబడే అనేకమందితో సంబంధాలు కలిగి ఉండాల్సిన ఒక సువిశాలమైన ప్రపంచంలో మనం జీవిస్తున్నాం. కేవలం మీ సంఖ్యల గురించి మాత్రమే కాక, మిగతా సంఖ్యల గురించి కూడా చదవవలసిందిగా నేను మీకు సలహా ఇస్తున్నాను. దీని వలన వారి స్వభావం అర్థం చేసుకొనే శక్తి మీకు కలిగి, తద్వారా మీరు వారితో చక్కని సంబంధ బాంధవ్యాలు కలిగి ఉండుటకు వీలు కలగుతుంది.

నేను ఈ గ్రంథాన్ని "సర్వే జనా సుఖినోభవంతు" అనే ప్రార్థనతో ముగిస్తున్నాను. ప్రపంచంలో అందరూ సుఖంగా జీవించాలి అని దీనికి అర్థం.

ప్రేమతో,

**V.S. GURUSWAMY**

# సర్వజ్ఞులు పొగుడుతున్న శాస్త్రం



**"సంఖ్యా శాస్త్రం అనే ఈ శాస్త్రం హాస్యాస్పదం కాదు, విశ్వసనీయమైనది!"**

- గౌరవనీయ పోప్ లియో **XIII** గారు (గౌరవనీయ పీటర్ గారి **257** వ ఆధ్యాత్మిక వారసులు)



**"ప్రారంభ దశలోనే ఈ కళని నమ్మక పోవటం ద్వారా నేను పెద్ద అవినీతికి పాల్పడ్డాను!"**

- గౌరవనీయ ముసాఫర్ ఉద్దీన్, పారశీక ప్రభువు



**“దేవుడు, దయ్యం, మతం, మనుషులు-దేనినీ నేను నమ్మలేదు. అయితే సంఖ్యలతో నా జీవితాన్ని విప్పి చెప్పే ఈ కళని నేను నమ్ముతాను! ”**

-కర్నల్ **R. G.** ఇన్కర్ సాల్- నాస్తికవాదిగా ప్రసిద్ధి చెందిన అమెరికన్ పండితుడు



**“సదా నాకు ఇష్టమైనది గణితం. కాని నేడు నేను ఆశ్చర్య పడుతున్నది సంఖ్యా శాస్త్ర జ్యోతిష గణితం!”**

**- W. E.** డ్స్టన్**,** నాలుగు సార్లు బ్రిటిష్ ప్రధానిగా ఉన్న గణిత మేధావి



**“కూడిక, తీసివేత, హెచ్చవేత, భాగహారంఇవి మాత్రమే కాక, గణితానికి అయిదవ పార్శ్వం ఉందని నిరూపించి, నన్ను విస్మయపర్చారు పండిట్ సేతురామన్!”**

- సర్ ఎమ్. విశ్వేశ్వరయ్య, మైసూర్ సంస్థానం మాజీ దివా ను, విశ్వప్రసిద్ధ ఇంజనీరింగ్ మేధావి

విధియా? బుద్ధియా?

విధిని బుద్ధితో జయించ గలమా? వీలు కాదంటారు అందరూ. అయితే వీలవుతుందని నేనంటాను! నియమ నిబంధనలు ఉండొచ్చు. అయితే అదే జీవితం కాదు. విధి అనేది సహజ ప్రకృతి - బుద్ధి అనేది మనిషిలోని మనోబలం.

వర్షం కురిపించేది విధి. గొడుగు పట్టుకొనేలా చేసేది బుద్ధి. విద్యుత్తు తీగెలలో విద్యుత్తు ప్రవహించటం విధి. చేతికి గౌజులు ధరించి పనిచేయటం బుద్ధి. సాయింత్రం చీకటి పడేది విధి. ఇంట్లో దీపం వెలిగించేది బుద్ధి. రోజూ మనల్ని కష్టాలకి గురి చేసేది విధి. “అదృష్ట విజ్ఞానం” అందించే సలహాలు బుద్ధి.

పదండి , బుద్ధిని ఉపయోగించి విధిని జయిద్దాం! నిరంతర కృపాసింధువు భగవానుని దీవెనలు పొందే ప్రయత్నం చేద్దాం!

- వి. ఎస్. గురుస్వామి

# పండిట్ మరియు ప్రశంసలు



పండిట్ సేతురామన్

1950లో



విమాన యానానికి

సిద్ధం!




కోలాలంపూర్లో దిగగానే స్వాగతం



కొలంబోలో ప్రముఖుల ద్వారా స్వాగతం - 1951



పెనాంగ్ రైల్వే స్టేషన్ వద్ద పరామర్శకై విచ్చేసిన అతిథులు,
శ్రేయోభిలాషులు, అభిమానుల మధ్య



మలేషియా భారతీయుల ద్వారా ఏర్పాటు చేయబడిన ఒక బహిరంగ స్వాగత సమావేశం



ఫిలిప్పైన్స్ లో శ్రీ యన్. సెల్వరత్నం ఇంటి వద్ద ఏర్పాటైన సాంప్రదాయక స్వాగత సమావేశం

